ప్రథమముద్రణ : 1976
ప్రతులు : 1,000

వెల : రూ. 20-00

ప్రతులకు :

(1) జి. లక్ష్మమ్మ,
18-1-699, శివాజీ నగర్,
తిరుపతి.

(2) నవోదయ పబ్లిషర్సు,
ఏలూరు రోడ్డు,
విజయవాడ-2.

(3) బంగోరె బుక్స్,
నెల్లూరు-4.

ముద్రణ :
ఫ్రీడమ్ ప్రెస్,
138-ఏ, టి. హెచ్. రోడ్డు,
మద్రాసు-21.

## అంకితము

స్వర్గస్థుడైన మా నాన్న
గూడూరు నాగప్ప
సర్వాత్మనా సేవించి తరించిన
కడపజిల్లా తాతిరెడ్డిపల్లె నిలయుడగు
కోదండరామస్వామికి.

# ప్రణుతి

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయములో తెలుగు ఎం. ఏ., ఫైనల్ విద్యార్థులకు ప్రధాన దాక్షిణాత్య భాషలైన తమిళ, కన్నడ. తెలుగు, మలయాళ సాహిత్యములకు సంబంధించిన తులనాత్మక పరిశీలనమును పాఠ్యాంశముగ 1968 లో నిర్ణయించడమైనది. ఈ అపూర్వ పాఠ్యాంశ నిర్ణయమునకు ప్రధానకారకులైన ఆచార్య జి. ఎన్. రెడ్డిగారు, బోధనా సామగ్రి అరకొరగా లభిస్తున్న సంధిదశలో ఒక ప్రణాళికను రూపొందించుకొని, ప్రశంసనీయమైన పరిశోధక వ్యాసములను 'ఆంధ్రప్రభ' దినపత్రికలో వెలువరించి 1969-71 మధ్య కాలములో ఎం. ఏ.. తెలుగు విద్యార్థులకు బోధించి మార్గదర్శకులైన ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు ఈ రచనకు ప్రేరేపకులు.

దాక్షిణాత్య సాహిత్యముల తులనాత్మక పరిశీలనమునకు సంబంధించిన వివిధాంశములపై నాల్గు సంపుటములను రచింప ప్రణాళికను సిద్ధము చేసికొనినపుడు ఆ ప్రణాళికను ఆమోదించడమేకాక ఈ మొదటి సంపుటపు వ్రాతప్రతిని ఓపికతో ఆమూలాగ్రముగ చూచి అమూల్యములగు సలహాల నందించి, శిష్యవాత్సల్యముతో 'ప్రవేశిక'ను సమకూర్చి, ఆశీస్సులందించి, సర్వవిధముల ప్రోత్సహించిన గురువర్యులు ఆచార్య జి. ఎన్. రెడ్డిగారికి నా నమస్సుమాంజలి.

'ముందు మాట'తో ఈ గ్రంథమునకు విలువను, విషయమునకు గౌరవమును పెంచిన మాన్యమిత్రులు ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభి వందనములు.

దాక్షిణాత్య సాహిత్య సమీక్ష (మొదటి సంపుటము) రచనా సందర్భములో అందుబాటులోని సర్వమూలాధారములను (Sources) వినియోగించుకున్నాను. ఉపయుక్త గ్రంథ రచయిత లందరికి నా ధన్యవాదములు.

'తెలుగులో హరికథా వాఙ్మయము' అను గ్రంథము లిఖితప్రతిని వినియోగించుకొనుటకు సహృదయతతో అవకాశమిచ్చిన మాన్యమిత్రులు ఆచార్య తూమాటి దొణప్పగారికి,

సుందర ముఖపత్ర రచనచేసిన మిత్రులు శ్రీ పి. సి. నరసింహారెడ్డిగారికి,

గ్రంథమును ఈ రూపమున ముద్రించి తోడ్పడిన ఫ్రీడంప్రెస్ అధినేత శ్రీబాలసుందరముగారికి. వారి సిబ్బందికీ,

నా నమస్సు మనస్సులు.

ఇంతకుపూర్వము నేను రచించి వెలువరించిన పరిశోధక గ్రంథములు ద్విపద వాఙ్మయము, తెలుగు కావ్యావతారికలను ఆదరించి ప్రోత్సహించినట్లుగానే దాక్షిణాత్య సాహిత్య సమీక్ష (మొదటి సంపుటము)ను సహృదయ పాఠకలోకము ఆదరించి ప్రోత్సహించి మిగతా మూడు సంపుటముల పరిసమాప్తికి తోడ్పడుతుందని విశ్వసిస్తున్నాను.

తిరుపతి
30-7-76

డాక్టర్ జి. నాగయ్య.

# ప్రవేశిక

సాహిత్యాధ్యయనంలో ముఖ్యమైన పద్ధతులు మూడు. ఒక సాహిత్యానికి చెందిన రచనల్లో ఏ రచనకు ఆ రచనను విడిగా చదివి స్వారస్యాన్ని గ్రహించడం ఒక పద్ధతి. ఇది సంప్రదాయకమూ, ప్రాచీనమూ. రెండవది చారిత్రక పద్ధతి. ఒక భాషలో వెలసిన సారస్వతాన్ని కాలక్రమ దృష్టితో పరిణామ స్వరూపాన్నీ, పూర్వాపర సంబంధాన్నీ నిరూపించే విధానమే చారిత్రక పద్ధతి. మూడవది తులనాత్మక పద్ధతి. ఇరుగు పొరుగు భాషల్లో, లేదా భిన్నదేశాల్లో వెలసిన సాహిత్యాలను సరిపోల్చి, వాటిలోని సామ్యవైషమ్యాలను, పరస్పర ప్రభావాదులను, ప్రత్యేక లక్షణాలను పరిశీలించడమే తులనాత్మక పద్ధతి. ఈ పద్ధతి అర్వాచీనం. పాశ్చాత్య దేశాల్లో పాతికేళ్ళ నుండి ప్రాముఖ్యానికి వచ్చింది. మన దేశంలో తులనాత్మక పద్ధతికి ఇప్పుడిప్పుడే గుర్తింపు కలుగుతూ వుంది.

భారతీయ సాహిత్య విషయంలో తులనాత్మక పరిశీలనకు సాటిలేని ప్రాధాన్యం వుంది. అందుకు కారణాలు అనేకం. ముఖ్యంగా భారతీయ సాహిత్యాలన్నీ సంస్కృత వాఙ్మయ ప్రభావితాలే. ప్రపంచ భాషల్లో శిష్టసాహిత్యాన్ని పండించుకొన్న తొట్టతొలిభాష సంస్కృతమే. భారతీయ సంస్కృతినీ, సాహిత్యాలనూ, జాతినీ, జాతిజీవితాన్నీ ప్రభావితం చేసిన భాషకూడా సంస్కృతమే. ద్రావిడాది సంస్కృతేతర భాషా సంస్కృతుల మీద ప్రసరించిన ప్రభావం ఎక్కువే అయినా అది ఏకోన్ముఖం కాదు. చాలావరకు పరస్పరం ఆదానప్రదానం. ఉత్తర దేశ భాషాసాహిత్యాలలో కూడా ద్రావిడ సంబంధ లక్షణాలు ఉన్నాయి. అతి ప్రాచీనకాలం నుండి భారతీయ సంగీత నాటక సాహిత్యాది సంప్రదాయ స్రవంతిలోని మార్గ, దేశి అనే రెండు పాయలు ఏర్పడడానికి

ఇదే కారణం. భారతీయులు భిన్నభాషా వ్యవహర్తలయినా 'భారతీయత' అనే ముద్ర భారతీయ సాహిత్యా లన్నిటిలో ప్రతిబింబిస్తూ వుంది. ప్రాదేశికమైన విలక్షణత్వం కూడా ఆయా సాహిత్యాలలో లేకపోలేదు. ముఖ్యంగా దక్షిణదేశభాషా సాహిత్యాలలో కొన్ని ప్రత్యేక లక్షణాలూ, సంప్రదాయాలూ కన్పిస్తాయి.

భారతీయ భాషా సాహిత్యాలను తులనాత్మకంగా పరిశీలించడంలో ప్రవేశమున్నవారు తక్కువ. పరిశ్రమ చేసినవారు అంతకన్న తక్కువ. తులనాత్మక సాహిత్యాధ్యయనానికి భారతీయ విశ్వవిద్యాలయాల్లో తగిన గుర్తింపు రాలేదు. ఇట్టి లోటును కొంతవరకు పూరించడానికి, తులనాత్మక సాహిత్యాధ్యయనం యొక్క ప్రాధాన్యాన్ని చాటడానికి, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో స్నాతకోత్తర పాఠ్య ప్రణాళికలో దక్షిణ దేశసాహిత్యాల తులనాత్మకాధ్యయనం 1968 లో ఒక అంశంగా నిర్ణయింపబడింది.

తులనాత్మక పద్ధతిలో భారతీయ సాహిత్యాలను అధ్యయనం చేయడం జాతిసమైక్యతకూ, భావసమైక్యతకూ దోహదమవుతుంది. జాతి విధ్వంసక శక్తుల్ని పురికొల్పే 'దహన సంస్కారాన్ని' తొలగించి సహనసంస్కారాన్ని పెంపొందించే మానవత్వం ఇట్టిసాహిత్యాధ్యయనం వల్ల సిద్ధిస్తుంది.

భారతీయ సాహిత్యాలను తులనాత్మకదృష్టితో పరిశీలించి రచింపబడిన గ్రంథాలు కూడా చాలా తక్కువ. తెలుగులో అట్టి గ్రంథాలు అసలే లేవు. ఆ లోటును కొంతవరకు తీర్చడానికి ఈ గ్రంథకర్త డాక్టర్ నాగయ్యగారు ప్రయత్నించినారు. వారి ప్రయత్నమూ, తత్ఫలితమూ ప్రశంసనీయం. పరిశోధనాపూర్వకమైన బోధనానుభవం గల రచయిత డాక్టర్ నాగయ్యగారు. విషయసేకరణలోనూ, విమర్శనాత్మక పరిశీలనలోనూ, విషయ వ్యక్తీకరణలోనూ రచయితకుగల ప్రావీణ్యం ప్రతి పుటలోనూ ప్రతిబింబిస్తుంది.

దాక్షిణాత్య సాహిత్యాలకు సంబంధించి తులనాత్మక సాహిత్య విమర్శ ప్రధానమైన ఈ గ్రంథం తెలుగులో మొట్టమొదటిదని చెప్ప వచ్చు. ఇందులో గ్రహించిన శీర్షికలు మూడే అయినా తత్సంబంధమైన పరిశీలన సమగ్ర మనదగినంత విస్తృతమైంది. డాక్టర్ నాగయ్యగారి శైలిలోని సంక్షిప్తతా, సరళతా ప్రశంసనీయమైనవి. ఈ గ్రంథం ఇతర భాషలలోకి అనువదింపదగింది కూడా. పరిశోధకసామర్థ్యమూ, పాండిత్యమూ గల డాక్టర్ నాగయ్యగారు ఇట్టి పద్ధతుల్లో మరికొన్ని గ్రంథాలను వెలువరించాలనీ, ఆ విధంగా వెలువరించినపుడు మన సాహిత్య విమర్శకుల్లో వారికి ఒక ప్రత్యేక స్థానం సిద్ధించగలదనీ నా నమ్మకం.

—జి. ఎన్. రెడ్డి,
ఆంధ్ర శాఖాధ్యక్షులు
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము.

తిరుపతి
26-7-1976

సంబంధ బాంధవ్యములు, సుకరము లయిన రాకపోకలు—వీటి అన్నిటి ఫలితంగా దాక్షిణాత్య సాహిత్యములలో సమాన ధర్మములూ, ఆదానప్రదానములూ, పరస్పర ప్రభావోత్తేజనములూ ఉండడానికి మఱింతగా అవకాశం ఉండినదని అన్న విషయం అందరూ అవశ్యం ఒప్పుకొని తీరవలసిన పరమసత్యం. కానీ, ప్రాంతీయావసరముల దృష్ట్యా, వివిధకాలములందలి ప్రజల అభిరుచుల దృష్ట్యా ఆయా సాహిత్యాలలో కొన్ని ప్రత్యేకతలూ చోటు తీసుకోక పోలేదు. వీటి అన్నిటిని గురించీ తెలుసుకోవడం, తెలుసుకుని ఆనందించడం ఒక మధురమైన అనుభూతి : పరిమితమయిన ఒక పరిధిలో కూర్చుండి గుడుగుడు గుంచము లాడుతుండినవాడు అంతకంటే విశాలమయిన ఆవరణలో అడుగిడినప్పుడు అతని కన్నులు ఆశ్చర్యంతో విస్ఫారితములై, హృదయంలో ఆనందం పరవళ్ళు తొక్కే—లాంటి అనుభూతి అది. అంతకు ముందు ఎంత తల పగలగొట్టుకున్నా తేలని సంగతులు, ముడివిడని సమస్యలు ఇట్టే తేలిపోవడమే కాక కొత్త సంగతులు ఎన్నో అనుభవానికి వచ్చి నూతనస్ఫూర్తి ఒకటి అతనికి యేర్పడుతుంది. తాను ఎంతో ఎదిగిన భావం ఒకటి మనసులో రూపుకట్టి, యింకా యింకా యెదగవలె నన్న కోరిక బలపడుతుంది. అలాంటి ఒక వినూత్న ప్రపంచంలోనికి ప్రవేశపెట్టి ఆనందాశ్చర్యసంభరితుల్ని చేస్తుంది. నవ్యపరిశోధకప్రచురణలు ప్రకటించిన 'దాక్షిణాత్య సాహిత్య సమీక్ష' అనే యీ గ్రంథం.

దాక్షిణాత్య సాహిత్యముల తులనాత్మక పరిశీలనాధ్యయనములు ఇటీవలి కాలంలో బాగా పుంజుకొని విజృంభిస్తున్నవి. ముఖ్యంగా స్వాతంత్ర్య ప్రాప్త్యనంతరం యివి భాషా విద్వాంసుల, పరిశోధకుల దృష్టిని విశేషంగా ఆకర్షిస్తున్నవి. తెలుగు సాహిత్యం ప్రాయికంగా సంస్కృత మూలకం కావడంచేత తెలుగులో వెలసిన కావ్యాదులను సంస్కృతంతో పోల్చి భేదసాదృశ్యములను నిరూపించే ప్రయత్నమే యిటీవలి దాకా కూడా సాగుతూ వచ్చింది. ఇంకా సాగుతూ ఉంది కూడా. దాక్షిణాత్య సాహిత్యాలతో పోల్చి చూచే యత్నం అంతగా కనిపించదు. కానీ ఈ శతాబ్ది తొలి దశాబ్దులలో కొందరు విద్వాంసులు ఈ వంకకు కూడా తమ దృష్టిని మరలించి కొంత కృషి చేయక పోలేదు. వారిలో ప్రముఖంగా పేర్కొన దగినవారు శ్రీ మానవల్లి రామకృష్ణకవి, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి, శ్రీ చిలుకూరి నారాయణరావు, శ్రీ చేకుమళ్ళ రాజగోపాలరావు, శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు, శ్రీ కోరాడ రామకృష్ణయ్య ప్రభృతులు. ఈ విషయంలో వారిని వేగుచుక్కలుగా పేర్కొనవచ్చును.

స్వాతంత్ర్యం ప్రాప్తించిన తరువాత భారతీయభాషల అభివృద్ధికై భారత ప్రభుత్వమువారిచే యేర్పాటు చేయబడిన కేంద్రసాహిత్య అకాడమీ చేపట్టిన కార్యక్రమాలవలన భారతీయ భాషలలో పరస్పరావగాహనకు ఎక్కువగా అవకాశం యేర్పడింది. వివిధ రాష్ట్రాలలో యేర్పడిన ప్రాంతీయ సాహిత్య అకాడమీల కృషి కూడా యీ విషయంలో తక్కువేమీ కాదు. వీటితోబాటు ద్రావిడభాషాశాస్త్రవేత్తల సంఘము (Dravidian Linguists Association) కూడా ద్రావిడభాషల ఛంద స్సామ్యములను గురించి యిటీవల ఒక విద్వద్గోష్ఠి జరిపి తులనాత్మక పరిశీలనకు విశేషమయిన దోహదం కల్పించింది. విశ్వవిద్యాలయములు కూడా యీ విషయంలో శ్రద్ధ వహిస్తుండడం చాలా ముదావహ మయిన విషయం. ముఖ్యంగా శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ఈవిషయంలో తీసుకున్న చొరవ చాలా ప్రశంసింపదగింది. పరిశోధన పట్టములకై తులనాత్మక అధ్యయనములను సూచించడంతోబాటు 1968 లో తెలుగు యం. ఏ. పాఠ్య ప్రణాళికలో దాక్షిణాత్య సాహిత్యముల తులనాత్మకాధ్యయనమునకు స్థానం కల్పించిన ఆచార్య జి. యన్. రెడ్డిగారి విజ్ఞత, ముందుచూపు హర్షింపదగ్గది. తెలుగుదేశంలోని యే విశ్వవిద్యాలయంలోనూ యం. ఏ. స్థాయిలో యిలాంటి అవకాశం కల్పింపబడలేదు. ఇతర దాక్షిణాత్య రాష్ట్రాలలోని విశ్వవిద్యాలయాలు కూడా యీ విషయంలో యింకా ముందుకు రాలే దనే చెప్పాలి. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో కల్పింపబడిన యీ సదవకాశం విద్యార్థులలోనూ, విద్వాంసులలోనూ తులనాత్మకాధ్యయనంపట్ల ఆసక్తిపీ, అభిమానమునూ కలిగించి యీ రంగంలో కొంత కృషి జరగడానికి తోడ్పడిందంటే అతిశయోక్తి కాదు. ఇలా సంస్థలు మాత్రమే కాక యీ రంగంలో పరిశ్రమించిన ప్రత్యేక వ్యక్తులు కూడా కొందరు ఉన్నారు. వారిలో ప్రముఖంగా పేర్కొన దగినవారు డా. చల్లా రాధాకృష్ణశర్మ, డా. తిమ్మావజ్ఝల కోదండరామయ్య, డా. జి. నాగయ్య, డా. తూమాటి దొణప్ప, శ్రీ కె. సర్వోత్తమన్, డా. తంగిరాల వెంకట సుబ్బారావు, డా. చన్నాప్రగడ తిరుపతి రావు, డా. ఆర్వి. యస్. సుందరం, శ్రీ ముదునూరి జగన్నాధరాజు ప్రభృతులు. ఈ యిరు తెలుగు లయిన సమష్టి కృషి ఫలితంగా యీనాడు యీ రంగంలో గణనీయమయిన వస్తు సామగ్రి లభిస్తున్నది. మిత్రులు డా. జి. నాగయ్యగారు రచించిన 'దాక్షిణాత్య సాహిత్య సమీక్ష' అనే యీ గ్రంథం ఇంతకు ముందు ఈ రంగంలో జరిగిన కృషిని సర్వమూ పుక్కిలించిన చక్కని రచన. కట్టుదిట్టముగా, శాస్త్రీయముగా నిర్వహించిన పరిశోధనాత్మక రచన, 1972 నుండి శ్రీ వేంకటేశ్వర విశ్వ

విద్యాలయంలో తెలుగు యం. ఏ. విద్యార్థులకు పాఠ్యాంశముగా దాక్షిణాత్య సాహిత్యములను గురించి బోధించి గడించిన అధ్యాపనానుభవమే వారి యీ రచనకు గల అధికారము.

డా. నాగయ్య మంచి పరిశోధకుడు. ద్విపదవాఙ్మయము, తెలుగు కావ్యావతారికలు అన్న గ్రంథముల మూలమున పండితలోకమునకు ఇదివఱకే పరిచితుడు. విస్తారమయిన గ్రంథావలోకనము, అవలోడనము, ఉపయుక్తాంశముల క్రోడీకరణము, వానివి సమన్వయపఱచుటలో రాగద్వేషములకు అతీతమయిన సమదృష్టి, సారభూతమయిన సంగ్రహరచన, నిర్ణయములలో నిబ్బరము, వినిద్రత—ఇవి మంచి పరిశోధకునికి ఉండవలసిన గుణవిశేషము లగుచో అవి డా. నాగయ్యలో మెండుగా నిండి యున్నవనియే చెప్పవలెను. అతడు అనవసరమయినది వ్రాయడు. అవసర మయినది వదలిపెట్టడు. పులుముడు ఆతనికి నచ్చదు. మాటలో యెంతో రచనలో కూడ అంత నిదానము గల నిక్కచ్చి మనిషి. పట్టు కత్తిరించినట్లు మట్టసంగా, ముక్తసరిగా రాయడం అతడు నేర్చిన నేర్పు. ఈ అన్ని లక్షణములనూ అతని యీ గ్రంథంలో చూడవచ్చు.

దాక్షిణాత్య సాహిత్యసమీక్ష అన్న యీ గ్రంథంలో మూడు విపులము లయిన వ్యాసములు ఉన్నవి. అవి రామకథ—రంగనాథ కంబరామాయణములు, దాక్షిణాత్య సాహిత్యములు—దేశి, యక్షగానములు—ద్రావిడ దృశ్యరీతులు అనునవి. ప్రథమవ్యాసంలో సంస్కృత, ప్రాకృత, జైన, బౌద్ధ సారస్వతములలోను, భారతీయ, భారతీయేతర భాషలలోను గల రామకథాస్వరూప స్వభావములను సంగ్రహంగా తెలిపి పిదప తెలుగులోని రంగనాథ రామాయణమునకు, తమిళములోని కంబరామాయణమునకు కల సామ్య వైషమ్యములను గురించి విపులంగా సమీక్ష చేయబడింది. కాండము వారీగా యీ రెండు రామాయణములలోని వివిధ ఘట్టములలో కల సామ్య వైషమ్యములను చర్చించడంతోబాటు అక్కడక్కడా యితర రామాయణములతో వాటికి గల సంవాదములను కూడా ప్రస్తావించడం జరిగింది. ఈ రెండు రామాయణములను గురించీ తెలుగులో తులనాత్మక పరిశీలన చేసిన తొలి ప్రయత్న మిది. దాక్షిణాత్యసాహిత్యములు - దేశి అన్న రెండవ వ్యాసంలో మార్గ - దేశి భేదములు, దేశి నిర్వచనం, తమిళం, కన్నడం, తెలుగు, మలయాళం అన్న ప్రధాన దాక్షిణాత్య భాషలలోని దేశికవితా స్వరూపం, దేశిసాహిత్య ప్రక్రియలు, దేశ్యపదవిభాగం, దేశిచ్ఛందస్సామ్యములు అన్న ప్రధాన శీర్షికలకింద

విపులమయిన సమీక్ష చేయబడింది. యక్షగానములు - ద్రావిడ దృశ్యరీతులు అన్న తుదివ్యాసంలో తెలుగులో యక్షగానముల ఆవిర్భావ వికాసములు, వాటిలో కని పించే ప్రబంధానుకరణ, మార్గ నాటక ప్రభావములు చర్చించి - తమిళ కన్నడము లందలి యక్షగానములను గూర్చి ప్రస్తావించి, వాటికి వీథినాటకములు, కురవంజి నాటకములు, మలయాళములోని కథకళి ప్రదర్శనములు, బొమ్మలాటలు, హరి కథలు, జంగమకథలు, బుర్రకథలు—మొదలగువాటితో గల సామ్య వైధర్మ్య ములను సమీక్షించి తుదిని యక్షగానమునకు గల వైశిష్ట్యమును నిరూపించినారు. దాక్షిణాత్య సాహిత్యములకు సంబంధించి సమీక్షకు చేపట్టిన మూడు ప్రధాన విష యములకు సంబంధించిన సమగ్రమయిన శాస్త్రీయమయిన చర్చ యిందులో సమర్థంగా నిర్వహించబడింది. ఆయా విషయములకు సంబంధించి వివిధకాలము లలో, వివిధ స్థలములలో పండితులు చేసిన చర్చలు, సిద్ధాంతములు, వారి అభి ప్రాయములు, అనుమానములు ఈ వ్యాసముల రచనలో పదిలబదిగా పరిశీలింప బడినవి. తమ రచనకు ఆధారము లయిన ఆకరములను ఆ యా వ్యాసముల చివర అనుబంధముగా చేర్చి ఆ యా విషయములయందు మఱింతగా పరిశ్రమించే ఆసక్తి గలవారికి ఉపకారం చేయడం గమనించదగింది.

83-వ పుటలో - సులోచనా వృత్తాంతమును గురించి ప్రస్తావిస్తూ 'ఆనంద రామాయణము పదకొండవ సర్గలో సులోచనా వృత్తాంతము కలదు.' అనీ, కాల నేమి వృత్తాంతమును గురించి 'కాలనేమికథ ఆనందరామాయణము సారకాండ పదకొండవ సర్గలోను, అధ్యాత్మ రామాయణమునందును విపులముగ కలదు', అని వ్రాశారు. రామకథా ప్రస్తావనలో ఆనందరామాయణ కాలమును తెలిపి, అధ్యాత్మరామాయణ రచనాకాలమును తెలుపలేదు. ఈ రెండు వృత్తాంతములూ ఆనందాధ్యాత్మరామాయణములలో ఉండడానికి కారణములను ప్రస్తావించి ఉంచే మఱింత సుకరంగా ఉండేది. 172-వ పుటలో - ఉత్సాహమును కూడ తమిళ అగవల్‌పా ఛందస్సునకు సంబంధించినదిగా నిరూపింపవచ్చును.... .... ....ద్విపద, తరువోజ, సీసము, రగడ పద్యములు తమిళములోని ఆశిరియపా అను పద్యమునకు సంబంధించినవిగా వానిలోని గణములకూర్పును బట్టి నిరూపింపవచ్చును .... ....' ఇలాంటి స్థలాలలో ఆ సంబంధముల వివరణం కొంత అవసరం అనుకుంటాను.

రంగనాథ కంబరామాయణముల తులనాత్మక సమీక్ష చేసినచో కన్నడం లోని తొరవె రామాయణముతోనూ, మలయాళంలోని కణ్ణశ రామాయణంతోనూ

తెలుగు రామాయణానువాదాన్ని తులనాత్మకంగా పరిశీలించవలసిన అవసరం ఉంది. ఇంకా యీ దాక్షిణాత్య భాషలలోని భారత, భాగవతాది ప్రముఖ గ్రంథముల తులనాత్మక సమీక్ష జరగవలసి ఉంది. ఈ భాషలలో వెలసిన భక్తిసాహిత్యం, శైవ సాహిత్యం, వైష్ణవ సాహిత్యం, జైన బౌద్ధ సారస్వతములు, జానపదసాహిత్యం, ఆధునిక కవితోద్యమాలు మొదలయిన అనేకానేక విషయాలను గురించి శాస్త్రీయ మయిన, సమగ్ర సుందరమయిన తులనాత్మక సమీక్షలు ఎన్నో యింకా జరగవలసి ఉంది. ఇలా ముమ్ముందు జరగవలసినకృషి అనే మహాయజ్ఞానికి డా. నాగయ్యగారి యీ గ్రంథం నాంది మాత్రమే. అందుచేతే దీనికి హృదయపూర్వకంగా స్వాగతం పలుకుతున్నాను. తెలుగులో జరిగిన తొలి ప్రయత్న ఫలమని మాత్రమేకాదు దీనిని సంభావిస్తున్నది. నాకు తెలిసినంతవరకు దాక్షిణాత్య భాషలలోనే యిది తొలి ప్రయత్నం. ఇతర దాక్షిణాత్య భాషలలో ఇంతవఱకు ఇట్టి ప్రయత్నం తలపెట్టబడ లేదు. అందుచేత కూడా వీరిని సంభావిస్తున్నాను.

డా. నాగయ్యగారు ఈ రంగంలో ఇతోధికంగా పరిశ్రమించి తమ పరిశోధన ఫలములనే అమూల్యాలంకారాలతో ఆంధ్ర భారతిని అలంకరింతురుగాక అని, అందుకు కావలసిన శక్తి యుక్తులనూ, ఆయురారోగ్యములనూ భగవంతుడు వారికి ప్రసాదించును గాక అని కోరుతున్నాను. ఈ గ్రంథ ప్రకటన మూలంగా వారికి సరస్వతీ కటాక్షంతోబాటు లక్ష్మీకటాక్షం కూడా లభించాలనీ, తప్పక లభిస్తుందనీ ఆశిస్తున్నాను.

మధుర
28-7-76

—తిమ్మావజ్ఝల కోదండరామయ్య.
ఆంధ్రశాఖాధ్యక్షులు
మధుర విశ్వవిద్యాలయము

# విషయసూచిక

# 1

# రామకథ : రంగనాథ కంబరామాయణములు

## 1. వాల్మీకి రామాయణ ప్రాశస్త్యము :

భారతీయసంస్కృతికి మూలకందము అనదగిన కృతులు రామాయణ భారత భాగవతములు. సంస్కృతసాహిత్యమున సర్వాలంకార గుణశోభితమగు ఆది కావ్యము వాల్మీకి రామాయణము. అది భారత జాతీయకావ్యము; విశ్వవిఖ్యాతమైన మహాకావ్యము. కవితాసౌరభములను గుబాళించే ఉత్తమ కావ్యము. భారతీయుల ఆదర్శములకు హైందవమతానుయాయుల నీతిసూత్రములకు నిధానము. కొన్నివేల సంవత్సరములుగ రామకథ భారతభూమిలోనే కాక భారతీయుల సంస్కృతి ప్రసరించిన అన్యదేశములందును ప్రచారప్రశస్తిని పొందినది. వాల్మీకి రామాయణము రాముని ఉత్తమాదర్శ పురుషునిగ, అతని చరిత పరమపావనముగ ప్రజాహృదయములలో హత్తుకొనజేసినది. వాల్మీకి రామాయణము వేదసమముగకూడ పరిగణింపబడుచున్నది. రామాయణవాణి సర్వదేశములకు, సర్వజాతులకు, సర్వవాఙ్మయములకు, సర్వకళలకు సమశ్రుతికమైన ప్రణవనాదము. పౌరాణికులు పురుషార్థ సాధనోపదేశమున కనువైన పుణ్యగాథగాను, తాత్త్వికులు జ్ఞానబోధకు ప్రతీకాత్మక కావ్యముగాను, కావ్యకర్తలు రూపకకర్తలు రసదృష్టికి, నవ్య కల్పనలకు నిలయముగాను రామకథను భావించినారు. సంస్కృత సాహిత్యమునందే కాక వివిధ భారతీయ సాహిత్యములందును, భారతీయేతర భాషలలోను రామకథకు వివిధరూపములైన అనువాదములు, అనుసరణములు, రామకథావస్తుకములైన స్వతంత్రగ్రంథములును వెలువడినవి. వివిధభాషా సాహిత్యములందలి రామకథా ప్రశస్తిని పేర్కొని రంగనాథ కంబరామాయణములందలి సామ్యమును తులనాత్మకముగ చర్చించుట ప్రస్తుత విషయము.

## 2. సంస్కృత పురాణేతిహాసములలో రామకథ :

సంస్కృత పురాణేతిహాస వాఙ్మయమునందు వంశానుచరితము, అవతార వర్ణనము మొదలగు ఘట్టములందు రామకథ సంగ్రహముగ కన్పట్టుచున్నది. పురాణములలో సాధారణముగ సూర్యవంశక్రమమును వర్ణించుసందర్భమున రామ చరితము పేర్కొనబడినది. మిగిలిన సందర్భములందు రామాయణ కథాంశములు సంగ్రహముగ వర్ణింపబడినవి.

పురాణము లన్నిటియందుకంటె పద్మపురాణములోని సృష్టి, ఉత్తర, పాతాళఖండములందు రామాయణ కథాంశములు విపులముగ విశదీకరింపబడినవి. పద్మపురాణములో రామకథ ఒక క్రమములో కాక పరిచ్ఛిన్నముగా ఆయా సందర్భ ముల ననుసరించి వివిధఘట్టములందు తెల్పబడినది. పద్మపురాణ సృష్టిఖండమున అహల్య వృత్తాంతము విపులముగ కలదు. పద్మపురాణోత్తరఖండమున శివుడు దశావతారములను వర్ణించుసందర్భమున చెప్పిన రామకథలో అవాల్మీకాంశములు కొన్ని కన్పట్టుచున్నవి. సీతాదేవి జనకునకు హోమలబ్ధయగుట, రాముడు శూర్ప ణఖ ముక్కు చెవులను కోయుట, సేతువుగా శివధనువు నుపయోగించుట, రావణ వధానంతరము రాముడు వేయేండ్లు రాజ్యమేలుట మొదలగునవి పద్మపురాణోత్తర ఖండమునందలి పూర్వ రామకథాభాగమున పేర్కొనదగిన వినూత్నకల్పనలు.

వేదవతియే లంకలో సీతగా జన్మించినదని, పరస్త్రీలను బలాత్కరించినచో రావణుని శిరస్సు వేయి వ్రక్కలగునట్లు వేదవతి శపించినదని బ్రహ్మ వైవర్త పురాణమున సీతాదేవి జన్మకథ తెల్పుసందర్భమున గలదు. బ్రహ్మ వైవర్త పురాణమున శ్వేతకేతుమహారాజు రావణ సంహారార్థము రామునికి సమర్పించవలసి అస్త్రశస్త్రాదులను అగస్త్యున కొసగినట్లు, అగస్త్యుడును త్రేతాయుగాంతమువరకు వానిని రక్షించి రామున కొసగినట్లు తెల్పబడినది.

నారదీయపురాణమున శివధనస్సు వృత్తాంతమును సీతకు రాముడు వివరించి నట్లు కల్పింపబడినది.

కూర్మపురాణమున పశు పక్ష్యాదుల స్వేచ్ఛావిహారమును తిలకించిన పార్వతీ పరమేశ్వరులకు జాంబవంతుడు జన్మించినట్లు చెప్పబడినది.

దేవీ భాగవత తృతీయస్కంధమునందు రావణ సంహారమునకై ఆశ్వీజ

మాసములో దేవీ నవరాత్రివ్రతము నాచరింపుమని రామునికి నారదుడు హితవు చెప్పినట్లు కలదు. రాముడు దేవీ నవరాత్రివ్రత మాచరించి తన్మహిమచే రావణ సంహారము గావించినట్లు చెప్పబడినది.

భాగవతము ద్వితీయస్కంధమున బ్రహ్మ నారదునకు విష్ణువు దశావతారములను వర్ణించిచెప్పు సందర్భమున రామకథ సంగ్రహముగ కలదు. విభీషణుడు స్వయముగా రావణునికి అంత్యక్రియలను జరిపించినట్లు, రావణవధానంతరము రాముడు సీతా సందర్శనార్థము అశోకవనమున కరిగినట్లు ఇందు పేర్కొనబడినది.

వరాహ, అగ్ని పురాణములందును, శివపురాణమందలి లీలాఖండము నందును హనుమంతుని జన్మవృత్తాంతము కలదు. హనుమంతుడు అంజనాదేవి గర్భమున శివవీర్యప్రభావమున జన్మించిన కథ ఈ పురాణములందు సంగ్రహముగా కలదు.

శివపురాణము లింగవైభవ ఖండమునందును, ఉమా ఖండమునందును రామాయణము అతి సంగ్రహముగా యథావాల్మీకముగా చెప్పబడినది. రామలింగేశ్వరప్రతిష్ఠ శివపురాణమునందు కలదు.

బ్రహ్మాండపురాణమునందును రామునికథ, మిథిలాపతుల వంశక్రమము సంగ్రహముగా సూచింపబడినది.

విష్ణుపురాణమున గంగావతరణము, విశ్వామిత్ర, పరశురాముల జన్మ వృత్తాంతములు తెల్పబడినవి.

సంస్కృతమహాభారతమున అరణ్యపర్వములో కథారూపమున వాల్మీ సందర్భములందు రామాయణప్రశంస కన్పట్టుచున్నది. లోమశమహర్షి పాండవులకు భృగుతీర్థమాహాత్మ్యమును తెల్పు సందర్భమున అరణ్యపర్వము 99 వ అధ్యాయమున రాముడు పరశురాముడిచ్చిన విష్ణుచాపమును భంగమొనర్చి విష్ణురూపమును ప్రదర్శించి పరశురామ గర్వభంగమొనర్చినట్లు చెప్పబడినది. 105 వ అధ్యాయమున భగీరథుని కథాసందర్భమున గంగావతరణము. 11i వ అధ్యాయమున ఋశ్యశృంగుని కథ వివరింపబడినది. ఇందలి ఋశ్యశృంగుని కథలో రోమపాదుడు ఒకానొక బ్రాహ్మణుని బాధించినకారణమున రాజ్యమున అనావృష్టి యేర్పడినట్లు, చతురవచోవిలాసినియగు ఒక వేశ్యమాత జాణయైన తన కుమార్తెతో వెళ్ళి ఋశ్యశృంగుని తోడ్కొనివచ్చినట్లు కలదు. సౌగంధికాపహరణ ఘట్టమున

హనుమంతుడు భీమునికి రామకథను సంగ్రహముగా తెల్పెను. సంస్కృతభారత మున 273 నుండి 293 వరకుగల అధ్యాయములలో మార్కండేయుడు ధర్మ రాజుకు వినిపించిన రామోపాఖ్యానము కలదు. ఇందు ప్రారంభమున రామజనన ముతోపాటు రావణుని బలపరాక్రమాదులు వర్ణింపబడినవి. దుందుభి యను గంధ ర్వాంగన మంథరగా జన్మించినట్లు, శ్రీరాముడు దశరథుని దర్శింపకనే వనముల కరిగినట్లు, రావణుడు తన శరీరమునుండి ప్రభవింపజేసిన ఆయుధ ధారులను రాముడు సంహరించినట్లు, అగ్నిప్రవేశము లేకుండగనే రాముడు సీతను స్వీకరించి నట్లు సంస్కృతభారతమునందలి రామోపాఖ్యానమున గలదు. ఇవి అవాల్మీకము లైన కొన్ని కల్పనలుగ తోచును.

## 3. అధ్యాత్మరామాయణ విశేషములు

వాల్మీకి రామాయణము తరువాత కవులను అధికముగా ప్రభావితులను చేసిన సంపూర్ణరామాయణములలో అధ్యాత్మరామాయణము పేర్కొనదగినది. ఇది బ్రహ్మాండపురాణాంతర్గతమైన సంహితయని కొందరు భావింతురు. మరికొందర రది ప్రత్యేకమైన రచనయనియే తలంతురు. వ్యాసప్రణీతమని కొందరు చెప్పుదురు. మరికొందరు దీనిని విశ్వామిత్రుడు రచించినాడని విశ్వసింతురు.

వాల్మీకిరామాయణమున రాముని దైవత్వము గుప్తముగా నుండును. అధ్యాత్మరామాయణమున రాముడు జ్ఞానమూర్తియైన అవతారపురుషుడుగా, సీతా దేవి యోగమాయగా కథ నడచును. ఈశ్వరుడు పార్వతికి అధ్యాత్మరామాయణ కథ చెప్పినట్లు కలదు. అధ్యాత్మరామాయణమున రాముడు చతుర్భుజములతో, శంఖ చక్రములతో కౌసల్యకు జన్మించును. కౌసల్య ప్రార్థనముచే భగవదవతార పురుషుడగు రాముడు, బాలభావము వహించును ఇందు రాముడు విష్ణువు అవతార మని పలుచోట్ల చెప్పబడినది. నారదుడు రామునియొద్దకువచ్చి రావణవధకు ప్రేరే పించుట, దేవతాప్రార్థనముచే సరస్వతి కైకేయీ మంథరల నావేశించుట, అహల్య శిలాకృతి ధరించునట్లు గౌతమునిచే శపింపబడుట, రాముడు గంగానదిని దాటబోవు నపుడు నావికుడు (పేరు లేదు) రామపాద స్పర్శమున తన పడవ, స్త్రీ యగునను భయమును వెలిబుచ్చి రామపాద ప్రక్షాళనముగావించి గంగను దాటించుట, చిత్ర కూటమున తన సన్నిధి కరుగుదెంచిన సీతా రామ లక్ష్మణులకు వాల్మీకి తన పూర్వ జన్మవృత్తాంతమును తెల్పి రామనామ మాహాత్మ్యమును స్తుతించుట, పర్ణశాల

నిర్మాణమును వాల్మీకి శిష్యగణమే కావించినట్లు తెలుపుట, అంతయు తన ఆదేశాను సారమే జరిగినదని రాముడు కైకను సమాశ్వాసపరచుట, రాముని అడుగుజాడల సౌందర్యమునకు శూర్పణఖ సమ్మోహితయై రామాదులకడకు వచ్చినదని తెలుపుట మొదలగు అవాల్మీకాంశములు ఆధ్యాత్మరామాయణమున కొల్లలు. ఇందు రావణుడు రాముని శ్రీహరిగా తెలుసుకొని సీతాపహరణమునకు నిశ్చయించుకొన్నట్లు తెల్పబడినది. రావణుడు మోక్షము నర్థించి రామునితో యుద్ధము చేయును. ఆధ్యాత్మరామాయణమున రావణుని ప్రవర్తనము శత్రురూపమగు భక్తివిశేషము. ఇందు ఆధ్యాత్మికదృష్టితో రామకథ వర్ణింపబడినది.

ఆధ్యాత్మరామాయణమున ఉత్తరకాండ కథకూడ కలదు. వాల్మీకి రామాయణమునకు వలె ఆధ్యాత్మరామాయణమునకును వివిధభాషలలో అనేకానువాదములు, అనుసరణములును వెలసినవి.

## 4. ఆనంద రామాయణ విశేషములు :

వాల్మీకి రామాయణము, అధ్యాత్మరామాయణమునకు పిమ్మట సంస్కృతములో పేర్కొనదగిన మరొక సంపూర్ణరామాయణము ఆనందరామాయణము. ఇది వాల్మీకి కృతమని ప్రసిద్ధి కలదు. కాని వాల్మీకిరామాయణమునకు భిన్నములగు కథాంశములు ఇందు పెక్కుండుటవలన ఇది వాల్మీకిరచన కాదని, మహారాష్ట్ర భక్తకవియగు సమర్థ రామదాసు (1608-1681) దీనిని రచించినాడని చిలుకూరి శ్రీ రామశాస్త్రిగారు ఆనందరామాయణము తెలుగు అనువాదమునందు (ఇది ముద్రితము (1956)) చెప్పినాడు.

ఆనందరామాయణమునందు సార, యాత్రా, యాగ, విలాస, జన్మ, వివాహ, రాజ్య (పూర్వార్ధ, ఉత్తరార్ధములు), మనోహర, పూర్ణకాండములని తొమ్మిది కాండములు కలవు. అందు సారకాండములో రావణవధవరకు గల రామాయణకథ పూర్తిగా వివరింపబడినది. యాత్రాకాండమున సీతా రామ లక్ష్మణుల అయోధ్యా గమనవృత్తాంతమును, యాగకాండమునందు శ్రీరాముని అశ్వమేధ యాగ వృత్తాంతములును తెలుపబడినవి. తక్కిన విలాసాది కాండములందు రాముని మాహాత్మ్యాదికములు వివరింపబడినవి.

ఆనందరామాయణమునకు మహారాష్ట్రలో మిక్కిలి వ్యాప్తి, ఆదరమును గలదు. ఆనందరామాయణములోని అవాల్మీకములైన కథలలో కాలనేమికథ,

సులోచనావృత్తాంతము మొదలగునవి తెలుగులో గోన బుద్ధారెడ్డి విరచితమగు రంగనాథ రామాయణమున కలవు. ఆనందరామాయణములో శూర్పణఖ కుమారుడు సాంబుడని చెప్పబడినది. రంగనాథ రామాయణములో శూర్పణఖ కుమారుడు జంబు కుమారుడని కలదు. ఆనందరామాయణము హనుమంతుని ప్రాముఖ్యమును ప్రశంసించును. ఆనందరామాయణముకూడ వివిధభాషలలోనికి అనువదింపబడినది.

ఇట్లు ఆయా పురాణముల స్వభావమునుబట్టి అమూలకములగు కొన్ని కల్పనలు సంస్కృత పురాణేతిహాసములలో గోచరించుచున్నను వానియందలి రామకథ మాత్రము వాల్మీకి హృదయమునకు భిన్నమైనది కాదు.

## 5. సంస్కృత కావ్యనాటకములలో రామకథ :

సంస్కృతకవులు పలువురు రామకథను రసదృష్టితో వివిధ కావ్యప్రక్రియలలో వెలయించినారు. కాళిదాసు రఘువంశము, కుమారదాసుని (క్రీ. శ. 6 వ శతాబ్ది) జానకీహరణము, భట్టి మహాకవి భట్టి కావ్యమని ప్రసిద్ధిచెందిన 'రావణవధ', అభినందుని (క్రీ. శ. 9 వ శతాబ్ది) రామచరితము, వేంకటనాధుని (13 వ శతాబ్ది) పాదుకాసహస్రము, మాధవ విద్యారణ్యుని (15 వ శతాబ్ది) రామోల్లాసము, వామభట్టబాణుని (15 వ శతాబ్ది) రఘునాధచరిత్ర, అభిరామకామాక్షి (16 వ శతాబ్ది) అభినవరామాభ్యుదయము మొదలగునవి రామకథాప్రస్తుతములైన సంస్కృత కావ్యములలో పేర్కొనదగినవి. కుమారదాసుని జానకీహరణమను ఇరువదిసర్గల కావ్యముపై కాళిదాసు రఘువంశప్రభావము అధికముగా కన్పట్టును. కాని జానకీహరణమున విశ్వామిత్రునకు బదులు వసిష్ఠుని, జటాయువునకు బదులు గరుడుని పేర్కొనుట వింతగా తోచును.

సంస్కృతములోని రామకథాపరములగు శ్లేషకావ్యములలో ముఖ్యమైనవి- ధనంజయుని రాఘవపాండవీయము, కవిరాజకవి రాఘవపాండవీయము, చిదంబరకవి రాఘవపాండవ యాదవీయము, వేంకటాధ్వరికవి (17 వ శతాబ్ది) యాదవ రాఘవీయము, హరిదత్తసూరి (18 వ శతాబ్ది) రాఘవనైషధీయము అనునవి.

రామకథను సంస్కృతములో చిత్రకావ్యములుగా రచించిన వారున్నారు. విట్ఠల ఉమాకవెంకటేశ్వరకవి రచించిన 30 సర్గల రామాయణసంగ్రహము, కృష్ణకవి రచితమగు 14 సర్గల క్రియాగోపన రామాయణము, సారాయమని

కృతమగు విరమనాపిక చంపూరామాయణము సంస్కృత చిత్రకావ్యములలో గణుతింపదగినవి.

సంస్కృతమున భోజుడు, లక్ష్మణుడు, రాజశ్యాముడు, ఘనశ్యాముడు, ఏకామ్రనాథుడు మొదలగువారు పూర్వరామాయణకథను, యతిరాజు, శంకరారాధ్యుడు, హరిహరనాథుడు మొదలగువారు ఉత్తరరామాయణకథను చంపువులుగా రచించినారు. రామకథను సంస్కృతములో గద్యకావ్యములుగ వెలయించినవారిలో ముఖ్యులు వాసుదేవుడు, దేవవిజయగని అనువారు.

ప్రతిమానాటకము, అభిషేకనాటకము, యజ్ఞఫలము మొదలగు నాటకములను రచించిన భాసుడు, కుందమాలకర్తయగు దిఙ్నాగుడు, జైన రామాయణమాధారముగా ఆశ్చర్య చూడామణిని రచించిన శక్తిభద్రుడు (క్రీ. శ. 8 వ శతాబ్ది) రామాభ్యుదయనాటక (అలభ్యము) కర్తయగు యశోవర్మ, మహావీరచరితము, ఉత్తరరామాయణములను రచించిన భవభూతి, అనర్ఘ రాఘవకర్త, బాలవాల్మీకి బిరుదాంకితుడగు మురారి (8 వ శతాబ్ది), బాలరామాయణ నాటకరచయిత రాజశేఖరుడు (900), ఉదాత్తరాఘవమను నాటకకర్తయగు మాయురాజు (900), ప్రసన్న రాఘవ నాటకకర్త జయదేవుడు మొదలగువారు రూపకప్రక్రియానుగుణముగ రామకథను మలచి సంస్కృతములో రచించినారు. మురారి అనర్ఘరాఘవమను ఏడంకముల నాటకములోని నూతనకల్పనలలో శూర్పణఖ రావణప్రేరితయై మంధరాకృతిదాల్చి కైకను పురికొల్పుట, కబంధుని బారినుండి రామలక్ష్మణులు గుహుని రక్షించుట అనునవి పేర్కొనదగినవి.

పైని పేర్కొనిన సంస్కృతకవులచేతిలో రామాయణఘట్టములు, రామకథాపాత్రములు విశిష్టశిల్పమును, వినూత్నకల్పనలను సంతరించుకొనినవి.

## 6. జైనసాహిత్యములో రామకథ :

పాలీ ప్రాకృతభాషలలో ముఖ్యముగా జైనసంప్రదాయ సాహితిలోని రామాయణకథలో ప్రధానకథాసూత్రముతప్ప తక్కిన ప్రతిఘట్టము, ప్రతి సన్నివేశము, ప్రతిపాత్రము సరిక్రొత్తవిగా వాల్మీకిరామాయణాతిరిక్తముగా కన్పట్టును. హేమచంద్రుడను జైనుడు త్రిషష్టిశలాక (శ్లోక) పురుషచరిత మను పేరులో రచించినగ్రంథమునందు రామకథ కలదు. ఈ కథ వాల్మీకి రామాయణముతో ముఖ్య విషయములలో భేదించుచున్నది. జైనసంప్రదాయ రామాయణకథలోని అవాల్మీ

కములైన కల్పనలనుగురించి, ఆంగ్లవ్యాసరూపముగ నున్నదానిని మంది శ్రీ సుర వరం ప్రతాపరెడ్డిగారు 'రామాయణవిశేషములు' అను గ్రంథమున సమీక్షించి వ్రాసినారు.

జైనసంప్రదాయ సాహితిలోని రామాయణకథలలో రెండు సంప్రదాయ ములు కలవు. ఒకటి గుణభద్రుని ఉత్తర పురాణకథ ననుసరించినది. రెండవది విమలసూరి (క్రీ. శ. 3 వ శతాబ్దమువాడని పండితుల తలంపు) పౌమచరియ (ప ఉమచరి అ) ననుసరించిన కథ. గుణభద్రుని ఉత్తరపురాణములో సీత మండో దరి కుమార్తె. విమలసూరి పౌమచరియలో రావణుడు వీరుడుగామాత్రమేకాక నీతి మంతుడుగ చిత్రింపబడినాడు. ఇందలి రామాయణకథలో వానరులు కపిధ్వజులైన విద్యాధరులు. రావణాది రాక్షసులుకూడ విద్యాధరులే. ఈ జైనసాహితిలోని రామ కథలో లక్ష్మణుడు ముఖ్యపాత్ర. వాల్మీకి రామాయణములోవలె రాముడు కాడు. వాల్మీకి పేర్కొనినట్లు ఇందులో రాముడు ఏకపత్నీవ్రతుడు కాడు. జైన సంప్ర దాయములలో బలదేవులు, వాసుదేవులు, ప్రతి వాసుదేవులు ప్రతి మహాయుగము నను తొమ్మండుగురుచొప్పున అవతరింతురు. అందులో రాముడు ఎనిమిదవ బల దేవుడు. లక్ష్మణుడు ఎనిమిదవ వాసుదేవుడు. రావణుడు ఎనిమిదవ ప్రతి వాసు దేవుడు. జైనసంప్రదాయ సాహితిలోని రామాయణము ప్రకారము రామునికి తదితర బలదేవులవలె వేయిమంది భార్యలు. లక్ష్మణునికి ఇతర వాసుదేవులవలె ఎనమండుగురు పట్టపు రాణులు, పదునారువేలమంది భార్యలు. లక్ష్మణునిరంగు నలుపు; రామునిరంగు తెలుపు. ఈ జైనగ్రంథములందలి రామాయణకథలో లక్ష్మ ణుడే గరుడవాహనుడు, చక్రి, నారాయణావతారుడు కూడ. రాక్షసులకు వానరులకు సంబంధబాంధవ్యము లుండెడివి. రావణుని అసలుపేరు రత్నశ్రవసుడు. 'దశ ముఖ' అనునది రావణుని బిరుదనామము. వాలి మేరుపర్వతమును తన బొటన వ్రేలితో నదుమగా దాని క్రిందనుండిన దశముఖుడు పీడితుడై అనేకసంవత్సర ములు రోదనముచేయుటచే రత్నశ్రవసునికి రావణుడని పేరు వచ్చినదట. సుగ్రీ వుని కూతురగు సుభద్రను రావణుడు వివాహమాడెను. శూర్పణఖపేరు చంద్రనఖ. హనుమంతుడు రావణుని చెలికాడు. హనుమంతుడు రావణుని కూతురగు సత్య వతిని, శూర్పణఖ కూతురగు అనంతకుసుమను, సుగ్రీవుని కూతురగు పద్మరాగను, నలుని కూతురగు హరిమాలినిని వివాహమాడినట్లు కలదు. ఈ బాంధవ్యమును పురస్కరించుకొని రావణుడు హనుమంతుని కర్ణమండలతాపురమునకు అధిపతిగా

చేసినాడట. సీతాపహరణము అకార్యకరణమని హనుమంతుడు చెప్పినను రావణుడు పెడచెవిని పెట్టును. రావణునిప్రవర్తన నరిపడక హనుమంతుడు శ్రీరామునిపక్షము చేరినట్లు జైనసంప్రదాయములోని రామాయణకథయందు కలదు. ఈ జైన రామ కథయందు కుంభకర్ణుడు, ఇంద్రజిత్తు మరణింపలేదు. విభీషణుడు లంకకు రాజయ్యెను. కుంభకర్ణుడు, ఇంద్రజిత్తును చిన్నచిన్నరాజ్యములకు రాజులయిరి. 'రావణు డొక్క స్త్రీలోలత్వమునదక్క తక్కినవిషయములం దాదర్శప్రాయుడే. బహురాజులకు స్త్రీ సంగతి నాటికిని నేటికిని మిక్కుటము. కాని రావణు డెన్ని చేసినను సీతాపహారకుడు కాకుండిన నిప్పటి యనేక విటరాజులవలె, రాజవిటులవలె నిందాస్పదుడు కాకుండెడివాడు. అత దహింసాప్రియుడు. యజ్ఞములయందు హింస యుండుటచే యజ్ఞధ్వంసి యయ్యెను. కాని యతడు వేదమతద్వేషియనియు, మునిహింసకుడనియు వాల్మీకి తన కలముయొక్క మసిచే రావణుని ముఖమును నల్లగా చిత్రించెను.' ఈ జైనసాహిత్యమందలి రామాయణములలో అహింసా విషయమును, రావణుని యజ్ఞధ్వంసకత్వమును తెలుపుట జైనసిద్ధాంత ప్రచారము నకై చేసిన మార్పని స్పష్టమగుచున్నది. రావణుడు శాంతీశ్వరతీర్థంకరుని ఆలయము ప్రవేశించి, వారిని ప్రార్థించును. మహేశ్వరునకు మారుగా ఈ జైన రామాయణమున ప్రతిష్ఠమందును జిననాథుని పేర్కొనియున్నారు. ఇదియును మతప్రచారార్థమే యైయుండును.

దశరథునికి అపరాజిత, సుమిత్ర, కైకేయి, సుప్రభ అని నల్గురు భార్యలు. అపరాజిత కుమారుడు పద్ముడు. అతడే రాముడు. సుమిత్ర కుమారుడగు లక్ష్మణుడు పీలవర్ణుడు, విష్ణ్వవతారుడు. కైకకు భరతుడు, సుప్రభకు శత్రుఘ్నుడును జన్మించిరి. సీత అయోనిజ కాదు. జనకునకు విదేహవలన సీత జన్మించినది. ఇందు మారీచుడు లేడు. బంగారుజింక మొదలే లేదు. ఇందలి వంశావళులు వాల్మీకి రామాయణములోని వంశావళులతో భేదించుచున్నవి. శంభూకుడు శూర్పణఖ పుత్రుడని, అతనిని లక్ష్మణుడు వధించెనని జైనసాహిత్యములోని రామాయణ కథ యందు కలదు. శంభూకుడను శూద్రతపస్విని రాముడు దండించినట్లు ఉత్తర రామాయణమున నున్నది. రాముడు సీతాదేవినేకాక ప్రభావతి, రతినిభ, శ్రీదమ అనువారినికూడ వివాహమాడెను. లక్ష్మణునికి 250 మంది పుత్రులట. లక్ష్మణుడు గరుడారూఢుడై తన చక్రముచే రావణుని చంపెను. వాల్మీకి రామాయణమున హను మంతుడు సంజీవిపర్వతమును తెచ్చినట్లున్నది. ఈ జైన రామాయణకథలో

ఖామండలుడు (ఇతదెవరో?) అమృతమును దెచ్చినట్లు చెప్పబడినది. వాల్మీకి రామాయణమునందు రాము డాదర్శపురుషుడుగ, ఏకపత్నీవ్రతుడుగను, రావణుడు పరమదుర్మార్గుడుగను చిత్రింపబడినాడు

ఇది హిందూ పౌరాణిక సంప్రదాయము. ఈ జైన సంప్రదాయ రామాయణ కథ జైన మతానుయాయులను తప్ప ఇతరుల నంతగా నాకర్షింపలేదు. కాని ఈ జైన రామాయణములో విశ్వసనీయవిషయము లనేకములున్నవని శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు తెల్పినారు. వైదికమతమును అవహాస్యము చేయుటకు జైనులు, బౌద్ధులు తమతమ మతధోరణుల ప్రకారము కొన్ని విడ్డూరములను రామకథలో సృష్టించినారని కొందరు తలంతురు.

## 7. బౌద్ధ జాతకకథలలో రామకథ :

చైనాభాషలోని 'బౌద్ధత్రిపిటక' మహాగ్రంథములో రామకథలు రెండు కన్పించును. ఒకటి: "పేరుతెలియని రాజు జాతక కథ". రెండవది: 'దశవిలాన ముల రాజు నిదానము'. ఈ రెండు జాతకకథలలో రామాయణ కథాబీజములు గోచరించునని ఆ కథలను ఆరుద్రగారు 'రాముడికి సీత ఏమౌతుంది' (మా. ఆంధ్ర జ్యోతి-ఆదివారం అనుబంధము, 31-3-76) అను వ్యాసమునందు వివరించి యున్నారు. పేరు తెలియని రాజు జాతకకథ పాలీభాషలో కనపడదు. ఇందు రామ కథ బీజప్రాయముగ నున్నది. ఇందు లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు లేరు. హను మంతుడు, వాలి, అంగదుడు మొదలగువారుకూడ లేరు. కాని వాల్మీకి రామాయణ పుట్టుములకు బీజములుగ రావణుడు యతివేషములో వచ్చుట. రాముడు లేనప్పుడు సీతను అపహరించుట. జటాయువు రావణుని వారించుట. సుగ్రీవునితో రాముని సఖ్యము, వానరసేనకు సంపాతి సీతజాడ నెరిగించుట. సేతుబంధనము రాక్షసుల మాయాయుద్ధములు మొదలగునవి యున్నవి.

ఈ జాతకకథలో శుక్రకపియే హనుమంతుడు, నలుడు మొదలగువారి పను లన్నియు నిర్వహించినట్లు చెప్పబడినది. ఋగ్వేదములో ఇంద్రునికి ప్రాముఖ్య ముండుటవలన ప్రాచీన రామకథకు ఇంద్రుని జోడించినట్లు కన్పట్టును. శక్రుడు పితృస్వామ్యదేవత. ఈ దేవత సహాయములేనిదే మాతృస్వామ్యములోని వ్యక్తులు జయించలేరను సత్యమును ప్రచారముచేయుటకే శక్రుని ఈ జాతకకథలో పేర్కొని యుండవచ్చును. ఈ జాతకకథలోని కథనుబట్టి ఆనాటిసమాజములో

మాతృస్వామ్యమున్నట్లు కన్పట్టును. తల్లి పెత్తనముగల సమాజమునందే మేన మామకు అధికారముండును. ఈ కథలోని బోధిసత్త్వదేకాక వానరరాజుకుకూడ మేనమామ మూలముగనే బాధలు కలుగుట గమనింపదగిన విశేషము.

బౌద్ధజాతక కథలందలి 'దశరథ జాతకము' నందు రామకథ పేర్కొన బడినది. ఇది పాలీభాషలో నున్నది. బౌద్ధజాతక రామకథయందు దశరథుడు వారణాసి పరిపాలకుడు. అతని మొదటిభార్యకు రామ లక్ష్మణులను ఇద్దరు కుమారులు. 'సీత' అను ఒక కూతురు కలిగిరి. భరతుడు రెండవభార్య కుమారుడు. మొదటి భార్య మరణించినతరువాత దశరథుడు రెండవవివాహము చేసికొనెను. రెండవ భార్య తన కుమారుడగు భరతునకు రాజ్యమిమ్మని వరముగా కోరినప్పుడు దశరథుడు తన మొదటిభార్య సంతానమున కపాయముకల్గునని భయపడి, తాను 12 సంవత్స రములు జీవింతునని జ్యోతిష్కులు చెప్పియుండుటచే వారిని 12 సంవత్సరములు హిమాలయమునందు నివసించునట్లు నియోగించెను. కాని దశరథుడు తొమ్మిది సంవత్సరములకే మరణించెను. దశరథుని రెండవభార్య తన కుమారుడగు భర తునికి పట్టాభిషేకముచేయ నిశ్చయించెను. భరతు డందుల కంగీకరింపక రాముని వేడి రాజ్యమును స్వీకరింపుమనెను. అతడు తండ్రియాజ్ఞ నుల్లంఘించనని, 12 సంవత్సరములు రాజ్యమునకు రానని తెల్పి తన పాదుకలను భరతున కిచ్చెను. 12 సంవత్సరములు పూర్తియైనతరువాత రాముడు తిరిగివచ్చి పట్టాభిషిక్తుడై 16 వేల సంవత్సరములు పరిపాలించెను.

బుద్ధుని పూర్వజన్మవృత్తాంతముగ పేర్కొనబడిన ఈ కథయందు దశ రథుడే శుద్ధోదనుడు. శ్రీరామునితల్లి మాయాదేవి. సీత రాహులుని తల్లి. భర తుడు ఆనందుడు. లక్ష్మణుడు శారిపుత్రుడు. రాముడు బుద్ధుడు.

దశరథ జాతక కథయందు సీతారాములు ఒక తల్లిబిడ్డలు. వీ రిరువురికి వివాహమైనట్లు ఈ జాతకకథ తెల్పినది. శక (Seythian) జాతియందు సోదరు లకు వివాహముకావించు ఆచారముకలదని పీకాక్ (Peacocke) గారు 'India in Greecabe' (PP. 191–195) అను గ్రంథమునందు తెల్పినాడు. కాని ఇట్టిపద్ధతి ఆర్యహిందువులలో లేదు.

బుద్ధుని మతవ్యాప్తి ప్రబలినతరువాత అతని గొప్పతనమును నిరూపించు టకు భక్తులచే 'దశరథ జాతకము' వంటి 'జాతకకథలు' అనేకములు అల్లబడినవి.

సుప్రసిద్ధమగు రామాయణకథను బౌద్ధులు తమ జాతకకథలోనికి తమ కవసరమగు మార్పులతో స్వీకరించినారని స్పష్టముగ తెలియుచున్నది.

## 8. పైశాచీభాషలో రామకథ :

బృహత్కథను పైశాచీభాషలో గుణాఢ్యుడు రచించెనందురు. కాని ఆ గ్రంథము నేడు లభించుటలేదు. కాశ్మీరమును పరిపాలించు హర్షదేవుని (1100) ఆస్థానమందుండిన, సోమదేవరసూరి దీనిని సంస్కృతములో 'కథాసరిత్సాగరము' అనుపేరుతో రచించినాడు. మూలమైన పైశాచీ బృహత్కథ కిది యథామువాదమని సోమదేవుడు గ్రంథారంభమున పేర్కొనియుండుటచే, కథాసరిత్సాగరమునందలి రామాయణ కథాసారమునుబట్టి. బృహత్కథాకాలము (క్రీ. పూ. 200) న వ్యాప్తి నొందిన రామకథను గ్రహింపవచ్చును. బృహత్కథలోని రామకథ వాల్మీకి రామాయణానుసారముగనే నున్నది. ఉత్తరకాండ కథయందుమాత్రము ఒకచోట కొంత భేదము కన్పట్టును. రామునిచే పరిత్యజింపబడి సీత వాల్మీకి ఆశ్రమమును చేరెను. అచ్చటి మునులును ఆమెను సందేహించిరి, అప్పుడు సీతను పరీక్షించుటకై మును లిట్లనిరి. 'ఇచట టిటిభ సరస్సు కలదు. పూర్వమొక టిటిభిని భర్త శంకించి దూషణ చేసెను. టిటిభి ఆక్రందించెను. ఆ సరస్సును దేవత లామె శుద్ధ్యర్థమై నిర్మించిరి. అందు సీత తన పాతిశుద్ధ్యమును రుజువు చేయుగాక !' సీత ఆ సరస్సులోదిగి అవతలిగట్టుచేర భూదేవిని ప్రార్థించెను. ఆమె సీతను ఒడిలో నుంచుకొని అవతలిగట్టు చేరెను... (వేదం వేంకటరాయశాస్త్రిగారు కథాసరిత్సాగరమునకు చేసిన తెలుగు అనువాదమునుండి ఈ వాక్యములు గ్రహింపబడినవి)

## 9. భారతీయేతరభాషలలో రామకథ :

వాల్మీకి రచించుటకుపూర్వముకూడ రామకథలు ప్రచారములో నుండి యుండినవని వాల్మీకి రామాయణమునుబట్టియే తెలియుచున్నది. నారదుడు వాల్మీకికి రామాయణకథను సంగ్రహముగా వినిపించినట్లు కలదు. తరువాత ఆ కథను వాల్మీకి విపులీకరించి కావ్యముగా రచించినాడు. నారదుడు చెప్పిన రామకథ సహజముగా జనసామాన్యములో వ్యాప్తిగాంచియుండును. అంతకుముం దెన్నియో తరములపాటుగా రామకథ ప్రచారములో నుండియుండును. వైదికులవలె బౌద్ధులు, జైనులుకూడ రామాయణమును తమ మతముల కనుగుణముగా నుపయోగించు

కొనినారు. బుద్ధుని, వైదికులు దశావతారములలో నొకనిగా పరిగణించినట్లే బౌద్ధులు రాముని బుద్ధుని పూర్వజన్మలలో ఒక జన్మగా చెప్పికొనినారు. వైదికులు రామునిచేత బౌద్ధులను, నాస్తికులను నిందింపజేసినారు. జైనులు రావణునిచే హింసాత్మకములగు యజ్ఞయాగాదులను నాశనముచేయించి అహింసను ప్రబోధించినారు.

భారతదేశములోని మూడు ప్రధానమత వాఙ్మయములలోనేకాక దాదాపు అన్ని ప్రధానభాషలలోను రామాయణములు రచింపబడినవి. ప్రతిభాషలోని రామాయణమునందును అవాల్మీకములైన కల్పనలు కొన్ని గోచరించుచున్నవి. రాముని మీది భక్తితో, రామాయణముపై గల గౌరవభావముతో వ్రాసిన ఈ గ్రంథములలో అవాల్మీకాంశములు చోటు చేసికొనుటకు ముఖ్యకారణము సంప్రదాయమును విస్మరింపకపోవుటవలననే.

మన ప్రాచీనులు మతమునుకూడ ప్రాచ్యదేశములకు వ్యాపింపజేసినారు. రామకథ ఆసియాఖండమంతటను అలముకొనినది. రామకథ చైనాభాషలోనికి జాతకకథలరూపమున స్వీకరింపబడినట్లు పేర్కొంటిమి. బౌద్ధసంప్రదాయ రామాయణములో సీత రామునికి చెల్లెలు మాత్రమేకాక అర్ధాంగికూడ. శ్రీలంక, టిబెట్టు, ఖోటాను, మంగోలియా, సైబీరియా, జపాను, లావోస్, కాంబోడియా, థాయ్‌లాండ్, ఇండోనీషియా, మలేషియా, ఫిలిప్పీన్, బర్మా మొదలగుదేశములందు రామాయణకథ కొన్నిచోట్ల జానపదగాథలుగా బహుళప్రచారమందినది. మరికొన్ని చోట్ల సాహిత్యముగా గ్రంథస్థమైనది. ఈ కథలలో వాల్మీకి రామాయణములో లేని నూతనాంశము లెన్నియో కలవు. బౌద్ధ జైన రామాయణములతోపాటు ఈ దేశదేశముల రామాయణములు సీతారాములపై గౌరవభావము కలిగినట్టివే. సీతారాములు ఆరాధ్యులైనప్పటికిని వాల్మీకికంటె చాలతరములుగా వ్యాప్తిలోనుండు కథలు వ్యాపించియుండుటచే వివిధదేశముల రామాయణములలో బౌద్ధ జైన రామాయణములలోని అంశములు యెక్కువ కన్పట్టుచుండును.

ఖోటాన్ రామాయణకథ బౌద్ధజాతక కథవలె నుండును. ఇది క్రీస్తుశకం తొమ్మిదవశతాబ్దమున ప్రచారములో నున్నట్లు తెలియుచున్నది. ఖోటాన్ రామాయణములో లక్ష్మణుని పేరు రైస్మణుడు. ఇందు దశరథునికుమారుడు సహస్రబాహుడు. అతని కుమారులు రైస్మణుడు రాముడు అని చెప్పబడినది. ఈ రామాయణములో సీత, రైస్మణ రాము లిరువురికి భార్య. ఆ అన్నదమ్ము లిరువురును

సీతతో నూరేళ్లు కాపురము చేసినట్లు చెప్పబడినది. ఖోటాన్ రామాయణములో సీత దశగ్రీవుని కూతురు. దశగ్రీవుని ఆయువుపట్టు అతని కాలి బొటనవ్రేలియం దున్నట్లు ఈ రామాయణములో వర్ణింపబడినది. ఈ విషయమును దశగ్రీవుని జాతకముమూలమున రాముడు తెలిసికొనును. కప్పము కట్టుట కంగీకరించి లొంగి పోయిన దశగ్రీవుని రాముడు సంహరింపకుండ వదలిపెట్టినట్లు ఖోటాన్ రామాయణమునందు కలదు.

అన్ని జాతక కథలందువలె ఖోటాన్ రామాయణకథ చివరకూడ బుద్ధుడు. పూర్వజన్మలో తానే రైన్మణుడనని. మైత్రేయుడు రాముడని తెల్పును.

లావోస్‌దేశములో రకరకాల రామకథలు వ్యాప్తిలో నున్నవి. లావోస్‌లో ప్రచారమందున్న బౌద్ధమతప్రభావముగల 'రామ జాతకకథ'లో దశరథుని తమ్ముని పేరు విరులహాంకు. దశరథునికి రామ లక్ష్మణులను ఇరువురు కుమారులు, 'శాంత' అను కూతురు కలదు. విరులహాని పుత్రుడు రావణాసౌనుడు. 'రామజాతక కథ' లో రావణాసౌనుడు 'శాంత'ను అపహరించి, చివరకు ఆమెను పెండ్లాడును. దీని వలన పినతండ్రి పెదతండ్రి పిల్లల వివాహము ఆదేశములో అంగీకార్యమనుట తెలియగలదు.

షట్‌పారమితా సూత్రములలోని 'దశవిలాసములరాజు విదానము' అను మరొక లావోస్ రామాయణకథలో సీత ప్రసక్తి కన్పట్టదు.

లౌంగ్‌ప్రబంగ్ అను మరొక లావోస్ రామాయణములో దశరథునికి నాల్గవభార్యయగు మండోదరి వలన సీత జన్మించినట్లు కలదు.

'బ్రహ్మచక్రము' అను మరొక లావోస్ రామాయణపాఠములో సీత. రావణుని ఉద్యానవనములోని ఒక వృక్షమునకు జన్మించినదని వర్ణింపబడినది.

లావోస్‌లో ప్రముఖముగా ప్రచారమందున్న రామాయణకథ ప్రకారము, దశరథుని కూతురు సంగ్‌చంద్ర. మరొక కథనముప్రకారము ఈ 'సంగ్‌చంద్ర'యే 'శాంత'గా పేర్కొనబడినది. ఇందు రాముని పేరు 'ప్రలమ్'. అతనిభార్య సీత. రావణుడు 'ప్రలమ్' చెల్లెలగు 'సంగ్‌చంద్ర'ను, అతని భార్యయగు సీతను ఇరువురిని విడివిడిగా రెండువిధముల నపహరించును. ఈ రామాయణకథలో సీత రావణుని కుమార్తెయే. 'ప్రలమ్' అను పేరుగల రాముడు విపత్కరకర్మవలన మూడేళ్ళపాటు వానరుడుగా మారిపోవును. అతనికి 'హనుమాన్' అను కుమారుడు

జన్మించును. తిరిగి మానవాకారము వచ్చినతరువాత 'ప్రలమ్' సోదరుని సహాయము వలనను, పుత్రుడగు హనుమాన్ సహాయమువలన లంకపై దండెత్తి రావణుని సంహరించి తన చెల్లెలిని భార్యను విడిపించును. లావోస్ రామాయణములో రాముని కొడుకు హనుమంతుడనునది ఒక విడ్డూరముగ తోచవచ్చు. లావోస్ రామ కథలోనే కాక ఇతరదేశముల రామకథలలోను ఈ వింత కలదు.

మలేషియాలో రాముని భక్తితో ఆరాధించుటయేకాక "దేవ బెరుంబున్" (దేవపరబ్రహ్మము) అను నవతారముగా భావింతురు. వయాంద్ (తోలుబొమ్మలు) ఆటగాండ్రు గానముచేయు 'చరిత్ర మహారాజా వన' అను రావణుని కథ, 'హికా యత్ శ్రీరామ' అను రామచరితము మలేషియాలో కావ్యప్రశస్తి పొందినవి. మలేషియాలో రావణుని 'వన' అందురు. రావణునికి పదితలలతోపాటు అదనముగా రెండుతలలు కిరీటముక్రింద యుండును. మలేషియాలో ప్రచారమందిన రామ చరిత్ర, రావణచరిత్రలనుండి అనేకాంశములు వ్యక్తమగుచున్నవి.

మలేషియా రామాయణములో మండూదారి దశరథుని పెద్దభార్య. కైకేయీ స్థానములోనున్న బాల్యాదారి దశరథుని భోగపత్నిమాత్రమే. మండూదారికి రామ లక్ష్మణులు జన్మించినారు. బాల్యాదారికి మొదట భరత శత్రుఘ్నులు ఆటుతరువాత 'కికేవిదేవి' అను కుమార్తె ప్రభవించిరి. రావణుని లంకలోనున్న ఛాయామండూ దరికి, దశరథునికి చాటుమాటుగా పుట్టిన కుమార్తె సీత. ఈ సీత రావణుని కుమార్తెగానే ప్రఖ్యాతి చెందినది. మలేషియా రామాయణములో దశరథునికొడుకు, రావణుని పుత్రికను పెండ్లాడి రావణుని సంహరించును. మలేషియాలోని రామ రావణచరిత్రలో మండూదరిని వాలి రావణునిమించి అపహరించుట, ఆమెవలన వాలికి అంగదుడు జన్మించుట మొదలగు ఘట్టములుకూడ కలవు. రామ రావణ యుద్ధము తరువాత మండూదరికి సీత తనకుమార్తె అనికూడ తెలుస్తుంది. ఒక సంప్రదాయముప్రకారము రాముడు వనవాసమునకు వెళ్ళినపుడు అతని వియోగ మును భరించలేక మరణించినది మండూదరియే. దశరథుడు కాడు.

రామాయణకథ తమ ద్వీపమునందే జరిగినదని ఇండోనీషియులు విశ్వ సింతురు. ఇండోనీషియా రామాయణమున రావణుడు యుద్ధరంగములో రామునిచే కాక స్వీయపుత్రికల ఆత్మలను రెండుకొలలమధ్య నలిగి నశించినట్లు వర్ణింపబడినది.

రామాయణమును 'థాయ్‌లాండ్'లో 'రామకియెన్' (Ramakien) అని యు, కాంబోడియాలో 'రామ్‌కేర్' (Ramker) అనియు వ్యవహరింతురట.

అధ్యాత్మరామాయణమునందువలె రావణుడు మాయాసీతనే అపహరించినట్లు బర్మాదేశమునందలి రామాయణకథయందు పేర్కొనబడినది.

ఇట్లు హిందూమతగ్రంథములలో సీత జనకుని పెంపుడుకూతురుగ, బౌద్ధ జాతకకథలలో సీత దశరథుని కన్న కూతురుగా, రాముని భార్యగా, ఖోటాన్ రామాయణములో రామ లక్ష్మణు లిద్దరికిని సీత భార్యగా తెల్పబడినది.

వివిధదేశములందు వివిధరీతుల ప్రచారమునందిన రామాయణగాథలన్నియు ఆయా దేశప్రజలు కల్పించినారని చెప్పుటకు వీలులేదు. ఈ గాథలన్నియు భారత దేశమునుండియే ఆయా దేశములలోనికి వ్యాపించినవి. జైన బౌద్ధమతములు వ్యాపించినప్రదేశములలో అవాల్మీకములైన రామకథలుకూడ వ్యాపించినవి. మన మీనాడు వాల్మీకి రామాయణములోని ఘట్టములను విశ్వసించినట్లే ఆనాటిప్రజలు కూడ వానిని విశ్వసించియుందురు.

రామకథలోని పైని పేర్కొనిన పలువిధములగు కథనములను గమ నించియే కాబోలు 'విడియ విడియ రామాయణం కేట్టు రామనుక్కు సీతై ఎన్న అగవేనుమ్ ఎన్ను కెట్టవన్' అని తమిళమునందును, 'రామాయణమంతా విని రాముడు సీత కేం కావాలి' అని తెలుగులోను ప్రశ్నరూపమగు సామెతలు వ్యాప్తి లోనికి వచ్చియుండును. రామాయణమంతయు కాకపోయినను వివిధరామాయణము లన్నియు వినినతరువాత ప్రతియొక్కరియందును ఈ ప్రశ్న ఉదయింపకమానదు. ఇది రామకథకుగల ప్రచారమును సువ్యక్తము చేయును.

భారతీయ సాహిత్యాభివృద్ధికి మూలాధారమైన వాల్మీకి రామాయణకథ భార తీయేతర భాషలలోనికికూడ పరివర్తనము చెందినది. వాల్మీకి రామాయణమును గొరెషియో (Gorresio) అనునతడు ఇటలీ భాషలోనికి భాషాంతరీకరించినాడు. ఆంగ్లము, రష్యన్ మొదలగు భాషలలోనికికూడ వాల్మీకి రామాయణము అనువ దింపబడినది.

## 10. భారతీయసాహిత్యములు - రామకథ:

వాల్మీకి రామాయణము ముఖ్యములగు భారతీయభాష లన్నిటిలోనికి అనువ దింపబడినది. వివిధభారతీయ సాహిత్యములందలి రామాయణములను పేర్కొని వాల్మీకి రామాయణముతో వానికిగల అనుబంధమును పేర్కొందము.

## 11. వంగసాహిత్యములో రామకథ:

వంగసాహిత్యములోని రామాయణములలో మొదట పేర్కొనదగినది కృత్తివాస ఓఝా (క్రీ. శ. 1420 ప్రాంతము) రచించిన రామాయణము. కృత్తివాసరామాయణము వాల్మీకి రామాయణమునకు అనువాదమేయైనను అనేకచోట్ల అవాల్మీకములైన కల్పనలు అందు గోచరించును. కృత్తివాసకవి కృతములుగ 'సీతారబార మాస్య', 'లక్ష్మణేర్ శక్తిశేల', 'రామరాస', 'అద్భుతరామాయణ' మొదలగునవి ప్రచారములో నున్నవి.

వంగరాష్ట్రములో ఒకప్పుడు జైనమతము చాల ముమ్మరముగా కొనసాగినది. ఇరవైనలుగురు జైనతీర్థంకరులలో ఇరవైముగ్గురు వంగరాష్ట్రములోని నేటి హజారీబాగ్ జిల్లాలోనున్న పారెస్‌నాథ్ పరక్కాలదగ్గరనున్న సమేత్శిఖరమున సిద్ధిపొందినారు. కొందరు తీర్థంకరులు వంగదేశములో జన్మించినవారే. మహావీరుడుకూడ వంగదేశములో బహుకాలము పర్యటించినాడు. ఈ కారణముల వలన బెంగాలీ రామాయణములలో జైనప్రభావము కన్పట్టుచున్నది.

కృత్తివాస ఓఝా అనంతరము బెంగాలీభాషలో వెలువడిన రామాయణములలో వాల్మీకి రామాయణముకంటె అద్భుత, అధ్యాత్మరామాయణముల అనువాదములే అధికముగ కలవు. మహాభారతములోని రామాయణకథ ననుసరించి 'భారత రామాయణము' లేదా 'సంక్షిప్తరామాయణము' అను పేరునకూడ వంగభాషలో పెక్కు రామాయణములు వెలువడినవి.

అద్భుతాచార్య (నిత్యానంద) అనునతడు వంగభాషలో అద్భుతరామాయణమును రచించినాడు. ఇందు అద్భుతావహములగు విషయములు పెక్కు కలవు. సీతాదేవి కాలికాదేవి అవతారముగా ఈ అద్భుతరామాయణమున చెప్పబడినది. అద్భుతాచార్యుడు వంగభాషలో శతకంఠరామాయణమునుకూడ రచించినాడు.

బెంగాల్‌లో చంద్రావతి (1550) అను కవయిత్రి 'రామాయణగీత', 'దస్యుకెనా రామ' అను గ్రంథములను రచించినది. ఈమెను సాహిత్య చరిత్రకారులు మొదట గుర్తింపలేదు కాని చంద్రావతి రామాయణములోని పాటలను బెంగాల్‌లోని అబాలగోపాలము పాడుకొందురు. మైమెన్‌సింగ్‌జిల్లాలో గ్రామీణ ప్రాంతములలో పడవవారు పాడునట్టిపాటలు, రథసప్తమినాడు స్త్రీలు సూర్యోదయము మొదలుకొని సూర్యాస్తమయమువరకు గానముచేయుపాటలును చంద్రా

వతి రామాయణములోనివే, పర్వదినములలోను, పెళ్ళిళ్ళలో ముఖ్యముగా మంగళ స్నానములు చేయించుటకు ముత్తయిదువుల పీళ్ళు తోడితెచ్చు సందర్భమునను, పెళ్ళికూతురును అలంకరించునప్పుడును, పెళ్ళికొడుకుకు క్షౌరము చేయించునప్పుడును చంద్రావతిరామాయణములోని కీర్తనలనే గానము చేయుచుందురు. చంద్రావతిరామాయణములో కైకేయీ దశరథుల కూతురు 'కుకువాదేవి' అని చెప్పబడి నది. కుకువాదేవి మందర పెంపకములో పెరిగినది. రావణవధ తరువాత రామ పట్టాభిషేకము పిమ్మట సీతారాములు సుఖముగా కాపురము చేయుచున్నప్పుడు ఈ కుకువాదేవి వారి కాపురములో చిచ్చుపెట్టినది. గర్భవతియగు సీతను నవికరము లేకుండ రాముడు అడవులకు పంపించుటకు ఈ కుకువాదేవియే ముఖ్యకారణము.

బ్రహ్మాండపురాణాంతర్గతమగు అధ్యాత్మరామాయణము ననుసరించి బెంగాల్‌లో రామశంకరదత్తు (1700) రామశంకర రామాయణమును రచించెను. శంకరకవిచంద్ర (1702) విష్ణుపురీ రామాయణము, జయప్రసాద రామప్రసాదుల (1770, 1796) రామాయణము, మైకేలు మధుసూదనదత్తు (1824-1873) మేఘ నాధవధ కావ్యము అనునవి వంగసాహిత్యములో పేర్కొనదగిన రామాయణ ములు. బంగ్లాసాహిత్యములోనేకాక భారతీయసాహిత్యమునందే మహాకావ్య మన దగినది 'మేఘనాధ వధ' అను కావ్యము. ఇందలి కథ రామాయణాంతర్గతమే యైనను నవీనము, అపూర్వమువంటి మహాసృష్టి. ఈ రామాయణకథలో ఇంద్ర జిత్తు భార్య ప్రమీలగా పేర్కొనబడినది. ఇందు కవి రాక్షసులపక్షము వహించి నాడు.

## 12. ఒరియా సాహిత్యములో రామకథ :

ఉత్కలవ్యాసు డని ప్రశస్తిగడిపిన సరళాదాసు ఒరియాభాషలో విలంక రామాయణము, విచిత్ర రామాయణములను రచించినాడు. విలంకరామాయణములో సహస్రకంఠుడైన మహీ (మై) రావణుని, శక్తిస్వరూపిణియైన సీత సంహరించుట ఇతివృత్తము. ఈ విచిత్రరామాయణమును దొంకాడ సీతారామకవి తెలుగులోనికి అనువదించినాడు. ఒరియా భాషలోని విలంక రామాయణములోని కథ పలువురు తెలుగు కవులకు అనుకార్యమైనది.

సరళాదాసు రామాయణము తరువాత ఒరియాభాషలో వెలువడిన మహా కావ్యము బలరామదాసు రామాయణము. ఇందు ఉత్కళులు రామునితో వెడలి

దండకారణ్యమున రామునికి సహాయమొనరించినట్లు పేర్కొనుట కవియొక్క ఉత్కళాభిమానమును వ్యక్తము చేయుచున్నది.

## 13. కాశ్మీరీ సాహిత్యములో రామకథ:

దివాకర ప్రకాశభట్టు అను నామాంతరముగల ప్రకాశరాముడు (1760) పూర్వరామాయణకథను రామావతారచరితమను పేరను, ఉత్తరరామాయణకథను లవకుశయుద్ధచరిత మను పేరను కాశ్మీరీభాషలో రచించినాడు. ప్రకాశరాముని రామావతారచరితము కేవల అనువాదగ్రంథము కాదు. ప్రకాశరాముడు నాటి సామాజిక జీవనమునకును, వ్యక్తుల చిత్తవృత్తి చిత్రణమునకును సముచిత స్థానము నొసగి ఈ గ్రంథమును రచించినాడు. ఈ రామాయణమునందలి కౌసల్య కాశ్మీర మాతృహృదయమునకు ప్రతీక యనదగును. దివాకర ప్రకాశభట్టు కాశ్మీరీ రామాయణములో ప్రధానముగ పేర్కొనదగిన అవాల్మీకాంశము సీత రావణుని కూతురిని వర్ణించుట.

## 14. హిందీ సాహిత్యములో రామకథ :

రామాయణకథ హిందీలో నాల్గు అంచెలుగా వ్యాపించినట్లు భగీరథమిశ్రా గారు తెల్పినారు. ప్రథమదశలో వాల్మీకి రామాయణమునకు అనువాదములు వెలసినవి. వానిలో పేర్కొనదగిన అమూలకవిశేషములు లేవు. రెండవదశలో వెలువడిన రామాయణములలో రాముడు భగవంతుడే. లోకోద్ధరణమునకై అవతరించి ఆదర్శజీవితము గడపిన అవతారపురుషుడైనాడు. ఈ దశలో ప్రధానముగా పేర్కొనదగినది తులసీదాసు (1589) రచించిన రామచరితమానస్ అనునది. ఇది హిందీసాహిత్యమునందేకాక భారతీయ సాహిత్యములందుకూడ ప్రశంస అందుకొనిన మహాగ్రంథము. రామచరితమానసమున బాలాదికాండలు సోపానములుగ వింగడింపబడినవి. తులసీదాసు అధ్యాత్మరామాయణమునందలి రాముని భగవత్తత్త్వ విచారమును ప్రముఖముగా వర్ణించినాడు.

అధ్యాత్మరామాయణము, హనుమన్నాటకము, శ్రీమద్భాగవతములను ఆధారముగా రామచరితమానసమున తులసీదాసు అచ్చటచ్చట తన ప్రవృత్తి కనుకూలముగ అమూలకములగు కొన్ని మార్పులను చేసినాడు. మిథిలానగరమున రామలక్ష్మణులు విశ్వామిత్రుని అనుమతిబడసి పూజాపుష్పములకై ఉద్యానవనమునకేగి

గౌరీపూజార్థ మట కరుదెంచిన సీతాదేవిని చూచినట్లు తులసీదాసు రామాయణమున కలదు. సీతారాముల పూర్వరాగవృత్తాంతము హనుమన్నాటకానుసరణమని విమర్శకులు భావించుచున్నారు. సీతారాముల పూర్వరాగవృత్తాంతము తమిళమున కంబకవి (క్రీ. శ. 12వ శతాబ్దము) రచించిన రామావతారమునందును కన్పట్టును. తులసీదాస రామాయణమునందు అధ్యాత్మరామాయణమునందువలె దేవతాప్రార్థనము చే సరస్వతి మంథరా కైకేయుల నావేశించినట్లు కలదు గంగావతరణఘట్టమున గుహుండు శ్రీరాముని పాదపద్మములను ప్రక్షాళనము గావించినట్లు తులసీదాసు రామాయణమునందు కలదు. ఈ కల్పనమువంటిది అధ్యాత్మరామాయణమునందు కలదు. తెలుగులోని మొల్లరామాయణమునందును. శ్రీ కృష్ణ రామాయణమునందును ఈ భావమే విపులీకరింపబడినది. యుద్ధకాండమని పేర్కొనక తులసీదాసు తన రామాయణమున 'లంకా కాండ'మని పేర్కొనుటచే విభీషణ శరణాగతి సుందరకాండముననే చెప్పవలసి వచ్చినది. తెలుగులో గోన బుద్ధారెడ్డి (క్రీ. శ. 1280) విరచితమగు రంగనాథరామాయణమందలి సులోచనా వృత్తాంతము తులసీదాసు రామాయణమునందును కన్పట్టుచున్నది. లంకలో విభీషణ హనుమంతులు శ్రీరామ మాహాత్మ్యమును, సీతావృత్తాంతములనుగురించి సంభాషించుకొనినట్లు తులసీదాసు తన రామాయణములో స్వయముగ కల్పించినాడు. తులసీదాసు రామాయణమున రామపట్టాభిషేకము యుద్ధకాండమున కాక ఉత్తరకాండమునందు కలదు. ఉత్తరకాండమున సీతాపరిత్యాగవృత్తాంతము లేదు. కుశలవులు అయోధ్యయందే జన్మించినట్లు తులసీదాసు చెప్పినాడు. తులసీదాస రామాయణములో మరొక విశేషము సీతారామ వనవాససందర్భమున వారు భరద్వాజాశ్రమమువీడి చను నప్పుడు తులసీదాసే ఒక తాపసిరూపమున సీతా రామ లక్ష్మణులకు ఆతిథ్య మొసగినట్లు రచింపబడుట.

తులసీదాసు. హిందీ భాషాంతర్గతమగు 'అవధి'లో రచించిన 'రామచరితమానస'మును మండ కామేశ్వరకవి (క్రీ. శ. 1857) నిర్వచనముగాను, భాగవతుల నరసింహశర్మ, మైలవరపు సూర్యనారాయణమూర్తులు ప్రత్యేకముగా పద్యకావ్యములుగను, మాతల పార్వతీ కృష్ణమూర్తి, ఏలూరిపాటి లక్ష్మీసరస్వతి అను వారు వచనకావ్యములుగను, కేశవతీర్థస్వామి మంజరీ ద్విపదరూపముగను తెలుగులోనికి అనువదించినారు. తులసీదాసు రామాయణమును 'ఎట్కిన్స్' అను నతడు ఆంగ్లములోనికి. 'వారాన్నికోల్' అను నతడు రష్యన్ భాషలోనికి అనువదించినారు.

ఈ ద్వితీయదశలో తులసీదాసు రామచరితమానసము తరువాత ఎన్నదగినవి రామాయణములు-ఆచార్య కేశవదేవుల 'రామచంద్రిక'యు, సహజరాముల 'రఘు వంశ దీపిక'యును.

ఇక మూడవదశలో శ్రీరామపూజ ప్రత్యేక సంప్రదాయమై హిందీలో రసికోపాసనా సాహిత్యము వెలసినది. అందులో సీతారాములు రసస్వరూపులు. ఈ సంప్రదాయములో సుమారు 70 మంది హిందీకవులు దాదాపు 200 గ్రంథములను రచించినట్లు తెలియుచున్నది.

ఆదుపరి నాల్గవదశ ఆధునికకాలము. ఈ దశలో రాముడు ఆదర్శమానవుడు. సత్యము, ప్రేమ, ధర్మము అనుష్ఠించి సంఘమునకు మార్గదర్శకుడైనాడు. వీనిలో మైథిలీ శరణగుప్త కృతమగు 'సాకేత', 'నిరాలా' అను కవి రచించిన 'రామ్‌కీ శక్తిపూజ' అను గ్రంథములు ప్రధానముగా పేర్కొనదగినవి.

## 15. తమిళ సాహిత్యములో రామకథ :

ప్రాచీనమైన సంగయుగపు సాహిత్యమునందే తమిళమున రామాయణ సంబంధములగు కథాంశములు కొన్ని పేర్కొనబడినట్లు టి. పి. మీనాక్షిసుంద రముగారు తెల్పియున్నారు. 'కలిత్తొగై'లో రావణుడు తన పదితలలతో కైలాసము నెత్తి శివుని మెప్పించినవిషయము పేర్కొనబడినది. 'పరిపాడల్' లోని అహల్యా వృత్తాంతమున ఇంద్రుడు పిల్లిరూపమెత్తి గౌతమాశ్రమమున సంచరించినట్లు వర్ణింపబడినది. 'అగనానూరు' నందలి ఒక పద్యమున, రావణునిమీదికి దండెత్తు నప్పుడు రాముడు ఒక వృక్షముక్రింద సమరసన్నాహములనుగురించి చర్చించు చుండగా వృక్షమునందలి పక్షులు నిశ్శబ్దముగా వినుచుండినట్లు వర్ణించుటచే పక్షులు కూడ రామునిపై సానుభూతి ప్రదర్శించినవనుట తెలియగలదు. 'పురనానూరు' లోని ఒక పద్యమందు రావణాపహృతయైన సీత గగనమునుండి ఋష్యమూకగిరి కంఠమున జారవైచిన నగలనూటనెత్తి, కిష్కింధావాసులగు కపులు తుప్పి గంతులు వైచిరని తెలుపబడినది.

తమిళ పంచమహాకావ్యములలో ప్రసిద్ధమైనవి, జంటపురాణములుగ ప్రఖ్యాతమైనవి శిలప్పదిగారము, మణిమేఖలై అను కావ్యములు. శిలప్పదిగారము (క్రీ. శ. 2 వ శతాబ్ది)న కౌంతి కోవలుని ఓదార్చుచు వేదమయుడగు శ్రీరాము నంతటివానికే భార్యావియోగము తప్పలేదని చెప్పు సందర్భమునను, కోవలన్

కణ్ణకిలు వదలిన పుహార్‌పట్టణము, రాముడు వీడిన అయోధ్యను పోలియున్నదని వర్ణించుసందర్భమునను రామకథ ప్రస్తావింపబడినది. శిలప్పదిగారములోని 'అచ్చియర్ కురవై' నృత్యమును వర్ణించుసందర్భమున రాముడు విష్ణువు అవతారమని చెప్పబడినది. మణిమేఖలై కావ్యమునందు సేతునిర్మాణసందర్భమున వానరులు పర్వతములను సముద్రమున పడవైచి రామునికి తోడ్పడినట్లు వర్ణింపబడినది. ఇట్లు ప్రాచీన తమిళసాహిత్యమునందు పలుచోట్ల సీతారాముల ప్రసక్తి కన్పట్టుచున్నది.

'యాప్పరుంగలమ్' అను ప్రాచీన తమిళ ఛందోగ్రంథమునందు రామాయణములోనిదని ఒక వెంబాపద్య ముదాహరింపబడినది. నాచ్చినార్ కినియర్ అనునతడు తొల్కాప్పియమ్ అను లక్షణగ్రంథమునకు వ్రాసిన వ్యాఖ్యలో 'రామాయణము'లోనిదని ఒక పద్యము నుదాహరించినాడు. రామాయణకథలో 'అశిరియమత్తై'ను వర్ణించు నాల్గుపద్యములు 'పురత్తిరట్టు' (క్రీ. శ. 14 వ శతాబ్దము)లో పేర్కొనబడినవి. ఈ ఆధారములనుబట్టి యస్. వైయాపురి పిళ్లై అను విద్వాంసుడు తమిళములో క్రీ. శ. 650 ప్రాంతమున 'వెంబా' ఛందస్సులో రామాయణము రచింపబడియుండునని తలంచినాడు. రాఘవ అయ్యంగార్ కూడ కంబరామాయణమునకు చాలకాలమునకుముందే తమిళములో 'శ్రీరామ కదై' వెంబా పద్యములలో రచింపబడియుండునని భావించినాడు. వెంబా పద్యములలో రచితమైన ఈ ప్రాచీన తమిళ రామాయణము నేడు లభింపదు.

ప్రాచీనకాలముననే తమిళములో జైన రామాయణమొకటి వెలసినట్లు తలంపబడుచున్నది. కాని ఆ గ్రంథము నేడు కానరాదు. తమిళసాహిత్యమున తరువాతికాలమున వెలువడిన శ్రీపురాణమను జైనకావ్యమునందు ఇరువదవ తీర్థంకరుడగు మునిశ్వరస్వామి కథయందు రామకథాప్రస్తావము కలదు. శ్రీపురాణము జినసేనుని మహాపురాణమునకు తమిళరూపమగు అనువాదము. తమిళదేశమందు జైనులలో మిక్కిలి ప్రసిద్ధిచెందిన గ్రంథమిది. శ్రీపురాణములో 'సీతావిచారము'ను వర్ణించుపద్యములు కొన్ని కలవు. ఈ పద్యములందలి శైలి శ్రీపురాణశైలికంటె భిన్నముగానుండుటచే ఈ రామాయణ కథాంశములు పరాక జైన రామాయణమునుండి గ్రహించి ఇందులో చేర్చబడియుండునని కొందరు విమర్శకులు భావించినారు. తమిళములో రచింపబడినదని విశ్వసించు జైన రామాయణములోని ముఖ్యకథావిశేషము లివి: దశరథుడు మొదట కాశిని. తరువాత

అయోధ్యను పరిపాలించెను. సీతా రామ లక్ష్మణులు వనసౌందర్యమును తిలకించుటకు చిత్రకూటమునకు వెళ్ళిరి. అచట కేతెంచిన నారదుని రాముడు అనాదరము చేయును. అందుకు నారదుడు రామునిపై కినిసి రావణుని దగ్గరకువెళ్ళి సీతాపహరణమున కతని పురికొల్పును. వానరులు విద్యాధరులుగ చెప్పబడినవి. రాముని రాయబారిగా హనుమంతుడు రావణునికడకు వెళ్ళినట్లు కలదు. ఇందు వాలిని చంపినది లక్ష్మణుడే. రావణుని అతని పరివారమును యుద్ధములో సంహరించినవాని కూడ లక్ష్మణుడే. రాముడు, హనుమంతుడు తుదకు జైనమతదీక్షను స్వీకరించి మోక్షమును పొందుదురు. కాని లక్ష్మణు డొక్కడే నరకమున కేగినట్లు ఈ జైన రామాయణమున కలదు.

తమిళదేశమందు వైష్ణవమత ప్రవర్తకులగు పన్నిద్దరాళ్వారులు, శైవ మతానుయాయులగు, నాయన్మారులు భక్తిమార్గమునకు బాసటయై నిల్చినారు. విష్ణు భక్తులగు ఆళ్వారులు, వైష్ణవమతవ్యాప్తి గావించిన ఆచార్యులు రాముని విష్ణ్వవతారముగా భావించుటచే రామాయణము వైష్ణవమతగ్రంథముగ పాటింపబడినది. అశోకవనమున సీతతో హనుమంతుడు సంభాషించినవిషయమును పెరియాళ్వారు (విష్ణుచిత్తుడు) తన భక్తిగీతములలో తెల్పినాడు. సీతారాముల దాంపత్యజీవితము లోని కొన్ని ఘట్టములను హనుమంతుడు సీతకు తెల్పును. కాకాసురవృత్తాంతము కూడ పెరియాళ్వారు భక్తిగీతములలో పేర్కొనబడినది.

కులశేఖరాళ్వారు వాత్సల్యపూరితమగు భక్తిని అవలంబించినాడు. భగవంతుని పుత్రభావముతో ప్రేమించుట వాత్సల్యభక్తి. కులశేఖరాళ్వారు, బాల్యమునందు రాముడు చేసిన ఘనకార్యములను జోలపాటరూపమున పాడినాడు. వనవాసమున కేగు రామునిగూర్చి దశరథుడు శోకించుతీరును గానరూపమున తెల్పినాడు. కులశేఖరాళ్వారు తన గీతములందు రామాయణకథలోని కొన్ని ప్రాసంగికములను కూడ సంగ్రహముగా తెల్పినాడు. శ్రీరామచంద్రుని దైవత్వభావము, రామనామ మహిమ తమిళదేశమున వ్యాపించుటకు ముఖ్యకారణభూతుడు కులశేఖరాళ్వారు.

తొండరడిప్పొడియాళ్వారు (విప్రనారాయణుడు) సేతుబంధనసమయమున ఉడుత రామునికి భక్తితో తోడ్పడుటను తన గీతములందు పేర్కొనినాడు. రాముడు, తనను పడవ నడిపించిన గుహుని సహోదరునిగా పేర్కొనుట తిరుమంగై ఆళ్వారు గీతములలో కలదు. ఇది ఆళ్వారుల విశ్వమానవప్రేమను వ్యక్తము చేయును. నమ్మాళ్వారు రామాయణ ప్రాశస్త్యమును గానము చేయుచు "తిరువాయ్

మొళి' అను గ్రంథమునందు రామాయణము సర్వజనులు చదువదగిన గ్రంథమని నుడివినాడు.

రామానుజాచార్యుల (క్రీ. శ. 11 వ శతాబ్ది) దృష్టిలో 'శరణాగతి' ప్రాధాన్యమును ప్రదర్శించు సాక్షాత్తు వేదమే వాల్మీకివలన రామాయణరూపమున అవతరించినది.

శైవభక్తులగు నాయన్మారుల గీతములందును రామాయణప్రసక్తియుండుట గమనింపదగిన విశేషము. తిరుజ్ఞానసంబంధర్, తిరునావుక్కరశర్ అను వారి గీతములందు రావణుడు కైలాసము నెత్తుటకు యత్నించుట మొదలగు కృత్యములు కొన్ని పేర్కొనబడినవి.

ఇట్లు కంబకవికి పూర్వము తమిళసాహిత్యమున రామకథావస్తువగు ప్రాసంగికములు కొన్ని అటనట పేర్కొనబడినవే కాని రామాయణరచన జరగలేదు. తమిళదేశము మొదటనుండియు ఆర్యజనాక్రాంతము కాలేదు. ఆర్యుల భాషయైన సంస్కృతమును ప్రాచీన తమిళకవు లాదరింపలేదు. ఆళ్వారులకాలముననే సంస్కృతముపై తమిళనాడులో కొంత ఆదరము హెచ్చినది. ఆర్యుడైన శ్రీరాముడు ఆర్యావర్తమునుండి దక్షిణదేశమునకువచ్చి అచట నివసించు దాక్షిణాత్యులగు సుగ్రీవుడు, హనుమంతుడు, అంగదుడు, గుహుడు మొదలగువారితో చెలిమిచేసి వారిలో నొకడైనాడు.

ఆళ్వారులు తమ భక్తిగేయములలో రాముని భగవదవతారముగ, పరాత్పరునిగ కీర్తించినారు. తమిళదేశములో రామునిపట్ల భగవద్విశ్వాసము, భక్తిప్రవత్తులు విశేషముగా పెరిగినవి. కంబకవి నమ్మాళ్వారు భక్తుడు. సహజముగానే వైష్ణవాచార్యుల భక్తిగీతములవలన ప్రభావితుడైన కంబకవి తన రామావతారములో రాముని భగవంతునిగ, దైవత్వపూర్ణునిగ పెక్కుచోట్ల చిత్రించినాడు. ఆళ్వారులప్రభావము కంబరామాయణమునందు అధికముగా కన్పట్టుచున్నది. వాల్మీకి రామాయణములోని మొదటి ఆరుకాండములనుమాత్రమే కంబకవి రచించినాడు. కంబరామాయణము తమిళమున ప్రామాణికమైన మహాకావ్యము. ఉత్తరకాండకథను తమిళములో సాలెకులజాడగు వాణిదాసుకవి రచించినాడు. కాని కంబకవి సమకాలికుడగు కవిచక్రవర్తి బిరుదాంకితుడగు ఒట్టక్కూత్తన్ ఈ ఉత్తరకాండను రచించినట్లు కొందరు భావింతురు.

## 16. కంబమహాకవి : కాలము :

కంబకవి తమిళసాహిత్యచరిత్రలో ప్రథితయశస్కుడైన మహాకవి. 'కల్వి యిల్ పెరియవన్ కంబన్' (కవిత చెప్పుటలో అధికుడు కంబకవి). 'కంబన్ వీట్టు కట్టుత్తఱియుం కవి సొల్లుం' (కంబకవి ఇంటిలోని కట్టుకొయ్యకూడ కవిత్వము చెప్పును.) అని పండితప్రశంస లందుకొనినాడు కంబకవి. 'కల్విసిఱంద తమిళ్ నాడు - పుగళ్ కంబన్ పిఱంద తమిళ్‌నాడు' (కవితకు పేరొందిన తమిళనాడు - కీర్తి కంబడు ప్రభవించిన తమిళనాడు) అని తమిళజాతీయ కవియగు సుబ్రహ్మణ్య భారతి సగర్వముగా తన గేయములందు కంబకవిని కీర్తించినాడు. తమిళదేశమున జన్మించిన మహాకావ్యకర్తలలో కవిచక్రవర్తి బిరుదాంకితుడగు కంబమహాకవి ప్రథమగణ్యుడు.

కంబకవికాలమునుగురించి ప్రధానముగ మూడువాదములు కలవు. కంబకవి రామావతారమునందలి ఒక పద్యమును ('ఎణ్ణియ సకాబ్దం ఎణ్ణూట్రేళమేల్') బట్టి శకసంవత్సరము 807 అనగా క్రీ. శ. 885 వ సంవత్సరప్రాంతమునందు అతడు రామాయణమును రచించినట్లు కొందరు చెప్పుదురు. ఈ పద్యమాధారముగా శక వర్షమునకు విక్రమసంవత్సరమును గ్రహింపవలయునని, మరికొందరి వాదము. అట్లు గ్రహించినచో కంబకవి క్రీ. శ. 12 వ శతాబ్ది ఉత్తరార్ధమునకు చెందునని వీరు భావింతురు.

కంబరామాయణమునందలి వేరొకపద్యమాధారముగా కంబకవి క్రీ. శ. 10 వ శతాబ్దికి చెందినవాడని మరికొందరు అభిప్రాయపడుచున్నారు. అదియును గాక కంబకవి తన రామాయణములో పలుచోట్ల ప్రయోగించిన 'ఉత్తమన్' అను పదము క్రీ. శ. 10 వ శతాబ్దికిచెందిన ఉత్తమచోళుడను చోళరాజునుగురించి ప్రస్తావించునని కొందరి అభిప్రాయము. టి. పి. మీనాక్షిసుందరం ఈ రెండవవాదమే సమంజసమైనదని, కంబకవి క్రీ. శ. 10 వ శతాబ్దికి చెందినవాడని తన తమిళ సాహిత్యచరిత్రలో తెల్పినాడు.

మరికొందరు కంబకవి క్రీ. శ. 12 వ శతాబ్దమువాడని తెల్పినారు. కంబకవి తన రామాయణమునందు 'త్యాగవినోదన్' అను పదమును పలుచోట్ల ప్రయోగించి యున్నాడు. అది మూడవ కులోత్తుంగుని బిరుదనామమును సూచించునని వీరి భావము. కనుక కంబకవి మూడవ కులోత్తుంగుని కాలమునకు అనగా క్రీ. శ.

1185 ప్రాంతమునకు చెందునని చెప్పుదురు. మూడవ కులోత్తుంగుడు రాజనరేంద్రుని సమకాలికుడు. కంబకవి ఏ కారణమువలననో చోళరాజులనువీడి ఓరుగల్లు రాజధానిగా తెలుగుదేశమును పరిపాలించుచుండిన కాకతీయచక్రవర్తిని సందర్శించినట్లు ఐతిహ్యములు కొన్ని ప్రచారములో నున్నవి. వానినిబట్టికూడ కంబకవి మొదటి ప్రతాపరుద్రునికాలము (క్రీ. శ. 12 వ శతాబ్దము)నకు చెందినవాడని చెప్పుదురు.

ఇట్లు కంబకవి కాలమునుగురించి మూడు వాదములున్నను అతడు చోళమహీపతులకాలము (క్రీ. శ. 850-1200) నకు చెందినవాడనుట సత్యము. ఈ మూడువాదములలో దేనిని గ్రహించినను కంబకవి రామావతారమే దక్షిణదేశ భాషలలో మొట్టమొదటి రామాయణకావ్య మగుచున్నది.

కంబకవి వాల్మీకిపట్ల గౌరవప్రపత్తులతో తమిళ సంప్రదాయబద్ధముగ 12 వేల ఉత్తమగీతములతో రామావతారమును రచించినాడు. కంబరామాయణమును పూతలపట్టు శ్రీరాములు రెడ్డిగారు యథాతథముగ తెలుగులోనికి అనువదించినారు. కంబరామాయణములోని అవాల్మీకములైన కల్పనావిశేషములను రంగనాథరామాయణముతో తారతమ్యపరీక్ష చేయుసందర్భమున ముందు వివరముగ చర్చింపబడును.

## 17. కంబరామాయణమునకు తరువాత తమిళములో రామాయణ రచన :

కంబరామాయణమునకు తరువాత తమిళమున ప్రసిద్ధమైన రామాయణము వెలువడలేదనియే చెప్పవలసియుండును.

అరుణాచలకవి (క్రీ. శ. 18 వ శతాబ్దము) 'రామనాటక కీర్తనై' అను పేరుతో రామాయణమును కీర్తనారూపముగ రచించినాడు. సంగీతసాహిత్యములకు సమప్రాధాన్యముండుటచే ఇది తమిళమున మిక్కిలి ప్రచారము పొందినది. రామలింగర్ (క్రీ. శ. 19 వ శతాబ్దము) అను తాత్త్వికుడు తన 'తిరు అరుట్పా' (Tiru Arutpa) అను గ్రంథమున 'శ్రీరామనామత్ తిరుప్పాతిగమ్' అను శీర్షికతో రామనామ మాహాత్మ్యమును వివరించినాడు. ఇది నాల్గుపాదములుగల పది పద్యములుగల్గిన రచన.

1185 ప్రాంతమునకు చెందునని చెప్పుదురు. మూడవ కులోత్తుంగుడు రాజనరేంద్రుని మనిమనుమడు. కంబకవి ఏ కారణమువలననో చోళరాజులనువీడి ఓరుగల్లు రాజధానిగా తెలుగుదేశమును పరిపాలించుచుండిన కాకతీయచక్రవర్తిని సందర్శించి నట్లు ఐతిహ్యములు కొన్ని ప్రచారములో నున్నవి. వానినిబట్టిచూడ కంబకవి మొదటి ప్రతాపరుద్రునికాలము (క్రీ. శ. 12 వ శతాబ్దము)నకు చెందినవాడని చెప్పుదురు.

ఇట్లు కంబకవి కాలమునుగురించి మూడు వాదములున్నను అతడు చోళ మహీపతులకాలము (క్రీ. శ. 850-1200) నకు చెందినవాడనుట సత్యము. ఈ మూడువాదములలో దేనిని గ్రహించినను కంబకవి రామావతారమే దక్షిణదేశ భాషలలో మొట్టమొదటి రామాయణకావ్య మగుచున్నది.

కంబకవి వాల్మీకిపట్ల గౌరవప్రపత్తులతో తమిళ సంప్రదాయబద్ధముగ 12 వేల ఉత్తమగీతములతో రామావతారమును రచించినాడు. కంబరామాయణమును పూతలపట్టు శ్రీరాములు రెడ్డిగారు యథాతథముగ తెలుగులోనికి అనువదించినాడు. కంబరామాయణములోని అవాల్మీకములైన కల్పనావిశేషములను రంగనాథరామాయణముతో తారతమ్యపరీక్ష చేయుసందర్భమున ముందు వివరముగ చర్చింపబడును.

## 17. కంబరామాయణమునకు తరువాత తమిళములో రామాయణ రచన :

కంబరామాయణమునకు తరువాత తమిళమున ప్రసిద్ధమైన రామాయణము వెలువడలేదనియే చెప్పవలసియుండును.

అరుణాచలకవి (క్రీ. శ. 18 వ శతాబ్దము) 'రామనాటక కీర్తనై' అను పేరుతో రామాయణమును కీర్తనారూపముగ రచించినాడు. సంగీతసాహిత్యములకు సమప్రాధాన్యముండుటచే ఇది తమిళమున మిక్కిలి ప్రచారము పొందినది. రామలింగర్ (క్రీ. శ. 19 వ శతాబ్దము) అను తాత్త్వికుడు తన 'తిరు అరుట్పా' (Tiru Arutpa) అను గ్రంథమున 'శ్రీరామనామత్ తిరుప్పాతిగమ్' అను శీర్షికతో రామనామ మాహాత్మ్యమును వివరించినాడు. ఇది నాలుగుపాదములుగల పది పద్యములుగల్గిన రచన.

రూపముగను, ఉపమానముల రూపముగను తమిళవాఙ్మయమున ప్రఖ్యాతమైనట్లు గుర్తింపవచ్చును. ఆళ్వారుల భక్తిగీతముల మూలముననూ, కంబకవి రామావతార మను కావ్యమువలనను రామాయణకథ తమిళసాహిత్యములో విపులప్రచారము నందుటయేకాక శాశ్వతస్థితినికూడ పొందినదని చెప్పవచ్చును.

## 18. కన్నడ సాహిత్యములో రామకథ :

లభ్యమైన కన్నడగ్రంథములలో మొదటిదగు కవిరాజమార్గమను లక్షణ గ్రంథమున రామకథాపరములగు కొన్ని ఉదాహరణపద్యములు పేర్కొనబడినవి. అవి నృపతుంగుడు (క్రీ. శ. 9 వ శతాబ్ది) స్వయముగ రచించినవో లేదా ప్రాచీన కన్నడ రామాయణములనుండి గ్రహించినవో చెప్పలేము.

కన్నడములో భారతమువలెనే రామాయణమునుకూడ ముందు వ్రాసినవారు జైనకవులే. కన్నడ రత్నత్రయమున ద్వితీయుడగు పొన్నకవి (క్రీ. శ. 10 వ శతాబ్ది) భువనైక రామాభ్యుదయమును 14 ఆశ్వాసములలో రచించియున్నట్లు అతని శాంతిపురాణమునుబట్టి తెలియుచున్నది. ఈ భువనైక రామాభ్యుదయము నేడు అలభ్యము. కేశిరాజు (క్రీ. శ. 1260) శబ్దమణిదర్పణము (సూత్రము-156) లో ఉదాహరింపబడిన ఒకపద్యము భువనైకరామాభ్యుదయములోనిదని తలంప బడుచున్నది. ఆ పద్యము నాగవర్మ (క్రీ. శ. 1150) కావ్యావలోకనమునందుకూడ ఉదాహరింపబడినది. కనుక కన్నడములో మొట్టమొదటి రామాయణము భువనైక రామాభ్యుదయమే యని చెప్పవచ్చును.

## 19. కన్నడములో జైనరామాయణములు :

కన్నడములో రామాయణ రచన జైనసంప్రదాయముగను, వాల్మీకి రామాయణ సంప్రదాయముగను రెండువిధములుగను సాగినది.

కన్నడములోని జైనరామాయణకథలలో రెండు సంప్రదాయములు కలవు. ఒకటి గుణభద్రుని ఉత్తరపురాణకథ ననుసరించినది. మరొకటి ప్రాకృతమున విమలసూరి రచించిన "పఉమచరిఅ" (పౌమచర్య) ననుసరించినది చావుండరాయని (క్రీ. శ. 978) చావుండరాయపురాణము లేక త్రిషష్టిశలాకా మహాపురాణము అను గద్యకావ్యమునందలి రామాయణకథ గుణభద్రుని ఉత్తరపురాణకథ ననుస రించి చెప్పబడినది. ఈ రామాయణకథకు, వాల్మీకిరామాయణకథకును గల వది

భేదములను శ్రీ యు. కె. సుబ్బరాయాచార్‌గారు 'The Ramayana theme in Kannada Literature' అను వ్యాసమున ఇట్లు తెల్పినారు. (1) సీత మందోదరి కూతురు. (2) మంధరపాత్ర లేదు. (3) రావణుడు నారదునివలన సీత సౌందర్యమును వినును. (4) చిత్రకూటము వారణాసి (దశరథుని ముఖ్యపట్టణము) కి సమీపమందున్న ఉద్యానవనము (5) మారీచుడు మాయామృగమై రామలక్ష్మణులు నెలయించినపుడు రావణుడు రాముని రూపములోవచ్చి సీతను తన పుష్పకముపై నెక్కించుకొని వెడలును. (6) ఆంజనేయుడు రావణుని ఆస్థానమునకు రాయబారిగా వెళ్ళినాడు. (7) సీత అగ్నిప్రవేశము లేదు. (8) లక్ష్మణుడు తన చక్రముచే రావణుని సంహరించును. (9) రాముడు, ఆంజనేయుడు మోక్షమును పొందుదురు. (10) సీత సన్యాసత్వమును స్వీకరించి సౌధర్మకల్పములో క్రొత్త జీవితమును ప్రారంభించును.

ఉత్తరపురాణములోని ఈ కల్పనలను చావుండరాయకవి తన గ్రంథమున అనుకరించినాడు.

కన్నడ జైనరామాయణములలో మిక్కిలి ప్రసిద్ధిచెందినది అభినవపంప బిరుదాంకితుడగు నాగచంద్రుని (క్రీ. శ. 1140) రామచంద్రచరిత పురాణము. ఇది విమలసూరి ప్రాకృతములో రచించిన సౌమచర్య (పద్మచరిత) ను, రవిషేణుని సంస్కృతరామాయణమును ననుసరించినది. ఇందు రాముడు విష్ణ్వవతారము కాదు. మనుష్యమాత్రుడు. రామలక్ష్మణులు బలివాసుదేవులు. రాముడు ధర్మనాయకుడుగ, లక్ష్మణుడు వీరనాయకునిగ చిత్రింపబడినాడు. సీత జనకుని కన్నకూతురుగనే చెప్పబడినది. సీతకు ప్రభామండలుడను సోదరుడుకూడ యున్నట్లు కలదు. పరశురాముడు, విశ్వామిత్రుడు, మంధరల వృత్తాంతము లిందు లేవు. భరతుడు రాజ్యమును కాంక్షించి రామలక్ష్మణులపై మత్సరమును పూని యున్నందువలననే భరతునితల్లి కైక రాముని వనవాసము పంపవలెనని దశరథుని కోరినట్లు ఈ జైన గ్రంథమునందలి రామాయణకథలో తెలుపబడినది. సుగ్రీవుడు, హనుమంతుడు మొదలగు వానరసమూహమంతయు మామూలు మనుష్యులే కాని వారి ధ్వజము లందుమాత్రము వానరచిహ్నము లున్నట్లు చెప్పబడినది. రావణుడు వీరుడు, ధైర్యశాలి, ధర్మాత్ముడు మాత్రమేకాక నీతిమంతుడుగ, పరస్త్రీ పరాఙ్ముఖుడుగ, విషాదాంత నాయకునిగ చిత్రింపబడినాడు. రావణుడు, తన్ను వలచి వలపింపవచ్చిన 'ఉపరంభ'ను మాతృమూర్తిగ భావించినాడు. కాని అతిలోకసౌందర్యవతియగు

సీతమగాంచి సహనశక్తిని కోల్పోయి ఆమెను చెరపెట్టినాడు. అదియే అతని మరణమునకు కారణమైనది. నాగచంద్రుడు తన రామాయణములో రావణపాత్రను సామభూతితో చిత్రించినాడు. ఈ రామాయణములో రాముని తల్లి 'అపరాజిత'. శత్రుఘ్నుని తల్లి పేరు సుప్రభ. పేర్ల విషయములో కూడ ఇది వాల్మీకిరామాయణము నకు భిన్నముగా నున్నది. ప్రతినాయకుడగు రావణుడు అసురుడు. దశముఖుడు కాడు. ఇందు ఒకానొకసందర్భమున నారదుడు సీతను మోహించినట్లుకూడ కలదు. సేతుబంధనము ఈ రామాయణమున లేదు. ఇందు జైన భక్త్యావేశము అధికముగా కలదు.

కుముదేందుని కుముదేందు రామాయణము, దేవప్పకవి భామినీ షట్పదిలో రచించిన రామవిజయకావ్యము, దేవచంద్రుని రామకథావతారము. చంద్రసాగర వర్ణి భామినీషట్పదిలో రచించిన జైనరామాయణము కన్నడ జైనరామాయణము లలో పేర్కొనదగిన ఇతర రచనలు. కుముదేందుడు నాగచంద్రుని రామచంద్ర చరిత పురాణకథనే అనుసరించి తన రామాయణమును రచించినాడు. కుముదేం దుడు షట్పదీచందస్సులో రామకథను రచించినాడు. షట్పదీఛందస్సును స్వీకరించిన జైనకవులలో కుముదేందుడే మొదటివాడు. దేవచంద్రుని రామకథావతారము చావుండరాయ పురాణము, పంపరామాయణము, కుముదేందు రామాయణము లందలి రామకథకు పూరణగ్రంథము. చంద్రసాగరవర్ణి రామాయణములో జైన సంప్రదాయముతోపాటు వాల్మీకి సంప్రదాయముకూడ పాటింపబడినది. కాని ఈ జైనరామాయణములకు కన్నడములో వ్యాప్తి తక్కువ.

## 20. వాల్మీకి అడుగుజాడలలో కన్నడ రామాయణములు :

కుమార వాల్మీకిగా ప్రసిద్ధిగాంచిన తొరవె నరహరికవి (క్రీ. శ. 1580) తన ఇష్టదైవమగు తొరవె నృసింహుని పేర తొరవె రామాయణమును కన్నడ ములో అయిదువేలకుపైగా భామినీ షట్పదులలో వాల్మీకి రామాయణము ననుస రించి రచించినాడు. తొరవె రామాయణము వైదిక సంప్రదాయముననుసరించి రచింపబడినది. కన్నడములోని వాల్మీకి రామాయణానుసార కావ్యములలో ఇది మొదటిది. ఇందు 109 ప్రకరణములు కలవు. నరహరి వాల్మీకి ననుసరించి రామా యణమును రచించినను కొన్నిచోట్ల మూలమునకు భిన్నమైన సన్నివేశములను కూడ చేర్చినాడు. పాత్ర చిత్రీకరణములో నరహరి కవి భావనాశక్తిని ప్రదర్శించి

నాడు. నరహరి తన రామాయణములో రాముని విష్ణ్వవతారముగనే వర్ణించినాడు. రావణసంహారము జరిపించుటకొరకే మంథర రాముని అడవులకు పంపినట్లు నరహరికవి వర్ణించినాడు. ఈ విషయము వాల్మీకి రామాయణమునందు లేదు. రావణుడు సీతను అపహరించుటకుపూర్వమే అగ్నిదేవుడు సీతలోని అర్ధాంశమును కొనిపోయినట్లు నరహరికవి తన రామాయణములో తెల్పినాడు. వనవాసకాలములో లక్ష్మణుడు పదునాలుగేండ్లు నిద్రాహారములుమాని సీతారాములను సేవించినట్లు నరహరికవి రామాయణమున కలదు. రావణునిలో గొప్ప మానసికసంఘర్షణను నరహరకవి చిత్రించినాడు. సీతను అపహరించి తెచ్చినందుకు, విభీషణునిమాటలు పెడచెవిని పెట్టినందుకు చివరకు రావణుడు పశ్చాత్తాపపడినట్లు తొరవె రామాయణమున కలదు. నరహరికవి మంథర పాత్రపైకూడ సానుభూతి చూపించి రచించినాడు. తొరవె రామాయణమునకు కన్నడములో బహుళవ్యాప్తి ప్రశస్తి కలదు.

భామినీ షట్పదిలో రచితమైన శంకరనారాయణ (క్రీ. శ. 1725) అధ్యాత్మ రామాయణము, హరిదాసుని (క్రీ. శ. 175 ) మూలబలరామాయణము (ఇదికూడ భామినీ షట్పదిలోనే రచితమైనది) వార్ధక షట్పదిలో రచింపబడిన భట్టలేశుని భట్టలేశ్వరరామాయణము మొదలగునవి కన్నడసాహిత్యములో చెప్పుకోదగిన ఇతర రామాయణములు.

రామాయణములోని ఉత్తరకాండ కథనుగ్రహించి కన్నడములో రచించిన కవులలో కవినారాయణ, (క్రీ. శ. 1650) ముద్దణ అను పేర ప్రఖ్యాతుడైన నందళికె లక్ష్మీనారాయణప్ప (క్రీ. శ. 1869-1901) మొదలగువారు ముఖ్యులు. ముద్దణ రామపట్టాభిషేకమును పద్యకావ్యముగాను, రామాశ్వమేధమును గద్యకావ్యముగాను రచించినాడు.

వాల్మీకి రామాయణమును కన్నడీకరించినవారిలో పేర్కొనదగినవారు దొడ్డబెలె నారాయణశాస్త్రి, డి. అలసింగరాచార్, పట్టాభి రామశాస్త్రి, సుబ్రహ్మణ్యశాస్త్రి మొదలగువారు.

పి. టి. నరసింహాచారిగారి 'అహల్యే', డి. వి. గుండప్పగారి 'శ్రీరామ పరీక్షణము', డాక్టర్ పద్మభూషణ కె. వి. షట్టప్పగారి జనప్రియ వాల్మీకి రామాయణము, శ్రీ రామాయణదర్శనము మొదలగునవి ఆధునికకాలములో వెలువడిన కన్నడ రామాయణములలో గణుతింపదగినవి. జనప్రియ వాల్మీకి రామాయణము సరళమైన వచనములో రచింపబడినది. శ్రీ రామాయణదర్శనమునకు 1955 సంవ

త్సరమున కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి లభించినది. రామాయణదర్శన రచనముచే కుప్పళి వెంకటప్ప పుట్టప్ప 'కు వెం పు' గా ప్రసిద్ధి చెందినాడు. ఈ గ్రంథమునకు భారతీయ విజ్ఞానపీఠము బహుమతికూడ లభించినది. శ్రీ రామాయణదర్శనములోని కొన్నిభాగములు సంస్కృతములోనికి, హిందీలోనికి అనువదింపబడినవి.

'శ్రీ రామాయణ దర్శనము'లో సీతతోపాటు రాముడుకూడ అగ్నిప్రవేశము చేసినట్లు కల్పింపబడినది. విభీషణుని కుమార్తెయగు 'అనలా' తన పెదతండ్రియగు రావణునితో చాల చనవుగా గడపినవిషయము ఇందు చక్కగా చిత్రింపబడినది. మంథర, ఊర్మిళ, శబరి, రావణ పాత్రలన్నిటికి కె. వి. పుట్టప్ప క్రొత్త ఊపిరి పోసి రచించినాడు.

అధ్యాత్మ, ఆనంద, అద్భుత రామాయణములుకూడ కన్నడములోనికి అనువదింపబడినవి.

## 21. తెలుగు సాహిత్యములో రామకథ :

తెలుగునాట రాముడు విష్ణ్వవతారముగ, దైవముగ, రామనామజపము మోక్షదాయకముగ, రామచరిత లోకపావనముగ పరిగణింపబడినది. సీతారాములు తెలుగువారికి దైవదంపతులు, ఇలవేల్పులు. మోక్షమార్గమునుచూపు ఒక మత గ్రంథముగా రామాయణమును పారాయణముచేయుట తెలుగునాట సర్వసాధారణమయినది. సీతారాములు సంచరించిన పంచవటి, భద్రగిరి, పంపాసరస్సు తెలుగు దేశమునందలివే. ఆంధ్రవాఙ్మయమునందలి సాహిత్యశాఖ లన్నిటియందును రామాయణము అల్లుకొనియున్నది.

తెలుగున వెలసిన రామాయణము లన్నిటిలోను మొట్టమొదట పేర్కొనదగినది రంగనాథ రామాయణము. దీని కర్తృత్వము వివాదాస్పదమయినది. గోన బుద్ధారెడ్డి రంగనాథుడను తన రెండవపేరుతో రంగనాథ రామాయణమును రచించినట్లు ఊహింపవచ్చును. ఈ విషయము 'ద్విపదవాఙ్మయము' అను గ్రంథమున విపులముగ చర్చింపబడినది. రంగనాథ రామాయణ కాలనిర్ణయముకూడ వివాదాస్పదముగనే యున్నది. క్రీ. శ. 1260 ప్రాంతమున రచితమైన తిక్కన నిర్వచనోత్తర రామాయణమునకుపూర్వమే అనగా క్రీ. శ. 1240 ప్రాంతమున రంగనాథ రామాయణ రచన జరిగియుండునని పింగళి లక్ష్మీకాంతము అభిప్రాయము.

వేటూరి ప్రభాకరశాస్త్రి రంగనాథ రామాయణ రచన క్రీ. శ. 1230-1300 ప్రాంతమున జరిగియుండునని చెప్పినాడు. (చూ- సింహావలోకనము పుట 18). సుప్రసిద్ధచరిత్ర పరిశోధకుడగు మల్లంపల్లి సోమశేఖరశర్మ రంగనాథ రామాయణ కృతికర్తయైన గోనబుద్ధ భూపతి క్రీ. శ. 1380-1380 ప్రాంతమువాడని, రంగనాథ రామాయణ రచనాకాలము క్రీ. శ. 14 వ శతాబ్ది చివరిభాగమని 'రంగ నాథ రామాయణ పీఠిక'లో నిర్ణయించినారు. కనుక గోన బుద్ధారెడ్డి కంటకవికి తరువాతివాడే అని చెప్పవచ్చును. తెలుగునాట రంగనాథ రామాయణమునకు బహుళ ప్రచారము, ప్రశస్తి కలదు. ఇది దేశికవితా సంప్రదాయమునకు చెందినదగుటచే, మార్గకవితా సంప్రదాయజ్ఞులు ఇందలి ద్విపదలను ప్రామాణికముగా స్వీకరింపమిచే రంగనాథ రామాయణమునకు తరువాత తెలుగులో వెలసిన భాస్కరరామాయణము నకు అధికప్రాశస్త్యము లభించినది. కనుక మార్గ కవితాపద్ధతిలో భాస్కర రామా యణమును దేశికవితాపద్ధతిలో రంగనాథ రామాయణమును తెలుగున అధిక గౌరవమును పొందిన రామాయణములని చెప్పవచ్చును. రంగనాథ రామాయణము నందలి వైశిష్ట్యము ముందు చర్చింపబడును.

పద్యకావ్యముగా వెలసిన పూర్వరామాయణములలో మొట్టమొదటిది భాస్కర రామాయణము. ఇది బహుకర్తృకము. ఇందు అరణ్యకాండము భాస్క రుడును, యుద్ధకాండములో కొంతభాగమును హుళక్కి భాస్కరుడును, బాల, కిష్కింధ, సుందరకాండములను మల్లికార్జున భట్టు, అయోధ్యాకాండను కుమార రుద్రదేవుడు, యుద్ధకాండ ఉత్తరభాగమును అయ్యలార్యుడును రచించిరి. భాస్క రుడు మంత్రి భాస్కరుడు కాడు. భాస్కరుడు, హుళక్కి భాస్కరుడు ఇరువురును ఒకరే. భాస్కరుని కుమారుడు మల్లికార్జున భట్టు అని, శిష్యుడు కుమార రుద్ర దేవుడని, మిత్రుడు అయ్యలార్యుడని తెలియుచున్నది. మల్లికార్జున, కుమార రుద్ర దేవ, అయ్యలార్యులు మువ్వురును భాస్కర శిక్షితులే కనుక మూలపురుషుడగు భాస్కరునిపేరనే భాస్కర రామాయణముగ ప్రఖ్యాతమైనది. హుళక్కి భాస్క రుడు క్రీ. శ. 14 వ శతాబ్దమువాడు.

భాస్కర రామాయణము వాల్మీకి రామాయణానుసారియేయైనను ఇతర రామాయణములందలి అవాల్మీకాంశములుకూడ కొన్ని ఇందు గోచరించును. రాముడు సాక్షాద్విష్ణువు అవతారమని, లక్ష్మణుడు ఆదిశేషువని, భరత శత్రుఘ్నులు విష్ణువు శంఖచక్రములు, సీతాదేవి మధుకైటభమర్దనియగు యోగమాయ యని భాస్కర

రామాయణమున వాచ్యముగనే చెప్పబడినవి. భాస్కర రామాయణమున అధ్యాత్మ రామాయణములోని అంశములేకాక పద్మపురాణము, ప్రసన్నరాఘవ నాటకము మొదలగువానియందలి విషయములుకూడ ఆయా సందర్భములందు గ్రహింపబడినవి.

భాస్కర రామాయణమునందలి అవాల్మీకాంశములలో సీతా జన్మవిషయికమైన విచిత్రకల్పన మొకటి. భాస్కర రామాయణమునందలి సీత జననప్రకారము ఋష్యశృంగాదులజననమును బోలియున్నది. జనకుని మానసపుత్రికగా సీత భూగర్భమునుండి జన్మించినదని ఇందు చెప్పబడినది. మేనకనుగాంచిన జనకుని బీజముష్టి విక్షేపనమున సీతాజన్మము జరిగినదని భాస్కర రామాయణమునందు కలదు.

భాస్కర రామాయణములోని మరొక నూతనాంశమగు అవాల్మీకాంశము వాలివధ ఘట్టమున కలదు. ఇందు తార 'రావణసంహారమున సీత లభించినను, అనతికాలముననే, ఆమె భూవివరముజొచ్చి శాశ్వతవియోగదుఃఖమును కల్గించునని' రామునికి శాపమిచ్చినది. ఈ శాపవృత్తాంతము మరియే యితర తెలుగు రామాయణములందు కన్పట్టదు. కాని పద్మపురాణమునమాత్రము సీత బాల్యదశయందు కీరదంపతులకు అజ్ఞానముచే వియోగముకలిగించి వారి శాపమునకు గురియైన ట్లొక కారణము కల్పింపబడినది. జానపదగేయ వాఙ్మయమునందును సీతారాముల శాశ్వతవియోగమునకు హేతువుగ విచిత్రములగు కొన్ని కారణములు కల్పింపబడినవి. భాస్కర రామాయణకర్త తన కాలమునాటికి వ్యాప్తిలోనున్న అట్టి కథా వృత్తాంతమును గ్రహించి పై విధముగ చెప్పియుండును.

విభీషణుని పత్నియగు సరమ, హనుమంతుని క్షేమవృత్తాంతమును సీతకెరిగించినట్లు భాస్కర రామాయణమున కలదు. ఇదికూడ అవాల్మీకాంశమే.

ఇంద్రజిత్తు మూడవపర్యాయము యుద్ధమున కరుదెంచినపుడు వానరులు భీతిల్లి రాముని శరణువేడిరి. అంత అనిలదేవు డరుదెంచి ఇంద్రజిత్తు సంహారమునకై త్వరపడవలసినదిగా రాముని హెచ్చరించినట్లు భాస్కరరామాయణమున కలదు. ఇది అవాల్మీకాంశము.

భాస్కర రామాయణమున ఇతిహాసమునకు కావ్యశోభకూడ ఆపాదింప

క్రీ. శ. 14 వ శతాబ్దమునవే ఎఱ్ఱన రామాయణమును రచించినట్లు హరి వంశ పీఠికనుబట్టి తెలియుచున్నది. ఎఱ్ఱన రామాయణము నేడు అలభ్యము. ఇది ప్రోలయ వేమారెడ్డికి అంకితముగా చెప్పబడినది. ప్రోలయ వేమారెడ్డి ఈ రామాయణమువలన 'అత్యుత్తమ ఖ్యాతింబొంది'నాడట. కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణసారసంగ్రహములో ఎఱ్ఱన రామాయణములోని 9 పద్యముల నుదాహ రించినాడు. వేటూరి ప్రభాకరశాస్త్రి వివిధ ఆకరములనుండి సేకరించి ఎఱ్ఱన రామా యణములోని 46 పద్యములను ప్రకటించినాడు. కాని ఈ పద్యములు ఎఱ్ఱన కర్తృ త్వములనుటలో సందేహమును వ్యక్తము చేసినారు నోరి నరసింహశాస్త్రిగారు. జక్కన విక్రమార్కచరిత్రలోను, చదలువాడ మల్లన విప్రనారాయణచరిత్రలోను, ఎఱ్ఱన రామాయణమును పేర్కొనినారు.

ఆంధ్రకవితా పితామహుండను బిరుదుగల కొరవి సత్యనారన (క్రీ. శ. 1320-1345) కూడ తెలుగులో ఒక రామాయణమును పద్యకావ్యముగ రచించి నట్లు తెలియుచున్నది. కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక (1-49 ప) లో 'రామాయణకృతియై తామెఱయుచు నాంధ్రకవి పితామహుండనగా భూమిని మించిన భీమన నామంబున బరగె సత్యనారన ఘనుడై' అని చెప్పినాడు. భీమన అను పేరు గల కొరవి సత్యనారన రచించిన రామాయణముకూడ నేడు లభ్యము కాలేదు.

తాళ్ళపాక అన్నమాచార్యుడు రామాయణమును 'ప్రవిమల ద్విపద ప్రబంధ రూపమున నవముగా' రచించినట్లు చిన్నన్న అన్నమాచార్య చరిత్ర (పుట 47)లో తెల్పినాడు. కాని అన్నమాచార్యుని ద్విపద రామాయణము నేడు కానరాదు. అట్లే విద్దికూచి రామాయణము, చిత్రకవి అనంతకవి రచితమగు సకల వర్ణనాపూర్ణ రామాయణముకూడ నేడు ఎచట దాగియున్నవో!

ప్రబంధయుగమున వెలసిన రామాయణకావ్యములలో ముఖ్యముగ పేర్కొనదగినవి మొల్ల రామాయణము, అయ్యలరాజు రామభద్రుని రామాభ్యుద యమును.

కవయిత్రి మొల్ల (క్రీ. శ. 16 వ శతాబ్ది) రామాయణకథను సంగ్రహముగ చెప్పినది. మొల్ల రామాయణమే ప్రథమాంధ్ర సంగ్రహరామాయణమని చెప్ప వచ్చును. పద్మపురాణ, మహాభారత, రఘువంశ, దేవీ భాగవతములందలి సన్ని వేశముల నాధారముగా గ్రహించి కాబోలు, మొల్ల తన రామాయణమున మంథర పాత్రను పరిహరించి కైకనే ప్రధానముగ స్వీకరించినది. కైకేయి వరములను

సుమంత్రుడు వసిష్ఠునికి చెప్పగా విని రాముడు, సీతా లక్ష్మణులతో దశరథాదులను దర్శింపకనే కానల కరిగినట్లు సంగ్రహముగ మొల్ల తన రామాయణమునందు తెల్పినది. సీతాన్వేషణమున విఫలులైన రాముడు ఆగ్రహావేశమున జగముల నిర్మూలింప యత్నించినపుడు లక్ష్మణు డాతని శాంతింపజేసినట్లు వాల్మీకి రామాయణమునందు కలదు. తెలుగు రామాయణము లన్నిటియందు దాదాపు నిట్టే కలదు. కాని మొల్ల రామాయణమునమాత్రము లక్ష్మణుడే ఆగ్రహింపగా రాముడు సాంత్వన వాక్యములు పల్కినట్లు కలదు. యుద్ధకాండమున త్రిజట స్వప్నవృత్తాంతమును విభీషణుడు విందు పేరోలగమున రావణున కెరిగించినట్లు మొల్ల రామాయణమునందు కల్పింపబడినది. ఇది పెక్కు అన్య రామాయణములందు కన్పట్టదు.

కవితాశిల్పము, కల్పనా చమత్కారములతో నొప్పియుండుటచే శీరము సుభద్రయాంబ రచితమగు సుభద్రా రామాయణము కంటెను, చేబ్రోలు సరస్వతీదేవి రచించిన సరస్వతీ రామాయణముకంటెను మొల్ల రామాయణమే తెలుగులో ప్రఖ్యాతమై బహుళవ్యాప్తి నందినది.

అయ్యలరాజు రామభద్రకవి (క్రీ. శ. 1540) రామాభ్యుదయము, గరుడాచలకవి కౌసలేయచరిత్ర, రంగయ్యకవి రామోదయము, చింతలపల్లి ఛాయాపతి రాఘవాభ్యుదయము మొదలగునవి రామాయణప్రబంధములలో ముఖ్యమైనవి. వీనిలో ప్రబంధోచితములగు మార్పుకూర్పులు వాల్మీకి రామాయణమునకు భిన్నముగ కల్పింపబడినవి.

రామకథాత్మకములగు ద్వ్యర్థికావ్యములలో పేర్కొనదగినవి పింగళి సూరన రాఘవపాండవీయము, పోడూరి పెదరామామాత్యుని శివరామాభ్యుదయము, క్రొత్తలంక మృత్యుంజయుని ధరాత్మజాపరిణయము, శ్రీపాద వెంకటాచలం శ్రీరామ కృష్ణోపాఖ్యానము, తిరుమల బుక్కపట్టణం వెంకటాచార్యుల అచలాత్మజాపరిణయము మొదలగునవి. రామకథాపరములగు త్ర్యర్థికావ్యములలో ముఖ్యమైనవి నెల్లూరి వీరరాఘవకవి రాఘవయాదవ పాండవీయము, ఎలకూచి బాల సరస్వతి యాదవ రాఘవపాండవీయమును.

తెలుగునగల ద్విపదరామాయణములలో కాలక్రమము ననుసరించి యెరుగదగినవి గోన బుద్ధారెడ్డి (క్రీ. శ. 1240) రంగనాథరామాయణము, అన్నమాచార్య రామాయణము (అలభ్యము), కట్టా వరదరాజు (క్రీ. శ. 1630) రచించిన రామా

యణము, గణపవరపు వేంకటకవి (క్రీ. శ. 1673) బాలరామాయణము (అలభ్యము). భోసల ఏకోజీ (క్రీ. శ. 1735), రామాయణము చేద రాఘవరెడ్డి (క్రీ.శ. 1780) రామాయణము, కేశవ తీర్థస్వామి శ్రీరామచరిత మానసము, విజయ రామరాజు రచితమగు వినుకొండ రామాయణము, తరిగొండ వెంగమాంబ (క్రీ.శ. 1794-1877) వాసిష్ఠ రామాయణము మొదలగునవి. ఇవిగాక ఆద్యంతములు శిథిలములై, కర్తృత్వవిషయాదిక మగోచరముగను, సంశయాస్పదముగను గల రామాయణ ద్విపద రచనాభాగములును, రామాయణ కథాప్రసక్తములగు ద్విపద గ్రంథభాగములనుకూడ కొన్ని తంజావూరు, మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములందు కలవు.

రఘునాథనాయకుని రఘునాథరామాయణము సమగ్రముగా దక్కలేదు. బాలకాండలో నాల్గవ ఆశ్వాసములో శ్వేతద్వీపవర్ణనవరకుగల 28 పద్యములు మాత్రము లభించినవి. కవిసార్వభౌమ బిరుదాంకితుడగు కూచిమంచి తిమ్మకవి (క్రీ. శ. 18 వ శతాబ్దము) అచ్చతెలుగు రామాయణమును రచించినాడు. మరింగంటి సింగరాచార్యుని దశరథరాజనందనచరిత తెలుగులో మొట్టమొదటి నిరోష్ఠ్య రామాయణముగా పేర్కొనదగినది.

వావిలకొలను సుబ్బారావు (వాసుదాసు క్రీ. శ. 1863-1939) శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము, గోపీనాథము వేంకటకవి (క్రీ. శ. 1820-1870) రచితమగు గోపీనాథ రామాయణము, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి (క్రీ. శ. 1866-1960) 'శ్రీ కృష్ణ రామాయణము', జనమంచి శేషాద్రిశర్మ (క్రీ. శ. 1882-1950) రామాయణము, శ్రీ వేంకట పార్వతీశ్వరకవుల రామాయణము (అసంపూర్ణము-సుందరకాండము 16 వ సర్గవరకు మాత్రమే కలదు), కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ శ్రీమద్రామాయణ కల్పవృక్షము మొదలగునవి తెలుగులో ఆధునిక యుగమున ప్రసిద్ధిచెందిన రామాయణములు.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి శ్రీకృష్ణ రామాయణము స్వతంత్రకావ్యమని చెప్పదగినది. సంస్కృత, దేశభాషా రామాయణములన్నింటిని పరిశీలించి అన్నిటిలోని చిత్రకథలను ఔచిత్యముతో గ్రహించి నూత్న విశిష్టపద్ధతిని శ్రీ కృష్ణరామాయణము రచింపబడినది. వాల్మీకి రామాయణమునందు కానరాని శ్రీ కృష్ణరామాయణమునందలి ముఖ్యమైన మార్పు కూర్పులీ క్రిందివి.

(1) వాల్మీకిచరిత్ర గ్రంథారంభమున చెప్పబడినది. (2) కౌసల్యా దశరథ వివాహము గ్రంథారంభమునందు కలదు. దశరథుడు కౌసల్యను వివాహమాడబోవు సందర్భమున రావణు డామెను అపహరించి పెట్టెలో ఆమెనుంచి సముద్రమున పారవేయించును. దశరథు డెట్లో దైవసంఘటనచే కౌసల్యను వివాహమాడును. వావిలకొలను సుబ్బారావు కౌసల్యాపరిణయమునందును ఈ కథ వివరింపబడినది. (3) శాంత కౌసల్యకు దశరథునివలన పుట్టిన ప్రథమసంతానమని చెప్పబడినది. (4) రామజననమునకు ముందే ఉత్తరకాండలోని రావణ జననాదివృత్తాంతము, వేదవతి చరిత్ర కూర్పబడినది. (5) పరశురాముడు రామునితో యుద్ధమొనర్పుటకు కాక తన వైష్ణవతేజము నప్పజెప్పుటకు వచ్చినట్లు ఇందు వర్ణింపబడినది. (6) అజప్రేరితమైన సరస్వతి కైకలో నావేశించి వరముల నడిగించినట్లు, కైక నిర్దోషి యని తెల్పబడినది. (7) ఖరదూషణాదులను రాముడు సంహరించినపుడు ఇంద్రు డాతనికి పూలదండలను పంపును. వానిని ధరించిన క్షుత్పిపాసాదిబాధ యుండదట. (8) సమక్షమున యుద్ధము చేయువారిబలము వాలిని చెందునని వరము కలదు. కాబట్టి రాముడు చాటుననుండి బాణ మేసినట్లు ఈ రామాయణమున కలదు. (9) సీత పరమపావనశీల యగుటచే సీతా పరిత్యాగకథ చెప్పబడలేదు. (10) రాముడు శంబూకుని తపోవిఘ్నమునుమాత్రము చేసినట్లు తెల్పబడినది. (11) అయోధ్య లోనే గర్భవతియగు సీతకు వాల్మీకివచ్చి చిత్రపటములతో మన్న రామాయణకథను వర్ణించి చెప్పినట్లు, గర్భస్థులైన కుశలవులా కథ విన్నట్లు ఇందు కల్పింపబడినది.

ఇట్లు వాల్మీకి రామాయణమునందు లేని కల్పనలెన్నియో శ్రీకృష్ణ రామాయణమునందు కలవు. శ్రీకృష్ణ రామాయణమునందు శాస్త్రిగారి శాస్త్రవైదుష్యము, బహుగ్రంథపరిశీలనము, వేదవేదాంత విజ్ఞానము ప్రశంసింపదగినవి.

విశ్వనాథ సత్యనారాయణగారి రామాయణ కల్పవృక్షమునకు భారతప్రభుత్వమువారి జ్ఞానపీఠబహుమతి లభించినది. వాల్మీకి రామాయణమునందువలె కాండలు సర్గలుగా విభజింపక విశ్వనాథ సత్యనారాయణ తన రామాయణకల్పవృక్షమున సన్నివేశ ప్రాముఖ్యమును సూచించు పేర్లతో కాండలను కొన్ని ఖండములుగ విగడించినాడు. ఇందు పాత్రల ప్రాముఖ్యమును వ్యక్తీకరించు నూతనకల్పనలు కొన్ని కలవు.

అహల్యా శాపవిమోచనఘట్టమున ఇంద్రుడు కోడియై కూసినట్లు రామాయణ కల్పవృక్షమునందుమ కలదు. అహల్య అభ్యర్థనము ననుసరించి రాముడు

వివాహానంతరము అయోధ్యకు మరలిపోవుసందర్భమున సీతతోగూడి అహల్యను సందర్శించును. అపుడు అహల్య సీతారాములకు నారచీర లిచ్చినట్లు కల్పవృక్షమున కల్పింపబడినది. సంస్కృతమున భాసుని ప్రతిమానాటకమునందు పట్టాభిషేక భంగ సందర్భమున అవదాతిక సీతారాములకు వల్కలము లొసగిన విషయము ఈ కల్పన మునకు ప్రేరకమై యుండును. రాముడు అహల్యను గురువుగా స్వీకరించు సంపూర్ణత్వమును అహల్యాపాత్రకు కవి ఇచట చేకూర్చినాడు.

రామాదుల జననమునకు ముందు దశరథుడు తాను నిర్వర్తింపనున్న యాగ మునకు తన ప్రియమిత్రులైన గుహ, జటాయువులను అయోధ్యకు ఆహ్వానించి నట్లు తెల్పుట రామాయణ కల్పవృక్షమునందలి మరొక అవాల్మీకమైన కల్పనము.

రామాయణ కల్పవృక్షము అరణ్యకాండమున సీతాపహరణఘట్టమున మారీ చుడు తుదిని 'గ్రజా'హతిని 'లక్ష్మణాగ్రజా' అని లక్ష్మణునకు మారు రామునినే స్మరించుచు కేక పెట్టినట్లు తెల్పుట ఇతర రామాయణములందు కన్పట్టదు.

యుద్ధకాండమున రాముడు హంసద్వారా సీతకు తన ఆగమనవార్తను తెల్పుచు సందేశమును పంపినట్లు రామాయణ కల్పవృక్షమున కలదు.

ఇంద్రజిత్తు నాగాస్త్రముచే రామ లక్ష్మణులను బంధించినపుడు రాముడు మరణించెనను వదంతిని రాక్షసులు వ్యాప్తి గావింతురు. రామునికి ప్రాప్తించిన ఆపద గడచినచో తాను అగ్నిప్రవేశ మొనర్తునని సీతాదేవి మ్రొక్కుకొనినట్లు ఇందు చెప్పబడినది. సీతాదేవి ఇట్లు అసాధారణమైన మ్రొక్కులను మ్రొక్కుట ఆనంద రామాయణమునందు కలదు. శివధనుర్భంగసమయమున రాముని సుందర విగ్రహమునుగాంచి పరవశించిపోయిన సీత, తనకు అతడు పతియైనచో పదునాలు గేడులు అరణ్యవాస మొనరింతునని మ్రొక్కుకొనినట్లు ఆనంద రామాయణమున కలదు.

తిక్కన (క్రీ. శ. 1260) నిర్వచనోత్తరరామాయణము ప్రథమాంధ్రో త్తర రామాయణమని చెప్పవచ్చును. స్వయం సంపూర్ణమగు మహాకావ్యముగ తిక్కన ఉత్తర రామాయణకథను రచించినాడు. గోన బుద్ధారెడ్డి కుమారులగు కాచవిభుడు, విట్ఠల నాథులను సోదర జంటకవులు (క్రీ. శ. 13 వ శతాబ్ది) ఉత్తర రామాయణమును ద్విపదలో రచించినారు. కంకంటి పాపరాజు (క్రీ. శ. 1575-1632) ఉత్తరకాండను పద్యరూపమున సంపూర్ణముగ "ఉత్తర రామాయణము" అనుపేర రచించెను. జయంతి రామభట్టు అనుకవి నిర్వచనోత్తర రామాయణ

ము న తిక్కన వదలిన భాగములను గ్రహించి 'నిర్వచనోత్తర రామాయణ శేష ము'ను ఏకాశ్వాసముగ రచించెను.

వాల్మీకి రామాయణమునకేగాక అధ్యాత్మరామాయణాది తదితర సంస్కృత రామాయణములకుకూడ తెలుగులో అనువాదములు అనుసరణములు వెలువడినవి.

భోజుని చంపూ రామాయణమును అభిషిక్తరాఘవమను కావ్యముగ నడిమింటి వెంకటకవి తెలుగులో రూపొందించినాడు.

అధ్యాత్మరామాయణము రామకథాపరముగ చెప్పబడు వేదాంతార్థ ప్రతిపాదకము. దీనిని సంస్కృతమున విశ్వామిత్రుడు రచించినాడట. కాణాద పెద్దన సోమయాజి (క్రీ. శ. 1725-1800). కోటంరాజు నాగయామాత్యుడు (క్రీ. శ. 1860). కంచర్ల శరభకవి. మోతుకూరి పండరినాథకవి. అల్లమరాజు రామకృష్ణకవి. ముడుంబై వేంకటకృష్ణమాచార్యులు. పరశురామపంతుల రామమూర్తి. రూపక శ్రీ రామకవి మొదలగువారు అధ్యాత్మరామాయణమును పద్యకావ్యములుగ అనువదించినారు. మామిడమ్మ సుభద్రమ్మ (క్రీ.శ. 1900) ద్విపదలో రచించిన అధ్యాత్మ రామాయణము బహుళప్రచార మందినది. కాళహస్తి సుబ్రహ్మణ్యకవి అధ్యాత్మ రామాయణమును ఆరుకాండలలో కీర్తనలరూపమున రచించినాడు.

వాసిష్ఠ రామాయణము వేదాంత ప్రతిపాదకమైనది. తత్త్వరూపమైన ఈ గ్రంథమును సంస్కృతములో వాల్మీకి రచించినట్లు చెప్పుదురు. పదునారేండ్లప్రాయమున శ్రీరామునకు తత్త్వజిజ్ఞాస కలుగగా విశ్వామిత్రుని కోరికపై వసిష్ఠుడు రామునికి తత్త్వోపదేశము చేయుట యిందలి కథాంశము. వాసిష్ఠరామాయణమునకు యోగవాసిష్ఠమని, జ్ఞానవాసిష్ఠమని, వసిష్ఠశ్రీరామచంద్రసంవాదమని నామాంతరములు.

జ్ఞానవాసిష్ఠ రామాయణార్థసారమును గ్రహించి 'వాసిష్ఠరామాయణమను పేర ద్విపదగ్రంథముగా తరిగొండ వెంగమాంబ (క్రీ. శ. 1840) రచించెను. ఇందు గ్రంథాంత్యమున శ్రీరాముడు విశ్వామిత్రునివెంట క్రతురక్షణార్థము పోవుట మొదలుకొని మిగత రామాయణ కథాసారమంతయు సంగ్రహముగా ద్విపదలో తెలుపబడినది.

రామాయణ కథాత్మకములగు శతకములలో ముఖ్యమైనవి - వద్దికాశయ్య (క్రీ. శ. 1800) లవకుమార శతకము, ముత్య సూర్యనారాయణమూర్తి (1913)

ముక్కోల్లు సీతారామశతకము, గాదేపల్లి రాఘవశాస్త్రి (1914) పట్టాభిషేక మహోత్సవీయ శతకము, సోమయకవి (1938) శతకరామాయణము, జూలూరి లక్ష్మణకవి ముకుందరాఘవశతకము, వంగూరి ముద్దునరసకవి ప్రసన్నరాఘవశతకము, ధూళిపాటి వేంకటసుబ్రహ్మణ్యము బాలరామాయణశతకము మొదలగునవి. వంగూరి ముద్దు నరసకవి రచితమైన ప్రసన్నరాఘవ శతకమునందు రామకథ సంగ్రహముగా చెప్పబడినది. ఇందు 200 పద్యములు కలవు. సీతాపతి, దాశరథి, ప్రసన్న రాఘవ, రామప్రభూ మొదలగు సంబోధనలతో పెక్కు శతకములు కలవు.

తెలుగు వచన వాఙ్మయములోకూడ రామకథావస్తుకము లనేకములు కలవు. తుపాకుల అనంతభూపాలుడు, శ్యామరాయకవి, పింగరాజు దత్తాత్రేయుడు మొదలగువారు రామాయణమును వచనములో రచించినారు.

గోపీనాథకవి (క్రీ. శ. 1670) రచించిన విచిత్రరామాయణము లభ్యమగు ప్రథమాంధ్రవచన రామాయణము. ఇది ఓఢ్రభాషయందు సిద్ధేశ్వరకవి రచించిన విచిత్రరామాయణమునకు అనువాదగ్రంథము.

పైడిపాటి పాపయ్య రంగనాథరామాయణమును వచనముగ ఆంధ్రీకరించినాడు. శ్రీనివాస శిరోమణి వచనరామాయణము శిష్టవ్యావహారికాంధ్రమున రచింపబడినది. దీపాల పిచ్చయ్యశాస్త్రి శ్రీరామవనవాసము, మామిడిపూడి రామకృష్ణయ్య శ్రీమద్వాల్మీకి రామాయణ కథామృతము, నూతలపాటి పేరరాజు ఆనంద, తులసీ రామాయణములు, ముంగర శంకరరాజు రామచరితామనస్, వొద్ల వేంకటరామరెడ్డి దొడ్డ రామాయణము మొదలగునవి తెలుగులోని రామకథా వస్తుకములగు వచన కావ్యములు.

యక్షగానములు సంగీతముఖ్యములైన దేశినాటకములు, క్రీ. శ. 12 వ శతాబ్దినుండియు తెలుగుజాతితో యక్షగానములు పాదుకొనియున్నవి. ఆక్కాలపాటలలో రామాయణ కథావస్తుకములైనవి అనేకము కలవు. వేల్పూరి వేంకటకవి (1780-1853) రామలీల, ముమ్మడిదేవుల తిరుమలకవి (19 వ శతాబ్ది పూర్వార్ధము) గీత రఘునందనము. శిర్నాదు వేంకటరాయకవి (క్రీ. శ. 1840) రామాయణము, నల్లమిల్లి బసివిరెడ్డి శ్రీమద్రామవర రామాయణము, ఓగిరాల పాపయ్య రామనాటకము. వేంకటాచార్యకవి సమగ్రరామనాటకము. శేషాచలకవి ధర్మపురి రామాయణము, రాపాక శ్రీరామకవి అధ్యాత్మరామాయణము, బోడిచర్ల సుబ్బకవి (మిట్టమరి) రామాయణము, నందివాడ జగన్నాథకవి శ్రీమద్రామాయణము,

మంథెనకవి రామాయణము మొదలగునవి సమగ్రరామాయణ యక్షగానములలో పేర్కొనదగినవి.

రామాయణ కథాఘట్టములను ఇతివృత్తముగా గ్రహించి రచింపబడిన యక్ష గానములలో పేర్కొనదగినవి కందుకూరి రుద్రకవి సుగ్రీవవిజయము, చేకుమళ్ళ రంగశాయి జానకీపరిణయము (అలభ్యము), శహాజీ సీతాకల్యాణము, యాగళ్ళ జానకీరామయ్య సీతాకల్యాణము, శహాజీ కృతములగు రామపట్టాభిషేకము, శాంతా కల్యాణము, నాదెళ్ళ పురుషోత్తమకవి అహల్యా సంక్రందన నాటకము, పండరి విఠలరాయకవి శ్రీరామవిజయము మొదలగునవి.

మరింగంటి భట్టరు రామానుజాచార్యుని (క్రీ. శ. 1850) శ్రీరామనాటకము, తోలుబొమ్మలాటల కువయుక్తమై 'బొమ్మలాట రామాయణము'గా ప్రసిద్ధి చెందినది. వంతవేలూరు కుశలవ నాటకమును ఆరురాత్రుల కథగా పీశె సుబ్బరాజు, గాజులపెండ్లూరి శేషగిరిరాజు అను ఇరువురు కవులు ప్రదర్శననిమిత్తము రచించినారు.

తెలుగుదేశమున రామాయణేతివృత్తముతో హరికథలు, బుర్రకథలుకూడ వెలసినవి. శాఖ్యారి నారాయణకవి మోక్షగుండరామాయణము, హరికథా పితామహుండగు ఆదిభట్ల నారాయణదాసు కృతములగు యథార్థరామాయణము (ఇందు రామ పట్టాభిషేకపర్యంతము ఆరుకథలుగ చెప్పబడినవి). జానకీశ పథమను పేర శతకంఠ రావణవధ, బాలాజీదాసు కుశలవ విజయము, సంపూర్ణ రామాయణములు మొదలగునవి తెలుగులో చెప్పుకోదగిన రామకథావరములగు హరికథలు.

రామాయణేతివృత్తముతో పెక్కు బుర్రకథలుకూడ కలవు. నదీరా సంపూర్ణ రామాయణమును శ్రీరామజననము, సీతాకల్యాణము, పాదుకాపట్టాభిషేకము, సుగ్రీవవిజయము, లంకాదహనము, రావణసంహారము, లవకుశ అను బుర్ర కథలుగా రచించినాడు.

తెలుగు జానపద వాఙ్మయమునకు రామకథ దోహదకారి యైనది. రామకథా వరములైన స్త్రీలపాటలలోని కొన్నిభావములు నిరాడంబరములు, నిర్వ్యాజములు. ఈ పాటలలోని రామాయణకథ లెన్నో వాల్మీకము చెప్పియుండలేదు. రంగనాథ రామాయణము, విచిత్రరామాయణము కొన్ని కథలకు మూలమని చెప్పవచ్చును. లేదా వానిలోని కథలకు ఈ పాటలే మూలములు కావచ్చును. కూచికొండ రామా

యణము, శారద రామాయణము, ధర్మపురి రామాయణము, రామకథా సుధార్ణవము, మోక్షగుండ రామాయణము, గుత్తెనదీవి రామాయణము, అధ్యాత్మరామాయణము, సంక్షేప రామాయణము, చిట్టి రామాయణము మొదలగునవి జానపదవాఙ్మయములో ప్రసిద్ధిగాంచిన రామాయణములు. శాంతాకల్యాణము, పుత్రకామేష్టి, కౌసల్యబైకలు, శ్రీరాముల ఉగ్గుపాట, రాములవారి అలుక, సుగ్రీవవిజయము, లక్ష్మణమూర్ఛ, లంకాయాగము, శ్రీరామ పట్టాభిషేకము, లక్ష్మణదేవర నవ్వు, ఊర్మిళాదేవి నిద్ర, కుశలవ యుద్ధము, శతకంఠరామాయణము మొదలగునవి రామాయణములోని కొన్నిఘట్టములను వర్ణించునట్టివి. ఇవి జానపదకవులు పురాణసంపతులగు సీతా రాములతో తాదాత్మ్యమనుభవించి వర్ణించినవి.

దేశీయానుగుణముగ తెలుగుదేశమున జానపదులలో ప్రచారములోనికి వచ్చిన కథలలో ముఖ్యమైనవి శతకంఠరామాయణము, మైరావణచరిత్ర మొదలగునవి.

వసిష్ఠోత్తర రామాయణము 12-వ అధ్యాయములో శతకంఠరావణ వృత్తాంతము కలదు. దీనికి సీతావిజయమని పేరు. వాల్మీకి రచించినాడని చెప్పబడు అద్భుతోత్తర రామాయణమునందు సీతాదేవి శతకంఠరావణుని సంహరించిన కథ కలదు.

శతకంఠ రామాయణమును లింగనకవి ద్విపదలో మూడు కాండలుగా రచించినాడు. దీనికి శతముఖ రామాయణమనియు, సీతావిజయమనియు పేర్లు కలవు. వల్లూరి హనుమంతకవి సీతావిజయమను ద్విపదకావ్యమును రచించియున్నట్లు నాగజిత్తీపరిణయమను పద్యప్రబంధమందలి అవతారికనుబట్టి తెలియుచున్నది. ఈ సీతావిజయ ద్విపదగ్రంథము అలభ్యము.

శతకంఠరామాయణము భవిష్యోత్తరపర్వము ననుసరించి రచింపబడినది. కేవలము దశకంఠుని సంహారముతో శ్రీరాముని త్రేతాయుగ వీరునిగ ఎంత వర్ణించినను పదకవులకు తృప్తి కలుగలేదు. శ్రీరాముని వీరాధిక్యచిత్రణకు శతకంఠ, సహస్రకంఠ రావణులనుకూడ కల్పించి, వారి సంహారమునుకూడ శ్రీరాముని చేతనే చేయించినారు.

శతకంఠునితో పోరుటకు సీతయు రామునివెంట వెడలుట ఈ గ్రంథమందలి విశేషము. సీత ధనుర్ధారిణియై రణరంగమున నిలిచి శతకంఠుని పరాభ

వించినదని ఇందు వర్ణింపబడినది. శతకంఠరామాయణమున సీత రాముని అర్ధాంగి యని నిరూపించుకొనిన వీరనారి. నరకాసుర సంహారమున శ్రీకృష్ణావతారములో సత్యభామ సహాయము లభించెననెడి పురాణప్రసిద్ధగాథ నాధారముగ చేసికొని కల్పించినకథయై యుండవచ్చును. సీతాదేవి రణరంగమున నిలిచి వీరరస మొలి కించుఘట్టము తెలుగున ఈ శతకంఠరామాయణమునందే కలదు.

శతకంఠ రామాయణమును మర్దనకవి (క్రీ. శ. 17 వ శతాబ్ది), లింగకవి (1700), గంగకవి అనువారు ప్రత్యేకముగ పద్యప్రబంధములుగ రచించినట్లు తెలియుచున్నది.

మైరావణచరిత్ర వాల్మీకి రామాయణమునందు లేదు. ఆనందరామాయణ మున ఐరావణ మైరావణుల చరిత్ర కలదు. తెలుగులో ప్రబంధముగా మైరావణ చరిత్రను మాడయకవి (క్రీ. శ. 16 వ శతాబ్దము) రచించినాడు. తెలుగునాట జన సామాన్యమున ఈ కథ బహుళప్రచారము గాంచినది; పండిత పామర జనరంజక మైనది. మైరావణచరిత్రను కాచనకవి, చంద్రగిరి చిన్నయ్య, శైవ లక్ష్మీనర సింహకవి, పాతూరి తిరుపతికవి, బసవప్పకవి మొదలగువారు ద్విపదలో రచించి నారు. ఈ ద్విపద మైరావణచరిత్ర లన్నిటిలోను కాచనకవి మంజరీద్విపదలో రచిం చినగ్రంథమే విపులవ్యాప్తిలో నున్నది. స్వేచ్ఛానుసారముగ, గానానుకూలముగ సాగిన ఇందలి మంజరీద్విపదలనే తోలుబొమ్మలాటవారు పాడుచుందురు.

మైరావణచరిత్రలో నాయకుడు హనుమంతుడు. వీరరస ప్రధానమైన కావ్యమిది. యోగదృష్టితో సర్వమును చూడగల్గిన వసిష్ఠుడీ కథను శ్రీరామునికి వినిపించినట్లు కలదు.

మైరావణుడు పాతాళ లంకేశ్వరుడు. లంకాధీశ్వరుడగు రావణుని మిత్రుడు. పెక్కుమాయలం దారితేరినవాడు. అతడు విభీషణుని వేషముచే హనుమంతుని కనుగప్పి, నిద్రించుచున్న రామ లక్ష్మణులను పాతాళమునకు తీసికొనిపోయి వారి నచ్చట కాళికి బలియిచ్చుట కుద్యమించును. హనుమంతు డిది తెలిసుకొని, పాతాళ లంకనుండి రామ లక్ష్మణులను విముక్తులను చేయుట యిందలి ప్రధానేతి వృత్తము.

కథలో వేరువేరు సందర్భములలో వేరువేరుపాత్రలచే కవి చమత్కార ముగా పూర్వరామాయణ కథనుకూడ సంగ్రహముగా చెప్పినాడు. మైరావణుని భార్య మాతంగి, భర్తను దుర్వ్యాప్తినుండి వారించుచు జననాది పరశురామ గర్వ

భంగమువరకు నడచిన రామకథను వర్ణించి చెప్పును. ఇట్లే మరొక సందర్భమున హనుమంతుడు మిగిలిన రామకథ ఖరదూషణాది సంహారముతో కూడినది వర్ణించి చెప్పును.

కృష్ణశ్రీ ప్రచురించిన 42 స్త్రీల రామాయణపాటలలో 'శాంత గోవిందనామములు' అనుపాటలో సీతాదేవి లంకలో ఒక పద్మమునందు జన్మించినట్లు వర్ణింపబడినది. జానపదులలో వ్యాప్తిగాంచిన ఈ అంశమునుబట్టియే "సీత పుట్టి లంకకు చేటు' అను సామెత వ్యాప్తిలోనికి వచ్చియుండును. సీత చిన్నతనముననే ఆటలాడుసందర్భమున శివధనుస్సును కదిలించినట్లును, వివాహమైనతరువాత సీత రామునితో కలిసి అయోధ్యలో పదకొండు సంవత్సరములు కాపురము చేసినట్లును, పదితలల రావణునిచూచి సీత మూర్ఛిల్లగా సీత పడియున్న భూమితోపాటు రావణుడు సీతను అపహరించినట్లును, రావణుని సంహరించి అయోధ్యకు మరలివచ్చు రాముని బ్రహ్మహత్యాపాపము చుట్టుకొనినట్లును ఇత్యాది అవాల్మీకాంశములు జానపదకవులు రామకథలో కల్పించినారు. కథానన్ని వేశమున కనుగుణముగ, మూలమునకు మెరుగుదెచ్చు ఔచితీపరిపోషకములగు మార్పులనుకూడ జానపదకవులు చేసినారు.

సీతాపరిత్యాగమును జానపదకవి ఇట్లు సృష్టించినాడు. తన అన్నయగు రావణుడు మరణించినను శూర్పణఖకు రామునిమీది వ్యామోహము తగ్గలేదు. తన దారికి అడ్డుగానున్న సీతను శాశ్వతముగా తొలగించుకొనుటకు శూర్పణఖ బిచ్చగత్తెరూపములో అయోధ్యకువచ్చి వేటకు బయలుదేరు రాముని సందర్శించును. రాముని ఆదేశముపై సీత బిచ్చగత్తె రూపముననున్న శూర్పణఖను ఆదరించును. శూర్పణఖ, రావణుని చిత్రమునడిగిపి తన కిమ్మని సీతను కోరును. మొదట నిరాకరించినను, శూర్పణఖ కోర్కెను కాదనలేక రావణుని కాలిబొటనవ్రేలిని గీసి యిచ్చును. శూర్పణఖ, మిగతబొమ్మను తానే పూర్తిచేసి, బ్రహ్మను మెప్పించి ఆ రావణ చిత్తరువునకు ప్రాణము పోయించును. తరువాత ఆ చిత్తరువును అయోధ్యలోవదలి వెళ్ళును. రావణుని చిత్తరువు సీతను తనతో లంకకు రమ్మని బాధించుచుండును. ఆ చిత్తరువును చిత్తుచేసినను మరల ప్రత్యక్షమై సీతను వేధించుచుండెను. చివరకు సీత తన పడకక్రింద ఆ రావణచిత్తరువునుంచి రామనామజపముచేసి దానివలని బాధనుండి తాత్కాలికముగా విముక్తి పొందును. వేటనుండి తిరిగివచ్చిన రామునికి సీతగాని, అంతఃపురములోనివారుగాని ఈ రావణ

చిత్తరువుసంగతి చెప్పరు. రాముడు సీతను సమీపించినపుడు, సీత పడకనుండి లేవగానే క్రిందనున్న రావణుని చిత్తరువు ప్రత్యక్షమగును. ఆ దృశ్యమునుచూచి రాముడు సీత శీలమును శంకించి ఆమెను పరిత్యజించుటకు నిశ్చయించుకొనెను.

వాల్మీకి రామాయణములో లేని ఈ కథ తమిళమునందలి 'ఏత్రాప్పాట్టు' (Picottah Song) అను జానపదగీతమునందుకూడ వర్ణింపబడినది. సీత రావణుని ప్రతిమనేకాక లంకావైభవమునుకూడ చిత్రించినట్లు కె. వి. జగన్నాథన్ అనునతడు 'ముల్లైమానస్'లో తెల్పినాడు.

ఈ జానపదకథకు మూలము బెంగాలీభాషలో చంద్రవతి (క్రీ. శ. 16 వ శతాబ్ది) రామాయణమని కె. వి. జగన్నాథన్‌గారు తెల్పినారు. సీత రావణుని ప్రతిమను గీయుట అనునది బెంగాలీ రామాయణములోను, తెలుగు జానపద రామకథలోను సమానముగానున్నను బెంగాలీ రామాయణములో శూర్పణఖ ప్రసక్తి లేదు. అందు శూర్పణఖకార్యమును కైకేయి కుమార్తెయగు 'కుకియ' (కుకువాదేవి) నిర్వహించినట్లు కలదు. కుకువాదేవి కోరికపై సీత రావణుని చిత్తరువును తాలవృంతముపై చిత్రించును. సీత నిద్రించుచుండగా రావణుని చిత్తరువుగల తాలవృంతమును 'కుకియ' సీత ఎదపై నుంచును. రాముడు ఆ దృశ్యమునుచూచి సీతను శంకించి సీతాపరిత్యాగమునకు పూనుకొనును.

రామదాసు కీర్తనలు, త్యాగరాజు కృతులు, మునిపల్లె సుబ్రహ్మణ్యకవి (క్రీ. శ. 1730) అధ్యాత్మరామాయణ కీర్తనలు, తూము నరసింహదాసు భజన కీర్తనలు, పరాంకుశదాసు కీర్తనలు, ప్రయాగ రంగశర్మ (క్రీ. శ. 1858-1927) కీర్తనలు మొదలగు కీర్తనలందుకూడ రామకథ విశేషముగ ద్యోతకమగుచున్నది.

ఇట్లు పలువురు కవులు తెలుగులో రామాయణమును కావ్యములుగ, ప్రబంధములుగ, ద్విపద కావ్యములుగ, ద్వ్యర్థి కావ్యములుగ, అచ్చతెలుగు కావ్యములుగ, యక్షగానములుగ, సలక్షణవచనములుగ, శతకములుగ, జానపద గాథలుగ, ఖండ కావ్యములుగ వివిధరీతుల రచించినారు.

సంస్కృతరామాయణములోని ఒక ఘట్టము నాధారముగా, విభిన్నదృక్పథములకు ప్రతినిధులైన జాబాలి, రాముడు ముఖ్యపాత్రలుగా, రామాయణ గాథను హేతువాదదృష్టినుండి పరిశీలిస్తున్న సుదీర్ఘ పీఠికతో, కవిగా, రచయితగా, పత్రికా సంపాదకుడుగా తెలుగునాడును ప్రభావితముచేసిన మేధావి శ్రీ నార్ల 'జాబాలి' అను

పేరుతో ఒక 'నాటిక'ను రచించినాడు. రామాయణము చారిత్రకగ్రంథమని వాదించు వారి అజ్ఞానమును, అహంకారమును నార్లవారు 'జాబాలి'కి వ్రాసిన పీఠికయందు దుయ్యబట్టినారు.

తెలుగు సారస్వతమునందేకాక ఆంధ్రుల జీవనమునకూడ రామప్రభావ మధికముగ కలదు. తెలుగువారి జీవితవిధానమే రామచరితతో, సమైక్యము పొందిన దని చెప్పవచ్చును. వారి జీవితమున ప్రతిసంఘటనయందును రామకథ స్ఫురింప జేయు సామెతలు, నానుడులు, జాతీయములు తెలుగుప్రజల నిత్యజీవితమున గాంచవచ్చును.

## 22. మలయాళ సాహిత్యములో రామకథ:

మలయాళములో క్రీ. శ. 12 వ శతాబ్దిలో రచింపబడిన 'రామచరితమ్' ఆదికావ్యమని చెప్పదగినది. తిరువిదాంకూర్ సంస్థానములో యుద్ధవీరులను ఉత్సాహ పరచుటకు ఈ కావ్యము రచింపబడెనని, దీనిని చేరమన్ (చీరామన్) అను తమిళ కవి రచించెనని చెప్పుదురు. అభినందనుని సంస్కృత రామచరితమునకును దీని కిని సంబంధము లేదు.

మలయాళములోని రామచరితము రామాయణములోని యుద్ధకాండము నాధారముగా రచింపబడినది. రామపట్టాభిషేకముతో కథ ముగియును. కాని యుద్ధ కాండవర్ణనలో ఉపకథలనుపేర రామాయణకథ మొత్తము వివరింపబడినది. రామ చరితము పాట్టు సాంప్రదాయమునకు చెందిన కావ్యము. ఇందు 164 పటలములు (అధ్యాయములు) కలవు. ఒక్కొక్క పటలమునందును 10 లేక 15 పాట్టు లుండును.

రామచరితము సాహిత్యగుణములన్నియు సంతరించుకొనిన ఉత్తమ గ్రంథము. కథాగమనములోను, వర్ణనలలోను చీరామన్ వాల్మీకిని మించిపోయినా డని చెప్పుదురు. రామచరితములో రావణుడు పంచవటిలోనికి భిక్షుకవివేషమున ప్రవేశించి, సీతను బెదరించి రామునినుండి వేరుచేయవలెనని తా ననుకొన్నట్లు తెల్పును. అప్పు డచటికి శూర్పణఖ వచ్చి సీతను చంపి భక్షింతునని భయపెట్టును. శూర్పణఖ మాటలువిని భీతితో వణకిపోయిన సీతను రావణుడు తన రథము నెక్కు మని ఆదేశించి తీసుకొనివెళ్లును. పట్టాభిషేకసమయమున నారదునిముఖమున కవి విష్ణు స్తోత్రమును చెప్పించును. వాల్మీకి రామాయణములో ఈ విషయములు లేవు.

రామచరితము తరువాత మలయాళములో పేర్కొనదగిన రామాయణము విరణంకవులలో ఒకడగు రామపణిక్కర్ (క్రీ. శ. 1375-1475) రచించిన కణ్ణశ రామాయణము. మలయాళపండితులలో దీనికి బహుళవ్యాప్తి కలదు. ఇందు ఉత్తరకాండ కథతోపాటు మొత్తము రామాయణకథ చెప్పబడినది. ఇది వాల్మీకి రామాయణాను సారియైనను కొన్ని వర్ణనలందు కవి స్వాతంత్ర్యమునుచూపి అమృత ప్రాయమైన కావ్యముగా రచించినాడు. ఇది జనసామాన్యమునకు సుబోధకమైనది కాదు.

అయ్యప్పిళ్ళి ఆశాన్ (క్రీ. శ. 15 వ శతాబ్ది) 'రామకథాపాట్టు' తమిళ మలయాళభాషా సమ్మిశ్రితమైనట్టిది.

మలయాళములో రామాయణచంపూ ప్రశస్తమైన చంపూకావ్యము. దీనిని పునం నంబూద్రి (క్రీ. శ. 15 వ శతాబ్ది మధ్యభాగము) రచించినాడు. ఇందు రావణ జన్మవృత్తాంతమునుండి రామపట్టాభిషేకమువరకుగల కథ వివరింపబడినది. ఇందు 22 భాగములు కలవు. రావణోద్భవము, విచ్ఛిన్నాభిషేకము, సుగ్రీవ సఖ్యము, అంగుళీయాంకము, ఉద్యానవన ప్రవేశము మొదలగునవి.

ఆధునిక మలయాళమునకు పితామహుడనదగిన ఎళుత్తచ్చన్ (క్రీ. శ. 16 వ శతాబ్ది) అధ్యాత్మ రామాయణము ఉత్తమోత్తమమని చెప్పదగినది. ఇది భక్తి సాహిత్యమునకు చెందినది. ఎళుత్తచ్చన్ సంస్కృతములోని అధ్యాత్మ రామాయణమును అధికముగా అనుకరించినను, యుద్ధకాండములో మాత్రము వాల్మీకి రామాయణానుసారముగనే రచించినాడు. ఎళుత్తచ్చన్ ఉత్తరకాండకథనుమాత్రము అనువదింపలేదు. ఎళుత్తచ్చన్ రాముని ఆదర్శప్రాయుడైన మానవోత్తమునిగాను, దైవాంశసంభూతునిగాను చిత్రించినాడు. అధ్యాత్మ రామాయణములో ఎళుత్తచ్చన్ ఆధ్యాత్మికవాదిగా కనిపించును. తత్త్వము వేదాంతములను చర్చించుటలో అతని ప్రతిభ 'లక్ష్మణోపదేశము' అను ఘట్టములో వ్యక్తమగును.

కొట్టారక్కార తంబురాన్ (క్రీ. శ. 17 వ శతాబ్ది) రచించిన 'రామనాట్టం' మలయాళములోని ఆట్టక్కథలలో మొట్టమొదటిది. ఆట్టకథాప్రకారములను రంగస్థలముపై ప్రదర్శించుటను 'కథకళి' యందురు. నేటికిని కథకళిలో 'రామనాట్టం' ను కొన్నిప్రాంతములలో ఉపయోగించుచున్నారు. రామాయణకథ ఎనిమిది భాగములుగ ఇందు విభజింపబడినది. పుత్రకామేష్టి, సీతా స్వయంవరం, విచ్ఛిన్నాభి

షేకం, ఖరవధం, వాలివధం, తోరణాయుద్ధం, సేతుబంధనం, యుద్ధం అను ఈ విభాగములు ఒక్కొక్కటి ఒక్కొక్కరాత్రి చొప్పున ఎనిమిదిరాత్రుల ప్రదర్శన మునకు అనుకూలముగా రచింపబడినవి. సాహిత్యములో చిరస్థాయివి చేకూర్చు కావ్యసంపద రామనాట్టంలో కన్పించదు. ఇందు వాల్మీకి, కంబ, షునం నంబూద్రుల రామాయణానుకరణములు కన్పట్టును, రావణవిజయము, మేఘనాధవిజయము, రావణవధం, శ్రీరామావతారం, సీతా స్వయంవరం, తాటకవధం మొదలగునవి రామ కథావస్తుకములగు అట్టక్కథలలో పేర్కొనదగినవి.

కుంజన్ నంబియార్ (క్రీ. శ. 18 వ శతాబ్ది) ప్రజలలో నాస్తికత్వమును నిర్మూలింపజేసి భక్తిభావమును పెంపొందింపజేయుటకు తుళ్ళల్ రచనలను మల యాళభాషలో ప్రవేశపెట్టినాడు. రామాయణ కథాసంఘటనలలో సమకాలిక సాంఘిక సమస్యలను జోడించి కుంజన్ నంబియార్ సీతా స్వయంవరం, కార్తవీర్యార్జున విజయం అను తుళ్ళల్ రచనలను చేసినాడు. యథావాల్మీకముగా రచింపబడిన వానిలో కేరళవర్మ (క్రీ. శ. 17 వ శతాబ్ది) రామాయణముకూడ పేర్కొనదగినదే. వల్లత్తోళ్ (క్రీ. శ. 20 వ శతాబ్ది) వాల్మీకి రామాయణమును యథాతథముగ మల యాళములోనికి అనువదించినాడు. ఆధునిక మలయాళ రామాయణములలో పేర్కొన దగినవి అజకథ్ పద్మనాభ కురుప్ (క్రీ. శ. 1894) రామచంద్రవిలాసము, కట క్కంకూర్ రాజరాజవర్మ రాఘవాభ్యుదయము మొదలగునవి. సంస్కృతములోని ఆశ్చర్యచూడామణి, అనర్ఘరాఘవము, ప్రసన్నరాఘవము మొదలగువానికి కూడ మలయాళానువాదములు కలవు. తులసీదాసు రామాయణము, కంబరామాయణ ములుకూడ మలయాళములో పద్యముగా, వచనముగా వెలువడినవి. కుమారన్ ఆశాన్ 'చింతావిష్టయాయసీత' అను కావ్యములో భావసౌందర్యము శ్లాఘింప దగినది. మలయాళవాఙ్మయములో రామకథ బహువిధరంగములలో బహువిధము లుగా విస్తరించినది. తక్కిన భాషాకవులవలె కాక మలయాళకవులు రామాయణ కథావృత్తాంతములను సంప్రదాయసిద్ధమగు కథను వదలి మార్పులుచేయుట కిచ్చ గింపక దాని పవిత్రతను భద్రపరచినారు. ఇది రామకథాభిమానులందరు గమనింప దగినవిశేషము.

## 23. మహారాష్ట్ర సాహిత్యములో రామకథ :

మహారాష్ట్రభాషలో క్రీ. శ. 14 వ శతాబ్దికి చెందిన నరహరి సోనార్‌కవి రసాళ రామాయణమును రచించినాడు. ఇందు 8-10 అభంగములుమాత్రమే లభ్య

ములు. రామసాక్షాత్కారమును బడసిన రామభక్తుడగు సమర్థ రామదాసు (క్రీ. శ. 1608-1681) సుందరకాండము, యుద్ధకాండములను రచించెను. జయరామస్వామి వడగాంకర్ రచితమైన 'సీతా స్వయంవర్' అను గ్రంథము మహారాష్ట్రభాషలో ప్రసిద్ధిచెందినది. ఆనందతనయుడు 'కడలే' అను గేయరూపమున మహారాష్ట్రములో సీతా స్వయంవర కావ్యమును రచించినాడు. మహారాష్ట్ర కవిసార్వభౌముడగు మోరోపంత్ (క్రీ. శ. 1729-1794) మొదటిగ్రంథము 'లవకుశాఖ్యానము'. అతడు సీతాగీతము, మంత్రరామాయణము, పద్మరామాయణము, దామ రామాయణములనుకూడ మహారాష్ట్రభాషలో రచించినాడు. హంసరాజు (శా. శ. 1720-1770) వేదాంతపరముగా రామాయణమును 'అభంగ'ములలో వ్రాసినాడు. విష్ణుదాసభావే (క్రీ. శ. 1843) సీతా స్వయంవర్ నాటిక మరాఠీభాషలోనే ప్రప్రథమ నాటకము. అణ్ణాసాహెబ్ కిర్లోస్కర్ (క్రీ. శ. 1843-1885) రామరాజ్య వియోగ మను నాటకమును వ్రాసినాడు. భార్గవరాం వరేర్కర్ అనునతడు మహారాష్ట్ర నాటకరంగమున మార్పులు కావించి భూమికన్యా సీతా నాటకమును నవీనపద్ధతిలో రచించినాడు. 'శాత్యాగోడబోలె' అనునతడు ఉత్తర రామచరితమును మరాఠీలోనికి అనువదించినాడు. మాడ్గూళ్కర్ సీతా రామాయణమునకు మరాఠీభాషలో విపులవ్యాప్తి కలదు.

ఇట్లు భారతీయభాషలందు రామాయణము ఎన్నిరూపముల దాల్చినదో సంగ్రహముగ పైని వివరింపబడినది.

## 24. రంగనాథ కంబరామాయణములు - సామ్యములు :

కంబరామాయణము దక్షిణదేశభాషలలోనే కాక భారతీయభాషలలోకూడ వెలసిన ప్రప్రథమ రామాయణానువాదము. ఇది తమిళములోని ప్రప్రథమ అనువాద భాషాగ్రంథము కూడ - తమిళమునందలి కంబరామాయణమునకు రామావతారమని, రామకదై అని, కంబనాటకమ్ అనియు పేర్లు కలవు. కంబరామాయణమనియే ఇది ప్రఖ్యాతి చెందినది. కంబరామాయణము తరువాత దక్షిణ భారత సాహిత్యములలో మిక్కిలి ప్రచారము పొందినది తెలుగున గోన బుద్ధారెడ్డి విరచితమగు రంగనాథ రామాయణము. రంగనాథ కంబరామాయణములకు గల సామ్యములను వర్ణించుట ప్రస్తుతవిషయము.

## 25. కంబరామాయణము - ప్రచారము:

కంబరామాయణము తమిళమున మిక్కిలి ప్రామాణికమైన గ్రంథము. తమిళేతరులను కూడ ఇది ఆకర్షించినది. కన్నడాంధ్ర మలయాళ దేశములందును దీనికి విపులవ్యాప్తి కలదు. క్రీ. శ. 14 వ శతాబ్ది నాటిదగు 'పురత్తిరట్టు' అను సంకలన గ్రంథమునందు కంబరామాయణమునందలి కొన్ని పద్యము లుదాహరింప బడినవి. క్రీ. శ. 14 వ శతాబ్ది నాటిదగు ఒకానొక కన్నడ శాసనమునందు కంబ రామాయణప్రశంస కన్పట్టుచున్నది. కంబకవి తెలుగుదేశములోని కాకతీయ ప్రతాపరుద్రుని సందర్శించి అతనిగురించి వెంబాపద్యమును చెప్పినట్లు ఐతిహ్యము కలదు. తెలుగుపదములగు తమ్మి, అక్కట మొదలగునవి కంబరామాయణమున చోటు చేసికొనినవని విమర్శకులు తెల్పుతున్నారు. తమిళములోని 'నాన్ కాకత్తి యన్, పొక్కత్తియన్ అల్లా' (నేను కాకతీయుడను, అసహాయుడను) అని ఒక సామెత కలదు. చిత్తూరుజిల్లాలో 'ఏమిరా కంబరామాయణము మాట్లాడుచున్నావు' అను నానుడి వ్యాప్తిలో నున్నట్లు కట్టమంచి రామలింగారెడ్డిగారు తెల్పినారు. దీనినిబట్టి కంబరామాయణము తమిళభాషలోనే కాక కన్నడాంధ్రములందును ప్రచారము పొందినట్లు తెలియుచున్నది. ఆదిపూడి సోమనాథరావు (క్రీ. శ. 1867-1941) కంబరామాయణమును తెలుగులోనికి అనువదించిన వారిలో ప్రథముడని తోచు చున్నది. కాని అతని కంబరామాయణము ప్రచురితము కాలేదు. పూతలపట్టు శ్రీరాములు రెడ్డిగారి కంబరామాయణానువాదము ప్రశస్తమై, ముద్రితమై విపుల ప్రచారములో నున్నది. మురుగేశమ్ పిళ్లై అనునతడు తెలుగులో కంబకవి జీవిత చరిత్రను రచించినాడు.

కేరళదేశములో కంబరామాయణమునకు అధికప్రచారము కలదు. పాణ్ణిత్తు శివుడే కంబనిరూపమెత్తి రామావతారమును రచించినట్లు ఒక ఐతిహ్యము కేరళదేశ మున వ్యాప్తినందినది. కంబరామాయణమునకు తమిళమున "కంబనాటకమ్" (Kamban's Drama) అనియు ప్రసిద్ధి కలదు. ఇందు 32 నాటకోచితములగు సన్నివేశములు కల్పింపబడినవి. ఆ యా సన్నివేశములందలి ప్రధానపాత్రలు తొలి సారిగా రంగప్రవేశము కావించుసందర్భమున వారు కావించు సంభాషణారీతి మిక్కిలి ప్రాముఖ్యము వహించునట్లుగా ఇందు రచింపబడినది. కేరళదేశమున ముఖ్యముగా ఉత్తర మలబారులో దేవాలయములో తిరునాళ్ల జరుగుసందర్భము లందు ప్రదర్శించు 'పావకూత్తు' (తోలు బొమ్మలాటలు) లందు ఈ 32 సన్నివేశ ముల కనుగుణముగ కంబరామాయణమునందలి పద్యములను తెరవెనుకనుండి

గాయకులు పాడు ఆచారము బహుకాలమునుండి వ్యాప్తి గాంచియున్నది. దీనికి సంబంధించిన ఒక ఐతిహ్యముకూడ కేరళమున ప్రసిద్ధిగాంచినది. రామరావణ యుద్ధము జరుగుటకు పూర్వము లంకానగరమును కావలి కాయుచుండిన 'కాళి'ని పరమేశ్వరుడు నగరమును వదలిపొమ్మని ఆజ్ఞాపించెనట. అట్లు వెడలిపోయి నందున కాళికాదేవికి రామరావణయుద్ధము తిలకించుభాగ్యము లేకపోయెను. అందు వలన కాళికాదేవి కోర్కెను తీర్పనెంచిన పరమేశ్వరుడు కేరళదేశములో తన దేవాలయములందు రామాయణ కథాసన్నివేశములను తోలుబొమ్మలరూపమున ప్రదర్శించుచుండగా చూచునవకాశము కాళికాదేవికి కల్పించెను. ఆ ప్రదర్శనములందు నాటకోచితములుగా రచింపబడిన కంబరామాయణమునందలి పంక్తులను గాయకులు గానముచేయు నాచారము నేటికిని కేరళమునందు కలదు. 'పావకూత్తు'లో కంబ రామాయణములోని నాటకోచిత సన్నివేశముల నుపయోగమునుగురించి పి. అచ్యుత మీనన్ ఇట్లు తెల్పినాడు.

"This is a kind of shadow - Play conducted by two men, who exhibit shadow - characters on the screen and speak for them. The performance is regarded as sacred by the masses who attend it in the same spirit of devotion as they visit temples. Kamba Ramayanam is generally the literature followed by the conductors, who very often deviate into learned discussions on philosophical and literary subjects in the form of a dialogue'. (Ezuttaccan and His Age. P. 16.)

కబీరు కీర్తనలందును, తులసీదాసు రామాయణమునందును కంబరామాయణమునందలి కథాసన్నివేశముల ప్రభావము కన్పట్టునని విమర్శకులు పలువురు భావించుచున్నారు.

కంబరామాయణములో 10,569 పద్యములు, 42,276 పాదములు కలవు. వీనిలో చాలపద్యములు కంబని తరువాత చేరినట్లు విమర్శకులు తలంతురు. చిదంబరనాథ మొదలియార్ ప్రకారము బాలకాండములోని 1420 పద్యములలో కంబకవి వ్రాసినది 167 పద్యములు మాత్రమే. అట్లే అయోధ్యకాండలోని 1210 పద్యములకుగాను కంబకవి 550 పద్యములనుమాత్రమే రచించినాడని అతడు కంబ రామాయణ పీఠికలో తెల్పినాడు. వెల్లియంబాలవణత్తంపిరాన్ (Velliambala-vana-t-Tampiran) అను నతడు కంబరామాయణములోని ప్రక్షిప్తపద్యములను

చేర్చినట్లు తమిళవిద్వాంసులు చెప్పుదురు. కంబరామాయణములోని ప్రక్షిప్తపద్యము లనుబట్టియే తమిళమున దానికెంత ప్రచారమున్నదో తెలియగలదు.

## 28. రంగనాథ రామాయణము - ప్రచారము :

తమిళమున కంబరామాయణమునకువలె తెలుగుదేశమున రంగనాథ రామాయణమునకు బహుళప్రచారము కలదు.

పాల్కురికి సోమనాథుని ద్విపద రచనావిధానమే గోన బుద్ధారెడ్డి రంగనాథ రామాయణరచనకు ప్రాతిపదిక. కాని పాల్కురికి సోమనాథుని ద్విపద కావ్యముల కంటె రంగనాథ రామాయణమునకే ఎక్కువ ప్రచారప్రశస్తులు లభించినవి. గోన బుద్ధారెడ్డి, అదివరకే దైవముగా పరిగణించు రాముని కథను ద్విపదలో రచించినాడు. పాల్కురికి సోమనాథుని ద్విపదకావ్యములందలి బ్రాహ్మణనింద, అన్యమత దూషణము, స్వమతోత్కర్ష మొదలగువానిని పరిహరించుటవలన రంగనాథ రామాయణము సోమనాథుని ద్విపదకావ్యములకంటె శీఘ్రకాలమున జనసామాన్యమున వ్యాప్తిగాంచినది.

దేశీయతా మనోహరమైన రచనగా రంగనాథ రామాయణము సుప్రసిద్ధమైనది. ఇది వాల్మీకి రామాయణమునకు ఆంధ్రీకరణమైనను, స్వతంత్రమైనరీతిలో జాతీయమైన విశేషములతో సర్వజనీనమైన కావ్యముగా, దేశీయతామహితముగా 'పాఠ్యేగేయేచ మధురము'గా పేరు గడించినది. రంగనాథ రామాయణము ద్విపద రామాయణములలో సర్వదా శ్రేష్ఠమైనది. ద్విపదకావ్యములలో దీనికి ప్రథమ గౌరవము దక్కినది.

రంగనాథ రామాయణము బహుళవ్యాప్తమునొంది పండిత పామర జనాదరణము నొందుటకు ముఖ్యకారణము లివి - భక్తిప్రాధాన్యము, పరమతసహనము, జనశ్రుతిలోనుండు కథలను గ్రహించుట, ప్రబంధరీతిలోనుండు వర్ణనలు. దీనికితోడు తెలుగులోని సమగ్రమైన మొదటి అనువాద రామాయణగ్రంథ మిదియే యగుటవలన రంగనాథ రామాయణమునకు ఉన్నతత్త్వము చేకూరినది. ఇది ప్రౌఢ కవితారసికులకుమాత్రమే కాక పామరజనులకుకూడ సాహిత్యానందమును సమకూర్చిపెట్టినది.

తోలుబొమ్మల నాడించువారు రంగనాథ రామాయణమునందలి ద్విపద పంక్తులను గానముచేయుచు కథావివరణము చేయుట ముఖ్యముగా రాయలసీమ

యందును, ఇతరప్రాంతములందును మొన్న ---న్నటివరకును మన మెరిగినవే. రంగనాథ రామాయణములో ఋశ్యమూకము చేరవచ్చిన రామ లక్ష్మణులతో హనుమంతు డనిన ఈ ద్విపదపంక్తులు బొమ్మలాటలో ఆలపించెడి పంక్తులే.

'ఎగు భుజంబులతోడ నిందు బింబంబు
నగు మొగంబులతోడ నళిన పత్రములఁ
దెగడు కన్నులతోడ దివిజులు మెచ్చి
పొగడు విక్రమ కళాభుజ శక్తితోడ
ఆరుదైన రాజ చిహ్నములతో మీరు
శరచాపహస్తులై చనుదెంచినారు
భూరి తపోవేషములు మీకు నేల?
మీ రెవ్వ? రిచటికి మీరు రానేల?
మీ రెవ్వ? రిచటికి మీరు రానేల?

—కిష్కింధాకాండము - పుట. 203.

ఇట్లే హరికథకుడు సీతాకల్యాణగాథను చెప్పుచు రంగనాథ రామాయణమునందలి ఈ క్రింది ద్విపదపంక్తులను గానముచేసి వివరించుటకూడ తెలుగుదేశమునందు చాలచోట్ల కలదు.

'హరువి చాపము రాము డతి సత్త్వయుక్తి
వెరిగి నేడిదె యెక్కు వెట్టుచున్నారు
ఆదరకు భూదేవి యాత్మలో నీవు
చెదరి చలింపకు శేషాహి నీవు
కదక ధరింపుము కమఠేంద్ర నీవు
కదు నేమరకుడు దిక్కరులార మీరు.'

—బాలకాండము - పుట. 65.

వీనివిబట్టి రంగనాథ రామాయణము జనసామాన్యములో ఎంతటి వ్యాప్తిని పొందినదో స్పష్టమగుచున్నది.

ముద్రితమైన రంగనాథ రామాయణప్రతులలో అధికపాఠములకు అంతు లేదు. ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారు ప్రకటించిన రంగనాథ రామాయణము మొదటి అనుబంధములోని అధికముగానున్న ద్విపదలు అలభ్యమైన అన్నమాచార్యకృత రామాయణమునుండి గ్రహింపబడియుండునని విదుదవోలు వేంకటరావు అభి

ప్రాయపడిరి.[1] రంగనాథ రామాయణమున పరిశిష్టముగ నీయబడిన ద్విపదలలోని పలుకుబడి, భావసంపద, రచనారీతి, వైష్ణవభావన, అవతారప్రశంస మొదలగు అంశములు అన్నమాచార్యుని రామాయణసంబంధి కీర్తనలందు పుష్కలముగా నుండుటచే వీనిలో కొన్నియేని అన్నమాచార్య ద్విపద రామాయణములోని పంక్తులు కాగూడు ననవచ్చునని వేటూరి ఆనందమూర్తిగారూహించినారు.[2]

మునివేషమున పర్ణశాలను సమీపించిన రావణుడు నిజరూపముదాల్చి సీత ముందు నిలిచినవిధము రంగనాథ రామాయణమున చమత్కారముగ ఇట్లు వర్ణింప బడినది.

'....అనవిని రావణుం డాగ్రహోదగ్ర
జనితోగ్ర దృష్టిమై జానకిఁ జూచి
యనుపమాటోపుఁడై యా రూపముడిగి
తన మనోవీథిఁ గందర్పుండు వెలుఁగ
బడియవస్థలు దోఁచి భాసిల్లు పగిదిఁ
బది తలల్ మణిజూట పంక్తులనొప్ప
నా యవస్థలఁ గోర్కులవి యున్మదింపఁ
బాయని గతినొప్ప బాహు లిర్వదియుఁ
గొన లిన్మడింపఁ గోర్కులు పల్లవించె
ననఁ బద్మ రుచులైన హస్తంబులొప్ప
లలి దోఁచు కోర్కి పల్లవములఁ బుష్ప
ములఁబోలు నాయుధంబులు పొల్పుమిగుల
బరఁగ దివ్యాంబరా భరణౌఘ కాంతు
లరుదార మదనాగ్నులై మండుచుండ
నతి భీకరాకారుడై.'

ఈ వర్ణన కట్టా వరదరాజ రామాయణము (అరణ్యకాండము-ద్విపదలు-995-1003) నందు కన్పట్టుచున్నవని నిడుదవోలు వేంకటరావు కట్టా వరదరాజ రామాయణ పీఠికయందు పేర్కొనినారు.

1. వరదరాజ రామాయణ పీఠిక, మొదటి సంపుటము-పుట, 32.
2. అలభ్యమగు అన్నమాచార్య రామాయణము-భారతి-ఏప్రిల్-1963.

తెలుగున ద్విపద రామాయణ విషయమింత వేరు చేయరానివిధముగ కలిసి పోవుటకు దేశమున వానికి గల్గిన ప్రాచుర్యమునే వెల్లడించును.

రంగనాథ రామాయణ ముద్రితప్రతులలో కొన్నిటియందు కొన్ని క్రొత్త ఘట్టములుకూడ లేకపోలేదు. ఉదాహరణమునకు అంజనాదేవి తపఃఫలితముగా వాయుదేవుని వరప్రసాదముతో హనుమంతుడు జన్మించినట్లుగా అన్నిప్రతులలోను ముక్తసరిగా సూచింపబడినది. కాని మర్కటక్రీడనుచూచి మనసుపడిన పార్వతీ పరమేశ్వరులు, తాముకు మర్కటరూపములు ధరించి క్రీడింపగా రూపొందిన తేజమును సేవించిన అంజనాదేవిగర్భములో హనుమంతుడు జనియించినట్లు ఒక ప్రతిలోని కథనమని ఆచార్య తూమాటి దొణప్పగారు 'రంగనాథ రామాయణ వైశిష్ట్యము' అను వ్యాసమున తెల్పియున్నారు. ఇది అవాల్మీకమయినను. ఇట్టి కథా కథనమును గమనించియే కాబోలు పుష్పగిరి తిమ్మన తన సమీరకుమార విజయము (2-114) నందు,

> '....మున్ను వానరరూపమున శివుండు
> దవలీలమొనయు కామినిఁగూడి నిజతేజ
> మూమెకు మోయ శక్యంబుగామి
> భరియింపుమని మహాబలుని యందుంచిన
> ననిలుండు బహుకాలమది ధరించి....'

అని ప్రపంచించియుండును.

ఇట్లు కంబరామాయణమునకు రంగనాథ రామాయణమునకు ప్రచారము నకు సంబంధించిన సామ్యము స్పష్టముగ గోచరించును.

## 27. ఛందస్సుకు సంబంధించిన సామ్యము :

కంబరామాయణము 'విరుత్తమ్' అను ఛందస్సులో రచింపబడినది. ఇది తమిళమున నాయన్మారులు, ఆళ్వారు లనబడు శైవ వైష్ణవాచార్యుల భక్తిగీతము లందు రూపొందినది. జీవక చింతామణి అను తమిళ కావ్యమునందు తొలిసారిగా కావ్యోపయోగిగా స్వీకరింపబడి క్రమముగా వ్యాప్తినందినది. 'విరుత్తమ్' ఛందస్సు సంగీతాత్మకమైన తమిళదేశ ఛందస్సుగా భావింపబడుచున్నది.

పాల్కురికి సోమనాథునికి పూర్వమే తెలుగులో పాటలరూపమున ప్రచార ములోనుండి. అతని కాలముననే కావ్యప్రయోగ యోగ్యతను పొందినట్టి అచ్చమైన

తెలుగు దేశిచ్ఛందస్సగు 'ద్విపద'లో రంగనాథ రామాయణము రచింపబడినది. 'ద్విపదిక' అను ఛందోరీతి సంస్కృతములో నున్నది. సంస్కృతములోని ద్విపదికకు, తెలుగువారి ద్విపదకు శబ్దమాత్ర సాదృశ్యముతప్ప స్వరూప స్వభావములలో శాస్త్రీయమైన సజాతీయ సాదృశ్యమును స్థాపించుట సాధ్యముకాదు. ఒకవేళ కొందరు సంస్కృతమునుండియే ద్విపద తెలుగున నవతరించినదని వాదించినను దానిని తెలుగువారు తమ స్వంతముచేసికొని వింత సొగసులతో వెలయించినారనుట యథార్థము. ద్విపద తెలుగు దేశిచ్ఛందస్సు. తెలుగువారి సొంతయాస్తి. ద్విపద కావ్యమును దిద్దికంతతోను, ఇంకను దేనితో నోపోల్చి ఈసడించినవా రున్నప్పటికిని ద్విపద ఆంధ్ర జానపదుల అభిమానచ్ఛందము. కేవలము జానపదసంపదగా రాణించిన ద్విపదకు సాహిత్యస్థాయిని చేకూర్చిన పాల్కురికి సోమనాథాదులతోపాటు గోన బుద్ధారెడ్డికూడ తెలుగువారికి ప్రాతః స్మరణీయుడు.

వాల్మీకి రామాయణమున 'అనుష్టుప్' ఛందము వాడబడినది. వైదిక వాఙ్మయమునందలి అనుష్టుప్ ఛందస్సులో నాల్గుపాదము లుండును. ప్రతిపాదమునకు ఎనిమిదేసి అక్షరము లుండును, గురులఘునియమము లేదు. కాని ఈ అనుష్టుప్ ఛందస్సును లౌకిక వాఙ్మయమునకు తెచ్చుటలో వాల్మీకి కొంత మార్పును చేసినాడు. లౌకికానుష్టుప్పునందు ప్రథమ, తృతీయ పాదములలో పంచమాక్షరము లఘు, ద్వితీయ, చతుర్థ పాదములలో సప్తమాక్షరములు నియమయుక్తము లగుటచే పాడునపుడు లయకు సరిపడును. వాల్మీకి రామాయణమునందలి అనుష్టుప్పు అక్షరబాహుళ్యము లేక సులువుగా చదువదగినది, అన్వయక్లేశము లేకపోవుటచే సులభముగా అర్థము చేసికొనదగినది. వాల్మీకి రామాయణము 'పాఠ్యేగేయేచ మధురమ్' అయినది. వాల్మీకి తొలుత రచించి పాడించిన రామకథ అనుష్టుప్పులచే కూర్పబడి రంగనాథ రామాయణములోని ద్విపద గాథవలె నుండును.

రంగనాథ రామాయణము పురాణమార్గమున, కథాకథన ప్రధానముగ దేశీయపద బాహుళ్యముగ, సర్వజన సుబోధకముగ రచింపబడి కవిశిల్పమును, పారాయణయోగ్యతను కల్గియున్నది.

ఇట్లు దేశీయచ్ఛందస్సులను స్వీకరించి కావ్యములను రచించుటలో కంబ రామాయణ రంగనాథ రామాయణములకు సామ్యము కన్పట్టును.

## 28. వాల్మీకి రామాయణము - ప్రక్షిప్తములు :

వాల్మీకి రామాయణమునకు భారతదేశములోను, పాశ్చాత్యదేశములందును చాల ప్రతులున్నవి. భారతదేశమునందే దక్షిణాది వాల్మీకి రామాయణప్రతులకును, ఉత్తరదేశ వాల్మీకి రామాయణప్రతులకును సర్గములలోను, మూలపాఠములలోను, కథావిషయములందును చాల వ్యత్యాసములు కన్పట్టుచున్నవి. వాల్మీకి 500 సర్గ లున్నట్లు తెల్పగా, ముద్రిత రామాయణములో 637 సర్గలున్నవి. రామాయణము లోని కొన్ని ఘట్టములను తరువాతివారు చేర్చియుందురని పలువురు విమర్శకులు తెలిపియున్నారు. సి. వై. వైద్యగారు 'ది రిడిల్ ఆఫ్ ది రామాయణ' అను ఆంగ్ల గ్రంథములో వాల్మీకి రామాయణములోని ప్రక్షిప్తములను విపులముగా వివరించి నారు. సురవరం ప్రతాపరెడ్డిగారు 'రామాయణవిశేషములు' అను గ్రంథమునందును, నార్ల వెంకటేశ్వరరావుగారు 'జాబాలి' అను ఏకాంకరూపకమునకు వ్రాసిన విపుల మైన పీఠికలోను వాల్మీకి రామాయణములోని ప్రక్షిప్తములనుగురించి చర్చించి నారు. రామాయణమునుగురించి ప్రత్యేక శ్రద్ధానక్తులతో పరిశోధనలు జరిపిన జర్మన్‌దేశ సంస్కృతపండితుడు డాక్టర్ హెచ్. ఎఫ్. జాకొబి అభిప్రాయము ప్రకారమేకాక సి. వి. వైద్యా, మారిస్ వింటర్ విట్జ్ ప్రభృతుల అభిప్రాయము ప్రకారముకూడ నేడు మనకు లభించుచున్న సంస్కృతరామాయణము వివిధపాఠ ములలో నాల్గింట ఒక వంతుమాత్రము వాల్మీకి చెప్పినది. మిగిలిన మూడు వంతులు తక్కినవారు వేర్వేరు కాలములలో మూలపాఠమునకు జతచేర్చి నట్టిదే.

వాల్మీకి రామాయణ ఇటాలియను ప్రతిలో కాలనేమివృత్తాంతము యుద్ధ కాండమందలి 82-వ సర్గమున కలదని మల్లంపల్లి సోమశేఖరశర్మ అందలి శ్లోక ములను రంగనాథ రామాయణ పీఠిక (పుట 17) యందు పొందుపరచినారు. నేడు మనము అవాల్మీకాంశములుగ పరిగణించు నాగపాశబద్ధులైన రామలక్ష్మణుల కడకు నారదుడు వచ్చుట, ప్రహస్తవధానంతరము రావణునికి శ్రీరామ బలపరాక్రమాదు లను మండోదరి తెలిపి హితబోధచేయుట, కాలనేమివృత్తాంతము, రావణు డొనర్చు హోమమునకు విఘ్నమాచరించుట, అంగదుడు మండోదరిని రావణునియొద్ద కీడ్చు కొనివచ్చుట మొదలగు విషయములన్నియు పశ్చిమోత్తరశాఖీయ వాల్మీకి రామా యణప్రతిలో కలవని కూడ మల్లంపల్లి సోమశేఖరశర్మ తెల్పినారు. కనుక పాఠ ముల విషయములో వాల్మీకి రామాయణప్రతులలోకూడ ఏకవాక్యత కానరాదు. ప్రపంచవ్యాప్తమైన వాల్మీకి రామాయణప్రతులలో కాలక్రమమున అధ్యాత్మ, ఆనంద

రామాయణాదులందలి అనేకాంశములు చేరియుండును. ప్రస్తుతము ప్రచారములో నున్న మూలకావ్యప్రతులలో దేనికి దగ్గరగానున్న ప్రతినిచూచి రంగనాథ, కంబ రామాయణ కర్తలు అనువదించినారో చెప్పుట కష్టము.

## 29. రంగనాథ కంబరామాయణములు - అవాల్మీకములైన కల్పనలు:

కంబరామాయణము వాల్మీకి రామాయణము ననుసరించి రచింపబడినప్పటి కిది మూలవిధేయమైన అనువాదము మాత్రము కాదు. వాల్మీకి రామాయణమునకు భిన్నములైన కల్పనలు కంబరామాయణమునందు కొల్లలు. అట్లే గోన బుద్ధారెడ్డి 'భూమిం గవీంద్రులు బుధులును మెచ్చ రామాయణంబు పురాణమార్గమున', 'ఆది కవీశ్వరుడైన వాల్మీకి యాదరంబున బుణ్యులందరు మెచ్చ జెప్పిన తెలుగున శ్రీరామచరిత మొప్పజెప్పెద'నని చెప్పినను అతని రంగనాథ రామాయణమునందు అవాల్మీకములైన కొన్ని కల్పనలు గోచరించును. ఇట్లు కంబకవి, గోన బుద్ధారెడ్డి ఇరువురును వాల్మీకి రామాయణము ననుసరించినను, కొన్ని సందర్భములలో స్వతంత్రముగా వ్యవహరించి తమతమ కావ్యములందు కొన్ని మార్పుకూర్పులను కావించినారు. కంబమహాకవి రామావతారము శ్రీరామపట్టాభిషేకముతో ముగింపబడినది. గోన బుద్ధారెడ్డి రంగనాథ రామాయణమునందలి కథకూడ యుద్ధకాండముతో ముగింపబడినది.

## 30. బాలకాండము - అవాల్మీకాంశములు:

గోన బుద్ధారెడ్డి వాల్మీకి రామాయణము ననుసరించి రంగనాథ రామాయణ ప్రారంభమున వాల్మీకి నారద సంభాషణమును చేర్చినాడు. నారదుడు చెప్పిన రామకథనే వాల్మీకి తరువాత, విస్తరించి కావ్యముగా రచించినాడు. రంగనాథ రామాయణములో మూలములోవలె మొదట రామాయణకథ సంగ్రహముగా చెప్పబడినది. కంబరామాయణకర్త రామాయణకథను సూటిగా ప్రారంభించినాడు. వాల్మీకి నారద సంభాషణము, సంగ్రహరామాయణకథ కంబరామాయణమునందు కన్పట్టవు.

సరయూనది, కోసలదేశము, అయోధ్యానగరములను కంబకవి చాల విపులముగా వర్ణించినాడు. రంగనాథ రామాయణములో కోసలదేశములోని ప్రజలు విష్ణుభక్తులనిచెప్పి తరువాత దశరథుని ఘనత వర్ణింపబడినది. కంబరామాయణములో

దశరథుడు 60 వేల సంవత్సరములు పరిపాలించినట్లు చెప్పబడినది. రంగనాథ రామాయణములో చాలసంవత్సరములు దశరథుడు అయోధ్యను పరిపాలించినట్లు కలదు.

కంబరామాయణములోని దశరథుడు తన కులగురువగు వసిష్ఠునికి ప్రాముఖ్య మిచ్చి తగినవిధముగ గౌరవించి అతని సలహాప్రకారము నడచుకొనును. వసిష్ఠుడు పుత్రకామేష్టియాగమును చేయుమని దశరథుని ప్రోత్సహించును. సాక్షాత్తు విష్ణువే రాక్షస సంహారనిమిత్తము దశరథపుత్రుడిగా జన్మించునని విష్ణువు, దేవతలకు తెల్పినవిషయమును వసిష్ఠుడు దశరథునికి తెల్పును.

రంగనాథ రామాయణమున మంత్రులతో మొదట తాను అశ్వమేధయాగమును పిదప పుత్రకామేష్టియాగమును చేయదలచినట్లు చెప్పును. వాల్మీకి రామాయణమున పేర్కొనబడిన దశరథుని రెండవ గురువగు వామదేవుని ప్రశంసకూడ రంగనాథ రామాయణమున కప్పట్టదు. రంగనాథ రామాయణములో దశరథుడు పుత్రకామేష్టియాగమును నిర్వర్తించుకొరకుమాత్రమే వసిష్ఠుని కోరినట్లు కలదు. వాల్మీకి రామాయణమున సుమంత్రుడు దశరథునికి ఋశ్యశృంగుని వృత్తాంతమును తెల్పినట్లు కలదు. కంబరామాయణమున వసిష్ఠుడే ఆకథను తెల్పును. రంగనాథ రామాయణమున సూతుడు ఋశ్యశృంగుని సహాయమున యాగము నిర్విఘ్నముగా నెరవేరునని దశరథునికి చెప్పినట్లు కలదు. రంగనాథ రామాయణములో సూతుడే హిరణ్యకశిపుడు రావణునిగా జన్మించినట్లు మానవునివలననే అతనికి మరణము కల్గునని బ్రహ్మ దేవతల కెరిగించినట్లు, విష్ణువు దశరథునికి పుత్రునిగా జన్మించునను దేవరహస్యమును దశరథునికి చెప్పినట్లు కలదు. కంబరామాయణమున వసిష్ఠుడు దశరథునికి గురువు, మిత్రుడు, సలహాదారుడు, మంత్రికూడ. రంగనాథ రామాయణమున వసిష్ఠున కంత ప్రాముఖ్యములేదు.

వాల్మీకి రామాయణమున దశరథ పత్నులు ముప్వురు. వారు రామ, భరత, లక్ష్మణ, శత్రుఘ్నులను గనిన మాతృమూర్తులు. వాల్మీకి రామాయణము కొన్ని ప్రతులలో అయోధ్యాకాండలోని 34 వ సర్గప్రకారము దశరథుని భార్యలు 350 మంది. వారి ప్రసక్తి అందు ప్రథమముగా పుత్రకామేష్టికై దశరథు డాయత్తపడు సందర్భమునమాత్రము వచ్చును. రంగనాథ రామాయణకర్త దశరథునకు వందల సంఖ్యలో భార్యలున్నట్లు తెల్పినాడు. 'అన్నరనాథు కులాంగనామణులు మున్నూట యేబండ్రు ముఖ్యులై యందు' కౌసల్య, కైక, సుమిత్రలు పట్టపు దేవేరులని

పేర్కొనెను. ఆనంద రామాయణమున దశరథునకు ఏడువందలమంది భార్య లున్నట్లు చెప్పబడినది. ఇట్లు రాజపత్ను లధికసంఖ్యలో పేర్కొనబడుటయేకాక వారిప్రసక్తి కావ్యారంభమున దశరథుని వర్ణించుసందర్భమునవనే చేసినాడు. రంగనాథ రామాయణమునకు తరువాత తెలుగులో వెలసిన రామాభ్యుదయాది కావ్యము లందును దశరథునికి మున్నూట ఏబదిమంది పత్నులు కలరనియే కవులు పేర్కొనుట జరిగినది.

యజ్ఞగుండమునుంచి ఉద్భవించిన యజ్ఞపురుషుడు పాయసభాండమును దశరథున కిచ్చినట్లు వాల్మీకి రామాయణమునందును, రంగనాథ రామాయణమునందును కలదు. కంబరామాయణములో హోమగుండములోనుంచి ఒక భూతము జన్మించి అమృతపిండము గల ఒకపాత్రను దశరథున కిచ్చినట్లు తెల్పబడినది.

రాముడు 'బుధవాసరము' నందు జన్మించినట్లు రంగనాథ రామాయణమున కలదు. భాస్కర రామాయణమునందును, యథావాల్మీకమని చెప్పదగిన కట్టా వరద రాజ రామాయణమునందును ఈవిధముగనే చెప్పబడినది. కాని మొల్ల రామాయణము (1-45) నందుమాత్రము రాముడు ఆదివారము జన్మించినట్లు కలదు. కంబ కవి తన రామావతారములో ఈ విషయమునుగురించి చెప్పలేదు. రామునికి నామ కరణము పదమూడవరోజున జరిగినట్లు కంబరామాయణమునందును, పదకొండవ రోజున జరిగినట్లు రంగనాథ రామాయణమునను తెల్పబడినది.

రాముని బాల్యవృత్తాంతమునుగురించి కంబరామాయణములో నేమియు చెప్పలేదు. రంగనాథ రామాయణమునందు బాలకాండమున రాముని బాల్యక్రీడలు వర్ణింపబడినవి. బాల్యమున 'మాయావినోదముల్మరగి, యాడుచుండిన రాముడు ఒకనాడు క్రీడాకందుకముతో చెలరేగి యాడుచున్నసమయమున కైక పరిచారిక యగు మంథర యరుదెంచి 'చిట్టంటుచేతలఁ జెండు' దట్టెను. అలిగిన రాముడు కాష్ఠముతో నడచగా మంథరకాలు విరిగెనట. రంగనాథ రామాయణమున అయోధ్యా కాండమున 'రాముడు బాల్యంబునందుఁ దనకాలు విఱిచిన తప్పు సాధింపవిది నాకుఁ దఱి' అని మంథరకు రామునిపై గల వైరమునకు కారణము చెప్పబడినది. ఇట్లు రాముడు బాల్యచాపల్యముచే నొనర్చిన స్వల్పాపరాధము భవిష్యత్తున అతని కఠోరజీవనమునకు గురి కావించినది. భాస్కర రామాయణమునందుకూడ 'తొల్లి కౌసల్యాతనయు చేతం దనకున్నైన చరణతాడనభంగంబు' అని మంథర రామునిపై గల వైరమునకు కారణము తెల్పబడినది. కంబరామాయణము బాలకాండమునందు

లేకున్నను అయోధ్యాకాండమునందు. రాముడు బాల్యమునందు మంటిముద్దలతో మంథర గూనిపీపు లదరగొట్టినందువలననే అతనిపై వైరభావము పూనినట్లు చెప్ప బడినది.

అధ్యాత్మ రామాయణమున రాముడు భాగవతమునందలి బాలకృష్ణునివలె పాలు పెరుగు త్రావుచు కౌసల్యను విసిగించెనని రాముని బాల్యక్రీడలను ఆసక్తి కరముగ వర్ణింపబడినవి.

## 31 అహల్యా వృత్తాంతము :

అహల్యావృత్తాంతమునకు ముందు దుర్వాసుడు ఇంద్రుని సర్వసంపదలు సముద్రములో కలియునట్లు శపించినట్లు కంబరామాయణమునందు కలదు. ఇది ఇంద్రుని నడవడికను విరూపించు ఘట్టము. సముద్రమథనవృత్తాంతము వర్ణింప బడినను దుర్వాస శాపవృత్తాంతముమాత్రము రంగనాథ రామాయణమునందు లేదు.

గౌతమాశ్రమ వృత్తాంతమున. గౌతమమునిని అహల్యనుండి వేరు చేయు టకు, గౌతముని తపోవిఘ్నమొనరించు నుద్దేశముతో ఇంద్రుడు కుక్కుటవేష ధారియై కొక్కొరోకోయని కూసినట్లు రంగనాథ రామాయణమున కలదు. ఇది వాల్మీకి రామాయణమునందు కాని, అధ్యాత్మ రామాయణమునందు కాని, కంబ రామాయణమునందు కాని కానరాదు. ఇంద్రుడు పిల్లిరూపమునొంది గౌతమాశ్రమ మున దాగియున్నట్లు పద్మపురాణ సృష్టిఖంతమున చెప్పబడినది. పరదారావంగ మమువలని హానిని విరూపించుటకు, దేవతారాధనమువలనను, మహాత్మ సాంగ త్యమువలనను కల్గు శుభముల నెరిగించుటకును పద్మపురాణ సృష్టిఖండమున అహల్యావృత్తాంతము చెప్పబడినది.

వాల్మీకి రామాయణమున కేవలము వాయువును భక్షించి నిరాహారయై సర్వ భూతములకు అదృశ్యయై బూడిదపోగులలో పెద్దకాలము ఆ ఆశ్రమముననే పడి యుండుమని గౌతముడు అహల్యను శపించినట్లు కలదు. అహల్య శిలాకృతి దాల్చినట్లు కంబరామాయణమునందును, రంగనాథ రామాయణమునందును కలదు. రంగనాథ రామాయణకర్త ననుసరించియే కాబోలు భాస్కర రామాయణకర్తకూడ అహల్య రాయిగా శపింపబడినట్లు తెల్పినాడు. గౌతముడు అహల్యను శిలాకృతి ధరించునట్లు శపించువిషయము అధ్యాత్మ రామాయణమునందును పద్మపురాణోత్తర ఖండమునందలి రామకథలోని అహల్యావృత్తాంతమునను కలదు. అధ్యాత్మ రామా

యజ్ఞానుసారిగనే తెలుగు రామాయణములు ఈ విషయమునుగ్రహించి వర్ణించి నట్లు తలంపవచ్చును. కాని పద్మపురాణ సృష్టిఖండమునందుమాత్రము అహల్యను మాంసనఖములులేని కళేబరమువలె శల్యపంజరాకృతిలో నుండునట్లు శపింపబడిన దని చెప్పబడినది. అహల్య శిలాకృతి దాల్చినట్లు వర్ణించుఘట్టము ఆనంద రామాయ ణమునందును కలదు. ఇది శ్రీరాముని మాహాత్మ్యమును, పతితపావనత్వమును వెల్లడించుఘట్టము.

అహల్యను మోసగించి, ఇంద్రుడు ఆమెతో క్రీడించినాడని, తెలియకనే పాపముచేసిన ఆమెపై కినిసి శిలగా పడియుండుమని గౌతముడు శపించినట్లు బహు జనాభిప్రాయము. ఇంద్రుడు గౌతమవేషమున అహల్యను మోసగించెనని పద్మ పురాణ సృష్టిఖండమున పేర్కొనబడినది. కాని, సంస్కృత రామాయణకథనము ప్రకారము ఇంద్రుడు తన భర్తవేషములో వచ్చినట్లు గ్రహించుటకు అహల్యకు ఒక క్షణమైనను పట్టలేదు. అయినను పాడుబుద్ధివలన సురాధిపతికి ఆమె లోబడి నది, అంతేకాదు, స్వర్గాధిపతితో తనకు పొందు లభించుట తన అదృష్టవిశేషమని భావించినది. 'నా జన్మపావనమైనది; మనకు ప్రమాదమురాకుండా నా భర్త తిరిగి రాకముందే మీరు చల్లగా తప్పుకొనండి' అని ఇంద్రుని ఆమె హెచ్చరించినది. కాని, ఇంతలోనే తిరిగివచ్చిన గౌతముడు కుపితుడై, ముందు సురాధిపతిని తరు వాత అహల్యను శపించినట్లు తెల్పబడినది. ఈ పట్టున రంగనాథ రామాయణమున మూలములో నున్నట్లుగానే అహల్య బుద్ధిపూర్వకముగనే ఇంద్రుని కాంక్షించి అతనితో క్రీడించినట్లు తెలుపబడినది. గౌతముడు ఆశ్రమమునకు తిరిగివచ్చినపుడు ఇంద్రుడు స్వస్వరూపముతోడనే బయటికి వెడలినట్లు రంగనాథ రామాయణమున కలదు. అహల్యతో తన అక్రమచర్య నెరవేరినతరువాత ఇంద్రుడు పిల్లిరూపమున గౌతమాశ్రమమును వీడినట్లు కంబరామాయణమున చెప్పబడినది.

కంబరామాయణమునందలి అహల్య సాధుశీల. ఆమెకు సురపతిమీద ఎట్టి వ్యామోహమును లేదు. ఆమెయెడ మోహముగొనిన స్వర్లోకాధిపతి గౌతమవేష మునవచ్చి ఆమెను మోసగించినాడు. కంబరామాయణకర్త ఈ అంశమును పద్మ పురాణ సృష్టిఖండమునుండి గ్రహించి వర్ణించియుండును. శీలవతియగు అహల్య తనకు జరిగిన మోసమును శంకించినంతనే మూర్ఛాగతురాలయినది. ఈలోగా అచటికి చేరుకొనిన గౌతముడు ఆమెను కఠిన పాషాణముగునట్లు శపించినాడు. అహల్య శాపవిమోచనఘట్టములో మనస్సు నిర్మలముగానున్నపుడు పాపకార్యము

జరిగినను దానిమూలమున వారి కెట్టిదోషమును అంటదని, విశ్వామిత్రుడు రాము నితో చెప్పి అహల్య నిర్దోషిత్వమును స్థాపించును. పాతివ్రత్యభావమునెడ విశేష గౌరవాదరములు కలిగిన కంబమహాకవి, సంగకాలసాహిత్యానుగుణముగ వాల్మీకి రామాయణములోని అహల్యా పాత్రచిత్రణములో కానవచ్చు దోషమును పరిహ రించుటకు ప్రయత్నించెను.

అహల్య నిర్దోషి, పతివ్రతయని శ్రీ కృష్ణ రామాయణమునందు చెప్పబడి నది. ఇందు ఇంద్రుడు అహల్యను కామించి పొంచియుండి చేసినది. కరస్పర్శ మాత్రమే. దానినిచూచియే గౌతముడు అహల్యా సంక్రందనులను శపించినట్లు శ్రీ కృష్ణ రామాయణమున వర్ణింపబడినది.

నీచమైన, వికృష్టమైన, నింద్యమైన ఇంద్రుని ప్రవర్తనకు కినిసి గౌతముడు అతనిని 'అముష్కుండ' వగుమని శపించినట్లు రంగనాథ రామాయణమున కలదు. గౌతముని శాపమువలన ఇంద్రుని మర్మాంగము, విత్తులు వీడిపోవగా, దేవతలు పితృదేవతలనువేడి 'మేషవృషణములను' ఇంద్రునికి సంధించినట్లు రంగనాథ రామాయణమున తెలుపబడినది. కంబరామాయణములో గౌతముడు ఇంద్రుని శరీ రమునందు సహస్రయోనులగునట్లు శపించెనని తెల్పబడినది. బ్రహ్మాదిదేవతల కోర్కెచే ఇతరులకు సహస్రాక్షులుగ కన్పడునట్లు గౌతముడు మార్చినాడట. కంబ రామాయణము ఈ విషయమున పద్మపురాణము ననుసరించినట్లు కన్పట్టును. గౌతము డింద్రుని అక్రమచర్య కాగ్రహించి అతని శరీరము సహస్రయోని సంక్రాంతమగునట్లు పద్మపురాణ సృష్టిఖండమున కలదు. తరువాత ఇంద్రుడు ఒక చెరువున కొన్నివత్సరములు సిగ్గుతో దాగియుండి ఇంద్రాక్షీదేవిని ధ్యానింపగా ఆమె ప్రత్యక్షమై అతని మేనియందున్న సహస్రయోనులు సహస్రాక్షులగునట్లు, మేషముష్కము లండములగునట్లును అనుగ్రహించినట్లు పద్మపురాణ సృష్టిఖండ మున తెలుపబడినది.

సంస్కృత రామాయణములో అహల్య గౌతమాశ్రమమున రాయిగానో, రప్పగానో కాక రమణిగానే మిగిలినట్లు చెప్పబడినది. రామలక్ష్మణులు చూచి నపుడు ఆమె 'మోహినీదేవత' యనునట్లు ప్రభాసించినదట. అది ఆమె తపోబల మని వాల్మీకి రామాయణమున కలదు. ఆమె నెరపినట్టిది ప్రేమతపస్సే కావచ్చు. ఇంద్రుడు తనకు చవి చూపించిన స్వర్గసుఖ సంస్మరణరూపములో అది కొనసాగి యుండవచ్చును. ఆ మోహినీదేవత సౌందర్యప్రలోభమువలననే కాబోలు రాముని

రాకతో లేచిపోని పట్టింపులకు పోకుండ గౌతముడు హిమాలయమునుండి వాయు వేగ మనోవేగములతో బయలుదేరి తన ఆశ్రమమునకు తిరిగివచ్చి అహల్యతో తిరిగి సుఖముగా కాపురము చేసినాడు. రంగనాథ రామాయణమున, రామపాదస్పర్శచే శిలారూపముననున్న అహల్య పూర్వరూపము దాల్చగనే హిమాలయములందు తపస్సు చేసికొను గౌతము డచటకువచ్చి రాముని సేవించి తన భార్యయగు అహల్యను స్వీకరించినట్లు తెల్పబడినది. ఇది కొంతవరకు మూలానుసారముగానే యున్నది. కంబరామాయణములో శిలారూపముననున్న అహల్య రామపాదస్పర్శచే పూర్వరూపమును పొందినపుడు, గౌతముడు అహల్యను వేశ్యగా నిందించినదానికి బాధపడవలదని, జరిగినదంతయు మరచిపొమ్మని రాముడు ఆమెను ఓదార్చినట్లు కలదు. విశ్వామిత్ర లక్ష్మణులతోకలసి రాముడు గౌతము డుండుచోటికివెళ్ళి అహల్య తనకు తెలిసి ఏ పాపము చేయలేదని, ఆమెను భార్యగా స్వీకరింపుమని గౌతముని కోరినట్లు కంబరామాయణములో కలదు.

## 32. సీతారాముల పూర్వరాగ వృత్తాంతము :

సీతా స్వయంవరార్థము రాముడు మిథిలానగర రాజవీథిలో విశ్వామిత్ర, లక్ష్మణులతో నేగుచుండగ, సీతా రాము లిరువురు ఒండొరులను సందర్శించుకొని పరస్పర ప్రణయభావముల నందిరని, అనంతరము వారి అనంగదశావర్ణనమును కంబకవి తన రామాయణములో విపులముగ వర్ణించినాడు. ఈ సందర్భమున కంబ కవి సీతా రాములను లక్ష్మీనారాయణులుగ భావించి వర్ణించినాడు. తరువాత శివ ధనుర్భంగసందర్భమునకూడ, సీత తాను ప్రేమించిన రాముడు శివధనుర్భంగము చేసి తన్ను చేపట్టవలెనని, ఆవిధముగా జరుగకపోయినట్లయితే ప్రాణత్యాగము చేయవలెనని నిర్ణయించుకొన్నట్లు కంబకవి తెల్పినాడు. కంబరామాయణములోని ఈ ఘట్టమునుబట్టి సీతారాములు పరస్పరము ప్రేమించుకొని పరిణయమాడవలెనని నిర్ణయించుకొనిన యుక్తవయస్కులని గ్రహింపవచ్చును.

సీతారాముల ఈ పూర్వరాగవృత్తాంతము వాల్మీకి రామాయణమునందు కాని, రంగనాథ రామాయణమునందు కాని లేదు. భాసుని యజ్ఞఫలనాటకములో షష్ఠాంక మున సీతారాములు మిథిలానగరోద్యానవనమున పరస్పరవీక్షణమున విరహాతప్తు లగుట వర్ణింపబడినది. ఆనంద రామాయణములో, రాముడే తన పతియైనచో పదునాల్గువర్షములు వనవాస మొనరింతునని సీతాదేవి దేవతలను ప్రార్థించినట్లు కలదు.

వివాహమునకు ముందు సీతారాముల పూర్వప్రణయవృత్తాంతమును కంబ కవి, తమిళములో సంగయుగమునందు వెలసిన సాహిత్యమునందు వర్ణింపబడు పూర్వరాగ సంప్రదాయగుణముగనే వర్ణించినట్లు టి. పి. మీనాక్షిసుందరం మొద లగు తమిళవిద్వాంసులు తెల్పినారు. వివాహాత్పూర్వమే జరిగిన ఈ పూర్వరాగ వృత్తాంతము సీతారాములకుతప్ప అన్యులకు తెలియదు. అందువలననే రాముడు హనుమంతునిద్వారా సీతకు సందేశము పంపునపు డామె తనను గుర్తించుట కాన వాలుగా ఈ విషయమును తెలుపుమని హనుమంతుని కోరినట్లు కంబరామాయణ మున కలదు.

సీతారాముల పూర్వరాగవృత్తాంతము తులసీదాసు రామచరితమానసము నందును కలదు అయితే రాముడు సీతను లీలోద్యానమునందు కలిసికొన్నట్లు తులసీదాసు రామాయణమునందు కలదు.

తెలుగులో శ్రీ కృష్ణ రామాయణమునందు లీలోద్యానవనమున సీతారాములు పరస్పరము సందర్శించుకొని విరహాతురులైనట్లు వర్ణింపబడినది.

సీతారాముల వివాహనిశ్చయ సందర్భమునందు వారి పరస్పరావలోకనము విమలసూరి రచితమైన ప్రాకృతకావ్యమగు 'పౌమచరియమ్' అను గ్రంథము నందలి జైనరామాయణమునందు తెల్పబడినది. పౌమచరియములోని కథాభాగము ననుసరించియే పద్మపురాణమునందును ఈ విషయము పేర్కొనబడినది. కంబకవి పద్మపురాణము ననుసరించి ఈ విషయమును తన రామాయణములో వర్ణించి యుండును.

దశరథుని మిథిలాప్రయాణమును వాల్మీకి ఒకటి, రెండు శ్లోకములలో వర్ణింపగా కంబకవి నాల్గు పటలములలో సుమారు 300 పద్యములలో విపులముగా వర్ణించినాడు. వివాహసందర్భమున రాముడు సీతతోపాటు ముందు కైకకు, తరు వాత కౌసల్యకు అటుపిమ్మట సుమిత్రకు నమస్కరించినట్లు కంబరామాయణమున కలదు. దీనినిబట్టి రామునికి తన తల్లియగు కౌసల్యయందుకంటె కైకయందే మక్కువ ఎక్కువయని తెలియుచున్నది. కౌసల్యాది రాజస్త్రీలు సీతారాముల వివా హమునందు పాల్గొనినట్లు రంగనాథ రామాయణకర్త వర్ణింపలేదు.

రాముడు వివాహమునకుపూర్వము సీతను ప్రేమించినను సీతారాముల వివాహముమాత్రము వైదికముగనే జరిగినట్లు కంబకవి వర్ణించినాడు. రంగనాథ

రామాయణములో గోన బుద్ధారెడ్డి మూలములో లేకున్నను సీతారాముల పాణి గ్రహణసందర్భమున వారి పరస్పర శృంగారావలోకనములను దేశీయానుగుణముగ మనోజ్ఞముగ వర్ణించినాడు. యథావాల్మీకముగ రచింపబడిన కట్టా వరదరాజ రామాయణములోకూడ రంగనాథ రామాయణమునందువలె దేశీయాచారములతో సీతారాముల వివాహము వర్ణింపబడుట గమనింపవచ్చును. మంగళసూత్రధారణ ప్రశంస వరదరాజ రామాయణమునందు కలదు.

భరత శత్రుఘ్నులు విద్యలు నేర్చుకొనుటకై మేనమామగృహమున కరిగి నట్లు వాల్మీకి రామాయణమునందును, రంగనాథ రామాయణమునందును కలదు. కొన్నాళ్ళకు భరతుడు దశరథుని చూడ కోర్కెతో లేఖను పంపినట్లుకూడ రంగ నాథ రామాయణమునందు కలదు. ఈ విషయములు కంబరామాయణమునందు కన్పట్టవు.

## 33. అయోధ్యాకాండము - అవాల్మీకములైన కల్పనలు:

వాల్మీకి రామాయణములో మంథర పాపదర్శిని అనిమాత్రమే తెల్పబడినది. కాని రంగనాథ, భాస్కర రామాయణములందు మంథర రామునిపై వైరము పూనుటకు కారణము చెప్పబడినది. కంబరామాయణములోకూడ మంథర రాము నిపై పగబూనుటకు కారణము తెల్పబడినది. రంగనాథ రామాయణమున బాల్య ములో రాముడు మంథర కాలు విరిచినట్లు చెప్పబడగా కంబరామాయణమున రాముడు మంటిఉండలతో మంథర గూని వీపు అదరగొట్టినట్లు తెల్పబడినది.

రాముడు తన తండ్రియగు దశరథుని దర్శింపకనే వనముల కరిగినట్లు కంబరామాయణమున తెల్పబడినది. రాముడు కైకపై కోప మేమాత్రమును ప్రద ర్శింపక సంతోషముతో కైకకు నమస్కరించి తన తండ్రిని సరిగా చూచుకొమ్మని తల్లులనుకోరి కానల కరిగినట్లు కంబరామాయణమున వర్ణింపబడినది. రాముడు వనవాసమున కేగుటకుముందు దశరథుని కలిసికొని అతని ఓదార్చినట్లు వాల్మీకి రామాయణమునందు, రంగనాథ రామాయణమునందు చెప్పబడినది. సంస్కృత మహాభారతమునందలి సంగ్రహ రామోపాఖ్యానము (అధ్యాయము 273 నుండి 293 అధ్యాయమువరకు) నందు దశరథుని దర్శింపకనే రాముడు అడవుల కేగి నట్లు వర్ణింపబడినది. దీని ననుసరించియే కంబరామాయణకర్త తన రామాయణము నందు రాముడు దశరథుని దర్శింపకనే వనవాసమున కేగినట్లు వర్ణించియుండును.

రంగనాథ రామాయణమున దశరథుడు కైకను ఆక్రోశించినాడు. తాను పొరపాటున ఒక మునిబాలకుని చంపినట్లును, అందులకా బాలునితండ్రి పుత్ర శోకముచే మరణము ప్రాప్తించునని తనకు శాపమిచ్చినట్లును, దశరథుడు కౌసల్యతో రామప్రవాసానంతరము తెల్పును. ఈ కథ వాల్మీకి రామాయణమునందు కూడ కలదు. వాల్మీకి రామాయణములో ముని బాలకుని పేరు లేదు. రంగనాథ రామాయణమున అతనిపేరు యజ్ఞదత్తుడు. కాని కంబరామాయణములో సురోచనుడని కలదు. కంబరామాయణములో బ్రాహ్మణ బాలకుడని చెప్పబడినది. వాల్మీకి రామాయణమునందును, రంగనాథ రామాయణమునందును వైశ్యునికి శూద్ర వనిత యందు పుట్టిన బాలుడని చెప్పబడినది. దశరథ శాపవృత్తాంతమున, వాల్మీకి రామాయణమున మునులు ఆశ్రమమందుండినట్లు చెప్పబడినది. రంగనాథ రామాయణమున వృక్షకోటరమునందు ఒక కావడియందుంచి మునిబాలకుడు దాచియుండెనని చెప్పబడినది. వాల్మీకి రామాయణమున మహర్షి శోకమును వర్ణింపగా రంగనాథ రామాయణమున మునిపత్ని శోకముమాత్రము వివరింపబడినది. శ్రీ కృష్ణ రామాయణములో దశరథుని వివాహానంతరమే వేట, అతనికి మునిశాపము జరిగినట్లు తెల్పబడినది.

కంబరామాయణములో దశరథు శాపవృత్తాంతకథ సీతా రామ లక్ష్మణులు అయోధ్యను వదలుటకు చాలకాలమునకుముందే చెప్పబడినది. వాల్మీకి రామాయణ మునందును రంగనాథ రామాయణమునందును దశరథుడు ఈ కథను చెప్పి మరణించినట్లు కలదు. రంగనాథ రామాయణమునందు దశరథుడు, రాముడు అడవులకు వెళ్ళెనను వార్తను విన్నంతనే మరణించును. కాని కంబరామాయణములో మాత్రము రాముడు అడవులకు చేరెనను వార్తను విన్నతరువాతనే దశరథుడు మరణించినట్లున్నది.

కాకాసురవృత్తాంతము రంగనాథ, భాస్కర రామాయణములందు రెండు చోట్ల కలదు. అయోధ్యాకాండములో సీతారాములు చిత్రకూటపర్వతమున విహరించుచున్నపుడును మరల సుందరకాండమున సీత హనుమంతునిద్వారా రామునికి పంపిన సందేశమునందును జరిగినట్లు ఈ రెండు గ్రంథములందును కలదు. వాల్మీకి రామాయణమునందును, కంబరామాయణమునందును సుందరకాండము నందే కాకాసురవృత్తాంతము చెప్పబడినది. వాల్మీకి రామాయణమునందు, కంబ రామాయణమునందు ఇంద్రునికుమారుడగు జయంతుడు కాకాసురునిరూపమున

సీతను అభిగమించినట్లు చెప్పబడినది. రంగనాథ రామాయణమునందు సీత చనుగవ నడు చక్కిపంచున పొడిచిన కాకి కేవలము దుష్టకాకముగానే చెప్పబడినది. తులసీదాసు రామాయణమున కాకాసురవృత్తాంతము అరణ్యకాండారంభమున చెప్పబడినది. అధ్యాత్మ రామాయణమునందువలె ఇందును ఆమిషబుద్ధిచే కాకము సీత చరణాంగుష్ఠమును చంచువుతో విదారించినట్లు తెల్పబడినది. పద్మపురాణ, ఆనంద రామాయణములందు కాకాసురవృత్తాంతము అయోధ్యాకాండముననే వర్ణింపబడినది.

దశరథున కౌర్ధ్వదైహికములను వసిష్ఠుని ఆదేశముచే భరతుడు చేసినట్లు రంగనాథ రామాయణమున కలదు. దశరథుడు, మరణించుటకుముందు తన కౌర్ధ్వదైహికములను కైక పుత్రుడగుటచే భరతుడు చేయరాదని ఆదేశించియుండుటచే వసిష్ఠుడు శత్రుఘ్నునిచే చేయించినట్లు కంబరామాయణకర్త తన రామాయణమునందు తెల్పినాడు.

వాల్మీకి రామాయణమునందు గుహుండు రాముని మిత్రుడుగ వర్ణింపబడెను. రంగనాథ రామాయణమున శృంగిబేరమందలి ఒక చెంచురాజుగ, రాముని గంగానదిని దాటించుటకు తోడ్పడిన రామభక్తుడుగ గుహుండు చిత్రింపబడినాడు. రంగనాథ రామాయణములో గుహుని ప్రవర్తననుబట్టి అత డంతకుమునుపే రాముని యెఱిగియుండెనని ఊహింపవచ్చును. కంబరామాయణములోని గుహుండు వేయి పడవలున్న నావిక నాయకుడు. ఇందు గుహుండు రాముని సముచితరీతిని సత్కరించును. రాముడు గుహుని తన సహోదరులలో నొకనిగా భావించినట్లు కంబరామాయణకర్త తెల్పినాడు. రంగనాథ రామాయణములో రాముడు గుహునికి స్వవృత్తాంతమును తెలిపినట్లు కలదు. కంబరామాయణమున గుహుండు లక్ష్మణుని వలన రామవృత్తాంతమును విన్నట్లు చెప్పబడినది.

తల్లి తనకై సంపాదించిన రాజ్యమును భరతుడు చేజేతుల వదలుకొనినాడు. అయోధ్యకు తిరిగివచ్చి పట్టము కట్టుకొనవలసినదిగా అన్నను కోరుటకు భరతుడు చిత్రకూటమునకు వెళ్ళును భరతుని స్వభావమును గుహుండు అపార్థము చేసుకొనినట్లు రంగనాథ రామాయణము, కంబరామాయణమునందు తెల్పబడినది. రంగనాథ రామాయణమునందలి గుహుండు భరతుని ఎదుర్కొనుటకు సన్నద్ధుడగును. కంబరామాయణమునందలి గుహుండు ముందు తనవారిని పంపి, భరతుని ఉద్దేశమును గ్రహించును. సుమంత్రునివలన గుహుని గొప్పతనమును విని భరతుడే స్వయ

ముగా గుహుని కలిసికొనినట్లు కంబరామాయణమున కలదు. భరతునివలన విషయ మును తెలిసికొని, అతని సౌజన్యమును గుర్తించి భరతునికి వేయిమంది రాము లైనను సాటిరారని గుహుండు కీర్తించును. ఈ సన్నివేశము రంగనాథ రామాయ ణమునందుకంటె కంబరామాయణమునందే మూలమునకు సన్నిహితముగా నున్నది.

భరతుడు, తన తల్లిచేసిన తప్పుకు తన్ను మన్నించమని కన్నీటితో రాముని వేడికొనెను. కాని అతనిమాటను రాముడు త్రోసిపుచ్చినాడు. రాముని పాదుకలకే పట్టాభిషేకముచేసి నందిగ్రామములో ప్రవాసిగా, ప్రమోదరహితముగా కాలము గడుపుచు వాని ప్రతినిధిగా తాను పరిపాలన సాగించినాడు. రాముని పాదుకలను భరతుడు నెత్తిన పెట్టుకొనివచ్చినట్లు కంబరామాయణమున కలదు. రామపాదుకలను శత్రుంజయమను రాజపినుగుపై పెట్టుకొని వచ్చినట్లు వాల్మీకి రామాయణమునందు, రంగనాథ రామాయణమునందును తెల్పబడినవి.

సీతారాములు తృణశయ్యపై పరుండి నిద్రించుచుండగా లక్ష్మణుడు పదు నాలుగేడుల వనవాసము ముగియువరకు నిదురపోవక యుండవలయునను నియ మము పూని దూరముగనిలిచి వారిని కనిపెట్టి కాపాడుచుండును. అంత నిద్రాదేవి లక్ష్మణుని సమీపించి విశానమయమున నిద్రింపవలెనను విధివిధానమునే ధిక్క రించితివి కనుక, నిన్ను విడుచుమార్గమును చెప్పుమనెను. ఈ పదునాలుగేండ్లు ముగియువరకు తనకు మారుగ తనభార్యయగు ఊర్మిళను ఆవేశించినచో తా నరుదెంచి పిమ్మట నిద్రను స్వీకరింతునని లక్ష్మణుడు నిద్రాదేవితో నియమ మొనర్చుకొనెను. ఈ సన్నివేశము వాల్మీకి రామాయణమునందు లేదు. కంబరామాయణములో లక్ష్మ ణుడు నిద్రాదేవిని పదునాలుగేండ్లతరువాత వనవాసము ముగిసినతరువాత తన్నుని ఆజ్ఞాపించినట్లు కలదు. ఊర్మిళాదేవి ప్రసక్తి కంబరామాయణమున లేదు. రంగనాథ రామాయణమునందలి ఈ అంశము లక్ష్మణుని శీలౌన్నత్యమును ద్విగుణీకృతము గావించును. లక్ష్మణుని భాతృభక్తిని, సేవాపరాయణత్వమును, కరుణోద్వేగముగ చిత్రించు ఈ కల్పనము 'ఊర్మిళాదేవి నిద్ర' యను జానపదగేయమునకూడ కలదు,

## 34. అరణ్యకాండము - అవాల్మీకాంశములు :

రాముడు అత్రిమహామునిని సందర్శించుటతో అరణ్యకాండము ప్రారంభ మయినట్లు రంగనాథ, కంబరామాయణములు రెండింటియందును కలదు. సీతాదేవి

తన వివాహమునుగురించి అనసూయతో ముచ్చటించుచు, దశరథుని అనుమతి తోడనే రామునితో తన వివాహనిశ్చయమైనట్లు తెల్పును. ఈ విషయము వాల్మీకి రామాయణమునందు కలదు. రంగనాథ, కంబరామాయణములు ఈ సంగతిని పేర్కొనలేదు.

అగస్త్యుడు తమిళభాషాపండితుడని కంబరామాయణమున పేర్కొనబడి నది. రంగనాథ రామాయణము ఈ విషయమును చెప్పలేదు. అగస్త్యుడు రామునికి వైష్ణవాస్త్రము నిచ్చినట్లు కంబరామాయణమున చెప్పగా, దివ్యాస్త్రము లిచ్చినట్లు రంగనాథ రామాయణమున చెప్పబడినది. అగస్త్యాశ్రమమునుండి పంచవటికి పోవుచు సీతారామలక్ష్మణులు జటాయువుతో సంభాషించువిషయము రంగనాథ కంబరామాయణములందు కలదు. జటాయువు దశరథుని మిత్రుడగుటచే జటా యువునకు అంత్యక్రియలను రాముడు చేసినట్లు కంబరామాయణమున చెప్పబడినది. ఈ అంత్యక్రియలసంగతి రంగనాథ రామాయణమున లేదు.

పంచవటి కేతెంచిన శూర్పణఖ యాదృచ్ఛికముగనే రామలక్ష్మణులను గాంచినట్లు వాల్మీకి తన రామాయణమున పేర్కొనెను.

రంగనాథ రామాయణమునందలి జంబుకుమారవృత్తాంతమువలన శూర్ప ణఖ దండకారణ్యప్రవేశము సోపపత్తిక మగుచున్నది. అరణ్యములో ఒకనాడు లక్ష్మణుడు ఆకాశములో ఆధారరహితముగ వ్రేలాడుచుండు ఖడ్గమును గాంచును. జంబుకుమారుని తపస్సునకుమెచ్చి సూర్యు డతనికి పంపిన ఖడ్గమది. సూర్యుడు ప్రత్యక్షము కానందువలన జంబుకుమారుడు దానిని పరిగ్రహింపలేదు. లక్ష్మణు డా ఖడ్గమును గ్రహించి అందుండు దట్టమైన వెదురుపొదలను నరుకుచుండగా, పొదలమాటున తపోదీక్షలోనున్న జంబుకుమారుడు మరణించును. అసంకల్పిత ముగ బ్రహ్మహత్యాపాప మొనగూడెనని లక్ష్మణుడు బాధపడుచుండగా అక్కడి మును లతనిని ఓదార్చి జంబుకుమారుని జన్మవృత్తాంతమును తెల్పుదురు.

జంబుకుమారుడు శూర్పణఖా విద్యుజ్జిహ్వుల కుమారుడు. రావణు డొకసారి దిగ్విజయయాత్రకు వెడలుచు, తన సోదరియైన శూర్పణఖ భర్తయగు విద్యుజ్జిహ్వు నకు తాత్కాలికముగా లంకాధిపత్యము నొసగెను. విద్యుజ్జిహ్వుడు దురాశాపరుడై లంకను శాశ్వతముగా తనవశము చేసికొనుటకు పాతాళమునకేగి మాయలు నేర్చు చుండెను. దిగ్విజయానంతరము లంకకు తిరిగివచ్చిన రావణుడు అతని కపట వర్తనమునకు కినుకచెంది సోదరి పతియని లెక్కింపక విద్యుజ్జిహ్వుని సంహరించి,

స్వేచ్ఛావిహారిణి యగునట్లు, తనకు సమ్మతమైన పురుషుని పొందునట్లు శూర్పణ ఖకు అనుమతినిచ్చి ఆమె నూరార్చెను. విద్యుజ్జిహ్వుడు మరణించునప్పటికి శూర్ప ణఖ గర్భవతి. శూర్పణఖ కుమారుడే జంబుకుమారుడు. తన తండ్రిని చంపిన రావణునిపై పగ దీర్చుకొనుటకు జంబుకుమారుడు దండకారణ్యమున తపస్సు చేయుచుండెను. శూర్పణఖ అతనికి అన్నాదికములను తెచ్చుచుండెడిది.

జంబుకుమారుని వృత్తాంతము వాల్మీకి రామాయణమునందుగాని, కంబ రామాయణమునందు కాని లేదు. ఈ కథ ఆనందరామాయణమున నున్నది. అందు శూర్పణఖాపుత్రుడు జంబుకుమారుడని కాక 'సాంబు'డని చెప్పబడినది. ఆనంద రామాయణమున సాంబునికి బ్రహ్మఖడ్గమును పంపినట్లు కలదు.

రంగనాథ రామాయణమునందు విపులముగానున్న జంబుకుమార వృత్తాంత మును భాస్కర రామాయణకర్త గ్రహించినాడు. భాస్కర రామాయణములో జంబుకుమారునికి ఖడ్గమును 'సుత్రాముం డాదిసురలు పుత్తెంచినట్లు' చెప్పబడినది. కన్నడములోని తొరవె రామాయణమునందును జంబుకుమారుని వృత్తాంతము కలదు. శ్రీ కృష్ణ రామాయణమునందును జంబుకుమారవధ కలదు. పుత్రశోకమున నుండు శూర్పణఖను సీత చేరదీసినట్లు శ్రీ కృష్ణ రామాయణమున కల్పింప బడినది.

శూర్పణఖ నిజరూపముతోడనే రాముని సమీపించినట్లు రంగనాథ రామా యణమున కలదు. కామరూపిణియై 'కామవల్లి' అను పేరుతో రాముని సమీపించి నట్లు కంబరామాయణములో తెల్పబడినది. శూర్పణఖ ముక్కు చెవులనేకాక వక్ష స్థలమునుకూడ ఛేదించినట్లు కంబరామాయణమున కలదు. అతిలోక సౌందర్య రాశియగు సీతను రావణునికొరకు తెచ్చుటకు ప్రయత్నించినపుడు తన కీ గతి పట్టిన దని శూర్పణఖ రావణునితో చెప్పినట్లు కంబకవి కల్పించినాడు. పద్మపురాణోత్తర ఖండమున శూర్పణఖ ముక్కు చెవులను రాముడే కోసినట్లు కలదు.

రాముని బాణమునకు కూలిన మారీచుడు 'హా సీతా! హా లక్ష్మణా!' అని ఆర్తనాదము చేసినట్లు వాల్మీకి రామాయణమున కలదు. కేవలము లక్ష్మణుని మాత్రమే సంబోధించినట్లు రంగనాథ, కంబరామాయణములందు కలదు.

సీతాపహరణఘట్టమున లక్ష్మణుడు రామాన్వేషణమునకై వెడలుచు పర్ణ శాలచుట్టు ఏడుగీతలను గీయుట రంగనాథ రామాయణమునం దున్నది. లక్ష్మణుడు

ఏడుబరులనుగీచి 'ఈ బరుల్ వడి దాటకమ్మ - ఎవ్వడేనీ బరుల్ వెనదాటివచ్చి - నవ్వీరవరు తలలవియు నా శుణమె' అని పలుకుటయేగాక అగ్నిని ప్రార్థించి జానకి నేమరకుమని యొప్పగించి రాముని వెదకుటకు వెళ్ళును. తాను చెప్పినంతనే రాముని సహాయమునకు మరిది వెళ్ళలేదని సీత నానా దుర్భాషలాడగా, రెండు చేతులతో ఆమె తన కడుపును బాదుకొనగా (చూ. అరణ్యకాండ-45 వ సర్గ) ఆమెమాటలు వినలేక, ఆమె పిచ్చిచేష్టలు మరి చూడలేక, కదలివెళ్ళిన లక్ష్మణుడు ఏవో గీతలుగీసి వెళ్ళలేదని, మొత్తము స్త్రీజాతినే నిందించి వెళ్ళినట్లు విమర్శకులు భావింతురు.

ఆనందరామాయణములో లక్ష్మణుడు ఏడుగీతలకు బదులు పంచవటి చుట్టును ఒక్కగీతనే గీచి దానిని దాటిరావలదని సీతకు చెప్పినట్లు కలదు. ఆంధ్ర జానపదగేయ వాఙ్మయమునకూడ లక్ష్మణుడు పర్ణశాలచుట్టు ఏడుగీతలను గీయుట అనునంశము అధికప్రచార మందినది. రంగనాథ రామాయణకర్త దీనిని జన శ్రుతినుండి గ్రహించియుండును. బర్మా రామాయణములో లక్ష్మణరేఖ విషయము కలదని కె. భరత అయ్యంగార్ తెల్పినాడు.[1]

కపటవేషముతో పంచవటికి వచ్చిన రావణుని, అతని ప్రేమను సీత తిరస్కరించును. అపుడు కుపితుడై లంకేశ్వరుడు భయంకరమైన తన నిజస్వరూప మును చూపగనే సీత మూర్ఛపోవును. ఇష్టవిముఖురాలైన స్త్రీని స్పృశించి నచో రావణునిశరీరము వ్రక్కలౌనని అతనికి ఒక శాపము కలదు. పైగా ఆ మహాపతివ్రతా శిరోమణిని స్పృశించినచో తాను భస్మీపటలమై పోగలనను భయ ముతో, ఆమె మూర్ఛలో మునిగియున్న ప్రదేశమును తనగోళ్ళతో ఒక పెళ్ళగా పెకలించి, రావణుడు దానిని తన రథముపై కొనిపోయినట్లు కంబరామాయణమున కలదు. ఈ విషయము కోటమరాజు నారయామాత్యుడు రచించిన అధ్యాత్మరామా యణమునందు కలదు. కంబరామాయణమునందు ఎట్టి సందర్భములందును సీతను రావణునిచేత స్పృశింపనీయడు. లంకలోకూడ రావణుడు సీతను స్పృశింపలేదు. ప్రాణభీతితో కాక ఆత్మముఖ్యము చూపని వనితను స్పృశింపకూడదను ఉదాత్త భావములోడను, ధర్మబుద్ధితోడను రావణుడు సీతను స్పృశింపలేదని కంబకవి తన రామావతారమునందు తెల్పినాడు.

(1) The Ramayana play of Burma - The Times of India Annual 1964. P. 22.

రావణుడు సీతను పట్టుకొనబోగా అనసూయాదత్తాంగరాగ ప్రభావమున ఆమె యొడలు అగ్నివలెనై చేతులు కాల్చునట్టిది కాగా రావణుడు ఆవటి భూభాగముతోడ పెల్లగించుకొని ఆకసమున కెగసినట్లు శ్రీకృష్ణ రామాయణమునందు కలదు.

ఈ సన్నివేశము వాల్మీకి రామాయణమున వేరువిధముగా నున్నది. అందు రావణుని భీకరస్వరూపమును చూచి సీత మూర్ఛపోలేదు. ఆమెను స్పృశించినచో తాను భగ్గున మండిపోదు, బూదిపోగు కాగలనని రావణుడును భయపడలేదు. బల ప్రయోగముతో తప్ప తాను సీతను లంకకు కొనిపోలేనని రూఢిపడినంతనే రావణుడు సీతను సమీపించి ఎడమచేతితో ఆమె తలవెంట్రుకలను, కుడిచేతితో ఆమె తొడలను పట్టుకొని ఒడిసిపట్టి యెత్తుకువెళ్ళి ఆమెను రథముపై కూర్చునబెట్టినట్లు వాల్మీకి రామాయణమున కలదు. (చూ. అరణ్యకాండ-49 వ సర్గ) రంగనాథ రామాయణములో కూడ రావణుడు సీతను అదియుడై యెత్తితెచ్చి రథముపై పెట్టి తనపాలి మృత్యుదేవతను కొనిపోయినట్లు లంకకు తీసికొనివెళ్ళెనని వర్ణింపబడినది.

రావణుని ధ్వజముపై 'వీణ' యున్నట్లు కంబరామాయణమున తెల్పబడినది. ఈ విషయము మూలమునందుకాని రంగనాథ రామాయణమునందుకాని లేదు.

అయోముఖి వృత్తాంతము వాల్మీకి రామాయణమునందు కంబరామాయణము నందు కలదు. రంగనాథ రామాయణమునందు అయోముఖి కథ కానరాదు. రామలక్ష్మణులు సీతను అన్వేషించుసందర్భమున రాముని దాహము తీర్చుటకు కేగిన లక్ష్మణుని అయోముఖి యను అసురవనిత కామించి అతని బంధించినది. లక్ష్మణుడు అయోముఖి ముక్కు చెవులుకోసి రాముని చేరుకొనును.

శబరి యను భక్తురాలు రామునికి భక్తితో ఫలములను సమర్పించినట్లు రంగనాథ రామాయణమున కలదు. తాను ముందుగా రుచిచూచి మధురముగానుండు ఫలములనే శబరి రామునికి సమర్పించినట్లు కంబరామాయణమున తెల్పబడినది. పద్మపురాణమున శబరి పండ్లను స్వయముగా ఆరగించి పిమ్మట రామునకొసగినట్లు కలదు. కంబకవి పద్మపురాణములోని ఈ కథాంశమును గ్రహించియుండును. శ్రీకృష్ణ రామాయణమునందును ఈ విషయము కలదు.

## 35. కిష్కింధాకాండము - అమూలకమైన కల్పనలు:

రంగనాథ రామాయణమున వాల్మీకి రామాయణమునందువలె వాలివధ తరువాత సుగ్రీవుడు వాలి భార్యయగు తారను చేపట్టినట్లు తెల్పబడినది. వాలి రామునిచే సంహరింపబడినపుడు.

'నీయట్టి సుకృతికి నీయట్టి పతికి
నీయట్టి కారుణ్యనిధి కిట్లు తగునె?
జనకజతోఁగూడఁ జనియెనో యెఱుక?
ఘనమైన విరహాగ్నిఁ గ్రాఁగెనే యెఱుక?
భూమీశ! నేఁడు నా పుణ్య మిట్లయ్యె!
నేమి సేయుదువింక? నేమందు విధికి?
నీ వాలి నెడబాపి యే నుండఁజాల!
దేవ! నన్నునుబట్టి తెగటార్పవయ్య.'

—రంగనాథ రామాయణము - కిష్కింధాకాండము - పుట. 219.

అని విలపించిన తారకూడ సుగ్రీవుని ప్రేమను అంగీకరించినది. సుగ్రీవుడు తారా వ్యామోహపీడితుడై వాలివధకు పూర్వము సీతాన్వేషణ విషయములో రామునికి చేసియుండిన బాసను విస్మరించి భోగలాలసు డగును. సుగ్రీవుని అలసత్వమునకు కోపగించి లక్ష్మణు డతనిని శిక్షింపదలచి సుగ్రీవునిదగ్గరకు వచ్చును. అప్పు డతి లోకసౌందర్యవతి అయిన తార సుగ్రీవునికిబదులు లక్ష్మణునకు ఎదురువచ్చి అతనిని శాంతింపజేసినట్లు వాల్మీకి రామాయణమునందును. రంగనాథ రామాయణమునందును కలదు.

కంబకవి తారా సుగ్రీవుల శీలములకు తన రామాయణములో మెరుగు దెచ్చుటకు ప్రయత్నించెను. వాలి సుగ్రీవుని ఓడించి అతని భార్యయైన రమను ఏలుకొన్నట్లు కంబకవి చెప్పినాడు. భార్యా వియోగ భగ్నమానస మెట్టిదో స్వానుభవమున ఎరిగిన రాముడు సుగ్రీవునిపై సానుభూతితో పరస్త్రీని చేపట్టినపాపము నకుగాను వాలిని వధింతునని ప్రతిజ్ఞ చేయును. వాలి శిక్షార్హుడగుటకు పరసతీగ్రహణమే ముఖ్యకారణమని రాముడు వాలికి తెల్పును. ఈ కారణమునే కంబరామాయణమున సుగ్రీవుడు వాలి వధానంతరము తారను భార్యగా చేపట్టలేదు. సుగ్రీవునికి తారయందు మాతృభావము కలదని, కంబకవి వర్ణించినాడు. తార సంసార

మను పరిత్యజించి యోగినియై సుగ్రీవుని ఆస్థానములో కాలము వెళ్ళబుచ్చినట్లు కంబరామాయణములో మార్పు చేయబడినది. లక్ష్మణుడు రౌద్రుడై సుగ్రీవుని శిక్షించుటకు వచ్చినపుడు తార వాల్మీకి రామాయణమునందువలె తన సౌందర్యము చేత కాక, తన యోగినీవేషముచే అతనిని శాంతింపజేయుటకు ప్రయత్నించినది. లక్ష్మణునకు తారను చూచినంతనే దశరథ నిర్యాణానంతరము తన మాతృమూర్తి సుమిత్ర దీనావస్థ కన్నులకు కట్టినట్లు కావింపగా నతనికన్నుల కన్నీరు విందినవి. దానితో ఆతనికి సుగ్రీవునిపై కలిగిన కోపము చల్లారినది. ఈ కల్పనమువలన తారా లక్ష్మణుల శీలములకు వన్నె చేకూరినది.

## 36. సుందరకాండము - అవాల్మీకాంశములు:

రావణుడు తన కోర్కెను నిరాకరించిన సీతను 'చంద్రహాస'మను ఖడ్గముతో చంపదలచినట్లు, మండోదరి అడ్డపడి ఆతనిని శాంతింపజేసినట్లు రంగనాథ రామాయణమున కలదు. వాల్మీకి రామాయణములో మండోదరికాక రావణుని మరొక భార్యయగు ధాన్యమాలి రావణుని సీతపై బడియకుండ అడ్డుపడినట్లు చెప్పబడినది. కంబరామాయణములో రావణుడు దూరమునుండియే సీతను దండింతునని భయ పెట్టినట్లుమాత్రమే చెప్పబడినది కాని అతడామెను సమీపించినట్లు లేదు.

కంబరామాయణములో అశోకవనమునందున్న సీతదగ్గరకు రావణుడు రాక పూర్వమే త్రిజట స్వప్నవృత్తాంతము తెల్పబడినది. రాముడు అతి త్వరలోనే లంకకువచ్చి, రావణుని చంపి సీతను చెరనుండి విడిపించునని త్రిజట కల గాంచి నట్లు సీతకు చెప్పును. రావణుడు సీతను భయపెట్టి వెళ్ళినతరువాత రంగనాథ రామాయణములో త్రిజట స్వప్నవృత్తాంతము చెప్పబడినది.

హనుమంతుడు సీతను అశోకవనమునందు మొదట కలిసికొనినపుడు, సీత తన జీవితములోని ఒకానొక సంఘటనను హనుమంతునికి తెల్పును. ఒకప్పుడు తన పెంపుడు చిలుకకు పేరు పెట్టుమని శ్రీరాముని కోరినట్లు, రాముడు చిలుకకు కైక పేరు సూచించినట్లు సీత హనుమంతునికి చెప్పినట్లు కంబరామాయణమున తెల్పబడినది. ఇది వాల్మీకి రామాయణములోను, రంగనాథ రామాయణములోను లేదు. ఈ సంఘటనవలన రామునికి కైకమీదయుండు భక్తి, గౌరవములు వ్యక్తమగును.

హనుమంతుడు రావణుని ముందు వాలమును పెంచినకథ రంగనాథ రామాయణమున కలదు. ఇది అవాల్మీకాంశము. ఇది ఆనందరామాయణమున కలదు.

హనుమంతుని తోకకు చిచ్చుపెట్టినపుడు అతడు అగ్నిసూక్తజపములగు బ్రహ్మమంత్రములు చదివెననియు, అందువలన బ్రహ్మపాశము లూడెనని రంగనాథ రామాయణమున చెప్పబడినది. ఇదికూడ వాల్మీకి రామాయణమునందు కాని కంబరామాయణమున కాని లేదు.

## 37. యుద్ధకాండము - అవాల్మీకములైన కల్పనలు :

సీతను రామునికి అప్పగించి అతనితో సంధిచేసికొని లంకను కాపాడుమని విభీషణుడు రావణునికి హిత ముపదేశించును. అపుడు రావణుడు విభీషణుని తన్ని పురమునుండి వెడలగొట్టినట్లు రంగనాథ రామాయణమున కలదు. ఈ విషయము వాల్మీకి రామాయణమునందు కాని, కంబరామాయణమునందు కాని కానరాదు. భాస్కర రామాయణమునందుకూడ విభీషణుని రావణుడు తన్నినట్లు లేదు. మొల్ల రామాయణము (6-30) నందుమాత్రము ఈ సన్నివేశము పేర్కొనబడినది.

రావణుని యుద్ధమంత్రాలోచన ఘట్టములో విభీషణుడు రావణునికి హిరణ్యకశిపుని వధాకథనమును వివరముగా చెప్పినట్లు కంబరామాయణమున కలదు. కంబరామాయణములో సుమారు పది పండ్రెండుచోట్ల ఉపమానాదుల వ్యాజమున నరసింహావతార ప్రస్తావన చేయబడినది. విభీషణునినోట మరల వివరముగా ఈ కథను చెప్పించుటచే పరమభాగవతోత్తముడైన ప్రహ్లాదుని గుణకీర్తనమనిన భాగవతుడైన కంబమహాకవికి చాల యిష్టమని చెప్పవచ్చును.

భాగవతములోని ప్రహ్లాదకథకు భిన్నములైన మార్పులెన్నియో కంబరామాయణములోని హిరణ్యకశిపునివధలో చేయబడినవి. ఈ ఘట్టమునకు కంబరామాయణములో 'హిరణ్యవధై ప్పతలం' అని పేరు. ఇందు హిరణ్యకశిపుని పాత్ర గొప్పగా చిత్రింపబడినది. విష్ణువు నరసింహావతారమున హిరణ్యకశిపుని చంపినాడు. రామావతారమున రావణుని చంపునని కంబకవి తెల్పినాడు.

రంగనాథ రామాయణములో బాలకాండమున హిరణ్యకశిపుడే రావణాసురుడిగా జన్మించినట్లు పేర్కొనబడినను యుద్ధకాండమునందు హిరణ్యకశిపుని వధ లేదు. అట్లే వాల్మీకి రామాయణమునందలి యుద్ధకాండములో హిరణ్యకశిపుని వధ కానరాదు.

రావణ పరాభూతుడైన విభీషణుడు మాతృదేవియగు కైకేసిని దర్శించి, జరిగినవృత్తాంతమును వివరించి, రామసన్నిధికి వెళ్ళుటకు నిశ్చయించుకొన్నట్లు తెల్పెను. కైకేసియు తన జనకుడగు విశ్రావసువువలన భవిష్యత్తును తాను పూర్వమే వినియున్నట్లుచెప్పి, రామరక్షను పొందుమని విభీషణుని దీవించినట్లు రంగనాథ రామాయణమునందువలెనే భాస్కర రామాయణమునకూడ కలదు. మొల్ల రామాయణమునందుకూడ రంగనాథ, భాస్కర రామాయణములవలెనే విభీషణుడు కైకసి అనుమతిబడసి రామశరణార్థియై యేగినట్లు కలదు. ఈ కైకేసి వృత్తాంతము వాల్మీకి రామాయణమునగాని, కంబరామాయణమునగాని లేదు.

సముద్రముపై సేతునిర్మాణమునకు ముందు గణేశుని సుగ్రీవుడు పూజించినట్లు రంగనాథ రామాయణమున కలదు. భాస్కర రామాయణములో సేతు నిర్మాణమునకుముందు నలుడు విఘ్నేశ్వరపూజ చేయుమని చెప్పినట్లు యున్నది. ఈ విషయము వాల్మీకి రామాయణమునగాని, కంబరామాయణమునగాని లేదు. సేతుబంధన సమయమున విఘ్నేశ్వర పూజను, నవగ్రహపూజను రాముడు చేసినట్లు శ్రీ కృష్ణ రామాయణమునందు కలదు.

వానరులు సముద్రముపై సేతువును నిర్మించుచున్నపుడు ఉడుత ఒకటి రామభక్తితో రామునికి సహాయపడదలచి తన మేనున నంటియున్న ఇసుకను శిలలమధ్య విదల్చుచుండెను. రాముడు దాని భక్తికి సంతసించి లక్ష్మణునిచే దానిని పట్టితెప్పించి, దాని పైభాగమున దక్షిణకరాగ్రముతో నిమురగా నచట దానికి మూడురేఖ లేర్పడినవని రంగనాథ రామాయణమున చెప్పబడినది. ఈనాటికిని ఉడుతల వెనుకభాగముననుండు మూడుచారలు ఆనాటి రాముని అనుగ్రహమునకు చిహ్నములని ఆంధ్రుల విశ్వాసము. ఈ కథ వాల్మీకి రామాయణమునందు కాని, కంబరామాయణమునందుగాని కానరాదు. రంగనాథ రామాయణమునందలి ఈ మనోజ్ఞకల్పనమే ఉడుతాభక్తి సామెతగా తెలుగునాట నిలిచిపోయినది.

రామ లక్ష్మణులు సువేలాద్రిని చేరుకొన్నసంగతి తెలిసి రావణుని తల్లియగు కైకేసి దిగులుచెంది లంకను కాపాడుట బ్రహ్మ శివుల తరముకూడ కాదని రావణునికి హితోపదేశము చేయును. వేదవతియే సీతగా జన్మించినట్లు, రాముడు నారాయణావతారమని సీతను రాముని కప్పగింపుమని రావణునికి కైకేసి హితబోధ చేసినట్లు, రావణు డామె హితోక్తులను పెడచెవిని పెట్టినట్లు రంగనాథ రామాయణ

మున వర్ణింపబడినది. మూలములోగాని కంబరామాయణములోగాని ఈ సంగతి లేదు.

యుద్ధ ప్రారంభమునకుముందు రాముడు అంగదుని రావణునికడకు రాయబారిగ పంపినట్లు రంగనాథ రామాయణమున కలదు. ఈ రాయబారప్రస్తావన కంబరామాయణమున లేదు. అంగదుడు వాలి కుమారుడని తెలిపికొని రావణుడు అతనితో, వాలికి తనకు మధ్యగల మైత్రినితెల్పి వాలిని అకారణముగా సంహరించిన రాముని వదలి తనపక్షము చేరమని అతనిని కిష్కింధాధీశునిగ చేసెదనని చెప్పినట్లు, అంగదు డందుకు నిరాకరించెనని కంబరామాయణమున చెప్పబడినది.

ప్రతినాయకుడగు రావణుని లోకభీరుడగు శూరుడుగానేగాక గుణగ్రహణ పారీణునిగ, మహోదారునిగ రంగనాథ రామాయణకర్త వర్ణించినాడు. రామునిపై పగబూనిన రావణుడు రాముని ధనుర్విద్యాకౌశలమును,

'నల్లనో రఘురామ ! నయనాభిరామ !
విల్లు విద్య గురువ వీరావతార !
........బాపురే ! రామ భూపాల
లోకముల నీపాటి విలుకాడు నేర్చునే కలుగ.'

—రంగనాథ రామాయణము - యుద్ధకాండము - పుట. ౪౯౬.

అని కీర్తించినట్లు రంగనాథ రామాయణమున వర్ణింపబడినది. మూలములోగాని, కంబరామాయణములోగాని, భాస్కర రామాయణాదులందుగాని ఈ సన్నివేశము కన్పట్టదు.

యుద్ధ ప్రారంభముననే నాగపాశబద్ధులైన రామ లక్ష్మణులకడకు నారదుడు వచ్చి, విష్ణ్వవతారమే రాముడనితెల్పి, తన వాహనమైన గరుత్మంతుని స్మరింపుమని రామునికి సలహానిచ్చినట్లు రంగనాథ రామాయణమున తెల్పబడినది. యుద్ధ ప్రారంభమునందుకాక కుంభకర్ణుడు మరణించినతరువాత ఇంద్రజిత్తు రామ లక్ష్మణులను నాగపాశబద్ధుల చేసినట్లు కంబరామాయణకర్త వర్ణించినాడు. కంబరామాయణములో లక్ష్మణుడు, హనుమంతుడు మొదలగువారుమాత్రమే నాగపాశబద్ధులైనట్లు తెల్పబడినది. ఇందు నారదునిప్రసక్తికూడ లేదు. రాముడు లక్ష్మణుని గురించి విలపించుసందర్భమున గరుడుడే స్వయముగా యుద్ధభూమికివచ్చి వారిని నాగపాశబంధ విముక్తులను చేసినట్లు కంబరామాయణములో చెప్పబడినది. రంగ

నాథ రామాయణానుసారిగనే భాస్కర రామాయణమునందు నారదాగమనము తెల్పబడినది.

రంగనాథ రామాయణకర్త రావణ కుంభకర్ణు లిరువురిని ఆత్మజ్ఞానపరాయణులుగ చిత్రించినాడు. రావణ కుంభకర్ణు లిరువురును, రాముడు విష్ణ్వవతారముగాను, సీతను లక్ష్మిగాను ముందే యెఱిగియున్నట్లు తెల్పుదురు. భాస్కర రామాయణమునకూడ రంగనాథ రామాయణమునందువలెనే రావణ కుంభకర్ణులను ఆత్మజ్ఞాన పరాయణులుగ చిత్రింపబడినది.

కుంభకర్ణుడు మొదటనుండియు ధర్మాధర్మవిచక్షణ మొనర్చువానివిగ రంగనాథ భాస్కర రామాయణములందు చిత్రింపబడినాడు. అతడు అంద రనుకొనుచున్నట్లు క్రూరుడు కాడు. కంబరామాయణమున కుంభకర్ణుడు, ప్రీతిపాత్రుడుగ, రావణుని మేలుగోరు సహోదరునిగ చిత్రింపబడినాడు. రాముడు విష్ణ్వవతారమని, సీతను చెరపట్టుట అధర్మమని కుంభకర్ణుడు అన్నయైన రావణునికి చెప్పును. రావణుడును రాము డవతారపురుషుడని తనకుకూడ తెలియునని, రామునిచేతిలో మరణించి మోక్షమును పొందుటకే సీతను తాను చెరపెట్టినట్లు కుంభకర్ణునికి సమాధానమిచ్చును. ఎట్టి పరిస్థితులందైనను రాజసేవ యొనర్చుట తన ధర్మము కావున కుంభకర్ణుడు రామ లక్ష్మణులతో పోరాడుటకు యుద్ధమునకు వెళ్ళినట్లు రంగనాథ రామాయణమున వర్ణింపబడినది.

యుద్ధభూమిలో విభీషణ కుంభకర్ణుల సమావేశమును కంబకవి నాటకీయముగ, మనసు కరిగించునట్లు కరుణరస పూరితముగ వర్ణించినాడు.

యుద్ధరంగమున విభీషణుడు, రావణుడు అధర్మము ననుసరించుటవలన రాక్షసకులక్షయమును శంకించి తాను రామ శరణార్థియైనట్లు కుంభకర్ణునికి విన్నవించెను. కుంభకర్ణుడుకూడ,

'అన్నదమ్ముల పొడియని స్రుక్కవలదు
....భానువంశ్యుని కృపఁ బడసితిగాక
నా రాము దయగల దటుమీద నీవు
సారదయోదయ! శ్లాఘచిత్తుఁడవు
లంక సద్గుణాలంకృతి నేల
వింక నెవ్వరు గలరిట నీవెకాక!

………….ఈ పట్టున నిలువ
వల దొక్కఁడై నను వలయు వంశమున.'

అని విభీషణుని చర్యలను సమర్థించుటయేకాక, తనతో యుద్ధ మొనరింపవలదని హెచ్చరించినట్లు రంగనాథ రామాయణమున వర్ణింపబడినది. కుంభకర్ణునిమీద విభీషణునికి సద్భావము కలదు.

కుంభకర్ణుడు రామునితో పోరాడుచున్నపుడు రావణుడు సీత ప్రేమను పొందుటకు మాయాజనకుని సృష్టించి, సీతకు బుద్ధులు చెప్పించినట్లు కంబరామాయణమున కల్పింపబడినది. ఈ వంగతి మూలములోగాని రంగనాథ రామాయణమున కాని లేదు.

రణరంగమున కుంభకర్ణుని రాముడు కాక లక్ష్మణుడు సంహరించినట్లు సంస్కృత మహాభారతమునందలి రామోపాఖ్యానమున కలదు. లక్ష్మణుడు కుంభకర్ణుని ఖడ్గముచే నరుకగా అతడు చతుర్భుజుడై, అంతలోనే తిరిగి బహుశీర్షుడు, బహుభుజుడుగా రూపొందినట్లు, లక్ష్మణుడు బ్రహ్మాస్త్రముచే కుంభకర్ణుని వధించినట్లు సంస్కృత భారత రామోపాఖ్యానమున కలదు. వాల్మీకి రామాయణములోను, రంగనాథ కంబరామాయణములందును శ్రీరాముడే కుంభకర్ణుని వధించినట్లు కలదు.

సీతను రాముని కప్పగించి లంకను కాపాడుమని మండోదరి రావణునికి హితబోధ గావించినట్లు రంగనాథ రామాయణమున కలదు. దైత్యుల గుణగణములను ప్రశంసించినట్లు కాని, వారినోట రాముని మాహాత్మ్యమునుగూర్చి చెప్పినట్లు గాని రంగనాథ రామాయణమునందువలె మూలమునగాని, కంబరామాయణమున గాని కానరాదు.

ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రమునకు రామ లక్ష్మణులు మూర్ఛిల్లినట్లు రంగనాథ రామాయణమున తెలుపగా, రాముడుతప్ప తక్కిన లక్ష్మణాదులందరు మూర్ఛిల్లినట్లు కంబరామాయణకర్త వర్ణించినాడు. లక్ష్మణుడు మూర్ఛిల్లుటనుగాంచి రాముడు శోకముతో మూర్ఛిల్లినట్లు కంబరామాయణమున తెలుపబడినది. ఆ సందర్భమున సీతను యుద్ధభూమిలోనికి కొనివచ్చినట్లు కంబరామాయణమున కలదు. రామ లక్ష్మణులు ఇంద్రజిత్తు నాగాస్త్రముతో బంధీకృతులయినపుడు సీతను యుద్ధభూమిలోనికి కొనివచ్చినట్లు రంగనాథ రామాయణములో తెలుపబడినవి.

లక్ష్మణునిచేతిలో ఇంద్రజిత్తు మరణించినందుకు అతని ఈ మారణకాండకు మూలకారణమైన సీతను రావణుడు చంపుటకు బయలుదేరి సమేతుడును పతివ్రతను చంపుట పాపహేతువని సుపార్శ్వుడతని ప్రయత్నమును వారించినట్లు రంగనాథ రామాయణమున చెప్పబడినది. మండోదరి, ఇంద్రజిత్తు మరణమునకు శోకించి సీతమూలముగనే లంకకు చేటు వాటిల్లెనని వాపోవును. మండోదరి మాటలచే ప్రేరేపితుడై రావణుడు సీతను చంపబోగా మహోదరుడు అతనిని వారించినట్లు కంబరామాయణమున చెప్పబడినది.

ఇంద్రజిత్తు భార్యయగు సులోచనావృత్తాంతము రంగనాథ రామాయణమున కలదు. ఈ కథ మూలములోగాని, కంబరామాయణమునందుగాని, భాస్కర రామాయణమున గాని లేదు. ఇది రంగనాథ రామాయణములో ప్రక్షిప్తమని కొందరందురు. ఆనంద రామాయణము పదిహేడవసర్గలో సులోచనావృత్తాంతము కలదు. సులోచన ఆదిశేషుని కుమార్తె. ఇంద్రజిత్తు భార్య; మహాపతివ్రత, ధీరవనిత. యుద్ధములో లక్ష్మణునిచే తనభర్త మరణించినపుడు రావణునిఅనుజ్ఞతో యుద్ధభూమికి నొంటరిగా వెళ్ళి, సుగ్రీవాదులను మెప్పించి, తన పాతివ్రత్యమహిమచే భర్త కళేబరముతో సంభాషించి, తన భర్తతోపాటు సహగమనము చేయును. తెలుగు జానపదగేయ వాఙ్మయమున సులోచన కథ అధికప్రచారము పొందినది.

కాలనేమి కథ రంగనాథ రామాయణమునను, భాస్కర రామాయణమునను కలదు. ఈ కథ మూలములోను, కంబరామాయణములోను లేదు. కాని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు వాల్మీకి రామాయణ ఇటాలియన్ ప్రతిలో కాలనేమి కథ కలదని రంగనాథ రామాయణపీఠికలో తెల్పినారు. కాలనేమి కథ ఆనంద రామాయణము సారకాండ పదకొండవసర్గలోను, అధ్యాత్మ రామాయణమునందును వివరముగ కలదు. భాస్కర రామాయణమునకూడ ఇది సముచితస్థాన మాక్రమించినది. మొల్ల రామాయణమునకూడ కాలనేమి కథ కలదు. కాని ఇందు తదంతర్గతమగు ధాన్యమాలి వృత్తాంతము సంక్షిప్తము గావింపబడినది.

మాయావియగు కాలనేమి మారీచుని కుమారుడు. రావణునిశక్తిచే మూర్ఛపడిన లక్ష్మణుని పునర్జీవితునిచేయుటకు హనుమంతుడు సంజీవకరణిని తీసుకొని వచ్చుటకు ద్రోణాద్రికి వెళ్ళును. కాలనేమి మునిరూపమున మార్గమధ్యమున హనుమంతుని ప్రయత్నమునకు ఆటంకము కలిగించును. కాలనేమి మాయాచేష్టలు, ప్రతిక్రియా కల్పనాచతురత మనలను ఆశ్చర్యచకితులను చేయును. కాలనేమి

సూచనప్రకారము ద్రోణాద్రికి సమీపమందలి ఒక సరస్సులో దాహము తీర్చు కొనుట కరిగిన హనుమంతుడు అచట ఒక మొసలితో పోరాడుట, ఆ పోరాట ములో మొసలి ధాన్యమాలి అను అచ్చరలేమగా పూర్వరూపమును బడసి, కాల నేమి నిజస్వరూపమును హనుమంతున కెరిగించుట, తరువాత కాలనేమిని హను మంతుడు సంహరించి ద్రోణాద్రికి అరుగుట ఈ కథలోని ముఖ్యాంశములు.

హనుమంతుడు సంజీవిని గ్రహించి తిరిగివచ్చునప్పుడు నందిగ్రామమందుండు భరతునిచూచి రాముడని భ్రమించుట, ఆ రాత్రి రామ లక్ష్మణులు ఆపదలో చిక్కు కున్నట్లు భరతుడు దుస్వప్నమును గాంచుట, రామ లక్ష్మణుల క్షేమమునుకాంక్షించి యాగమును నిర్వహించు భరతుడు ఆకాశమార్గమున పయనించు హనుమంతుని గాంచి శత్రువుగా భావించి శిక్షింపనెంచుట, ఆకాశవాణివలన హనుమంతుడు హితు డని భరతుడు గ్రహించుట - ఇత్యాది కథాంశములు రంగనాథ, భాస్కర రామా యణములందు కలవు. మూలములో కాని కంబరామాయణములో కాని ఈ విషయ ములు లేవు. సంజీవిసహితముగ మరలివచ్చు హనుమంతుడు భరతుని రామునిగ భ్రమించువిషయము మొల్ల రామాయణమునందును. శ్రీ కృష్ణ రామాయణము నందును కలదు.

సంజీవిని కొనివచ్చు హనుమంతుడు మాల్యవంతునితో కూడ పోరాడి జయించినట్లు రంగనాథ, భాస్కర రామాయణములందు కలదు. మొల్ల రామాయణ మందును మాల్యవంతసంహారము కలదు. హనుమంతుడు మాల్యవంతునితో యుద్ధము చేసినట్లు మూలములో గాని, కంబరామాయణమునందు కాని కానరాదు.

సంజీవినిచే లక్ష్మణుడు పునరుజ్జీవితుడైనట్లు తెలిసికొని, రావణుడు తన ప్రయత్నము విఫలముకాగా, రాముడు మరణించుమార్గము నుపదేశించుమని గురువైన శుక్రాచార్యు నడిగినట్లు రంగనాథ రామాయణమున కలదు. కంబరామా యణములో రావణుడు తన అంతరంగికమిత్రులను సమావేశపరచి వారితో ఈ విషయమును చర్చించినట్లు తెల్పబడినది.

శుక్రాచార్యోపదేశముచే రావణుడు పాతాళహోమము చేసినట్లు రంగనాథ, భాస్కర రామాయణములందు కలదు. మూలములోగాని కంబరామాయణమునగాని ఈ విషయము లేదు. రావణుడు చేయు హోమమును కొనసాగనీయకుండుటకు అంగదుడు మండోదరిని రావణునొద్ద కీడ్చుకొనివచ్చి భంగపరపగా రావణు డది చూచి హోమమునుమాని మండోదరి రక్షణకు పూనుకొనినట్లు, మండోదరి

రాముని మాహాత్మ్యమును రావణుని కెరిగించినట్లు రంగనాథ రామాయణమున వర్ణింపబడినది. మొల్ల రామాయణమునందును రావణ పాతాళహోమము స్వీకరింప బడినది. ఈ విషయములు మూలమునను, కంబరామాయణమునందును కానరావు. రావణ పాతాళహోమమును అధ్యాత్మ రామాయణమునుండియే రంగనాథ రామాయణకర్త స్వీకరించియుండును. అంగదుడు రావణుని హోమము విఘ్నమొనర్చు విషయము ఆనంద రామాయణమునందును కలదు.

రావణ బాణఘాతములకు రాముడు వ్యాకులత చెందినపుడు అగస్త్య దరు దెంచి ఆదిత్యహృదయము నుచ్చరింపుమని రామునికి చెప్పినట్లు రంగనాథ రామాయణమున తెల్పబడినది. మూలములోకాని, కంబరామాయణమునందుకాని ఈ విషయము లేదు.

రావణ సంహారసందర్భమున బ్రహ్మాస్త్రమును ప్రయోగింపుమని మాతలి రామునికి సలహా చెప్పినట్లు వాల్మీకి రామాయణమున కలదు. రంగనాథ రామాయణములో రాముడు తన బాణములచే రావణుని కరశిరములను ఖండించినను మరల మొలచుచుండుటకై చింతించు రామునకు ఆగ్నేయాస్త్రమును ప్రయోగించి రావణుని నాభియందున్న అమృతము వింకింపజేసి అతని మడియింపుమని విభీషణుడు ఉపాయము చెప్పినట్లు కలదు. రామరావణ యుద్ధమున విభీషణుడు రావణుని నాభియందుగల అమృతకుంభమునుగురించి యెఱింగించుట ఆనంద రామాయణమున కలదు. ఈ విషయమును అధ్యాత్మ రామాయణమునుండియే రంగనాథ రామాయణ కర్త గ్రహించియుండును. భాస్కర రామాయణమునందును ఈ విషయము పేర్కొనబడినది. కంబరామాయణములో రావణుని కరశిరములు మరల మొలచు చుండినవిషయము తెలుపబడినది. ఎవరి సలహా సంప్రదింపులులేకనే రాముడు బ్రహ్మాస్త్రమును ప్రయోగించి రావణుని సంహరించినట్లు మూలమునందువలె కలదు.

రాముని సలహాప్రకారము విభీషణుడు వీరుడైన రావణునికి అంత్యక్రియలు జరిపించినట్లు మూలములోను, రంగనాథ రామాయణమునందును కలదు. కంబ రామాయణములో రావణుని భార్యయైన మండోదరి సహగమనము చేసినట్లు వర్ణింప బడినది. రావణునితోపాటు, పతివ్రతాతిలకమగు మండోదరికికూడ విభీషణుడు అంత్యక్రియలు జరిపించినట్లు కంబరామాయణమున తెల్పబడినది.

రావణుని మరణవార్తను, రాముని విజయోత్సాహమును వివరించిన హనుమంతునికి సీత, ప్రతిఫలముగా అతనికి తానేమి యివ్వవలెనో నిశ్చయించుకోలేనట్లు, ప్రేమపూరితమైన ఆమె వాక్కులకు హనుమంతుడు తృప్తిచెందినట్లు మూలమునందును, రంగనాథ రామాయణమునందును కలదు. కంబరామాయణములో సీత హనుమంతుని ఏదైనను అడగమని కోరును. అపుడు ఆమెను సేవించుభాగ్యమును ప్రసాదించమని హనుమంతుడు కోరగా సీత అందుల కంగీకరించినట్లు కంబరామాయణమున కలదు. రామపట్టాభిషేకసమయమున సీత హనుమంతునకు హార మొసగి సన్మానించినట్లు అధ్యాత్మ రామాయణమునం దున్నది. రామ పట్టాభిషేక సమయమున సీత రాముడు తన కిచ్చిన రత్నహారమును హనుమంతునికి బహూకరింపగా రాముడు లేని వస్తువును తాను ధరింపనని హనుమంతుడు దానిని నోట కొరికి విసరివైచినట్లును, తరువాత సీత కోర్కెపై హనుమంతుడు తన హృదయమును చీల్చి అందుండు రామ లక్ష్మణులను చూపినట్లును ఆనందరామాయణమున కలదు.

యుద్ధానంతరము రావణ సంహారమువలన కలుగు బ్రహ్మహత్యాపాప నివారణార్థము, కాశీనుండి హనుమంతుడు శివలింగమును కొనివచ్చుట ఆలస్యమగుటచే ముహూర్తము మించకుండ తాను స్వయముగ సైకతలింగమునుచేసి సీతాదేవి సైకతముతో నందిని గూర్ప రాముడు రామేశ్వరమున శివలింగప్రతిష్ఠ కావించినట్లు రంగనాథ రామాయణమున కలదు. హనుమంతుడు తెచ్చిన లింగమునుకూడ అక్కడే ప్రతిష్ఠించి ఈ రెండు లింగములను పూజించినవారికే మోక్షము కల్గునని వాక్రుచ్చినాడు. మతసామరస్యమునకు శివ కేశవా భేదమునకు ఆదివిష్ణువైన రాముడు శివలింగమును ప్రతిష్ఠ యొనర్చుట ఒక చక్కని ఉదాహరణము. సముద్రము దాటు వేళ రామలింగేశ్వర ప్రతిష్ఠాపనము శివపురాణమునందలి లీలాఖండమునను, ఉమాఖండమునను పేర్కొనబడినది. అధ్యాత్మ రామాయణమునందును సేతు నిర్మాణ సందర్భమునకు ముందు రామలింగ ప్రతిష్ఠాపన మొనర్చినట్లు కలదు. ఈ అంశము మూలమునందు లేదు. కంబరామాయణములో ఈ అంశమును కంబకవికి తరువాతి తమిళవిద్వాంసులు చేర్చియుందురని విమర్శకులు భావించుచున్నారు.

సీత కోరికపై వానరుల భార్యలందరు అయోధ్యకు కదలి వెళ్ళినట్లు కంబరామాయణములో చెప్పబడినది. మూలములోను, రంగనాథ రామాయణములోను కేవలము వానరులుమాత్రమే రాముని వెంట అయోధ్యకు వెళ్ళినట్లు తెల్పబడినది.

అనుకున్నట్లు తన మాటప్రకారము రాముడు తిరిగిరావందునవలన గుహుడు, భరత, శత్రుఘ్నులు ప్రాణత్యాగము చేయుటకు నిశ్చయించుకొన్నట్లు, అంతలో హనుమంతుడు రాముని విజయవార్తను వారికి వినిపించి ప్రాణత్యాగమునుండి వారిని వారించినట్లు రంగనాథ రామాయణమున కలదు. కంబరామాయణమునకూడ హనుమంతుడు రాముని విజయవార్తను ముందు గుహునికి తెల్పి తరువాత 'నంది గామ'కు వెళ్ళి భరతున కెరిగించినట్లు తెల్పబడినది.

రాముని సలహాప్రకారము గుహుడు తపసివేషమును వీడినట్లు రంగనాథ రామాయణమున కలదు. కంబరామాయణమున ఈ వివరము లేమియు లేవు.

రామ పట్టాభిషేకము వసిష్ఠ, జాబాలి మొదలగు మునుల సలహాప్రకారము జరిగినట్లు రంగనాథ రామాయణమున తెల్పబడినది; కంబరామాయణములో కంబ కవి తన ఆశ్రయదాతయగు 'శదయప్ప' పూర్వీకు లిచ్చిన కిరీటమును వసిష్ఠుడు రామునితలపై ధరింపజేసినట్లు వర్ణించినాడు.

యుద్ధకాండములో కంబకవి మరొక కల్పనకూడ చేసినాడు. అగ్నిప్రవే శముచేత సీతా పాతివ్రత్యము నిరూపితమగుచుట్టమున దేవలోకమునుండి దశ రథుడు భూలోకమునకువచ్చి సీత నిర్దోషిత్వమును ప్రకటించును. సీత గుణవతి, శీలవతియని దశరథునిచేత చెప్పించినాడు కంబకవి. దశరథుడు తన కుమారుడగు రాముని వాత్సల్యముతో నొక వరమును కోరుకొనుమని ప్రోత్సహించును. దశ రథుడు, తాను పుత్రశోకముతో మరణించుటకు పూర్వము సీతారాముల వనవాసము నకు కారణభూతురాలగు కైకను తన భార్యకాదని, ఆమె పుత్రుడైన కారణమున భరతుని తన పుత్రుడు కాడనితెల్పి వారి ప్రవర్తనమునెడ యేహ్యభావమును ప్రక టించియుండెను. కనుకనే కేకయదేశమునుండి భరతుడు అయోధ్యకువచ్చి తన తండ్రికి ఊర్ధ్వ దైహికక్రియలు చేయుటకు సిద్ధపడినపుడు మంత్రులు దశరథుని ఆదేశంవనమును అతనికి తెలిపి శత్రుఘ్నునిచేతనే ఉత్తరక్రియలు జరిపించినట్లు కంబకవి వర్ణించినాడు. భరతుని తనకు సోదరునిగాను, కైకను తన తల్లిగాను అంగీకరింపవలసినదని రాముడు దశరథుని వరమడిగినట్లు కంబకవి తెల్పినాడు. దశరథుడు తొలుత భరతునిమాత్రమే తన కుమారునిగా స్వీకరించుటకు అంగీక రించును. కైక విషయములో వైముఖ్యమును ప్రకటించును. అపుడు రాముడు, కైక కేవలము నిమిత్తమాత్రురాలని, ఉత్తమురాలని, లోకకల్యాణము చేకూరుటకు దోహదము చేసినదని దశరథునికి నచ్చచెప్పును. దశరథుడు ప్రసన్నుడై కైకను

తన భార్యగా అంగీకరించును. కంబరామాయణములోని ఈ ఘట్టములో దశరథ ప్రవేశమువలన కైకపాత్రకు కలిగిన కళంకము తొలగినది. ఈ ఘట్టము మూల ములోగాని రంగనాథ రామాయణమునగాని లేదు.

యుద్ధకాండము కడపట గోన బుద్ధారెడ్డి రంగనాథ రామాయణమున ప్రవేశపెట్టిన 'సౌమిత్రిహాసము' మూలములోగాని కంబరామాయణమునగాని లేదు. ఇది ఆంధ్రస్త్రీలు నిరంతరము పాడుకొను గేయములలో ప్రశస్తమైన 'లక్ష్మణ దేవర నవ్వు' అనుదానికి ఛాయారూపము. రామ పట్టాభిషేకసందర్భమున రాముడు బంధువులకు హితులకు మిత్రులకు విందుచేయును. ఆ సందర్భమున అకారణముగా లక్ష్మణుడు నవ్వును. అక్కడివారందరు తమలో తాము తమ్ముచూచియే లక్ష్మ ణుడు నవ్వినట్లు భావించుకొని కినుక చెందుదురు. లక్ష్మణుని అనుచిత పరిహాస మునకు రాముడును కోపగించుకొని అతనిని చంపుటకు పూనుకొనును. తరువాత లక్ష్మణుడు అందరికి సంజాయిషీగా తన నవ్వుకు కారణము నిట్లు వివరించును. వనవాసమపుడు తాన్నావరించుటకు వచ్చిన నిద్రాదేవిని పదునాలుగేండ్లు ఊర్మిళదగ్గ రకు వెళ్ళమని కోరినట్లు వనవాసమై పోయినతరువాత నిద్రాదేవి తన్నావహించి నందుకు నవ్వినట్లు తెల్పినాడు. లక్ష్మణుని చంపదలచిన రాముడు తన పాపమునకు ప్రాయశ్చిత్తమేమిటని వసిష్ఠు నడుగగా, లక్ష్మణునిపాదములు తాకిన పాపపరిహార మగునని చెప్పును. లక్ష్మణుని నిద్ర కేర్పాటుగానించి, అతడు నిద్రించుచుండగా రాము డాతని పాదములను తాకును. ఆ తాకిడికి లక్ష్మణుడులేచి తన పాదములదగ్గ రున్న అన్నను చూచి ఆశ్చర్యపడును. తరువాత రాము డతని కౌగిలించుకొని రాజ సభకు తీసికెళ్ళును.

ఇట్లు రంగనాథ రామాయణమునందు కంబరామాయణమందు కంటె, తది తర తెలుగు రామాయణము లన్నిటికంటె అవాల్మీకములగు కల్పనలు అధికముగా నున్నట్లు పైని పేర్కొనిన వానినిబట్టి స్పష్టముగా తెలియుచున్నది. రంగనాథ, కంబరామాయణములు ప్రధానముగా వాల్మీకి రామాయణాను సారులేయైనను అధ్యాత్మ రామాయణానుసారముగ రంగనాథ రామాయణమును, పద్మపురాణము ననుసరించి కంబరామాయణమును అవాల్మీకాంశములను కొన్నిటినిచేర్చి రచించి యున్నట్లు తోచుచున్నది.

## 38. పాత్రచిత్రీకరణములో రంగనాథ కంబరామాయణముల సామ్యము :

పాత్రపోషణ విధానమునందుకూడ కంబకవికి, గోన బుద్ధారెడ్డికి పోలిక కలదు. కంబరామాయణమునందువలెనే తెలుగు రామాయణ కర్తలందరుకూడ రాముని భగవదవతారముగ పరాత్పరునిగ సంభావించినారు. రంగనాథ రామాయణమున ద్రష్టలైన విశ్వామిత్రాది మహాఋషులేకాక ప్రత్యర్థులైన రాక్షసవీరుల పక్షములోని వారలైన కైకేసి, మండోదరి, విభీషణుడు మొదలగువారి అభిప్రాయములు రాముడు సాక్షాద్విష్ణుస్వరూపుడని భక్తితో కీర్తించినట్లే యున్నది. దేవతలు, మహర్షులు, మానవులు, రాక్షసులే కాదు, మాటవచ్చుటలేని తిర్యగ్జాతికిచెందిన ఉడుతకూడ సేతుబంధనమున రామునికి భక్తితో సహాయమొనరించినది. తిర్యక్కు-కూడ రాముని ఆదిదేవునిగ గ్రహించి భక్తిపారవశ్యమున మునిగినదనిన అతిశయోక్తి కాదు. శ్రీరాముని దైవత్వము చాలచోట్ల స్పష్టపరుపబడినది.

శ్రీరాముడు రావణవధానంతరము కొంతకాలముగా లంకలో పరపురుషుని గృహమునందుండిన సీతను పరిగ్రహించుటకు నిరాకరించును. అపుడతడు సీతా మనోహరుడుమాత్రమేకాక అయోధ్యానగర ప్రజానాథుడు కూడ. సామ్రాజ్యమునకు పట్టమహిషికాబోవు సీత శీలము శంకరహితముగా నుండవలెను. అందువలన రామచంద్రప్రభువు రాజధర్మానురక్తియై నిర్దాక్షిణ్యముగ ఆమె పాతివ్రత్యమును నిరూపించుటకు అగ్నిప్రవేశము గావించుటకు ఆజ్ఞాపించును. సీతయు లోకాపవాదముకంటె అగ్నిప్రవేశమే ఉత్తమమని భావించును. కాని సత్యము నెరిగిన అగ్ని ఆమెను స్పృశింప సాహసింపలేదు. అప్పుడు పరలోకమునయున్న దశరథుడు ప్రత్యక్షమై సీత శీలవతి, పతివ్రతయని చెప్పి సీతాపరిగ్రహణమునకు రాముని యొప్పించును. ఈ ఘట్టమున సీతారాముల పాత్రపోషణము కంబరామాయణమున ఉదాత్తముగ పోషింపబడినది. కంబరామాయణమున రాముడు కైకను ఏ సందర్భమునందును దూషణోక్తులాడక భక్తితో గౌరవించినాడు. రాముడు గుహుని, హనుమంతుని, సుగ్రీవుని, అంగదుని, విభీషణుని తన సోదరులుగ సంభావించినట్లు కంబరామాయణమున చిత్రింపబడినది. రాము డెప్పుడును తన గొప్పతనమును తానుగా చెప్పికొనడు. అట్టియెడ లక్ష్మణుడు రామునిగురించి తెలుపును. రాముని విశ్వమానవప్రేమను, సౌభ్రాతృత్వమును కంబకవి పెక్కుచోట్ల తన రామావతారమునందు వ్యక్తము చేసినాడు.

ప్రధానపాత్రలగు సీతారాములను మాత్రమేకాక ఇతరపాత్రలను పోషించు టలో కూడ కంబకవి ప్రత్యేకశ్రద్ధనే కనుపరచినాడు. ప్రతినాయకుడగు రావణుడు వేదాధ్యయనపరుడని, గాయకుడని, శివభక్తుడని - కంబకవి పేర్కొనెను. రావణుడు గొప్ప వైణికుడట. అతని ధ్వజమునందు వీణె యుండెనట. రావణుడు, లక్ష్మ ణుడు, గుహుడు, వాలి సుగ్రీవులు, విభీషణ కుంభకర్ణులు, ఇంద్రజిత్తు మొదలైన సర్వపాత్రముల చిత్రణలో కంబకవి లోకపరిశీలనాదృష్టి, మనోవిశ్లేషణసామర్థ్యము గోచరించుచున్నది. హనుమంతు డొక వీరయోధునిగా వర్ణింపబడెను. రాజుగా కాక రామభక్తునిగా కంబకవి గుహుని చిత్రించినాడు. కాళహస్తి కన్నప్ప కథను మనసు నందుంచుకొని కంబకవి గుహుని చిత్రించినట్లు విమర్శకులు చెప్పుదురు.

కంబరామాయణములో స్త్రీ పాత్రము లుదాత్తముగా చిత్రింపబడినారు. వారినిగురించి అసభ్యములు, అశ్లీలములునగు విషయములు కంబరామాయణమున కానరావు, 'ఇలా సర్వపాత్రములనూ సమప్రాధాన్యంతో చిత్రించడంచేతనే అతడి (కంబకవి) కావ్యానికి సర్వాంగశోభితమైన సమగ్రమైన ఒక సౌందర్యం సమ కూరిందని చెప్పవచ్చు. అతడి రామాయణం ఒక మహాసౌందర్యరాశి. ఒక 'మహా రసభుని' అని డాక్టర్ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారి వాక్యములు ఈ సంద ర్భమున స్మరింపదగినవి.

గోన బుద్ధారెడ్డికూడ పాత్రచిత్రీకరణమునందు కంబకవివలె ప్రత్యేకశ్రద్ధను కనపరచినాడు. రంగనాథ రామాయణమున రాక్షసులందరు రామభక్తులుగ, గుణ గ్రహణ పారీణులుగ చిత్రింపబడినారు, కుంభకర్ణుడు తన అన్నకొరకు జీవిత సర్వస్వముకూడ త్యాగముచేసిన గుణసంపన్నుడు, మండోదరి, సులోచనల పతిభక్తి, ధీశక్తి, రామభక్తి రంగనాథ రామాయణమున మెచ్చుకొనదగినది. రాక్షసులందును సాధ్వీమతల్లు లున్నారని సులోచనా వృత్తాంతము తెల్పుచున్నది.

ఇట్లు ప్రచారము, చందస్సు, అవాల్మీకములైన కల్పనలు, పాత్రపోషణము అను నాల్గు అంశములందు రంగనాథ, కంబరామాయణములకు చక్కని సామ్యము గోచరించుచున్నది.

# ఉపయుక్త గ్రంథసూచి

తెలుగు :


1. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి *దక్షిణ భారత సాహిత్యములు* (1962).
2. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి *ఉత్తర భారత సాహిత్యములు* (1965).
3. ఆరుద్ర. 'రాముడికి సీత ఏమౌతుంది' ఆంధ్రజ్యోతి (దినపత్రిక). ఆదివారం అనుబంధము (1976 మార్చి 31 నుండి మే వరకు).
4. కోదండరామయ్య. తిమ్మావజ్ఝల - 'మహారసధుని : కంబరామాయణ వైశిష్ట్యము' - ఆంధ్రప్రభ (దినపత్రిక) ఆదివారం అనుబంధము. (1973 ఫిబ్రవరి 4 వ తేది).
5. ద్రోణప్ప. తూమాటి. 'రంగనాథ రామాయణ వైశిష్ట్యం' *తెలుగులో కొత్త వెలుగులు* (ప్రథమ సంపుటి) (1972).
6. దొరసామి శర్మ. రావూరి. *తెలుగు సాహిత్యము-రామకథ* (1972).
7. నాగయ్య. జి. *ద్విపద వాఙ్మయము* (1967)
8. ప్రతాపరెడ్డి. సురవరం. *రామాయణ విశేషములు*. ఆంధ్ర రచయితల సంఘం. హైదరాబాదు. (1957)
9. *భాస్కర రామాయణము.*
10. బుద్ధారెడ్డి. గోన. *రంగనాథ రామాయణము.* (సోమశేఖర శర్మ. మల్లంపల్లి వారి పీఠికతో) రాయలు అండు కో. కడప. (1957).
11. *మొల్ల రామాయణము.*
12. లక్ష్మీకాంతము. పింగళి. 'రంగనాథ రామాయణ పీఠిక' *గౌతమవ్యాసములు.*
13. వెంకటేశ్వరశాస్త్రి. జొన్నలగడ్డ. *మలయాళ భాషా సాహిత్యాలు (సంగ్రహ చరిత్ర)*. ఆంధ్ర సారస్వత పరిషత్తు. హైదరాబాదు. (1968).
14. వేంకటేశ్వరరావు. నార్ల. *జాబాలి* (ఏకాంక రూపకం) నవోదయ పబ్లిషర్స్. విజయవాడ. (1974).
15. శమంతకమణి. పండా. *తెలుగు సాహిత్యములో రామకథ*. ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రచురణ. హైదరాబాదు. (1972).

16. శ్రీరామశాస్త్రి, చిలుకూరి. *ఆనంద రామాయణము (తెలుగు అనువాదము)*. ఆనంద రామాయణం కార్యాలయము, కంకిపాడు. (1956).

17. శ్రీరాములు రెడ్డి. పూతలపట్టు. *కంబరామాయణము (ఆంధ్రానువాదము)*. 2 సంపుటములు. ప్రగతి ప్రచురణ. హైదరాబాదు. (1988).

18. సత్యనారాయణశాస్త్రి. మధునాపంతుల. *తెలుగులో రామాయణములు*. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ. (1975).

**English :**

1. Achyuta Menon, C. *Ezuttaccan and His Age.*

2. Krishna Sarma, E. R. (Ed.) *Rāmāyana Samīkshā.* S. V. University Publication (1967)

(a) Bhagani, H. C. 'The Narrative of Rama in the Jain Tradition'.

(b) Bhagiratha, Misra - 'The Ramayana Theme in Hindi Literature'.

(c) Ezherthachan, K. N. 'The Ramayana in Malayalam'.

(d) Kodandaramaiah, T. 'The Ramayana Theme in Telugu Literature'.

(e) Subbarayachar, U. K. 'The Ramayana Theme in Kannada Literature'.

3. Meenakshi Sundaram, T. P. *A History of Tamil Literature.* Annamalai University, Annamalai Nagar, (1965).

4. Rice, E. P. *History of Kanarese Literature.* The Heritage of India Series, Calcutta. (1921).

5, Ruknidevi, 'Ramayana the world over' - *Triveni,* July - September, (1975),

6. Sarma, C. R. *The Ramayana in Telugu and Tamil - A Comparative study* (Thesis approved for the Ph. D. Degree of Madras University, (1973). Lakshminaraya Grandha-mala, Madras-24.

2

# దాక్షిణాత్య సాహిత్యములు - దేశి:

కన్నడాంధ్రసాహిత్యములందు సంస్కృతప్రాబల్యము అధికమేకాక అత్యంత ప్రాచీనముకూడ. మలయాళముపై సంస్కృతప్రభావము అధికతరమైనను అది అర్వాచీనమైనది మాత్రమే. క్రీస్తునకు పూర్వమే అగస్త్యుడు మొదలగు వైదిక మతానుయాయులగు ఆర్యమహర్షులు, బౌద్ధభిక్షువులు, జైనమతస్థులు కొందరు ఉత్తరదేశమునుండి తమిళదేశమునకు తరలివచ్చి అచట స్థిరనివాస మేర్పరచుకొని తమ మతములను ప్రచారము కావించుసందర్భమున తమిళభాషపై సంస్కృత భాషాప్రభావ మేర్పడుట కవకాశము ఏర్పడినది. కాని వింధ్యపర్వత దక్షిణభాగము నందలి తెలుగు కన్నడ దేశములందువలె తమిళదేశము ఆర్యజనాక్రాంతము కాలేదు, ఉత్తరదేశీయులగు రాజుల పరిపాలన ప్రాభవములకు తమిళ మలయాళ దేశములు లోనుకాలేదు. కనుకనే క్రీస్తుశకారంభమునాటికే తమిళమున సంస్కృత నిరపేక్షమైన, స్వతంత్రమైన దేశి సాహిత్యరచనలు దేశీయప్రభువుల ఆదర ప్రోత్సాహములతో సంకలితములై సంరక్షింపబడినవి. సంస్కృతభాషా సాహిత్య సంప్రదాయరీతులు దాక్షిణాత్యభాషలలో ననుసరింపబడినరీతియే 'మార్గ' పద్ధతి. ఈ దాక్షిణాత్య భాషాసాహిత్యములకు సహజము, సమానమునగు సంప్రదాయ పద్ధతియే 'దేశి'. తమిళభాషా సాహిత్యములందు సంస్కృతప్రభావ మత్యల్పమగుటచే అందు 'మార్గ' పద్ధతి కొంత ప్రవేశించినను 'దేశి' పద్ధతియే బాగుగా కుదురుకొనినది. కన్నడాంధ్రములందు 'మార్గ' పద్ధతికే పైచేయి. ఈ భాషలందు 'దేశి' రచనాపద్ధతి కొంత వెనుకబడిపోయినను, కేవల మడుగంటిపోకుండ 'దేశిమార్గములను దేశీయములు'గా చేయుప్రయత్నములు కొనలు సాగినవి. కాని కన్నడాంధ్రములందలి 'దేశి' రచనలు కాని, 'దేశి' పద్ధతులు కాని 'మార్గ' పద్ధతులవలె పండితుల దృష్టి నంతగా నాకర్షింపలేదు. తమిళ, కన్నడ, తెలుగు, మలయాళ సాహిత్యము

లందలి 'దేశి' రచనలలోని సామ్యమును సమగ్రముగ, తులనాత్మకముగా నిరూపించుట ప్రస్తుతవిషయము. ఈ అంశమును నిర్ణయించుటకుముందు దేశి సంప్రదాయమన నేమో తెలిసికొందము.

## 1. మార్గ - దేశి సంగీతములు :

వాల్మీకి విరచిత రామాయణమును కుశలవులు 'మార్గవిధాన'మున పాడినట్లు వాల్మీకి రామాయణమువం దిట్లు కలదు.

'తతస్తుతౌ రామవచః ప్రచోదితా
వగాయతాం మార్గవిధాన సంపదా
స చాపి రామః పరిషద్గత శ్శనై
ర్బుభూషయా సక్తమనా బభూవ.'

—బాలకాండము, చతుర్థసర్గ - 31 శ్లోకము.

దీనినిబట్టి వాల్మీకి రామాయణకాలమునాటికే సంగీతమున మార్గదేశిభేదములు ప్రచారమున నున్నట్లు తెలియుచున్నది. తంత్రీలయబద్ధముగా, నియమపూర్వకముగా, సంప్రదాయసిద్ధముగా సంస్కృతభాషా రచితములైన కావ్యములను గానము చేయుట 'మార్గపద్ధతి' అని, ప్రాకృతభాషా రచితములైన గేయములను పాడుట 'దేశిపద్ధతి' అని రామాయణవ్యాఖ్యాతలు కొందర భిప్రాయపడినారు.

సంగీతశాస్త్ర గ్రంథములందు 'మార్గ-దేశి' భేదములకు లక్షణనిర్దేశము చేయబడినది. గీతము, వాద్యము, నృత్తము అను మూడును సంగీతమనబడును. ఆ సంగీతము మార్గ-దేశి భేదములచే ద్వివిధములని, బ్రహ్మాదులచే సృష్టింపబడి పరమేశ్వరుని సముఖమున భరతాదులచే సంస్కృతమున ప్రయోగింపబడినది 'మార్గ' మని, ఆయాభాషలలో ఆయా దేశీయులైన జనులకు హృదయరంజకమగునది 'దేశి' అని శార్ఙ్గదేవుడు (క్రీ.శ. 1230) సంగీతరత్నాకరమున ఇట్లు తెల్పినాడు.

'గీతం వాద్యం తథానృత్తం త్రయం సంగీతముచ్యతే
మార్గో దేశీతి తద్ద్వేధాతత్ర మార్గస్స ఉచ్యతే
యో మార్గితో విరించాద్యైః ప్రయుక్తో భరతాదిభిః
దేవస్య పురత శ్శంభోః నియతో భ్యుదయప్రదః

దేశే దేశే జనానాం యద్రుచ్యా హృదయరంజకం
గీతం చ వాదనం నృత్తం తద్దేశీ త్యభిధీయతే.'

—సంగీతరత్నాకరము-ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీ వారి ప్రచురణ.
(1968) ప్రథమభాగము-1[illegible]8 పుట.

వినయమనహితమై, శాస్త్రీయమైనది మార్గరాగమని, స్థిరవిషయము సహితమైనది దేశి రాగమనియూను శార్ఙ్గదేవుడు సంగీతరత్నాకరమున మార్గ-దేశి రాగములను వివరించియున్నాడు. బుద్ధిగమ్యమైనది మార్గసంగీతము. హృదయరంజకమైనది దేశి సంగీతము. కాశీనాథుడు సంగీత[illegible] అనందురు. రామయామాత్యుడు స్వరమేళ కళానిధియందును సంగీతమున మార్గ-దేశి భేదములను పేర్కొనినారు. శార్ఙ్గదేవుడు మార్గసంగీతమును 'గాంధర్వ'మని దేశి సంగీతమును 'గాన'మని వ్యవహరించినాడు. ఈ గాంధర్వము గానాశ్రయము, తాళాశ్రయము, పదాశ్రయము అని మూడువిధములుగ భరతుడు నాట్యశాస్త్రమున చెప్పినాడు. గాంధర్వము అనాది సంప్రదాయసిద్ధము, అపౌరుషేయము, లక్షణప్రధానము, పండితజనరంజకము నయినది. ఇక 'గానము' కామచారప్రవృత్తిగలదై నానాదేశజనులచే రుచ్యనుగుణముగా నిత్యనూతనముగా ప్రయుక్తమై, సామాన్యజనరంజకమై లక్ష్యప్రధానమైనది. స్వరయుక్తముగా వేదములను గానముచేయు విధానము మార్గపద్ధతి. సంగీతమున మార్గ-దేశి భేదములు నేటికిని గుర్తింపబడుచున్నవి. కర్ణాటకసంగీతము (Classical Music) ను మార్గసంగీతమని, లలితసంగీతము (Light Music) ను దేశిసంగీతమని నేడు వ్యవహరించుట కలదు.

## 2. మార్గ-దేశి నాట్యములు :

సంగీతశాస్త్రమునందేకాక నాట్యశాస్త్రమునందును మార్గ-దేశి భేదము చెప్పబడినది. ధనంజయుడు (క్రీ.శ. 950) దశరూపకములో నృత్యము భావాశ్రయమని, నృత్తము తాళ లయాశ్రయమని వివరించి, అందు పదార్థాభినయమైన నృత్యము 'మార్గ'మని, నృత్తము 'దేశి' అని ఇట్లు తెల్పినాడు.

'అన్యద్భావాశ్రయం నృత్యం నృత్తం తాలలయాశ్రయమ్
ఆద్యం పదార్థాభినయో మార్గో దేశీ తథాపరమ్
మధురోద్ధత భేదేన తద్ద్వయం ద్వివిధం పునః
లాస్య తాండవరూపేణ నాటకా ద్యుపకారకమ్.'

—దశరూపకము - 1-9.

నృత్య, నృత్తములను మార్గ-దేశి శబ్దములతో మొదట నిర్దేశించినవాడు ధనంజయుడే. దశరూపకమును ఆంగ్లములోనికి పరివర్తింపజేసిన ప్రొఫెసర్ 'హాస్' (Hass) దొర 'మార్గ' పద్ధతిని, 'Higher Style' అని 'దేశి' పద్ధతిని 'Lower style' అని వ్యవహరించినాడు.

ఇళంగో అడిగళ్ (క్రీ.శ. 2 వ శతాబ్ది) రచించిన 'శిలప్పదిగారము' అను తమిళ పంచమహాకావ్యమునందు 'చోళన్ కరిగాల్ పెరువళత్తాన్' అను రాజాస్థానమునందలి రంగాధిరోహన మహోత్సవసందర్భమున 'మాధవి' అను నర్తకి చేసిన 'ఇరువహై క్కూత్తిన్ ఇలక్కణం అరింద్' అను ద్వివిధములగు నాట్యముల ప్రసక్తి కలదు. శిలప్పదిగారమునకు వ్యాఖ్యానమును రచించిన అడియార్ నల్లార్ అను తమిళవిద్వాంసుడు ఇయ్యల్పుకూత్తు' అనునది మార్గనాట్యమని, 'దేశికూత్తు అనునది 'దేశినాట్య'మని వ్యాఖ్యానించినాడు. దీనివలన క్రీ.శ. 2-వ శతాబ్దమున తమిళమునందలి నాట్యమునకూడ మార్గ-దేశి భేదములున్నట్లూహింపవచ్చును.

తమిళనిఘంటువు (Tamil Lexicon) నందు 'మార్గ-దేశి' భేదములకు సంగీత, నాట్యపరములగు అర్థములు కలవు.

'మార్గమ్' = A kind of dance.

'దేశి' = A mode of dance; దేశికమ్ = A kind of dance. మార్గరాగమ్ = Musical modes in vogue from ancient times, దేశిరాగమ్ = A specific melody type.

జాయపసేనాని (క్రీ.శ. 1253) సంస్కృతమున రచించిన 'నృత్తరత్నావళి' అను నాట్యశాస్త్రగ్రంథమునందు తనకాలమున తెలుగుదేశమున వ్యాప్తిలోనుండు పేరణి, చర్చరి, దండలాసక, ఘటిసరి, బహురూపము, చిందు, కోలాటము మొదలగు దేశి నృత్తపద్ధతులను వర్ణించినాడు. శ్రీనాథుడు (క్రీ.శ. 15 వ శతాబ్ది) కాశీఖండమున దక్షారామక్షేత్ర సందర్భములో 'శివివారోత్సవ వేళఁ గన్గొవియె నా స్థానంబునఁ రాజనందనయుం దానును దేశిమార్గమున గంధర్వాప్సరోనృత్తముల్' అని నృత్యములోని మార్గ-దేశి భేదములను పేర్కొనినాడు.

## 3. మార్గ-దేశి భాషలు:

**సంగీత, నాట్యములందలి మార్గ-దేశి విభేదము భాషావిషయమునకూడ అన్వయింపబడుచున్నది. సంస్కృతభాష మార్గవిధానమునకును, దేశజముల వ్యవ**

హారమునందున్న ప్రాకృతభాషలు దేశి విధానమునకు చెందునని కొందరి అభి ప్రాయము. క్రీ.శ. 8 వ శతాబ్దివాటిదగు 'లీలావతి కథ' అను ప్రాకృతగ్రంథావతారికలోని ప్రసంగమునుబట్టి ప్రాకృతభాష దేశిపద్ధతికి చెందినదనుభావము స్ఫురించుచున్నట్లు తోచును. 'దేశి' ప్రాకృతపాఠ్యభేదమునే భరతుని నాట్యశాస్త్రమందును చెప్పబడినది.

సంస్కృతము నియతలక్షణములుగల ప్రామాణికభాష. తమిళ కర్ణాటాంధ్ర మలయాళాది దేశభాషలకు మొదట నియమాదులేవియు లేకున్నను కాలక్రమమున నియతలక్షణము లేర్పరచబడినవి. కాని అవి జీవద్భాషలగుటచే స్థిరత్వములేక దేశకాలోచితమగు మార్పు కూర్పులకు లోనయినవి. పైగా ఈ దేశభాషలు సంస్కృతమువలె అనాదిసిద్ధములు కావు. కనుక ఆంధ్ర కర్ణాటాది దేశభాషలన్నియును దేశి విధానమునకు చెందునని కొందరు విశ్వసించిరి.

కన్నడమునకు ప్రామాణికమైన నిఘంటువును రచించిన 'కిట్టెలు' దొర 'దేశి = The language or dialect of a country' అనియు, 'దేశియ' = Peculiar or belonging to a country or Province, Provincial in nature' అను నర్థములను చెప్పినాడు. డాక్టర్ గుండర్టు కూడ 'దేశ్యం = belonging to a country' అని తన మలయాళ నిఘంటువునందు అర్థము చెప్పినాడు.

## 4. కన్నడములో మార్గ-దేశి కవితాప్రస్తావన :

మార్గదేశిభేదము సంగీత నాట్యభాషావరముగనే కాక కవిత్వవిషయమున కూడ అన్వయింపబడుచున్నది. కవిత్వమున మార్గ-దేశి భేదములను పాటించుట మొదట కన్నడభాషయందు జరిగినది. లభ్యమైన కన్నడగ్రంథములలో మొట్ట మొదటిది కవిరాజమార్గము. ఇది కన్నడలక్షణ గ్రంథములలో మొదటిదికూడ. దీనిని నృపతుంగుడను నామాంతరముగల అమోఘవర్షుడను (క్రీ.శ. 815-877) రాష్ట్రకూట చక్రవర్తి రచించినాడు. కవిరాజమార్గ ప్రారంభమున పేర్కొనబడిన బెదండె, చెత్తాణె అను కావ్యభేదములు రెండును కన్నడదేశి రచనలుగా భావింపబడుచున్నది. కవిరాజమార్గమున 'పళగన్నడము' ను గురించిన ప్రస్తావనలో దేశిని గురించిన వివరములు తెల్పబడినవి.

పంపకవి విక్రమార్జున విజయము (1-8) నందు మార్గ-దేశి కవితావిధానములని ట్లు ప్రస్తావించినాడు.

'బగెపొన తప్పుదాగి మృదుబంధ దొళొందువుకొంది దేసియొళ్
పుగువుదు పొక్కుమార్గదొళె తప్పదు తక్కొతి కావ్యబంధ మొ
ప్పుగు మెళమావు కెందళిర పూవిన బుణ్పొదెయొళం బిబల్దుతుం
బిగళిసె తుంబి కోగిలెయె బగ్గిపెనుగ్గి యొళొప్పు వంతెవొల్.'

రన్నకవి 'గదాయుద్ధము'న 'నెళెల్ద రసం మనం గొళిసె మార్గమొదంబడె దేసికబ్బ మంబిగె గొళలింతు పెళ్దుదు' అని 'మార్గమొదంబడు' నట్లు దేశి కావ్యమును రచించినట్లు తెల్పినాడు. మల్లికార్జునుని సూక్తిసుధార్ణవములో దేశిమార్గములిట్లు ప్రస్తావింపబడినవి.

'పదవిన్యాసన దేశిమార్గద విలాసం రూఢిపెత్తంగ హా
రదలంకారద బంధబావదెసకం మెల్పాది నొల్‌బందుకో
డిద నానారస సారదాన మెసెదత్తెం దొడ్డు కెయ్కొండు మె
చ్చిదనా సూక్తిసుధార్ణ వాద్యకృతిపాత్ర శ్రీగె సోమేశ్వరం.'

ఇట్లు కన్నడమున కవిరాజమార్గకాలమునుండియు మార్గ-దేశి భేదములు కవిత్వపరముగ పాటించు సంప్రదాయమున్నట్లు తోచును. సంస్కృత కావ్యలక్షణముల కనుగుణముగనే కన్నడ దేశి కావ్యములను రచించినట్లు పంపాది కన్నడ కవులు తెల్పినారు. మార్గ-దేశి విధానములను కలిపిచెప్పుటయే కన్నడ కవుల కవి మతమని వారి మార్గ-దేశి విధానప్రకారంపనుబట్టి గ్రహింపవచ్చును.

## 5. తెలుగు సాహిత్యములో మార్గ-దేశి ప్రస్తావము :

తెలుగులో మార్గదేశి పదములను కవిత్వపరముగా వాడిన మొదటికవి నన్నెచోడుడు (క్రి. శ. 1130). కన్నడ కవుల కవితాసంప్రదాయములను పెక్కు సందర్భములం దనుసరించిన నన్నెచోడుడు మార్గదేశి విభేదముల ప్రస్తావమును కన్నడమునుండియే గ్రహించియుండును. నన్నెచోడుని కుమారసంభవ పీఠిక యందు మార్గ-దేశి భేదముల ప్రస్తావము నాలుగుచోట్ల కలదు. నన్నెచోడుడు కుమారసంభవ పీఠికలో,

'మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్రవిషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్.'

అని చాళుక్యరాజాదులగు పలువురు దేశికవితను పుట్టించి తెలుగుదేశమునందు నిలిపిరని తెల్పియున్నాడు. సంస్కృతకవిత 'మార్గ'మని, దేశిభాషలలోని కవిత 'దేశి' అని ఈ పద్యమునుబట్టి కొందరు అభిప్రాయపడిరి. 'మును మార్గకవిత లోకంబున వెలయగ' అనుటచే సంస్కృతకవిత్వము ఆంధ్రదేశమునందే కాక కన్నడాది దేశములందును చాలకాలమునకుముందే వ్యాప్తి గాంచినట్లు భావింపవచ్చును. నన్నయకు పూర్వము కావనాదులందు తెలుగుపద్యములను వెలయింపుటకు కారణభూతులైన గుణగవిజయాదిత్యుడు మొదలగు చాళుక్యరాజాదులనే నన్నెచోడుడు పై పద్యమున పేర్కొనియుండును. నన్నెచోడుడు వ్యాస, వాల్మీకాది ప్రస్తుతమతులైన పురాణ కవిసంఘమును, కాళిదాస, భారవి, ఉద్భట, బాణాది 'ఉత్తమమార్గ సత్కవీశ్వరులను', 'దేశి సత్కవులను' కుమారసంభవమున స్తుతించినాడు. నన్నెచోడుడు స్తుతించిన ఈ 'దేశి సత్కవులు' పంపాది కన్నడకవులు కావచ్చును. లేదా నన్నయాది తెలుగుకవులు కావచ్చు. మతభేదమువలనను, అప్పటికి నన్నయ భారతము అధికప్రాచుర్య మందియుండకపోవుటవలనను నన్నెచోడుడు నన్నయను ప్రత్యేకముగ పేర్కొనకపోయియుండునని విమర్శకులు కొందరు భావింతురు. ఉత్కృష్టమార్గ కవులనినను, దేశి సత్కవులనినను నన్నెచోడునికి గౌరవభావమున్నది.

'మార్గకు మార్గము దేశియు
మార్గము వగవంగఁ దమకు మదివదలక దు
ర్మార్గ పదవర్తు లనఁదగు
మార్గవులం దలఁప నేఁటి మహి సుకవులకున్.'

అని నన్నెచోడుడు 'మార్గవులను (మాఱు+కవులను) పరిహరించినాడు. ఈ మార్గవులు 'మార్గ' కుమార్గమనియు 'దేశి' యమార్గమనియు వాదించి తృతీయ మార్గమగు మణిప్రవాళపద్ధతిని కవిత్వము చెప్పవలెనని అభిప్రాయపడెడి సంస్కృత భాషాదురభిమానులగు కవులు. దేశిభాషను సంస్కృతమునకలిపి మిశ్రమముగా

రచన చేసినచో మణిప్రవాళ మనబడును. నన్నెచోడుడు 'దుర్మార్గపదవర్తన'మని పరిహరించినది ఈ మణిప్రవాళమునే యని భావింపవచ్చును. నృపతుంగుడు కవి రాజమార్గములోను, కేతన ఆంధ్ర భాషాభూషణములోను మణిప్రవాళశైలిపట్ల విర సభావమును తెల్పియున్నారు.

'దేశిమార్గంబులు దేశీయములుగా' కవిత చెప్పవలెనని నన్నెచోడుడు కుమార సంభవ పీఠికలో తెల్పినాడు. మార్గకవిత్వమును దేశికవితకు సన్నిహితముగా చేయ వలెనని దేశి కవితారీతిని అధికతర దేశీయతాముద్రతో నలంకరింపవలెనని నన్నె చోడుని అభిప్రాయము. అతని కుమారసంభవమున దేశీయలక్షణములతోపాటు తమిళ కర్ణాట భాషలనుండికూడ కొన్ని దేశీయాచార సంప్రదాయములుకూడ కుదురు కొనినవి.

నన్నెచోడునికి తరువాత నృపధూర్జటి భీమయపండడు (క్రీ. శ. 1145) "దేశిమార్గములు ముట్టుపడునట్లు" కవిత చెప్పగలనేర్పును ప్రశంసించుకొనినాడు.

'తల(౦)పు సదర్థభావమున(౦) దగ్గతసూక్తుల(౦)గూడ వర్ణనల్
గొలుసు గొనంగ వ్రాసడులు గోరినభంగ్గిక వచ్చిముట్ట(౦) గో
మలగతి దేశిమార్గ్గములు ముట్టుపడం గ్గఱినంబులొప్ప నా
ద్యులక్రియ(౦) జెప్పనేర్చె నృపధూర్జటి భీమయపండ(౦) డిమ్మహిన్.'

—దక్షిణదేశ శాసనసంచయం-సంపుటము 6-సంఖ్య 103.

"ఆద్యులక్రియఁ జెప్పనేర్చె" అనుటచేబట్టి భీమయపండనికి పూర్వమే కొందరు కవులు దేశిమార్గములు కుదురుకొనునట్లుగా కవిత్వము చెప్పియుండురని ఊహింప వచ్చును. భీమయపండడు పేర్కొనిన 'ఆద్యులు' మార్గ-దేశి విధానములను కలిపి కవిత్వముచెప్పిన పంపాది కన్నడకవులు కావచ్చును. తత్సమ భాషాపదప్రయోగ మునను, దేశి భాషాపదప్రయోగ విషయమునను లాలిత్యమును తొణికిసలాడించు సిద్ధహస్తుడు భీమయపండడు.

## 6. మార్గ-దేశి : నిర్వచనము :

సంస్కృతకవిత 'మార్గ' మని, దేశభాషలలోని కవిత 'దేశి' అని కొంద రభిప్రాయము. కాని మార్గ-దేశి కవిత్వముల నిర్ణయము కేవలము భాషాభేదము నాశ్రయించినది కాదు. ఇతివృత్తము, భాష, ఛందస్సు మొదలగువాని విషయ ములో సంస్కృత సాహిత్య లక్షణప్రభావమునకు విధేయమైనదంతయు 'మార్గ'

మవి. తద్భిన్నమైనదంతయు 'దేశి' యని కొందరు వ్యాఖ్యానించిరి. కావి దక్షిణ దేశభాషలందు ముఖ్యముగా కన్నడాంధ్ర మలయాళ సాహిత్యములందలి ప్రాచీన దేశిరచన లనేకములు సంస్కృత పురాణేతివృత్తముల ననుసరించినట్టివే. కావున ఇతివృత్తమునుబట్టి పరిశీలించినవారికి మార్గకవిత్వమునకు చెందినవని చెప్పవలసి యుండును. కవిత్వమునందలి మార్గదేశి భేదములను పరిశీలించునపుడు కేవలము ఇతివృత్తమునేకాక కవిత్వాంగములైన భాష, భావము, పాత్రలు, రసము, ఛందస్సు, అలంకారములు, రీతి, పాకము, శయ్యాదులన్నిటిని దృష్టిలో నుంచుకొన వలసియుండును.

మార్గ-దేశిభేదము కేవలము ఒకానొక లక్షణభేదముచే భిన్నమనదగినది కాదు. ఇతివృత్తము, భాష, ఛందోలంకారాది లక్షణములనేకాక రచయిత దృక్పథమును అతడుద్దేశించిన పాఠకలోకమును జాతీయ జీవిత విలక్షణములనుకూడ ఆశ్రయించియుండును. సంస్కృత భాషాసాహిత్య లక్షణప్రభావము భాసింప జేయుచు, ఉభయభాషాపండితుల కుద్దేశింపబడి వారి ఆదరాభిమానములను అవి వార్యముగ నపేక్షించునట్టి ప్రౌఢకవిత 'మార్గ' కవితయనియు, ప్రత్యక్షసంస్కృత ప్రభావమును ప్రతిబింబింపజేయక కథావస్తువు, వర్ణనలు, భావము, భాష, రీతులు, అలంకారములు, కవి సమయములు, ఛందస్సు, సాహిత్య ప్రక్రియలు మొదలగు వానియందు దేశి లక్షణములను ప్రధానముగా నారోపించుకొని దేశీయ ప్రజాజీవితమునకు సన్నిహితముగ జనసామాన్యమున వ్యాప్తికొరకు ఉద్దేశింపబడిన ప్రజా కవిత 'దేశి' కవితయనియు స్థూలముగ నిర్వచింపవచ్చును.

## 7. దేశి కవితా భేదములు:

'మార్గ' మునందువలెనే 'దేశి' లోకూడ నిబద్ధము, అనిబద్ధము అని రెండు విధములను గుర్తింపవచ్చును. ఏ భాషాసాహిత్యము నందయినను మొదట దేశి కవిత్వమును అటుతరువాతనే మార్గకవిత్వమును వ్యాప్తికి వచ్చుచుండుట సహజము. మార్గకవిత్వ మొకవైపు శిష్ట సాహిత్యమున వెలసి సముచితస్థానము నంది యుండగా మరొకవైపు దేశికవిత్వము జనసామాన్యమున సృష్టింపబడి మార్గకవిత్వమునకు సమానాంతరముగ ప్రవర్ధిల్లుచుండును. ఇట్లు ప్రతిభాషయందును సంస్కృత లక్షణానుసారముగ రచింపబడినవానిని నిబద్ధమనవచ్చును. దేశీయ చ్ఛందములో దేశీయ సంప్రదాయానుసారిగ రచింపబడినది అనిబద్ధమని చెప్పవచ్చును. శిష్ట

లైన వృద్ధులకు సంబంధించినది నిబద్ధదేశి. ఇది పద్యకవితలో సమానమైనదగు పారస్వతప్రతిష్ఠను పొందినట్టిది. దేశీయమైన శుద్ధ దేశికవితకు సాంస్కృతికమైన ప్రౌఢసాహిత్యమునకు సామరస్యము కల్గించి ఉభయతారకముగ వాఙ్మయపథమున వెలసినది. వీనిలో తాళ్ళపాక అన్నమాచార్యులు, క్షేత్రయ్య, ఏగంటి, సారంగపాణి మొదలగువారి సుసంస్కృతములైన పదములు, కీర్తనలును, ఏలలు, జోలలు, సువ్వాలలు మొదలగు అసంస్కృతములైన పదకవితలును చేరియుండును. ద్విపదకావ్యములు, యక్షగానములు, శతకములు, ఉదాహరణములు, దండకములు, హరికథలు మొదలగునవి నిబద్ధదేశికి చెందిన ప్రక్రియలు. ఇక అనిబద్ధదేశి సామాన్యప్రజల ఆదరాభిమానములతో వ్యాప్తినొందిన ప్రజాకవిత్వము.

అనిబద్ధదేశిని పామరదేశి, జాతిదేశి అని రెండువిధములుగ విమర్శకులు విభజించినారు. చదువు సంధ్యలులేని పామరులకు సంబంధించినవి పామరదేశి. పల్లెపాటలు, వీరగాథలు మొదలగునవి ఈ తరగతికి చెందును. నాగరికవర్గముల లోని బాలబాలికలకు, స్త్రీలకు సంబంధించినది 'జాతిదేశి'. బాలగేయములు, స్త్రీల పాటలు మొదలగునవి ఈ తరగతికి చెందును.

నిబద్ధదేశి కవితాపద్ధతిలో ఇతివృత్తము, భాష, ఛందస్సు మొదలగునవి దేశి కవితాపద్ధతి కనుగుణముగా నున్నను, మార్గకవితాచ్ఛాయలుకూడ అందు చోటు చేసికొనినవి. అనిబద్ధదేశి కవితాపద్ధతిలో మార్గ కవితావాసన సాధారణముగ నుండదు. కాని పామరజన వ్యవహారమున నుండు అనిబద్ధ దేశికూడ దేశికవుల చేతిలోపడి 'నిబద్ధదేశి' యగుచుండుటయు కలదు.

మార్గ-దేశి కవితాపద్ధతులు రెండును ప్రత్యేకములని భావింపరాదు. వానిలో ఒండొంటి సంపర్కము నుండరాదనుటకును వీలులేదు. మార్గకవిత్వమందును దేశి కవితాచ్ఛాయలును, దేశికవిత్వమందు మార్గకవితావాసనలును కుదురుకొని యుండవచ్చును. అట్టి సందర్భమునందు బాహుళ్యమునుబట్టియే మార్గ-దేశి కవితాభేదము లను నిర్ణయింపవలసియుండును. మార్గకవితావాసన కల్గిన దేశిపద్ధతులకు లక్షణాది నియమములేర్పడి వానినుండి నూతనమగు దేశిపోకడ లేర్పడుటయు కలదు.

దక్షిణ దేశభాషలగు తమిళ కన్నడ తెలుగు మలయాళములం దన్నిటను కూడ ప్రారంభదశలో దేశికవితయే ప్రాచుర్యము వందినట్లు గుర్తింపవచ్చును. ఈ దక్షిణభారత సారస్వతములందు కథావస్తువు, భాష, ఛందస్సు, ప్రక్రియ అను వానిలో కవ్పట్టు దేశితనమును తులనాత్మకముగ చర్చించుట ప్రస్తుతవిషయము.

## 8. తమిళ సాహిత్యములో దేశి కవిత:

దక్షిణ దేశభాషలలో అతి ప్రాచీనమైనది తమిళము. క్రీ. పూ. 500 నాటికే అందు గణనీయమైన సాహిత్యమున్నట్లూహింపబడుచున్నది. తమిళమునం దున్నంత దేశితనము తక్కిన దక్షిణదేశ భాషాసారస్వతములందు కన్పట్టదు.

తమిళ సాహిత్యమున సంగయుగము క్రీస్తుపూర్వమే ప్రారంభమై క్రీస్తు తరువాత మొదటి శతాబ్దములో ముగిసెనని పలువురి అభిప్రాయము. తమిళదేశమున పండితులకు, కవులకు తగిన ప్రోత్సాహమిచ్చుటకై వారి వారి రచనలను పరీక్షించి ఆయా రచనల విలువలను నిర్ణయించు నిమిత్తమై ఆ దేశప్రభువులు పండిత పరిషత్తుల నేర్పరచిరి. ఆ పరిషత్తును 'సంగం' అని వ్యవహరింతురు. కవి సమూహమును 'సంగము' అని పేర్కొనవచ్చును. కవుల కృతులలోని బాగోగులను నిర్ణయించి సత్కార్యమొనర్చుటే సంగపు పని. సంగకవుల ఆమోదమును బడసిన గ్రంథము ప్రచారములోనికి వచ్చుచుండెను. తమిళమునందు కొన్ని శతాబ్దముల వ్యవధిలో ఒకదానివెనుక తలైచ్చంగము (తొలిసంగము), ఇడైచ్చంగము (మధ్యసంగము), కడైచ్చంగము (కడసంగము) అను మూడు సంగములు మధుర కపాడపురముల నేలిన పాండ్యరాజులచే నెలకొల్పబడి పోషింపబడినవి. సంగములు ఆమోదించిన గ్రంథములన్నిటిని సంకలనముచేసి కాలగర్భములో కలసిపోకుండ భద్రపరచియుంచుట జరిగినది. ఇఱైయనార్ (క్రీ. శ. 13 వ శతాబ్ది) 'అగప్పొరుళ్' నకు వ్రాసిన వ్యాఖ్యానములో ఈ మూడు సంగములకు సంబంధించిన వివరము లున్నవి. సంగయుగములో తమిళము సంపూర్ణముగా అభివృద్ధిపొందినదని అందరు అంగీకరింతురు. ఇది తమిళమున సువర్ణయుగముగకూడ పరిగణింపబడుచున్నది. సంగకాలమునందు సంస్కృత నిరపేక్షమైన స్వతంత్రదేశి సారస్వతమే వ్యాప్తికి వచ్చినది. సంగకవులు తమ భాషపవిత్రతను కాపాడుకొనుటయందు శ్రద్ధవహించినారు. వారు సంస్కృత భాషాప్రభావమును సహింపనివారుకూడ.

లభ్యమైన తమిళగ్రంథములలో మొట్టమొదటిది తొల్కాప్పియనార్ రచించిన 'తొల్కాప్పియము' అను లక్షణగ్రంథము. ఇది మధ్యసంగకాలములో వ్యాప్తికి వచ్చినది. ద్రావిడభాషావ్యాకరణము లన్నిటిలోను ఇదియే మిక్కిలి ప్రాచీనమైనది. తొల్కాప్పియమ్ క్రీ. పూ. 300 ముందే వ్యాప్తిగాంచినదని పలువురు విద్వాంసు లభిప్రాయపడినారు. తొల్కాప్పియమ్‌నందు సంస్కృతవ్యాకరణ

సంప్రదాయముల ప్రభావము కొంత కన్పట్టుచున్నను అందలి సాంకేతికపదము లందు, భావములందు, పద్ధతులందు స్వాతంత్ర్యము చూపబడినది.

తొల్కాప్పియమునందు మొదటి రెండు అధికారములు భాషాశాస్త్రమునకు సంబంధించినవి. మూడవదియగు పొరుళధికారము కావ్యవస్తువునకు సంబంధించి నది. శృంగారవీరరసములు, బాహ్యాభ్యంతర వస్తువులు, నాయికానాయకులు, దేశ కాలపరిస్థితుల కనువైన వస్తుచిహ్నరూపములగు కవి సమయములు, ఛందోలంకార ములు మొదలగువానినిగురించి పొరుళధికారము వివరించును. తొల్కాప్పియము లోని ఈ లక్షణగ్రంథ రచనాసంప్రదాయము దేశీయమైనది. తొల్కాప్పియము నందలి ఈ దేశి రచనాపద్ధతి తరువాత తెలుగు లక్షణగ్రంథములందుకూడ అనుస రింపబడినది.

తమిళమునందు నేడు మనకు లభ్యమైన ప్రాచీన కవితాసంకలనములలో ప్రసిద్ధిచెందినవి ఎట్టుత్తొగై, పత్తుప్పాట్టు, పదినెణ్ కీళ్కణక్కు అనునవి. ఇవి కడసంగకాలములో వర్ధిల్లినవి. భిన్నకాలములందు భిన్నభిన్న సందర్భములందు ఆయా కవులు చెప్పిన పద్యములందు కూర్చబడినవి. ఇవి బహుకర్తృకములు కూడ. ఎట్టుత్తొగై ఎనిమిదిగ్రంథముల బృహద్గ్రంథము. పత్తుప్పాట్టులో పది కావ్య ములును, పదినెణ్ కీళ్కణక్కులో పదునెనిమిది కావ్యములును కలవు. వీని యందలి రచనములన్నియు దేశి సాహిత్యమునకుచెందిన పదములు లేక గీతములే. ఇవి ఒక కథాకావ్యమునకు సంబంధించినవి కావు. ఇవి ఒకదానితో నొకటి సంబం ధములేని ముక్తక రచనలు. ఒక అనుపూర్వితోకూడిన కథను చెప్పుట సంగ యుగపు కవుల ధ్యేయము కాదు. నాటకీయసంభాషణలవంటి ఈ ముక్తక రచనలే తరువాతికాలములో కావ్యరూపము దాల్చినవి. ఈ సంకలనగ్రంథములలో అగనా నూరు, పురనానూరు అనునవి ప్రసిద్ధిచెందినవి. అగనానూరునందలి వస్తువు 'అగం' శాఖకు చెందినట్టిది. ఏకమనస్కులైన నాయికానాయకుల సంతోష పుర స్సరముగ వ్యక్తీకరించు మధురానుభూతియే 'అగం' అనబడును. ఇట్టి ప్రేమగీత ములు అనగా నూరులో నాలుగువందలున్నవి. ప్రేయసీప్రియుల వివాహాత్పూర్వ ప్రణయము వివాహానంతరప్రణయము, తరువాత వారికి కల్గిన వియోగము, అపుడు సఖులు నాయకను అనునయించుట మొదలగువిషయములు ఈ ప్రణయగీతికా సంపుటములో వర్ణింపబడును.

ఇక పురనానూరునందు 'పురం' శాఖకుచెందిన పద్యములు కలవు. ఇది

వీరగీతముల సంకలనము. ధర్మార్థముల సమన్వయమును 'పురం' అని వ్యవహరింతురు. పురనానూరులో కూడ నాలుగువందల గీతము లున్నవి. ఇందు తమిళ భూపతులగు చేర, చోళ, పాండ్య వంశీయులనుగురించి, వారి సామంతులను గురించి, వీరవరేణ్యులనుగురించి పెక్కు విషయములు ప్రస్తావింపబడినవి. సంగ కాలమునాటి చారిత్రక సామాజికవిషయము లెన్నియో పురనానూరునుండి తెలిసి కొనవచ్చును.

సంగయుగపు కాలమునందు వెలసిన సంకలనకావ్యములన్నియు అనువాదములు కావు. స్వతంత్రమగు దేశీయరచనలే.

కడసంగమునకుచెందిన కవులలో ప్రసిద్ధుడు తిరువళ్ళువర్. అతడు రచించిన 'తిరుక్కుఱళ్' తమిళ వేదముగా సంభావింపబడుచున్నది. 'కుఱళ్' కావ్యము రెండుపాదములుగల 'కుఱళ్' అను దేశిచ్ఛందమున కూర్పబడినది. సార్వజనీనములు, సార్వకాలికములునగు పెక్కు నీతిగీతములతో కూడినది. కడసంగకాలపు కవయిత్రి 'అవ్వై' ఆత్తిచ్చూడి, కొండ్రైవేంద్రన్, వాక్కుండాం, నల్వళి మొదలగు నీతిగ్రంథములను రచించినట్లు తమిళపండితులు తెల్పుచున్నారు.

ఇట్లు సంగకాలమునందలి తమిళవాఙ్మయమున స్వతంత్రత, దేశీయ కథా ప్రాబల్యము, దైనందిన జీవితప్రతిబింబనము కన్పట్టును.

తమిళ సాహిత్యచరిత్రమందలి జైన బౌద్ధయుగమున శిలప్పదిగారము, మణిమేకలై, జీవకచింతామణి, వళయాపతి, కుండలకేశి అను పంచమహాకావ్యములు వ్యాప్తిలోనికి వచ్చినవి. వీనియందలి ఇతివృత్తములు స్వతంత్రములు, దేశీయములు నయినవి. సంస్కృతసాహిత్యములో వీని కెట్టి సంబంధమును లేదు. శిలప్పదిగారము తమిళుల జాతీయమహాకావ్యముగ పరిగణింపబడుచున్నది. చోళదేశమున జన్మించి, పాండ్యమండలమున పాతివ్రత్యమునెరపి, చేరదేశమున తన తన భౌతికకాయమును వీడిన కణ్ణకి దివ్యచారిత్రము ఈ మహాకావ్యమున వర్ణింపబడినది. వేశ్యాగృహములో జన్మించినను వైభవముల కానపడక శ్రావికగా జీవితము గడిపిన మణిమేఖల దివ్యచరిత్రము వర్ణించుకావ్యము మణిమేకలై. దీనికి మణిమేకలై తుఱవు (మణిమేఖలా సన్న్యాసము) అనికూడ నామాంతరము కలదు. తమిళసాహిత్యమున శిలప్పదిగారము, మణిమేకలై అనునవి జంటకావ్యములుగ పేర్కొనబడుచున్నవి. ఇవి అనాటి తమిళుల సాంఘికజీవితమును చక్కగా ప్రతిబింబించుచున్నవి. తమిళ పంచమహాకావ్యములలో జైన బౌద్ధుల

ఆచారవ్యవహారములు, తాత్త్వికరహస్యములు ప్రసక్తానుప్రసక్తముగ వ్యక్తమగు చున్నవి. జైనకవి విరచితమగు 'నాలడియార్' చతుష్పది తిరుక్కురళ్‌వలె నీత్యు ద్బోధకమైన గ్రంథము. కొంగువేల్ రచించిన 'పెరుంకదై' అను జైనకావ్యము నందు సంస్కృతప్రభావము కలదని కొందరు తమిళవిద్వాంసు లభిప్రాయపడిరి. కాని ఆ కాలమునందు తమిళదేశమున వ్యాపించిన కథలను గ్రహించి కొంగువేల్ 'పెరుంకదై'ని స్వతంత్రముగనే రచించియున్న ట్లూహింపబడుచున్నది. 'పెరుం కదై' అను జైనగ్రంథము తమిళమున 'ఇయ్యేప్పు' అను కావ్యభేదమునకు చెంది నది. సుదీర్ఘ పద్యములతోకూడి, కథాత్మకమైన రచనముకల్గి ఒక్కొక్కపద్యమును అనునాసికముతో ముగియు కావ్యభేదమునకు 'ఇయ్యేప్పు' అని పేరు.

ఇట్లు జైన బౌద్ధయుగమువందలి తమిళకావ్యములలో సంస్కృతశబ్దములు, ఆర్యగాథాచ్ఛాయలు కొన్ని గోచరించుచున్నను అవి సంస్కృతానువాదములు కాక స్వతంత్రములై దేశీయేతివృత్తములతో శోభిల్లుచు, తమిళసాహిత్యము ఆదినుండి అనుసరించుచుండిన దేశి కవితాపద్ధతిని సంరక్షించుచున్నవి.

శైవ వైష్ణవాచార్యయుగమున ప్రచారములోనికివచ్చిన భక్తిరసప్రపూర్ణ మైన, మధురగేయమయమైన తమిళ సాహిత్యమంతయు దేశిపద్ధతికి చెందినట్టిదే. శైవులను నాయన్మారులను, వైష్ణవభక్తులగు ఆళ్వారులను సంస్కృతాభిజ్ఞులే యైనను భక్త్యుద్రేకమున వారు తమిళమునందు ప్రజలభాషలో గానానుకూలము లైన గీతములను రచించినారు. శైవగీతకదంబమునకు 'తిరుమురై' అనియు, వైష్ణవ గీతికాగుచ్ఛమునకు 'నాలాయిర దివ్యప్రబంధ'మనియు వ్యవహారనామములు కలవు. మాణిక్యవాచకర్ రచితమగు 'తిరువాచకమ్' అను కృతియందు శుద్ధ దేశి కవితాశాఖకు చెందిన అమ్మానై (అచ్చనగాయలాడు సందర్భమున స్త్రీలు పాడెడి పాట), తెళ్ళేణం (గొబ్బిపాట), పాళల్ (జోలపాట) మొదలగు గీతప్రభేదములు రచింపబడినది.

చోళుల పరిపాలనాకాలమున (క్రీ. శ. 850-1200) సంస్కృతభాషా సాహిత్యముల కాదరము లభించినందువలన సంస్కృత కావ్యానువాదములు, అను సరణములు కొన్ని తమిళమున వెలసినవి. వాల్మీకి రామాయణము ననుసరించి తమిళములో కంబకవి రచించిన రామావతారము ఈ కాలమునకు చెందినదే. కథా వస్తువువిషయమున సంస్కృతప్రభావము గోచరించుచున్నను కంబరామాయణము నందలి వర్ణనాంశములు పెక్కు దైనందిన తమిళజీవితమునుండి గ్రహింపబడి

తమిళ దేశి కవిత్వచ్ఛాయలతో నొప్పుచున్నవి. సంస్కృత కావ్యపద్ధతి అష్టాదశ వర్ణనలుకావి, గర్భబంధకవిత్వ రీతులుగావి కన్నడాంధ్ర సాహిత్యములందువలె తమిళమున అవలంబింపబడలేదు.

తమిళ సాహిత్యచరిత్రమునందు కవిత్రయయుగమున సంస్కృతకావ్యాను వాదములు, అనుసరణములు కొన్ని వెలసినను ఆ తరువాతికాలమున దేశి కవితా రచనలే హెచ్చుగా వెలువడి వ్యాప్తినందినవి. క్షీణయుగమునకు చెందిన అరుణగిరి నాథుని రచనలలో ప్రశస్తమైనది 'తిరుప్పుగళ్' అను గ్రంథము. అందు సుమారు వేయింటికిపైగా మధురగీతము లున్నవి. తమిళులు తమ జాతీయకవిగా సంభా వించు సుబ్రహ్మణ్యభారతి ఆధునిక తమిళ గేయ వాఙ్మయమును సుసంపన్న మొనర్చినారు. ఆతని కవిత్వమున గేయాంశముతోపాటు దేశి కవితారీతియు స్పష్ట ముగ గోచరించును.

## 9. ప్రాచీన తమిళ దేశ్యవిభాగములు :
### ప్రత్యేక కవి సమయములు :

తమిళుల సంస్కృతి ప్రాచీనకాలమందు దేశీయమైనది. వారి సాహిత్యము భౌతికపరిసరముల ప్రభావముమీద ప్రధానముగా ఆధారపడినది. వారిది భౌగోళిక పరిస్థితుల ననుసరించిన సాహిత్యము. చారిత్రకపరిస్థితులవలన యేర్పడిన సాహి త్యము కాదు.

తొల్కాప్పియమునందలి పొరుళ్ళదికారమున కావ్యములలోని శృంగార రసము కాని, వీరరసము కాని ఆయా దేశకాలవిభాగమున కనుగుణముగనే వర్ణింపబడవలెనని నిర్దేశింపబడినది. ప్రాచీన తమిళకవి సంప్రదాయముప్రకారము భౌగోళికముగా తమిళ దేశవిభాగము 'కురుంజి' (పర్వతప్రాంతము). 'పాలై' (మరుప్రదేశము లేక ఎడారి). 'ముల్లై' (అరణ్యప్రాంతము). 'మరుదమ్' (మాగాణిప్రదేశము). 'నైదల్' (సముద్రప్రాంతము) అని అయిదువిధములుగా చేయబడినది. ఈ ప్రదేశములందు జరిగినట్లుగా శృంగారవీరరస ప్రధానములైన ఇతివృత్తమును వర్ణించునపుడు కొన్ని ప్రత్యేక కవిసమయములు అందు పేర్కొన బడినవి.

'నాళ్ తిరునామము' (స్వస్తివాచకము లేక మంగళాశాసనము) అను తమిళ గ్రంథమునందుకూడ ఈ తమిళ దేశ్యవిభాగప్రసక్తి కన్పట్టుచున్నది.

తమిళ దేశ్యవిభాగమునందలి ఒక్కొక్క ప్రాంతమునకు చిహ్నములుగా కొన్నికొన్ని రంగులపుష్పములు, వృక్షజాతులు, వాద్యములు, జంతువులు, సంగీతము, దేవతలు, ఆహారము అను ఏడంశములు ప్రత్యేకముగా వర్ణింపబడవలయు నవికూడ ఒక నియమమున్నట్లు తొల్కాప్పియమునందు తెలుపబడినది. ఇవి ఏడును ఆయా దేశవిభాగములందలి తమిళప్రజల జీవితవిధానములపై ప్రభావము నెరపి, వారి గుణములకును, అలవాట్లకును, సంస్కృతికి, ప్రత్యేకతకు మూలకందము లయ్యెనని తమిళుల అభిప్రాయము.

'ముల్లై' అను భూభాగమునందు గార్హస్థ్య జీవితమును, 'కురంజి' యందు పర్వతప్రాంత నాట్యవిశేషమగు కొరవంజియు, 'మిరుదమ్' లో నాయిక దుఃఖము, వేశ్యాలోలత్వము, పతిత్వమును, 'నెయ్‌దల్'లో వివాహమునకుపూర్వము ప్రేమించుకొన్న ప్రేయసీ ప్రియులలో ప్రేయసి పడు బాధను, 'పాలై'లో పతీపతుల వియోగానంతర విరహబాధను వర్ణింపవలెనని చెప్పబడినది.

శృంగారము రసమైనప్పుడు నాయికా నాయకుల సమాగమము 'కురంజి' అనగా పర్వతప్రదేశములందు జరిగినట్లును, రాత్రి మొదటిజామున సంఘటిల్లినట్లును వర్ణింపబడవలెను యుద్ధాదివర్ణనము మొదట గోగ్రహణముతో ప్రారంభింపవలెను. అదియు 'కురంజి' అను పర్వతప్రదేశమునందే జరిగినట్లు సూచింపవలెను. దండయాత్ర కనువైనస్థలము 'ముల్లై' (అరణ్యప్రదేశము), ముట్టడి 'మరుదమ్' (మాగాణి) ప్రదేశమున జరిగినట్లును, యుద్ధము 'నెయ్‌దల్' (సముద్ర ప్రాంతము)నందు జరిగినట్లును సూచింపవలయును. విజయమునకు సంబంధించినది 'పాలై' అనగా ఎడారిప్రాంతము.

ఇక పుష్పములలో ఎర్రని రంగుగల 'వెచ్చి' రుధిరస్రావముగల యుద్ధమునకు సూచకములుగా వర్ణింపవలెను. పసుపు పచ్చనివగు 'వంచి' పువ్వులు అప్రతిహతశక్తి చిహ్నములు - తుంబె (ద్రోణ) పుష్పములు కోటను ముట్టడించువారిచే ధరింపబడును. 'వాహై' అను తెల్లనిపుష్పములు విజయచిహ్నములు.

ఇట్లు తొల్కాప్పియము పొరుళ్ళదికారమున తెలుపబడిన ఈ కవిసమయము లన్నియు దేశీయములేకాని సంస్కృతాలంకార శాస్త్రములకును, సంస్కృతకవి సంప్రదాయములకును ఏమాత్రము సంబంధించినవికావు. తమిళమునందలి ఈ ప్రత్యేక కవిసమయములు ఇతర దాక్షిణాత్యభాషలలోనికి స్వీకరింపబడలేదు.

పలువురు విమర్శకులు భావించుచున్నట్లు తమిళవాఙ్మయమే సంస్కృత ముతో సంబంధములేని ఒక మహాప్రపంచము. ఉడుకవాద్యముతో నడుమును పోల్చుట, వగడపారెలతో స్తనమండలమును పోల్చుట, తమిళవాఙ్మయమునకు ప్రత్యేకమైన, దేశీయమైన ఉపమానములుగా పేర్కొనవచ్చును. వివాహసమయ ములో తమిళులు గుప్పిటితో ఇసుక కుప్పలువేసి లెక్కించుట, 'వంచి' పూల మాలను ధరించుట అనునవికూడ మనకు క్రొత్తవిగా కన్పట్టును. శిలప్పదిగార ములో కన్నులు వేలాయుధమునకు పోల్చబడినవి. పాండ్యరాజులు యుద్ధసమయ ముందు వేపపూవులనో వేపరెగుళ్ళనో హారముగా ధరించెడివారట. ఇట్టివి లక్షణములయిన, స్వతంత్రములయిన దేశీయకవి సమయాదులెన్నియో తమిళ సాహిత్యమున కొల్లలుగా కలవు.

ఇతివృత్తము, వర్ణనాంశములు, కవిసమయములు, ఉపమానములు మొద లగువిషయములందేకాక కావ్యప్రక్రియలందును దేశ్యభిమానమే వ్యక్తమగు చున్నది.

## 10. తమిళ సాహిత్యప్రక్రియలు : దేశీయత :

తమిళ సాహిత్యమున ప్రసిద్ధికి వచ్చిన లఘుకావ్యభేదములు 96 వరకున్నట్లు తెలియుచున్నది. వీనిలో కొన్ని సంస్కృత సాహిత్యానుకరణములయినను తమిళ సాహిత్యమునకు విలక్షణములైన, స్వతంత్రములైన దేశీయప్రక్రియ లెన్నియో కలవు. తమిళ సాహిత్యములోని దేశిప్రక్రియలను స్థూలముగా పేర్కొం దము.

### (1) ఆట్రుప్పడై :

తమిళ సాహిత్యములో సంగయుగమునకు (క్రీ. పూ. 500—క్రీ. శ. 200) చెందిన 'పత్తుప్పాట్టు' అను సంకలనగ్రంథమందలి తిరుమురుగాట్రుప్పడై, పోరున రాట్రుప్పడై, సిరుప్పాణరాట్రుప్పడై, పెరుంపాణారాట్రుప్పడై, మలైపాడుకడామ్ అను అయిదును ఆట్రుప్పడై (Poems of a guide) ప్రక్రియకు చెందినవి. ఇది మార్గదర్శికావ్యము.

దానకర్తయైన ఒకానొక రాజుచే విశేషసత్కారములుపొందిన ఒక భిక్షుకుడు, తనవలె పేదవాడైన మరొక భిక్షుకుని రాజదర్శనమునకు వెళ్ళుమని ప్రబోధించుట

'ఆట్రుప్పడై' కావ్యములోని ముఖ్యవిశేషము. వదాన్యుడైన ఆ రాజు, అంతః పురమునకు వెళ్ళవలసినమార్గమును, ఆ మార్గమందు కనిపించు ప్రకృతిసంపదను, ఆ ప్రభువు ఈ భిక్షుకుని ఆదరించినతీరును, విందుభోజనమును, భోజనానంతరము బహూకరించిన అమూల్య వస్త్రాభరణాదులను, సాదరముగా సాగనంపినతీరును కన్నులకు కట్టినట్లు మనోజ్ఞముగ 'ఆట్రుప్పడై' ప్రక్రియయందు వర్ణింపబడినవి. ఈ వర్ణన చేయువాడు గాయకుడు కావచ్చు, నటుడు కావచ్చు, వీరుడు కావచ్చును. కాని 'తిరుమురుగాట్రుప్పడై'లో దీనికి భిన్నముగా ఒక భక్తుడు మరొక భక్తునికి సుబ్రహ్మణ్యస్వామిని సేవించి మోక్షమార్గము నందుమని ప్రబోధించినట్లు వర్ణింప బడినది.

'తిరుమురుగాట్రుప్పడై' అనునది మంగళప్రదుడైన సుబ్రహ్మణ్యస్వామిని గురించి రచింపబడిన మారదర్శక కావ్యము. దీనిని నక్కీరుడు రచించినాడు. తెలుగులో ధూర్జటి రచించిన కాళహస్తిమాహాత్మ్యమందలి నక్కీరుని కథలోను, వేశ్యకన్యల కథలోను ఈ స్తోత్రగ్రంథ రచనావిషయము ప్రస్తావింపబడినది. 'తిరుమురుగాట్రుప్పడై' అను లఘుకావ్యమునందు సుబ్రహ్మణ్యస్వామి మాహాత్మ్యము ప్రధానముగా వర్ణింపబడినను, ప్రసక్తానుప్రసక్తముగా తమిళదేశపు ప్రకృతిసంపద కూడ మనోహరముగ చిత్రింపబడినది.

'పోరునరాట్రుప్పడై' అనునది 248 పంక్తులుగల రచన. దీనికర్త ముడ త్తామన్ కణ్ణియార్. ఇందు చోళ కరికాల పెరువళత్తాన్ అను చోళప్రభువు పరాక్రమాదికముతోపాటు ప్రాచీన చోళదేశ సౌభాగ్యము, వ్యావసాయిక పారిశ్రామికాభి వృద్ధి వర్ణింపబడినది.

'శిరుప్పాణాట్రుప్పడై' 269 పంక్తులుగల రచనము. దీనిని నల్లూరు నాట్ట త్తనార్ రచించినాడు. ఎరుమైనాడు పాలకుడగు నల్లియక్కోడన్ వదాన్యత ఇందు వర్ణింపబడినది.

'పెరుంపాణాట్రుప్పడై'ను ఉరుత్తిరన్ కణ్ణనార్ రచించెను. 500 పంక్తులు గల రచనము, ఇందు కాంచీనగరపాలకుడగు తొండైమాన్ ఇళంతిరయన్ వదాన్యతను ఒక భిక్షుక గాయకుడు మరొక భిక్షుక గాయకికి వివరించును. తమిళ సాహిత్యమునకు ప్రత్యేకమైన 'అయింతిణై' అను అయిదు దేశభాగములు ఇందు వర్ణింపబడినవి.

'మలై పాడు కడామ్' (The rut of the mountain) అనుదానికి 'కూత్తర్ ఆట్రుప్పడై' అనికూడ పేరు. కూత్తర్ అనగా నటులని అర్థము. నటులు, గాయకులు, స్త్రీ పురుషులు ఒక దుర్గమునుండి మరొక దుర్గమునకు తరలిపోవుసందర్భమున వారు వాయించిన సంగీత వాద్యధ్వనులు 'నావిరం' అను పర్వతగుహలలో ప్రతిధ్వనించుటనుబట్టి ఈ రచనకు 'మలైపాడు కడామ్' అని పేరు వచ్చినది. 583 పంక్తులుగల ఈ రచనను పెరుంకౌశికనార్ అను నతడు రచించినాడు. ఒక నట్టువ కాడు మరొక నట్టువకానితో జరిపిన సంభాషణారూపమున ఈ రచన కలదు. పల్కున్రకోట్టం అధిపతియైన నన్నన్ ఇందు వర్ణింపబడినాడు.

సంగయుగములో వ్యాప్తికివచ్చిన ఈ ఆట్రుప్పడై అను ప్రక్రియను తరువాతి కవు లెవరుగాని చేపట్టినట్లు కానరాదు.

తమిళ సాహిత్యములో 'అగం' శాఖకు చెందిన ప్రక్రియలలో ప్రసిద్ధమైనవి. మడల్, ఉలా, కోవై అనునవి.

(1) మడల్ :

'మడల్' ప్రణయమునకు సంబంధించిన ప్రక్రియ. సంగయుగపు సాహిత్యములో నాయిక తన ప్రేమను తిరస్కరించినపుడు విఫలమనోరథుడగు నాయకుడు ఆత్మహత్యకు గడంగుట వర్ణింపబడినది. 'కలిత్తొగై'లో భగ్నప్రేమికుడొకడు శరీరమంతట బూడిద పూసుకొని, జిల్లేడుమాలలు మెడలో వేసుకొని, కుడిచేతిలో ప్రియురాలి చిత్రపటమును పట్టుకొని, తాటిమట్టలతో తయారుచేసిన రంపపుపండ్లు కలిగిన, గుర్రమువంటి వాహనముపై నెక్కియుండగా కొందరతని పురవీథులలో లాగుచుండుటను వర్ణింపబడినది. ఆవిధముగా లాగుచున్నపుడు రంపపుపండ్ల కోతవలన ఆ భగ్నప్రేమికుడు బాధపడుచుండుటనుచూచి నాయిక అతనిమీద జాలిపడి ప్రేమించునని అతని ఆశ.

తిరుమంగై ఆళ్వారు ఈ బెదరింపు ఒక నాయిక చేసినట్లుగ తన భక్తిగీతములందు వర్ణించినాడు. భగవంతుడను నాయకుని ప్రేమించిన జీవాత్మయను నాయిక భగవద్దర్శనము లభింపకపోయినచో తనువు చాలింతునని బెదరించుట ఈ గీతములందు కన్పట్టును, తత్త్వరాయర్ రచించిన 'కలిమడల్'లో ఈ ప్రక్రియను తన గురుభక్తిని చాటుకొనుట కుపయోగించినాడు. క్షీణయుగములో ఈ 'మడల్' ప్రక్రియ చాల అశ్లీలముగకూడ ప్రయోగింపబడినది. క్రీ. శ. 19, 20 వ శతాబ్దము

లకు చెందిన కృష్ణపిళ్లై అనునతడు 'వరుణకులాదిత్యన్ ఉలామదల్'ను సంక్రాంత్రి పద్ధతిలో రచించినాడు. ఏసుక్రీస్తు శివ నెక్కుటను ఇతడు 'మదల్ ఏరుదల్' అను పేరుతో రచించినాడు. ఇందు ఏసుక్రీస్తు విశ్వజనులమీద తనకుగల అపార ప్రేమకారణముగా ఆత్మత్యాగము చేయుచున్నట్లు వర్ణింపబడినది. ఈ క్రైస్తవకవి తన అభిమతమున కనుగుణముగా 'మదల్' ప్రక్రియను మలచుకొని రచించుట ప్రశంసనీయమైన విషయము.

(3) ఉలా :

ఇది సాధారణమైన ప్రణయమితివృత్తముగా కలిగిన ఒక ప్రక్రియ. ఇందు రాజుగాని, భగవంతుడుగాని నాయకుడు; అయిదు మొదలు నలభై సంవత్సరముల వరకు వయస్సున్న పురస్త్రీ (సాధారణముగా వేశ్య–) నాయిక. పురవీథులగుండా నూరేగుచుండు నాయకుని, నాయిక ప్రేమిస్తున్నట్లు 'ఉలా' ప్రబంధమున వర్ణింప బడును. కాని వారి ప్రణయము ఏకాశ్రయముమాత్రమే.

లభ్యమైన ఉలా ప్రబంధములలో 'చేరమాన్ పెరుమాళనాయనార్' అను చేర రాజు రచించిన 'తిరుక్కైలాయ జ్ఞానఉలా' అనునది మొట్టమొదటిది. దీని ఆవిష్కరణము కైలాసశిఖరముమీద జరిగిందని ప్రతీతి కలదు. కనుక దీనిని 'ఆది ఉలా' అను పేరుతో వ్యవహరింతురు. తొల్కాప్పియములోని 'ఉరోడుతోత్రం' కూడ ఉలా ప్రక్రియనే సూచించునని కొందరభిప్రాయపడిరి.

ఆధ్యాత్మికులు మానసికముగా ఏడుదశలను దాటవలెనని చెప్పుదురు. వీనిని ఏడు ప్రపంచములుగ వర్ణింతురు. తమిళమున వీనిని 'ఏళువిలం' లేక సప్తభూమి అని అందురు. ఈ ఏడుదశలను దృష్టియందుంచుకొనియే 'జ్ఞానఉలా' అను పేరుతో ఉలాప్రబంధమును రచించియుందురని చెప్పవచ్చును.

ఉలా ప్రబంధకర్తలు ఆయా నాయికల వయోభేదమునుబట్టి నాటకీయ సన్నివేశములను కల్పించుటలో జాగ్రత్త వహించినారని చెప్పవచ్చును. ఉదాహరణమునకు ఒక ఉలాప్రబంధములో నాయికయగు ఒక అమ్మాయి తన్ను తాను తల్లిగా భావించుకొని తల్లి ఆట ఆడుచుండును. ఆమె లాలించుచున్న బిడ్డకు తండ్రి ఎవరని ప్రశ్నించినపుడు శివుడే యని సమాధానమిచ్చెను. దానిని బట్టి శివుడే ఆమె భర్తయని గ్రహింపవచ్చును. ఆ సమయములో శివుడు ఊరేగుచు ఆ పురవీథిలోని కరు డెంచును. అపుడా బిడ్డ అతనినిచూచి యేడ్చినట్లుగాను, ఊరేగింపు ముందుకు సాగి

వట్లుగాను వర్ణింపబడినవి. అంతకంటె పెద్ద వయస్సులోనున్నవారు నాయికలయి నపుడు వారి వయస్సుకుతగిన ఆటలను, ఆలవాట్లను వర్ణించి ఉచితసమయములో నాయకుని ఊరేగింపును ప్రవేశపెట్టి వారి వయసున కనుగుణమగు ప్రేమను వ్యక్తముచేసినట్లు వర్ణింపబడును.

తమిళములో 'ఒట్టకూత్తర్' తన పోషకులైన విక్రమచోళుడు, రెండవ కులోత్తుంగుడు, రెండవ రాజరాజు అను వారిని ప్రశంసించుచు రచించిన ఉలా ప్రబంధములు చాల ప్రశస్తి చెందినవి. ఈ మూడు ఉలాప్రబంధములను 'మూవర్ ఉలా' అను పేరున వ్యవహరింతురు. తమిళమున ఇట్టి ఉలా లెన్నియో రచింప బడినవి.

తమిళములోని ఉలా ప్రబంధములచేత ప్రభావితులై దక్షిణాంధ్రయుగము లోని కవులు కొందరు తెలుగులో ఉలా ప్రబంధపోకడలతో రచన చేసియుండుట గమనింపదగిన విశేషము. మహారాష్ట్రప్రభువగు శహాజీ రచించిన 'విష్ణుపల్లకి సేవా ప్రబంధము, శంకరపల్లకి సేవాప్రబంధము' ఇట్టి రచనలే.

## (4) కోవై :

సంగయుగములోని శృంగార రచనలన్నియు ఒకదానితో నొకటి సంబం ధములేని ముక్తక రచనలు. నాటకీయ సంభాషణలవంటి ఈ ముక్తకరచనలే తరు వాతికాలమున కావ్యరూపము దాల్చినది. ప్రేమనీ ప్రియుల సంభాషణలను ఒక క్రమములోరచించి వారి ప్రథమసమాగమము మొదలుకొని వారిరువురు వివా హితులై దాంపత్యజీవితము గడపుటలోగల వివిధసన్నివేశములతో కూడుకొనిన ఒక ప్రణయగాథను వర్ణించుప్రక్రియ 'కోవై' అనునది. 'కోవై' అనగా పూవుల తోనో, ముత్యాలతోనో కూర్చిన హారమని యర్థము. పాండ్యరాజు నాయకుడుగా గల శృంగారసన్నివేశములకు సంబంధించిన సంభాషణలను ఒక క్రమములో కూర్చి రచించుటచే దీనికి 'పాండిక్కోవై' అను పేరు వచ్చినది.

క్రీ. శ. 9 వ శతాబ్దములో మాణిక్యవాచకర్ 'తిరుక్కోవైయార్' అను ప్రబంధమును రచించినట్లు తెలియుచున్నది. ఇందులోని నాయిక భగవంతుడు; నాయకుడు జీవాత్మయగుట గమనింపదగిన విశేషము. తరువాతికాలమున తమిళ ములో దుర్గాధిపతులను, సేనాధిపతులను నాయకులుగాచేసి కోవై ప్రబంధములు అసంఖ్యాకముగా వెలసినవి. పొయ్యామొళిప్పులవర్ రచించిన 'తంజైవానన్

కోవై' అనునది అందుల కుదాహరణము. అటుతరువాత క్షేత్రాధిదేవతలమీదకూడ కొన్ని కోవై ప్రబంధములు తమిళములో రచింపబడినవి.

సాధారణముగా కోవై ప్రబంధములలో నాయకుని పేరుండదు. ఎవరి రాజ్యమునం దాకథ జరిగినట్లు రచింపబడునో ఆ పోషకుని పేరుమాత్రమే అందు సూచింపబడును. కోవై ప్రబంధములో ప్రణయకవిత్వమునకు సంబంధించిన నాల్గవందల సన్నివేశములలో సాధారణముగా నాల్గవందల పద్యములు రచింపబడుచుండుట కలదు. కాని అద్భుత కవిరాయర్ రచించిన 'ఒరుత్తురై కోవై' అను గ్రంథమునందు ఒక సన్నివేశమే నాల్గవందల పద్యములలో వర్ణింపబడినది.

'పురం' శాఖకు చెందిన తమిళ సాహిత్య ప్రక్రియలలో ముఖ్యమైనవి పరణి, కలంబగమ్, పిళ్లైత్తమిళ్ అనునవి.

(5) పరణి :

చోళ మహీపతులకాలములో వ్యాప్తికివచ్చిన తమిళ సాహిత్యప్రక్రియ పరణి. తమిళభాషలో 'పరణి' అనగా వీరప్రబంధము లేక వీరకావ్యమని అర్థము. 'పరణి' పేరువిషయమున పండితలోకమున అభిప్రాయభేదము లున్నవి. ఏనుగులు వేయింటిని జయించిన మానవుని వర్ణించునది 'పేరణి' అని తమిళ లాక్షణికులు తెల్పినారు. 'పరణ్' అనగా మంచె' అనియు, మంచెమీద కూర్చుండి వ్రాసిన కావ్యమగుటచే 'పరణి' అని పేరు వచ్చియుండునని కొంద రభిప్రాయపడిరి. భరణి నక్షత్రమున కధిదేవతలు కాళి, యముడని, భరణినాడు కాళికి పొంగళ్ళు పెట్టుట ప్రాచీనాచారమని, ఆ నక్షత్రము పేరుమీదుగా 'పరణి' కావ్యమును వ్యవహరించుట జరిగినదని మరికొందరి అభిప్రాయము. ఈ నిర్వచనమును మొదట తెల్పినవాడు డాక్టర్ స్వామినాథ అయ్యరు. ఇదియే నేడు బహుజనసమ్మతమైన అభిప్రాయము. 'బరణి పిరందాన్ దరణి యాళ్వాన్' (భరణిలో పుట్టినవాడు ధరణి నేలుతాడు) అను లోకోక్తి ఈనాడు ప్రచారమందున్నది.

పరణి కావ్యములో శత్రువులను జయించి విజయలక్ష్మిని వరించిన మహీపతి ధైర్య స్థైర్యములు వర్ణింపబడినను, కావ్యముమాత్రము పరాజయముపొందిన ప్రభువు పేరుమీదుగానే వ్యవహృతమగుచుండును. పరణిలోని నాయకుడు రాజుగానే యుండనక్కరలేదు. దేవతలు మొదలైనవారుకూడ నాయకులుగ నుండవచ్చును. దక్కయాగప్పరణి, హిరణ్యవద్దైప్పరణి, కంసవద్దైప్పరణి మొదలగునవి ఇందుల

కుదాహరణములు. దక్కయాగప్పరణి వీరభద్రవిజయమని చెప్పవచ్చును. పరమ శివుని పరాభవించవలెనను నుద్దేశముతో దక్షప్రజాపతి తలపెట్టిన యజ్ఞమును ధ్వంసముచేసిన వీరభద్రుని వీరోచితకృత్యములు వర్ణింపబడినను ఈ కావ్యమునకు 'దక్కయాగప్పరణి' అనియే పేరు.

తమిళములో ప్రప్రథమ పరణికావ్యము కళింగత్తుప్పరణి. ఇది తొలి పరణి కావ్యమేగాక ప్రశస్తమైన పరణిగాకూడ పరిగణింపబడుచున్నది. తరువాతి పరణి కావ్యములన్నిటికి ఇదియే మార్గదర్శకమయినది. జయంకొండాన్ (క్రీ. శ. 1112) కవి దీనిని రచించినాడు. 'పరణిక్కు ఒరు జయంకొండాన్' (పరణి కావ్యమున కొక్క జయకొండాన్ పేరునే చెప్పవలెను) అని అర్వాచీనుడైన పలపట్టై చొక్క నాథన్ అను తమిళకవి ప్రస్తుతించినాడు. కళింగత్తుప్పరణిలో క్రీ. శ. 1070 నుండి 1120 వరకు చోళదేశమును పరిపాలించిన మొదటి కులోత్తుంగచోళునికి, కళింగదేశపు రాజయిన అనంతవర్మ చోడగంగునికి జరిగినయుద్ధము వర్ణింపబడినది. ఆ యుద్ధములో ఓడిపోయిన కళింగరాజు పేరుమీదుగానే 'కళింగత్తుప్పరణి' అని సహేతుకముగా పరణి కావ్యమునకు పేరు పెట్టినది.

జయంకొండాన్ కళింగత్తుప్పరణిని 598 పద్యములలో 'తాళిసై' అను ఛందస్సులో రచించినాడు. తరువాతి పరణికావ్యములన్నియు కళింగత్తుప్పరణిలో వలె 'కళిగత్తాళిసై' లోనే రచింపబడినవి.

పరణి ప్రబంధములో సాధారణముగ ఇష్టదేవతాప్రార్థన, తలుపుతీయుట, మరుభూమివర్ణన, కాళి ఆలయవర్ణన మొదలగువిభాగము లుండును. వీర, రౌద్ర, భయానక, బీభత్స, అద్భుతరసములకే ఇందు ప్రాధాన్యమున్నను 'తలుపుతీయుట' అను ఘట్టమునందుమాత్రము శృంగారమునకే అగ్రతాంబూలము. యుద్ధభూమి నుండి తిరిగివచ్చిన యోధులు తమ ప్రియురాండ్రను తలుపు తీయుమనుట ఇందు వర్ణింపబడును. ఇందులో కడవుల్ వాళుత్తు (దైవస్తుతి), కడై తిరప్పు (తలుపు తీయండి), కాడు పాడియదు (మరుభూమి వర్ణన), ఇంద్రజాలము, కాళిక్కు కూళి కూరియదు (కాళికి భూతము చెప్పినది) మొదలైన పదునాల్గు ఆశ్వాసము లున్నవి. ఇందలి 'కడై తిరప్పు, కాడు పాడియదు' అను ఆశ్వాసములను 'వెన్నెల-వేసవి' అను పేరుతో ఆరుద్ర తెలుగులోని కనువదించినాడు.

కవిచక్రవర్తి బిరుదాంకితుడైన ఒట్టక్కూత్తర్, విక్రమన్ అను చోళ యువరాజు కళింగదేశముపై దండెత్తినవిషయమును వర్ణించుచు ఒక పరణి కావ్య

మును రచించినట్లు చెప్పుదురు. కాని అది నేడు అలభ్యము. ఒట్టక్కూత్తర్ వ్రాసిన మరొక పరణికావ్యమగు 'దక్కయాగప్పరణి' లభించుచున్నది. ఇందు దేవ రాక్షస సంగ్రామము వర్ణింపబడినది. ఒట్టక్కూత్తర్ తరువాత మానవయుద్ధము వర్ణించు పరణికావ్యము లేవియు తమిళమున వెలువడలేదు. దక్కయాగప్పరణికి ప్రతిగా వైష్ణవులు 'హిరణవధై పరణి' అని ఒక పరణికావ్యమును వెలయించినారు. సుబ్రహ్మణ్యస్వామికి, తారకునికి జరిగినయుద్ధమును వర్ణించుపరణి కావ్యమొకటి 'తిరుచ్చెందూర్' అనుపేరుతో తరువాతికాలములో రచింపబడినది. అజ్ఞానమునకు లేక పాపమునకు ఆధ్యాత్మిక గురువుచేతిలో కలిగిన ఆధ్యాత్మిక పరాజయముగా నభివర్ణించుచు తత్త్వరాయర్ మొదలగు తాత్త్వికులు 'యోగవధైప్పరణి, అజ్ఞవధైప్పరణి' అను పేర్లతో పరణికావ్యములను రచించినారు. ఇట్టి పరణికావ్యముల ప్రభావముచే కాబోలు క్రీ. శ. 17 వ శతాబ్దిలో వైద్యనాథ నావలర్ అనునతడు 'పాశవధైప్పరణి' అనుపేరుతో ఒక పరణి కావ్యమును రచించినాడు. ఆటుతరువాత ఈ పరణికావ్య ప్రక్రియను ఎవరుగాని చేపట్టినట్లు లేదు.

(6) పిళ్ళైక్కవి లేక పిళ్ళైత్తమిళ్ లేక పిళ్ళైత్తిరునామం :

తమిళములో మరొక ప్రసిద్ధిచెందిన కావ్యప్రక్రియ పిళ్ళైత్తమిళ్. పసిబిడ్డ నెరపు చిన్ననాటి వివిధచేష్టాదికములను ప్రశంసించు కావ్యమిది. బిడ్డలకు మూడు నెలలుపడి, పెరుగుకొలది వారి కదలికల కనుకూలముగ జోలపాట, చప్పట్లపాట, ముద్దుపాట, లాలిపాట, చందమామపాట మొదలగు సర్వసాధారణమగు పాటలు పాడుచుండుట నేటికిని కలదు. దేశీయములైన ఈ పాటలప్రసక్తి తొల్కాప్పియము కాలమునాటికే యున్నట్లు ఊహింపబడుచున్నది. కాని 'పిళ్ళతమిళము' అను కావ్యప్రక్రియను వ్యాప్తిలోనికి తెచ్చినవాడు వైష్ణవాళ్వారులలో నొకడగు పెరియాళ్వారు.

పెరియాళ్వారు బాలకృష్ణుని బాల్యక్రీడలను కీర్తించినాడు. తమిళదేశమునకు చెందిన 'తిరుక్కోట్టియూర్' అనునది కృష్ణుని జన్మస్థలముగా తమిళకవులు, తాత్త్వికులు వర్ణించినారు. బాలకృష్ణుని వివిధాంగముల సౌందర్యవర్ణన, లాలిపాట, చందమామను పిలుచుట, తరువాత కృష్ణుని బాల్యచేష్టల కనుగుణమైన చప్పట్ల పాట, తప్పటడుగువేయు బాలునిగూర్చిన పాట, తల్లి వెనుక నక్కియున్న బాలుని పట్టుకొనుటకు సంబోధించుచు పాడుపాట, దాగుడుమూతలాట, స్నానము చేయించునపుడు, అన్నము తినిపించునపుడు పాడునట్టి పాటలు. పిల్లవానికి తల దువ్వి

నపుడు పాడు కోడిపాట, బిడ్డను గ్రహములబారినుండి రక్షించుటకు, దిష్టి తగుల కుండా నుండుటకుగాను పాడునట్టి కాప్పుపాటలు, బాలకృష్ణుని ఆగడములనుగురించి ఇరుగుపొరుగువారు తల్లితో వివేదించుసందర్భమున పాడు ఫిర్యాదుపాటలు ఇత్యాదులను పెరియాళ్వారు రచించినాడు. ఈ పాటలు 'పిళ్ళైత్తమిళ్ ప్రక్రియకు' చెందినట్టివి. పెరియాళ్వారు బాలసాహిత్యమును తరువాతి తమిళకవు లనుకరించినారు. పిల్లల అమాయకభావములను చిత్రించుగీతములను, భక్తిభావమును ప్రేరేపించు బాలగేయములను 'కుమారకురుపరార్' అను తమిళకవి రచించినాడు. ఇతనిశైలి పెరియాళ్వారు శైలికంటె కఠినమైనది. కుమారకురుపరార్ తన రచనలో సుబ్రహ్మణ్యస్వామిని దైవాంశసంభూతుడగు బిడ్డగా భావించి బాలభక్తిభావముతో ఆరాధించినాడు. ఈ ప్రపంచములో జరుగు అనర్థములను భగవంతుని బాల్యచేష్టలుగా కుమారకురుపరార్ తన గేయములలో నిరూపించును. ఈ భావమును తరువాతి తమిళకవులు తమ పోషకులగు ప్రభువులను కీర్తించుసందర్భములం దనుకరించి నట్లు తోచును. ఒట్టకూత్తర్ రెండవ కులోత్తుంగునిపై 'పిళ్ళైత్తమిళ్' గ్రంథమును రచించినాడు. రాజులను కీర్తించు మొదటి 'పిళ్లతమిళము' ఒట్టకూత్తర్ రచించినదే. ఇట్టి రచనలు తరువాత వెలువడలేదు.

వేదాంతులు, తత్త్వవేత్తలునగు తత్త్వరాయర్, శివప్పిర్కాచార్ మొదలగువారు తమ గురువులను కీర్తించుటకు పిళ్ళైత్తమిళ్ కావ్యములను రచించినారు. సాధువులు పసిబిడ్డలవంటివారు కాబట్టి వీ రిట్టి రచనలకు పూనుకొనియుండవచ్చును.

తరువాత ఈ ప్రక్రియను దేవాలయములను కీర్తించుట కుపయోగించుకొనినారు. మహమ్మదీయకవులుకూడ తమ మతప్రవక్తను కీర్తించుటకు "పిళ్ళైత్తమిళ్" ప్రక్రియను చేపట్టినారు.

## (7) కలంబగం :

'కలంబగం' అనగా వివిధపుష్పములతో కూర్చిన పూలమాల అని అర్థము. శిష్టసాహిత్యమును, జానపదగేయకవితను ఒకచోట చేర్చికూర్చుట 'కలంబగం' లోని ప్రత్యేకత.

ప్రౌఢసాహిత్య సంకలనములను తమిళములో "అటంగన్ముఱై" అను పేరుతో వ్యవహరింతురు, సంగీతప్రధానమైన జానపదగేయ సంపుటిని 'పాటు

తురై ' అని అందురు. ఈ రెండువిధములైన సాహిత్యములను సమానాంతర ముగ ప్రవహించు రెండు నదులతో పోల్చవచ్చును. ప్రౌఢులైన పండితకవులు జానపదగేయముల నాదరింపమిచే అవి మరుగుపడజొచ్చినవి. సాంఘిక పరిస్థితు లనుబట్టి, ఆయా కవుల అభిరుచి. అభిమానములనుబట్టి దేశీయములయిన కొన్ని పాటలు, పదములు గుర్తింపబడి ప్రౌఢసాహిత్యముతో సమానమగు గౌరవమును పొందినవి. తమిళమునలో మొదటినుండియే తెలుగునందువలె పదకవితపట్ల చిన్న చూపు లేదు. పామాన్యజనుల నాకర్షించుటకు నాయన్మారులు, ఆళ్వారులు తమిళ ములో భక్తిగీతములద్వారా దేశికవిత నాదరించినారు. తత్త్వరాయర్ అను నతడు ప్రౌఢకవితను, పామరకవితను రెండింటిని ఒకచోట కూర్చినాడు.

మూడవ నందివర్మను (క్రీ. శ. 826-849) కీర్తిస్తూ పాడిన 'నంతిక్కలం బగమ్' అనునది మనకు లభించిన కలంబగములలో ప్రాచీనమైనది. దీని రచయిత పేరు తెలియదు. ఉతీచితేవర్ అను జైనకవిచే పాడబడిన 'తిరుక్కలంబగమ్' ఒకటి వ్యాప్తిలో నున్నది. ఇందు సామాన్య జీవితానందమునుండి దివ్యానుభూతు లను పొందుటకు యత్నించువిషయము తెల్పబడినది. దీనితరువాత 'నంబి యాండార్ నంబి' అనునతడు తిరుజ్ఞానసంబంధర్‌నుగురించి కీర్తించుచు పాడిన కలంబగం పేర్కొనదగినది. ఐహికాముష్మికములకు సంబంధించిన పొందికకు తగిన పరిస్థితులను కల్పించుట కింద ప్రయత్నము చేయబడినది.

తమిళములో తరువాతికాలమున దేవాలయములను, ఆధ్యాత్మిక గురువులను కీర్తించుచు 'కలంబగమ్'లు వెలసినవి. వానిలో క్రీ. శ. 14 వ శతాబ్దమందున్న 'ఇరత్తియార్' రచించిన కలంబగం పేర్కొనదగినది. బెష్కి (Beskhi) దొర మేరీమాతపై 'తిరుక్కవలూర్ కలంబగమ్' ను వ్రాసినాడు. మహమ్మదీయులుకూడ తమ మతప్రతిపాదనమున కెన్నో 'కలంబగమ్' లను రచించినారు. వీనివలనబట్టి 'కలంబగం' ప్రక్రియకుగల ప్రాచుర్యమును గ్రహింపవచ్చును.

తమిళసాహిత్యమున ఆదినుండియు నేటిదనుక కథావస్తువు, వర్ణనాంశ ములు, కవిసమయములు, ఉపమానములందేకాక కావ్యప్రక్రియలందును స్వతంత్ర మగు దేశితనమే పాటింపబడుచుండెనని పై పరిశీలనమునుబట్టి వ్యక్తమగుచున్నది.

## 11. కన్నడాంధ్ర సాహిత్యములలో దేశికవిత :

దక్షిణభారత సాహిత్యములలో తమిళము తరువాత ప్రాచీనతాగౌరవమును పొందినది - కన్నడము. కన్నడమున లభ్యమైన గ్రంథములలో మొదటిది నృప-

తుంగుడు (క్రీ. శ. 814-877) రచించిన కవిరాజమార్గమను లక్షణగ్రంథము. కన్నడమున కవిరాజమార్గమునకు ముందే దేశికవిత్వము కొంత యుండినదని ఆ గ్రంథమునుబట్టియే తెలియుచున్నది. కవిరాజమార్గ పీఠికయందు బెదండె, చెత్తాణె అను రెండు ప్రాచీన కావ్యభేదములు పేర్కొనబడినవి. అవి రెండును దేశీయ ఛ్ఛందమునందు రచింపబడిన కావ్యభేదములనియు, హళగన్నడము (ప్రాత కన్నడము)న రచింపబడియుండునని ఊహింపబడుచున్నది. నాగవర్మ కన్నడ ఛందోంబుధిలో మెల్వాడు, బాజనెగబ్బ, పాడుగబ్బ అను దేశిరచనలను పేర్కొనినాడు. కవిరాజమార్గమందలి దోషాదోషానువర్ణన నిర్ణయమను నధ్యాయమున దేశిని గురించిన కొన్నిపద్యము లున్నవి. కనుక క్రీ. శ. 9 వ శతాబ్దికి పూర్వమే కన్నడమున దేశిరచనలు వ్యాప్తిలోనున్నట్లు తెలియుచున్నది. కవిరాజమార్గమునకు పూర్వము కన్నడమున దేశికవిత మార్గకవితతోపాటు సమానగౌరవమును పొందియుండినట్లు ఊహింపవచ్చును.

క్రీ. శ. 7, 8 శతాబ్దులనాటికే కన్నడమున సంస్కృతవృత్తములు, సంస్కృత సాహిత్యాలంకారరీతులు ప్రవేశించినవి. క్రీ. శ. 450 ప్రాంతమునాటిదగు హల్మిడి శాసనమున మొదట సంస్కృతశ్లోకము తక్కినభాగమంతయు సంస్కృతబహుళమైన కన్నడవచనము కలదు. కనుక ఈ శాసనకాలమునాటికే కన్నడమున సంస్కృతప్రభావము అధికముగా నున్నట్లు స్పష్టమగుచున్నది. ఇక కన్నడ కవితాసామగ్రియగు కథాంశములు, గుణదోషాలంకారాదులన్నియు సంస్కృతాలంకారికుల రచనల యనుకరణములే. ఆ కాలమున దండిభామహాదుల ననుసరించి గుణదోషాలంకార ప్రకరణములను నృపతుంగుడు కవిరాజమార్గములో చేర్చి రచించినాడు. కవిరాజమార్గముతో కన్నడమున 'మార్గపద్ధతి' వ్యాప్తిలోనికి వచ్చినది. అది శిష్టకవితాపద్ధతియై వెలసినది. కవిరాజమార్గములోని భాషాప్రయోగపద్ధతులు, కవితాలక్షణవిధానములు తరువాతి కన్నడ కవులకు మార్గదర్శకములయినవి. కనుక కవిరాజమార్గమందు ప్రతిపాదింపబడిన కన్నడమార్గపద్ధతి ప్రభావముచే అంతకుముందు కన్నడమున వ్యాప్తిలోనుండిన దేశిపద్ధతి అంతరించిపోయినది.

తమిళమునందువలె కన్నడములోకూడ కవిసంఘము లున్నట్లును, గ్రంథప్రాశస్త్యము పరిషత్తులమూలమున నిర్ణయింపబడుచుండినట్లు కవిరాజమార్గములో నృపతుంగుని సభావర్ణనమునుబట్టి తెలియుచున్నది. కాని తమిళములోని సంగముల

వలె ఈ కన్నడపరిషత్తులు కన్నడగ్రంథములను సంకలనముచేసి భద్రపరచినట్లు కన్పట్టదు.

తెలుగులోకూడ నన్నయకుపూర్వమే పదగేయరూపమైన దేశికవిత ప్రజల నోళ్లలో వెలసియుండునని ఊహింపవచ్చును. ఈ దేశికవితకు పండితాదరణ. లక్షణ వ్యవస్థితిలేక గ్రంథరూపమున మనకు దక్కలేదు. కన్నడమున మార్గకవిత వృద్ధినంది ప్రచారము నందియుండుకాలమున పలువురు చాళుక్యరాజులు అనగా గుణగవిజయాదిత్యుడు మొదలగువారు, తెలుగుదేశమున దేశికవితను పుట్టించి. తెలుగుకవితను ఆదరించి అభివృద్ధిపరచిరని నన్నెచోడుని కుమారసంభవము పీఠిక లోని పద్యమునుబట్టి గ్రహింపవచ్చును. దీనినిబట్టి నన్నయకుపూర్వమే తెలుగులో దేశికవితాస్రవంతి రూపొంది చాళుక్యరాజుల ఆదరాభిమానములతో పెంపొందినదని చెప్పవచ్చును. చాళుక్యరాజులు దేశీయాభిమానము కలవారు కావుననే అనాడు వ్యవహారములోనున్న తెలుగుభాషలో శాసనములు వేయించుటకు ప్రయత్నించిరి. ఆ శాసనములలో దేశీయ చ్ఛందోరీతులందు రచించబడిన తరువోజ, సీసము, మధ్యాక్కర అను పద్యములే ప్రాచీనకాలమున తెలుగులో కన్పట్టుచున్నవి. సంస్కృతాభిమానులైన పండితులు ఈ దేశిపద్యములను ఆదరింపని కారణమున తరువాత క్రీ. శ. 10 వ శతాబ్దినుండి తెలుగులో మార్గపద్ధతికిచెందిన వృత్తములు వ్యాప్తిలోనికి వచ్చినట్లు తోచును. విరియాలకామసాని గూడూరు శాసనములోని ఉత్పలమాల, చంపకమాలలు, గుణగ విజయాదిత్యుని సాతలూరు శాసనము (రాగి శాసనము - సంస్కృతభాషలోనిది) లోని తెలుగులక్షణములుగల చంపకమాల పద్యము ఇందు కుదాహరణములు.

రాజరాజనరేంద్రుని కాలముననో అతనితండ్రికాలముననో తెలుగులోకూడ తమిళసంప్రదాయానుగుణముగ విద్వత్పరిషత్తులు స్థాపింపబడియుండవచ్చును. కావ్యశ్రోతృతా పారంగతులైన ఈ పరిషత్తులను 'సత్ప్రభాంతరము'లని నన్నయ భారతావతారికలో పలుచోట్ల పేర్కొనినాడు, భారతావతారికలో నన్నయ ఇష్టదేవతా స్తుతితోపాటు పండిత పరిషత్తులనుకూడ స్తుతించినాడు. పర్వానుక్రమణికలోకూడ 'సభల నుతింపగ జెల్లును' ఇత్యాది వాక్యములచేకూడ నన్నయ విద్వత్సభలను నుతించినాడు. కాని ఈ పండిత సంఘములకు తెలుగు దేశికవితపట్ల ఆదరభావ ముండియుండదు. తమిళమునందువలె ప్రాచీనమైన తెలుగు దేశికవిత మనకు దక్కలేదు.

ఇట్లు దేశికవిత తొలుత తెలుగుదేశమునందు వ్యాప్తిగాంచియున్నను ఉత్తర దేశీయులగు ఆర్యాంధ్రులకు తెలుగుదేశము వలసభూమి యగుటచే ఈ దేశము ఆంధ్రదేశమై. భాష ఆంధ్రమై తెలుగుభాష పేరు కొంతకాలము మరచిపోబడినట్లే ఈ తెలుగుదేశి రచనలును దేశమున కొంతకాలము మరచిపోబడుట తటస్థించినదని కోరాడ రామకృష్ణయ్యగారు 'ఆంధ్రము - తెలుగు' అను వ్యాసమునందు తెలిపి యున్నారు.

కన్నడములో పంపాదికవులు కవిరాజమార్గములోని మార్గపద్ధతిని అవలంబించి కావ్యరచన చేసినారు. కన్నడమున పంపాది కవులు దేశిని స్మరించినను గద్యపద్యాత్మకమగు చంపూపద్ధతిలో. మార్గపద్ధతిలోనే తమ ప్రబంధములను రచించినారు. పంపకవికి సమకాలికుడగు శివకోట్యాచార్యుడు తన 'వడ్డారాధన' అను గ్రంథమునందు మార్గ-దేశి పద్ధతులకు సమప్రాధాన్యమిచ్చి రచించినాడు. క్రీ. శ. 11 వ శతాబ్దికి చెందిన దుర్గసింహుడు మార్గ-దేశి సమ్మిశ్రితముగానే పంచతంత్రమును రచించినాడు. ఇట్లు పంపయుగమునకుచెందిన కన్నడకవులు సందర్భోచితముగా తమ కావ్యములందు 'దేశి'ని అభిమానించి స్మరించినను ఇతివృత్తములో, శైలిలో, అలంకారములలో, కవిసమయములలో, ఛందస్సులో చాలవరకు మార్గపద్ధతినే అనుసరించి రచించినారు.

ఆ కాలమున కన్నడ తెలుగుభాషలకు ఇప్పు డున్నంత వ్యత్యాసముకాని పార్థక్యముకాని లేకుండెను. అందువలన ఉభయదేశములందలి కవులు ప్రజలు ఒండొరుల భాషాసాహిత్యములలో పరిచయము కల్గియుండుట కవకాశము కలదు. అందువలన కన్నడమున వ్యాప్తిగాంచిన మార్గకవితాపద్ధతి తెలుగులోకూడ ప్రచారమందుట అసంభావ్యము కాజాలదు. నన్నయ భారతానువాదకారణముగ తెలుగు సాహిత్యమున కన్నడములోని మార్గకవితాపద్ధతిని నెలకొల్పినాడు. నన్నయ స్వేచ్ఛానువాదమునే తరువాతి తెలుగుకవులు అనుసరించినారు. చంపూకావ్య నిర్మాణ పద్ధతి, సంస్కృతవృత్త సమాదరణశీలము, తత్సమపదబాహుళ్యము - వీని సమాహారరూపమైన మార్గకవితాపద్ధతి నన్నయతరువాత చాలకాలము తెలుగుసాహిత్యమున రాజ్యమేలినది.

నన్నెచోడుని కుమారసంభవ రచనతో తెలుగుసాహిత్యచరిత్రమున శైవమత ప్రధానమును, శైవమత ప్రచారమును అగు రచనలు వ్యాప్తికి వచ్చినవి. ఇతివృత్తము, కావ్యప్రక్రియ, కవిత్వవిధానము అను విషయములందు నన్నె

చోడుడు మార్గపద్ధతినే అనుసరించినను తెలుగుకవిత్వమున తొలిసారిగా దేశిపద్ధతి వైపు మ్రొగ్గుచూపి తన కుమారసంభవమున అందందు కొన్ని దేశి సంప్రదాయములను నెలకొల్పినాడు. 'దేశిమార్గములు దేశీయములుగా చేయవలెనని నన్నెచోడుని తలంపు.

గజక్రీడావలోకన తత్పరులైన పార్వతీశివులు కరికరిణీరూపములతో క్రీడింపగా గజాననుడు జన్మించినట్లు క్రీ. శ. 652 ప్రాంతమున జ్ఞానసంబంధర్ అను కవిచే రచింపబడిన తమిళకృతి తేవారమునందు తెల్పబడినది. తేవారములోని ఈ శివలీలా విలాసగాథనే నన్నెచోడుడు తన కుమారసంభవమున చిత్రించినాడు. ఈ విషయమే తమిళవాఙ్మయమునందలి వినాయకపురాణమునందుకూడ వర్ణింపబడినది. మలయాళ రామచరితమునకూడ ఈ కథ సూచింపబడినది. ఇట్లు తమిళ మలయాళములందు ప్రచారములోనున్న దక్షిణదేశీయగాథను నన్నెచోడుడు తన కావ్యమునందు దేశీయతను సాధింపనెంచి చేర్చియుండవచ్చును. నన్నెచోడుడు వర్ణించినరీతినే గజాననోత్పత్తి సుప్రభేదాగమమునందు (త్రిచత్వారింశత్తమపటలము)ను కలదు. ఆగమముల ప్రాచీనత నిర్ణయింప సాధ్యముకాదు. కనుక నన్నెచోడుడు సుప్రభేదాగమమునుండి ఈ కథను అనుసరించినాడని చెప్పుటకంటె ప్రాచీన తమిళ మలయాళముల నుండి సంగ్రహించియుండునని చెప్పుటయే యుచితము. నిశ్శంక కొమ్మన శివలీలావిలాసములో గజానన జన్మఘట్టములో ఈ ఇతివృత్తమే పునరావృత్తమైనది. కుమారసంభవమునందలి గజాననవృత్తాంతము నన్నెచోడుని దేశీయాభిమానమును వ్యక్తము చేయును.

దక్షుడు తన కుమార్తెల కాపురములను చూచివచ్చుటకు బయలుదేరుట. తన్ను సత్కరింపని శివు నవమానించుటకు దక్షుడు యజ్ఞమును ప్రారంభించుట అనునవి నన్నెచోడుడు దేశీయతాపాదమునకై కల్పించినవే కాని మూలమున లేవు. దక్షపత్ని దక్షునితో చెప్పిన ఈ క్రిందిమాటలు సామాన్యముగా నిత్యము తెలుగువారి కుటుంబములలో వినిపించునట్టివే.

'తల్లిదండ్రులఁ బాసి తగవెఱింగి
మన్న పొందవైనవే యత్త మామలనియె
ప్రియము మెఱుంగునం చిచ్చిన బిడ్డమనకుఁ
బాపెనని యుండుఁ; దింక నీ వలుకులేల.'

ఈ మాటలు సహజములై దేశీయతో నొప్పియున్నవి. దక్షుడు తాను చేయ దలచిన యజ్ఞమునకు తక్కిన కుమార్తెలతోపాటు సతీదేవినికూడ పిలిచికొని వచ్చుటకు తన వనితలను పంపినట్లు నన్నెచోడుడు మూలములో లేకున్నను దేశీయ సంప్రదాయానుగుణముగా కల్పించినాడు. అట్లే ఇటుకను నమిలి శపథముచేయుట (4-67 ప). సేనకులకు కూలికిమారుగా జొన్నలు కొలుచుట, పార్వతికి 'ఓం నమ శ్శివాయ' అని పంచాక్షరీమంత్రముతో అక్షరాభ్యాసము చేయించుట మొదలగు దేశీయాచారములనుకూడ కుమారసంభవమున నన్నెచోడుడు తెల్పియున్నాడు.

కన్నడ సాహిత్యచరిత్రయందు బసవనయుగము (క్రీ. శ. 12 వ శతాబ్ది నుండి 14 వ శతాబ్దివరకు) స్వతంత్రయుగముగ పరిగణింపబడుచున్నది. బసవేశ్వరుని (క్రీ. శ. 1160) అవతరణముతో కన్నడమున ఆడంబరముతోకూడిన గ్రాంథికశైలీపద్ధతిపై, మార్గకవితాపద్ధతిపై ఒక విప్లవము చెలరేగినది. మార్గపద్ధతి నుండి దేశిపద్ధతికి పరివర్తనము మొదలయినది. విషయములో, భాషలో, ఛందస్సులో దేశిప్రాధాన్యము అధికము కాజొచ్చినది.

ఈ కాలమున కొంకించుక పూర్వకాలమందే నయసేనుడు తన ధర్మామృతములో కన్నడ సారస్వతమున అధికముగా సంస్కృతపదముల నుపయోగించు విషయమున తన అసమ్మతిని ప్రకటించియుండెను. జైనమతాచారములలో చతుర్దశమహారత్నములని పేరుపొందిన వ్రతములనాచరించి సద్గతినిపొందిన మహాపురుషుల కథలు ధర్మామృతమున వర్ణింపబడినవి. నయసేనుడు ధర్మామృతమును 14 ఆశ్వాసములలో శుద్ధ కన్నడమున పామరులకొరకై రచించినాడు.

బసవయుగమున ప్రాయికముగా శివభక్తుల గాథలు కావ్యవస్తువులయినవి. క్రీ. శ. 12 వ శతాబ్దమున పండితలోకమున ప్రబలిన జైన బౌద్ధాదిమతములకు పోటీగా బసవాదులు తమ వీరశైవమతమును జనసామాన్యమున వ్యాప్తిగావించుటకు సుబోధకమగు రచనారీతి నవలంబించి దేశిచ్ఛందస్సులలో రచనలు చేసినారు. కన్నడమున భక్తిప్రధానమైన వీరశైవమత వాఙ్మయమంతయు వచనములు, షట్పదులు, రగడలు, సాంగత్యములు మొదలగు దేశీయ రచనాపక్కినే అనుసరింపబడినది. 'వచనము' అను సాహిత్యరూపము కన్నడమున బసవేశ్వరునితో ప్రారంభమయినది. షట్స్థల వచనము, కాలజ్ఞాన వచనము మొదలగునవి బసవని వచనగ్రంథములు. భక్తిసాహిత్యమును వెలయించిన బసవేశ్వరుడు, వైరాగ్యరచనలు కావించిన అల్లమప్రభువు, కర్మయోగబంధులగు రచనలు కావించిన సిద్ధ

రాముడు, జ్ఞానప్రధానుడైన చెన్నబసవేశ్వరుడు, అక్కమహాదేవి మొదలైనవారు కన్నడములో ప్రముఖవచన కారులు. ఇంకను బసవన సమకాలికులలో మడివాళ మాచయ్య, అంబిగర చౌడయ్య, సకలేశ మాదరసు లనువారుకూడ పెక్కు వచన ములను కన్నడములో రచించిరి.

క్రీ. శ. 12 వ శతాబ్దిలో ప్రసిద్ధిగాంచిన భక్తకవి 'హరిహరుడు'. 'రగళె' ఛందస్సులో పూర్తికావ్యమును వ్రాయుటకు హరిహరుడే మొదటివాడు. అతని 'శివశరణరరగళె' శివభక్తుల చరిత్రములను వర్ణించు పండ్రెండువందల లఘు కృతులు. ఇది రగళె కావ్యములలో ప్రాచీనమైనది. పాల్కురికి సోమనాథుడు 'శీల సంపాదనె' అను వచనమును, పద్దురరగళె, చెన్నబసవ స్తోత్రరగళె, 'శరణు బసవరగళె' అను రగడకృతులను కన్నడములో రచించినాడు. కెరెయ పద్మరసు 'దీక్షాబోధె' కూడ రగడ ఛందస్సునందే రచింపబడినది. హరిహరుని మేనల్లుడైన రాఘవాంకకవి సంస్కృతపాండిత్యము గడించిన విద్వాంసుడయినను, చంపూ కావ్యప్రక్రియను చేపట్టక దేశిచ్ఛందమగు షట్పదిలోనే తన కావ్యములను రచిం చెను. అతని కృతులలో సోమనాథచరితె, వీరేశచరితె, సిద్ధరామపురాణము, హరి శ్చంద్ర చారిత్ర అనునవి ప్రకటింపబడినవి. ఈ కాలమునకే చెందిన అండయ్య (1235) పూర్వకవులవలె చంపూపద్ధతిని ఆదరించియు వస్తువులో, భాషలో, శైలిలో తన ప్రత్యేకతను చాటినాడు. ఇతడు ఒక్క తత్సమశబ్దమునుకూడ వాడక 'అచ్చగన్నడము'నందే 'కబ్బిగరకావ' అను కావ్యమును రచించినాడు. సంస్కృత పదములు వాడనిదే కావ్యమునకు శోభలేదని వాదించువారికి అచ్చగన్నడ పదము లతో కావ్యరచనచేసి కన్నడమాధుర్యమును చవిచూపిన అండయ్యకవి ప్రశంస నీయుడు. పాల్కురికి సోమనాథుని తెలుగు బసవపురాణమును భీమకవి (క్రీ. శ. 1369) భామినీ షట్పదిలో కన్నడములోనికి అనువదించినాడు. అతనివలెనే పద్మ ణాంకుడుకూడ పద్మరాజ పురాణమును వార్ధక షట్పదిలో రచించినాడు.

కథావస్తువులో, రూపములో, భాషలో స్వాతంత్ర్యము, నూతన సాహిత్య ప్రక్రియలమీద ఆసక్తి వీరశైవమతోద్యమకాలమందు వెలువడిన రచనలలో కాన వచ్చును. కనుకనే ఈ భక్తి కవితోద్యమమును దేశికవితోద్యమముగకూడ విమ ర్శకులు పేర్కొనియున్నారు.

క్రీ. శ. 13 వ శతాబ్దమునను అటుతరువాతను కన్నడములో జైనులు, వైదికులుకూడ వీరశైవకవులవలె మార్గపద్ధతినుండి దేశిపద్ధతికి మారి దేశిరచనా

పక్కి నవలంబించి గ్రంథరచన చేసినారు. శికుమాయణకవి సాంగత్యములు, కుము దేందు విరచితమగు షట్పదీరామాయణము మొదలగునవి వీని నుదాహరణములుగ పేర్కొనవచ్చును.

బసవన వీరశైవమతము తెలుగుదేశమున వ్యాప్తిగాంచినది. మల్లికార్జున పండితారాధ్యుడు, పాల్కురికి సోమనాథుడు మొదలగువారు తెలుగుదేశమున బసవన వీరశైవ భక్తిమార్గమునకు వేదప్రామాణ్యాపత్తిని చేకూర్చినారు. పండితారాధ్యుడు వీరశైవములోని ఒక అవాంతరశాఖయైన ఆరాధ్యసంప్రదాయమును స్థాపించినాడు. వీరశైవసంప్రదాయము కన్నడాంధ్ర సారస్వతక్షేత్రములలో నూతనములును, అపూర్వములును అగు దేశి వాఙ్మయశాఖలసృష్టికి కారణభూతమైనది.

శివకవులకు పూర్వము వెలసిన తెలుగుకావ్యములకు కథావస్తువు సంస్కృత మూలకము. అనువాదప్రాయము, పండితైకవేద్యముగానున్న సాహిత్యమును ప్రజాసామాన్యముచేకూడ ననుభూతమగునట్లు చేయదలచి శివకవులు వస్తువు నందును, కవితయందును మార్పు తెచ్చినారు, శివకథావస్తువుతో దేశికవితా సంప్ర దాయము ననుసరించి కవిత చెప్పినారు. శైవ వాఙ్మయమున తెలుగులో నన్నయ 'మార్గ' కవితకు భిన్నముగ 'దేశి' సంప్రదాయమునకు ప్రాధాన్యము సిద్ధించినది.

తెలుగున కందపద్య బహుళముగా శివతత్త్వసారమును రచించిన మల్లి కార్జున పండితారాధ్యుడు పంచగద్యలను. శంకరగీత భాస్వత్పదావళి అను పదము లను రచించినట్లు పాల్కురికి సోమనాథుడు తెల్పినాడు. పాల్కురికి సోమన పండితారాధ్యచరిత్రలో పెక్కుపదములను, గీతములను, దేశీనృత్య కళారీతులను పేర్కొనినాడు. పదగేయరూపమైన ఈ దేశికవిత జనసామాన్యమున ప్రచారములో నుండియుండును.

పాల్కురికి సోమన నన్నయ అవలంబించిన 'సంస్కృతసమాన భూయిష్ఠ మగు రచన' 'సర్వసామాన్యము' కాదని భావించి శైవమత ప్రచారముకొరకు దేశీయమైన భాషాచ్ఛందోరీతులను చేపట్టినాడు. మతాభిమానము, దేశ్యభినివేశము సంగమించిన ప్రజ్ఞాశాలి పాల్కురికి సోమన. గీర్వాణమునకు కొంతదూరముగ తెలుగు భాషాసాహిత్యములకు పొంతగద్దెను ప్రతిష్ఠింపజేయ యత్నించినవాడు మహాకవి సోమనాథుడు. దూరదృష్టిగల ప్రజ్ఞాశాలి, జాత్యభిమాని, దేశికవితోద్యమ కారుడు, ద్విపద 'ఐహికాముష్మిక హేతుప'ని ఎలుగెత్తిచాటి ద్విపద మహాకావ్య

ములను రచించిన చరితార్థుడు. పాల్కురికి సోమనతరువాత ప్రతిశతాబ్దమునందును తెలుగులో కొద్దిగనో గొప్పగనో ద్విపదకావ్యములు రచింపబడినవి.

పాల్కురికి సోమనకు ముందున్న కావ్యములన్నియు సంస్కృతగ్రంథానువాదములే. నన్నెచోడుని కుమారసంభవముమాత్రము కాళిదాసు కుమారసంభవమును దృష్టిలోనుంచుకొని ఇంచుమించుగా స్వతంత్రకావ్యముగా వెలయింపబడినది. అయినను అందులోనివస్తువు ప్రాచీనమైనది. ప్రఖ్యాతమైనది. పాల్కురికి సోమన కథావస్తువులో నయితము నవ్యతను కనపరచినాడు. 'ఆతని సకల పురాతన భక్తగీతార్థసమితియే మాతృకగాగ' బసవపురాణమును రచించినాడు. బసవన, పండితారాధ్యులు పురాణపురుషులు కారు. చారిత్రకవ్యక్తులు. బసవన, పండితారాధ్య చరిత్రలతోపాటు ప్రసక్తానుప్రసక్తముగ ద్రవిడాంధ్ర కర్ణాటక మహారాష్ట్రదేశములకు సంబంధించినవారు, బసవన పండితారాధ్యులకు సమకాలికులు. పూర్వులు నగు శివభక్తుల చరిత్రలను ఉపాఖ్యానములుగా జోడించి బసవపురాణ, పండితారాధ్య చరిత్రలను రచించినాడు. కన్నడదేశమున వీరశైవమతమును ప్రచారముచేసిన బసవనకథతో, తమిళదేశములో విశేషవ్యాప్తిగల 'అరువత్తుమూవరు' నాయన్మారులకథలను, మహారాష్ట్రజనుల భాషావేషములను జోడించి తెలుగులో కావ్యమును వ్రాసినాడు పాల్కురికి సోమన. అతడు దక్షిణదేశచరిత్రలో జాతీయసమైక్యతను సాధించినాడు.

పాల్కురికి సోమన బహుభాషాకోవిదుడు. అతడు వెలయించిన దేశి సారస్వతము బహుముఖమయినది. బసవరగళె, సద్గురరగళె, చెన్నబసవస్తోత్రదరగళె అను గ్రంథములను కన్నడభాషలోనే రచించినాడు. కన్నడవచనములను బోలిన అక్షరాంకగద్య, నమస్కారగద్య, పంచప్రకారగద్య మున్నగు గద్యలను తెలుగున రచించినాడు. కన్నడదేశమున ప్రచారములోలేని తెలుగుదేశమునమాత్రమే నిలిచియున్నట్టి దేశీయ రచనారీతులగు ద్విపద, ఉదాహరణ, సీసములనుకూడ సోమనాథుడు తెలుగులో రచించినాడు. బసవోదాహరణమును తెలుగులోనేకాక సంస్కృతమందును రచించినాడు. పాల్కురికి సోమన కన్నడాంధ్ర రచనములందే కాక తన సంస్కృత రచనలందును దేశిలక్షణములకే ప్రాధాన్యమిచ్చి రచించియుండుట గమనింపదగినవిశేషము. పాల్కురికి సోమన తెలుగులో సృష్టించిన దేశీయ రచనావైఖరులు సమకాలములో పండితామోదమును పొందకున్నను ప్రజాభిరుచినిమాత్రము చూరగొనినవి. అతడు స్థాపించిన ద్విపద, శతకము, ఉదాహరణ కవితాశాఖలను శైవేతరకవులుకూడ చేపట్టినారు.

సంస్కృతమూలకములుకావి, స్వకపోలకల్పితములైన అచ్చమైన దేశివర్ణనలు పాల్కురికి సోమనాథుని స్వతంత్రకావ్యములగు బసవపురాణ పండితారాధ్య చరిత్రలలో కొల్లలు. పండితారాధ్య చరిత్ర (పర్వతప్రకరణము-పుట. 262) లో ప్రభాతవర్ణనాసందర్భమున సోమనాథుడు చేసిన కోడికూతవర్ణన ఎంత స్వాభావికముగ నున్నదో పరికింపుడు.

'తొలికోడి కనువిచ్చి నిలిచి మైవెంచి
జలజల రెక్కలు నటలించి నీల్గి
గ్రక్కున కాలార్చి కంఠంబువిచ్చి
ముక్కున నీకెలు నక్కొల్పి కడుపు
వెక్కించి మెడసాచి నిక్కి మిన్సూచి
కొక్కొరోకోయని కూయకమున్న.'

కోడికూతను ఆంధ్రకవు లనేకులు అనేకరీతులలో వర్ణించినారు. కృకవాకు కూజితములను ముద్దుగా వర్ణించినవారిలో ముక్కు తిమ్మనను మొదట పేర్కొనవచ్చును. 'వినవయ్యెన్ కృకవాకు కూజితము లుద్వేలంబులై నూర నూతనవోద్యత్ కరకుంచికా విఘటితధ్వాంతార రక్రక్రియాస్వనముల్' అని ముక్కు తిమ్మన పారిజాతాపహరణమున వర్ణించినాడు. ఇందు గొప్ప కల్పన ప్రవేశపెట్టుటతో కావ్యనైసర్గికశోభకు భంగము కల్గుచున్నది. అనూరుడు సూర్యకిరణములను బీగములతో చీకటి అను తలుపులను తీయుచున్నపుడు వచ్చు కిరకిర చప్పుళ్ళు కోడికూతలని ఈ పద్యపాదమున కర్థము. ఇది అపూర్వ భావోల్బణమును సూచించు గొప్ప కల్పన. కాని ఈ పద్యము విన్నతరువాత కోడి కూస్తున్నట్లుగా ప్రత్యక్షము కాదు. దాని కూత మన మనస్సులో ప్రతిధ్వనించదు. ఈ వర్ణనలోని సర్గ రామణీయకత లోపించి కృత్రిమ సౌందర్యలేపనము జరిగినది. పాల్కురికి సోమనాథుని పై వర్ణన చదువుచున్నపుడు కోడిపుంజు మన ఎదుట నిల్చొని కూయుచున్న ట్లనిపించును. 'కొక్కొరోకట్టి'ని ధ్వన్యనుకరణముతోపాటు వర్ణన ముగియగానే ఆ కోడిపుంజు ఆకృతి, వివిధావయవ విక్షేపములవైఖరి, దాని కూజితము శాశ్వతముగా మన మనస్సులో ముద్రితమగును. సోమనాథుని ఈ వర్ణన అప్రయత్నపూర్వకము. భావప్రవాహము కుంటుపడక, సోమనాథునికిగల సూక్ష్మ కవితాదృష్టిని వ్యక్తముచేయు వర్ణన ఇది.

'మార్గ' పద్ధతికిచెంది, చంపూపద్ధతిని తెలుగులో రచింపబడిన పురాణ, కావ్య, ప్రబంధాదిరచనలు చాలవరకు సంస్కృతానువాదములగుటచే వానియందు దేశీయమైన సాంఘిక జీవితవిశేషాదులు ఎక్కువగా వర్ణింపబడలేదు. 'మార్గ' సంప్రదాయ ప్రియులగు కవులగు 'దేశి'మీద మక్కువ తక్కువ. దేశి సంప్రదాయ ప్రియుడగు పాల్కురికి సోమనాథుని ద్విపదరచనలలో తెలుగువారి ఆచారవ్యవహార ములకు, వేషభాషలకు, జాతీయతకు సంబంధించిన దేశీతనము నిండియున్నది. ఈ కారణముననే ఆంధ్రుల సాంఘిక జీవితచరిత్రరచనకు చంపూకావ్యములకంటె సోమనాథాదికవుల ద్విపద రచనలే ఎక్కువగా నుపకరించుచున్నవి.

కన్నడాంధ్రములలో ప్రాచీనకావ్యములన్నియు సంస్కృతములో రూఢ ములుగా నిర్ణయింపబడిన కవి సమయములను, ఉపమానములను చాలవరకు పాటించినవే. స్వతంత్రములును, దేశీయములునగు ఉపమాన, కవి సమయాదులు ఈ భాషలందు తక్కువ అనియే చెప్పవచ్చును. కాని తెలుగులో దేశ్యభిమానులగు పాల్కురికి సోమనాథాది శివకవులు కొందరు సంస్కృతప్రభావము సోకని కవి సమయములను, ఉపమానములను వాడియున్నారు. ఈ శివకవులు కన్నడమునుండి కూడ కొన్ని సమయములను ఉపమానములను గ్రహించి తెలుగులో ప్రయోగించి యున్నట్లు తెలియుచున్నది.

'జవనుందు కాటిదవోల్ ఆయితెత్తం కురుక్షేత్రదొళ' అని రన్నకవి గదా యుద్ధమున ప్రయోగించినదానిని నన్నెచోడుడు 'జముఁడు కుడిచి క్రక్కిన భంగిన్' అని కుమారసంభవము (11- 194 ప) నందు గ్రహించినాడు. పంప భారతము లోని 'సంగరదలో జళదపాళియం నెరపిదం గండం పెఱ్ఱంగండనే' (విక్రమార్జున విజయము 10-66) అను పద్యభావమును నన్నెచోడుడు 'జొన్నలుగొన్న బుజంబు లీఁగేదన్' (కుమారసంభవము 11-42) అని అనుకరించినాడు. ఇట్లే కన్నడ కావ్యములందు కానవచ్చు. ఛత్రమహీరుహములు, తానదీనియలు, మండవాంగానోక హములు మొదలగువానినికూడ నన్నెచోడుడు తన కుమారసంభవమున గ్రహించి నట్లు విమర్శకులు పలువురు తెల్పియున్నారు.

పాల్కురికి సోమనాథాది శివకవులు సంస్కృతమున ప్రసిద్ధముకాని దేశీయ కవి సమయములెన్నిటినో తమ కావ్యములందు పాటించినారు. మేరుపర్వతమును సోకిన కాకికి సువర్ణచ్ఛాయ కలుగునను కవిసమయమును మార్గకవు లెవ్వరును ప్రస్తావించలేదు. కన్నడములో 'మేరువం పొర్ద్దిదా కాగె పొన్నప్పచోల్' అను కవి

సమయము కలదట. ఈ కన్నడ కవిసమయము ననుసరించి కాబోలు పాల్కురికి సోమన 'మేదినీ వల్లభ, మేరువు సోఁకి, కాదె తచ్ఛాయన కాకి వన్నెల్లు (బసవ పురాణము 7 ఆ. 531 పుట) అని తెల్పినాడు. పాల్కురికి సోమన కన్నడకవుల నుండి గ్రహించినవి, స్వతంత్రముగా కల్పించినవి అగు కవిసమయ ఉపమానాదు లను పెక్కింటిని డాక్టర్ తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు 'ఆంధ్రసాహిత్య ములో దేశికవితోద్యమము - పాల్కురికి సోమనాథుని పాత్ర' అను సిద్ధాంత వ్యాసము (అముద్రితము-1968) నందు ఉదాహరించినాడు.

ఇట్లు ఇతివృత్తములో, వర్ణనలలో, రచనావిధానములో, జీవనచిత్రణ ములో, కావ్యప్రక్రియలలో, ఉపమానాదికములలో, కవిసమయములలో, ఛంద స్సులో, భాషాప్రయోగములలో పెక్కుభంగుల పాల్కురికి సోమనాథుడు తన కావ్యములందు దేశీయతను విస్తరింపజేసినాడు.

గోన బుద్ధారెడ్డి (క్రీ. శ. 1260) ద్విపదచ్ఛందస్సులో రచించిన రంగనాథ రామాయణము వాల్మీకి రామాయణమున కనువాదగ్రంథము. కవితారీతిలో నన్నయ మార్గమునే పాటించి రచించినను గోన బుద్ధారెడ్డి తేట తెలుగునలుకుబళ్ల వోహ శింపులోను, ఛందస్సునందును, పాల్కురికి సోమన పాటించిన దేశీయవిధానమునే తన రామాయణమున అనుకరించినాడు. గోన బుద్ధారెడ్డి రంగనాథ రామాయణ మున మూలకథకు తెలుగుదనమును, దేశీయతాసొంపును చేకూర్చినాడు. రంగనాథ రామాయణమునందలి ఊర్మిళాదేవి నిద్ర, లక్ష్మణదేవర నవ్వు, సులోచనావృత్తాం తము మొదలగునవి దేశీయకథలుగా పేర్కొనవచ్చును. మార్గ-దేశి కవితాసంప్ర దాయముల జోడింపు రంగనాథ రామాయణములోని ప్రత్యేకత. ఇది ప్రౌఢకవితా రసికులకే కాక పామరజనులకుకూడ సాహిత్యానందమును సమకూర్చి పెట్టినది.

రంగనాథ రామాయణము సంస్కృతానువాద గ్రంథమైనను సీతాకల్యాణ సందర్భమున మూలములోలేని కొన్ని దేశీయాచారములు వర్ణింపబడినవి. లగ్న సమయమును నిర్ణయించుట, 'కల్యాణవేది' సమర్చుట, 'మధువర్క సమయము' దీర్చుట, 'కోమల తెరమరుగున' వధూవరుల నిలుపుట, 'సుముహూర్తము'న తెర తీయుట, తలంబ్రాలు, లాజహోమము మొదలగువానితో పెండ్లి నాలుగుదినములు జరుగుట, పిమ్మట జనకుడు కూతుళ్లకు బుద్ధులుగరిపి, భూషణాభరణములిచ్చి, అల్లుండ్లకు అరణమిచ్చి పంపుటయు వర్ణింపబడినది. కొన్నివిషయములందు రంగ నాథ రామాయణము ననుసరించినట్లున్న భాస్కరరామాయణ చంపూకావ్యమునందు

ఈ దేశీయాచారవర్ణన విస్మరింపబడినది. రచనలలో దేశీయమగు ఆంధ్రప్రజాజీవిత మును వర్ణించువిషయమున చంపూ కావ్యకర్తలకు మక్కువ తక్కువ యనుటకిది ఒక నిదర్శనమగుచున్నది. ఇట్లు రంగనాథ రామాయణమునందు ఛందస్సునందు మాత్రమేకాక ఇతివృత్తమునందును దేశీయాచారములందును కొంత దేశీయత సాధించుయత్నము జరిగినదని చెప్పవచ్చును.

కృష్ణమాచార్యుడను వైష్ణవబ్రాహ్మణుడు రెండవ ప్రతాపరుద్రునికాలములో (క్రీ. శ. 1295-1320) నుండినట్లు తెలియుచున్నది. అతడు వచనభేదములగు చూర్ణికలను, సింహగిరి నరహరి వచనములను, శతగోప విన్నపములను తెలుగులో రచించినాడు. ఇతడు సంకీర్తనవాఙ్మయమునకు మూలపురుషుడని చెప్పవచ్చును.

మొదట ద్విపదను ఈసడించిన పాపమును పరిహరించుకొనుటకు కాబోలు. కవిసార్వభౌముడైన శ్రీనాథు నంతటివాడు చరమదశయందు ద్విపదను చేపట్టినాడు. 'శాశ్వతంబైనట్టి సద్గ్రంథ'మను నమ్మకముతో 'జనులెల్ల భక్తిచే జదువుట కొరకు' శ్రీనాథుడు పల్నాటి వీరచరిత్రలోని కల్లుప్రతిష్ఠ, బాలచంద్రుని యుద్ధము అను భాగములను మంజరీ ద్విపదలో రచించినాడు. పల్నాటి వీరచరిత్రమునందు చారిత్రకము. రాజకీయము, వీరరసోదంచితమునగు కథావస్తువు కలదు. తెలుగు దేశమున క్రీ.శ. 1181-1182 మధ్యకాలమున జరిగిన పల్నాటియుద్ధమందు వర్ణింపబడినది. పల్నాటివీరచరిత్ర అనువాదము కాదు. స్వతంత్ర రచన. దేశికవితాశబ్దమును అన్నిట సార్థకముచేసిన కావ్యములలో ఇదియే మొదటిది, మేటి. పల్నాటి వీరచరిత్ర రచనచే కవిసార్వభౌముడు, విద్యాధికారి, యుగకర్తయునైన శ్రీనాథుడు అచ్చముగా ప్రజాకవియైనాడు. సామాన్యప్రజలలో గొంతుకలిపి తెలుగుజాతి పౌరుషమును కీర్తించినాడు. శివకవులు ప్రారంభించిన ద్విపద కవితను చేపట్టి శ్రీనాథుడు చరిత్రప్రధానమగు వీరగాథను రచించి తదితర తెలుగుకవులలో మృగ్యమగు జాత్యభిమానమును ప్రదర్శించియున్నాడు.

శ్రీనాథునికి సమకాలికుడైన బమ్మెర పోతన భోగినీదండకమును రచించెను. తెలుగులోని దండకవాఙ్మయములో భోగినీదండకమే మొట్టమొదటిది. గౌరన ద్విపద కావ్యకర్తలలో పేరెన్నిక గన్నవాడు. అతడు నవనాథచరిత్ర, హరిశ్చంద్రోపాఖ్యానము అను ద్విపదకావ్యములను రచించినాడు. గౌరన హరిశ్చంద్ర ద్విపద తరువాతి చంపూ కావ్యకర్తలకు మార్గదర్శకమయినది.

కన్నడ సాహిత్యచరిత్రయందు కుమారవ్యాసయుగమున (క్రీ. శ. 15 వ శతాబ్దినుంచి 19 వ శతాబ్దివరకు) దాసకూటోద్యమఫలితముగ కన్నడమున దేశి పారమ్యతము విస్తారముగ వెలసినది. వైష్ణవమతగ్రంథములు చాలవరకు దేశీయ ఛృందములందే రచింపబడినవి. బ్రాహ్మణకవులుకూడ శివకవుల అడుగుజాడల ననుసరించి జనసామాన్యమున కందుబాటులోనుండు సాహిత్యమును సృష్టించి అందు సంగీతమును జోడించినారు. వీరు ఇతివృత్తవిషయమున సంస్కృతకావ్యములనే ఎక్కువగా ననుసరించినట్లు కన్పట్టును. కుమారవ్యాసునిచే రచింపబడిన భారతము, కుమారవర్మ విరచితమగు రామాయణము చాటు విట్ఠలనాథుని భాగవతపురాణము మొదలగునవి షట్పదీఛృందస్సులో రచింపబడినవి.

విజయనగర రాజులకాలమున కన్నడములో వైష్ణవదాసులు భక్తిగీతములను రగడఛృందస్సులో రచించినారు. ఈ భక్తిగీతములకు 'దాసరపదగళు' అని పేరు. ఇట్టి భక్తిగీతముల రచనములో ప్రసిద్ధులు పురంధరదాసు, కనకదాసు అను వారు. కనకదాసు మోహనతరంగిణి అను సాంగత్యమును, హరిభక్తిసారమను షట్పదీకావ్యమును రచించినాడు. బసవయుగమునందలి వచనవాఙ్మయమువలె ఈ దాసవాఙ్మయముకూడ ప్రజలలో నవచైతన్యమును కలిగించినది.

కన్నడమున పంపాదుల మార్గపద్ధతిచే వెనుకబడిపోయిన దేశి రచనావిధానము మరల బసవయుగమున శైవమతవ్యాప్తికొరకు చేపట్టబడినది. అది కుమారవ్యాసయుగమున శైవేతర కవులచేకూడ ననుసరింపబడినది. క్రీ. శ. 17, 18 శతాబ్దులలో తెలుగు యక్షగానముల ప్రభావముచే కన్నడమున యక్షగాన ప్రబంధముల రూపమున దేశికవితాపద్ధతి పెంపొందింపబడినది. యక్షగానములమూలమున అనేక దేశిరచనలు సంరక్షింపబడినవి. ఇట్లు కన్నడమున కావ్యరచన ప్రారంభమగునాటికి 'మార్గపద్ధతి' ప్రబలిన సూచన లగపడుచున్నను కాలక్రమమున మతప్రచారాదులగు నావశ్యకములనుబట్టి, ఆయా కాలములందలి అనుకూలవాతావరణమునుబట్టి దేశి పద్ధతికిచెందిన వచనము, రగడ, త్రిపది, సాంగత్యము, షట్పది, కీర్తనలు మొదలగు ప్రక్రియలు వ్యాప్తికి వచ్చినవి. దేశీయేతివృత్తముగల కావ్యములు కన్నడమున తక్కువ అనియే చెప్పవచ్చును.

తెలుగున తాళ్ళపాక కవులు వైష్ణవమతవ్యాప్తికై వెలయించిన సాహిత్యమంతయు దేశి కవితోద్యమమునే అనుసరించినది. పదములు, సంకీర్తనములు, ద్విపదకావ్యము, శతకము, ఉదాహరణము, వచనము, రగడ, మంజరి అను వివిధ

సాహిత్యప్రక్రియలలో తాళ్ళపాక కవులు వైష్ణవకవిత్వమును వెలయించిరి. అన్నమాచార్యుడు పదకవితాపితామహుండు. సంకీర్తనాచార్యుకని ప్రసిద్ధికెక్కినాడు. అతడు శృంగార, ఆధ్యాత్మ సంకీర్తనలను పేర పెక్కు పదరచనలను తెలుగులో రచించినాడు. అన్నమయ్యకు 'ఆడినమాటెల్ల అమృతకావ్యమును. పాడినపాటెల్ల పరమగానము' నయినది.

దేశి కవితకు అన్నమాచార్యుడు చేసినసేవ అపారమైనది. అన్నమాచార్యుని సంకీర్తనలలో జోలపాటలు, ఉయ్యాలపాటలు, తలుపుదగ్గర పాటలు, మేలుకొలుపులు, తుమ్మెద పదములు, మంగళహారతులు మొదలగు దేశీయములైన పదరచన లెన్నియో కన్పట్టును. కన్నడమున ప్రఖ్యాతుడగు పురంధరదాసుకూడ అన్నమాచార్యుని సంకీర్తనలను విని పరవశుడై ప్రశంసించినట్లు విమర్శకులు చెప్పుదురు.

అన్నమాచార్యుని పెద్ద భార్యయగు తిమ్మక్క సుభద్రాకల్యాణమును మంజరీ ద్విపద వికారమనదగు గేయమందు రచించినది. సుభద్రాకల్యాణమున ఆంధ్రులగు ఆడపడచుల కిష్టమగు బొమ్మలపెండ్లిండ్లనుగురించిన వివరములు తెల్పబడినవి. అన్నమాచార్యుని కుమారుడగు పెద తిరుమలాచార్యుడు వెంకటేశ్వరవచనము లనుపేర భగవంతునికి విన్నపములు రచించినాడు. ఇవి రాగ తాళ సమన్వితములై పాడుట కనుయుక్తములయినవి. శృంగారదండకము, వేంకటేశ్వర నీతిశతకము, వేంకటేశోదాహరణము, చక్రవాళమంజరి, శృంగారకీర్తనలు అనువానినికూడ పెద తిరుమలాచార్యుడు రచించినాడు. అన్నమాచార్యుని పౌత్రుడగు చిన్నన్న ద్విపదకు పేరుపొందినవాడు. పరమయోగి విలాసము, అష్టమహిషీకల్యాణము, ఉషాకల్యాణము, అన్నమాచార్య చరిత్ర అనునవి చిన్నన్న ద్విపదగ్రంథములు. చిన్నన్న ద్విపదగ్రంథమునందు అంతకుపూర్వము ఏ తెలుగు గ్రంథమందును వర్ణింపని వివిధవృత్తులవారి, జాతులవారి, వేషభాషాది వర్ణనలు కలవు.

ఇట్లు ఒకవైపు తాళ్లపాకకవులు దేశికవిత్వమును వివిధప్రక్రియలలో వెలయించుచున్నను రాజాస్థానమునందుమాత్రము మార్గకవిత ప్రబంధరూపమున వ్యాప్తి పొందుచుండెను. తాళ్ళపాక కవులలో దేశికవిత సజీవమైనను అది ప్రబంధ వాహినిముందు నిలువలేకపోయెను.

కందుకూరి రుద్రకవి (క్రీ. శ. 1608) సుగ్రీవ విజయమను యక్షగానము

లభ్యమైన తెలుగు యక్షగానములలో మొట్టమొదటిది. ఈ యక్షగానము ద్విపదలు, దరువులు, ఏలలు మొదలగు దేశిరచన లెన్నియో సుగ్రీవవిజయమున కలవు.

కళాపూర్ణోదయమునందు పింగళి సూరన కల్పితకథతో, కథావైచిత్ర్యముతోకూడిన స్వతంత్రకావ్య నిర్మాణప్రయత్నముచేసినను అందలి కవిత్వమంతయు మార్గపద్ధతిలోనే సాగినది.

తెలుగు సాహిత్యచరిత్రలో దక్షిణాంధ్రయుగమున దేశికవితను పండితాదరణము, రాజప్రాపకము అతిశయించినది. ఈ యుగమునందలి కావ్యప్రక్రియా వైవిధ్యము గమనింపదగినది. ఇందు పూర్వసంప్రదాయసిద్ధములైన ప్రబంధములేకాక శతకములు, యక్షగానములు, దండకములు, వచనములు, గేయములు ప్రబలముగా వెలసినవి. విజయరాఘవుడు సాంగత్యమను ఛందస్సులో శృంగార సాంగత్యము, సంపంగి మన్నారు సాంగత్యము అను రెండుగ్రంథములను రచించి ఛందస్సులో క్రొత్తరీతిని ప్రవేశపెట్టినాడు. తంజావూరు నాయకరాజుల కాలములోను ఆ తరువాత మహారాష్ట్రుల పోషణమునను వ్యాప్తిగాంచిన దేశి రచనాప్రక్రియ యక్షగానము. కొరవంజులు, వీథినాటకములు మొదలగునవి యక్షగాన ప్రాయములగు రచనలే. తెలుగునందు ప్రాచుర్యమునహించిన యక్షగానరచనము క్రమముగా కన్నడములోనికి వ్యాపించినది.

దక్షిణాంధ్రయుగమున పదకవితకు ప్రజాదరణము, రాజాదరణము లభించినది. క్షేత్రయ్య, గిరిరాజకవి, మాతృభూతయ్య మొదలగువారందరు రాజాశ్రయమున వర్ధిల్లిన పదకవులే. రాజాశ్రయము కోరక దైవభక్తితో కృతులు రచించినవారు నారాయణతీర్థులు, పల్లవి గోపాలయ్య, మెరత్తూరు వెంకటరామశాస్త్రి, సభాపతయ్య మొదలగువారు. దేశిగీతము లనదగు కూనలమ్మ పదములు, కోలే రమ్మ పాటలు, చెంచెతపాటలు, జక్కిణి దరువులు మొదలగునవి. సందర్భమునకు తగిన నాటకాదులందు ప్రయోగింపబడి దేశి సంగీతరీతులకు తంజావురాంధ్ర వాఙ్మయమున తగిన ప్రోత్సాహము లభించినది.

అయ్యలరాజు నారాయణామాత్యుని హంసవింశతిలోను పాలవేకరి కదిరీపతి శుకసప్తతిలోను దేశికథలు మార్గపద్ధతిలో రచింపబడినవి. ఇందలి కథలు జన సామాన్యమున వ్యవహారమునందుండుటచే ఆ కథాకావ్యములు దేశి సారస్వతములో సముచితస్థానమును సంపాదించుకొనుచున్నవి.

ప్రజాకవియగు వేమన తననాటికి జడీభవించిన వైదికధర్మమార్గమును, సాంఘికదురాచారములను అధిక్షేపించుటకు దేశీయమగు ఆటవెలది పద్యమును వజ్రాయుధమువలె నుపయోగించుకొనినాడు. వేమన చేపట్టినవస్తువులో గొప్ప వైవిధ్యమున్నది. అధిక్షేపకావ్యకీతికి వేమన పద్యములు శ్రీకారము చుట్టినవి. తన చుట్టు జరుగువిషయములను సూటిగా నెత్తిచూపుట, సంఘసంస్కారార్థమై కవిత్వము నుపయోగించుట, ప్రజలభాషలో అచ్చమైన తెలుగుదన ముట్టిపడునట్లు పద్యములను రచించుట వేమనలో మెచ్చుకోదగిన లక్షణములు.

కన్నడమునందువలె తెలుగులోకూడ ఆధునికయుగమున మార్గకవితాపద్ధతి క్రమక్రమముగా సన్నగిల్లుచు దేశి సాహిత్యమున కాదరము హెచ్చినది. గురుజాడ అప్పారావు దేశభక్తిగీతములలో ఆధునిక దేశికవితకు నాందీవాక్యము పలికినట్లయినది. శిష్టజన వ్యావహారికభాష కవితారచన కుపయోగింపబడుచున్నది. వస్తువులో, భావములో, రచనలో నవ్యమార్గము నవలంబింపబడినది. ఆధునికయుగమున కన్నడాంధ్రములందు దేశి వాఙ్మయశాఖకుచెందిన గేయకవిత్వము వివిధప్రక్రియలుగ వెలసినది.

ఇట్లు క్రీ.శ. 11 వ శతాబ్దమున నన్నయ పెంపొందించిన మార్గకవిత మూలముగా వెనుకబడిపోయిన తెలుగు దేశికవిత. క్రీ. శ. 12, 13 శతాబ్దులలో మత వ్యాప్తిమూలముగా మరల ప్రాధాన్యము వహించినది. కాని ఆతరువాతికాలమున నన్నయోపజ్ఞమైన మార్గకవితాపద్ధతియే బలవత్తరమై తెలుగుకవుల హృదయముల నాకర్షించుటచే అప్పుడప్పుడు చాటుమాటుగా కొంత దేశిరచనాప్రయత్నము జరిగినను, క్రీ. శ. 17 వ శతాబ్దివరకుకూడ మార్గకవితయే తెలుగులో ప్రాధాన్యము వహించియున్నట్లు గ్రహింపవచ్చును. క్రీ. శ. 17 వ శతాబ్దమునందు రాజకీయపరిస్థితుల కారణముగా, తెలుగు నాయకరాజులు పరదేశమగు తమిళదేశమున నెలకొనియుండుటచేత తిరిగి అనుకూలవాతావరణ మేర్పడువరకు దేశికవిత వ్యాప్తిచెందుటకు వీలు కలుగలేదు. క్షీణయుగమునందు దేశికవితకు ఆదరణప్రోత్సాహములు లేక ఉత్పన్నప్రాయమైనది. ఆధునికయుగమున మార్గపద్ధతి క్రమక్రమముగా సన్నగిల్లినది. దేశికవితకు చైతన్యమేర్పడినది. ఇటీవలికాలమున కన్నడాంధ్రములందు రచింపబడుచుండు పెక్కురచనములు దేశిపద్ధతికే చెందియున్నవి. వానియందలి ఇతివృత్తము ప్రాయికముగా సాంఘికము, భాష వ్యావహారికము, ఛందస్సు ఆధునికమైన వచనగీతము, ఆధునికయుగమున కన్నడాంధ్రములందలి దేశికవిత

చాలవరకు ఆంగ్ల సారస్వత పఠనానంస్కారమువలన పెంపొందినదేయని చెప్ప వచ్చును.

## 12. కన్నడాంధ్ర సాహిత్యములలో దేశి కావ్యప్రక్రియలు :

కన్నడాంధ్రములందు సంస్కృత సాహిత్యరీతులను, అందలి రీతిగుణా లంకార రసవర్ణనాదులతోకూడ గ్రహించి పురాణ ప్రబంధపద్ధతిలో నిమిడ్చికొని మార్గపద్ధతిని ఆత్యాదరముతో విస్తరింపజేసినను దేశీయములగు ద్విపద, షట్పది, రగడ మొదలగు పదరచనలును, వచనము, ఉదాహరణము, యక్షగానము మొద లగు కావ్యప్రక్రియలును దేశి సాహిత్యమునకు పట్టుగొమ్మ లయినవి. కన్నడాంధ్ర ములందు ఇతివృత్తము, వర్ణనాంశములు మొదలగువానియందేకాక కావ్య క్రియ లందును దేశీయత నెలకొనియున్నది. ఈ అంశమును స్థూలముగా పరిశీలింతము.

(1) వచనము

బసవయుగమునందు కన్నడమున వ్యాప్తిలోనికి వచ్చిన సాహిత్యరూపము 'వచనము'. సంస్కృత పదాడంబరములేని సరళమైనభాషలో సామాన్యజనుల కొరకు వ్రాయబడిన స్వతంత్ర రచనమిది. ప్రతివచనము చివరను ఆయా వచన కారుల ఇష్టదైవములపేర్లు మకుటముగ నుండును. బసవేశ్వరుడు రచించిన వచన ముల తుదిని 'కూడలి సంగమదేవా' అను మకుటము గలదు. అల్లమ ప్రభుదేవర రచించిన వచనములలోని మకుటము 'గుహేశ్వరా' అనునది. అక్కమహాదేవి రచితములైన వచనములకు 'చెన్న మల్లికార్జునా' అని మకుటము.

బసవని వచనములు లలితములై మనోహరములై వీరశైవమును విశ్వ ధర్మమును చాటును. ఉదాత్తభావములతోకూడిన ప్రభుదేవర వచనములలో చాల భాగము తత్త్వవేత్తలకుకూడ గ్రాహ్యము కానివి కలవు. అక్కమహాదేవి వచన ములలో స్పష్టవాక్యత, ఉదారదృష్టి అడుగడుగున గోచరించుచుండును. చెన్నబస వేశ్వరుని వచనములు దీర్ఘములై, సిద్ధాంత వివరణాదులతో నొప్పియుండును. అందువలన అతని వచనశైలిలో మార్దవము లోపించినది. ప్రభుదేవర, బసవేశ్వర వచనములలో కన్పట్టు సాహిత్యఘనత చెన్నబసవేశ్వర వచనములందు కానరాదు.

శివలెంక మంచన, మల్లికార్జున పండితారాధ్యులు కన్నడవచనములను రచించినారు. కన్నడమున సుమారు రెండువందల వచనకారులపేర్లు లభ్యమగు చున్నవి. వచనకారులలో అక్షరజ్ఞానము కలవారు, నిరక్షరాస్యులుకూడ కలరు,

కన్నడసాహిత్యమున కీ వచనములు అపూర్వము లయినవి. పునరుద్ధరింపబడిన వీరశైవమతధర్మములు, ప్రవర్తన నియమావళి, అజ్ఞానమును, సంప్రదాయమును, అంధానుకరణమును ఖండనముచేయుట, సర్వమానవ సమానత్వము, కాయకష్ట ములకుగల గౌరవస్థితి అనునవి వచనములందు వస్తువులుగా ప్రతిపాదింపబడినది.

'వచనము' లందలిశైలి ఛందోబద్ధము కాదు. వీనివి 'గద్య' రచన అనుట కును వీలులేదు. వచనములు లయాత్మకమైన శైలితో సంగీతయుక్తముగ పాడు కొనుట కనుకూలముగ రచింపబడినవి. వచనములలో కొన్ని గీతిజాతికి చేరినవవి. మరికొన్ని సలక్షణములైన పాటలవంటివని. వేరొకకొన్ని మాత్రాగణయుక్తము లని విమర్శకులు తెల్పియున్నారు.

తెలుగులో కూడ ఇట్టి వచనముల రచనము కలదు. అనంతుడు తన ఛందో దర్పణములో 'వచనము'నకు లక్షణము ఇట్లు చెప్పినాడు.

'కనుగొన బాదరహితమై
వనుపడి హరి గద్దెవోలె బహుముఖ రచనం
బున మెరయు గద్యమది దా
దెనుగు కృతుల వచనమనగ దీపించుగడున్.'

'వచనము' మధురకవితాశాఖకు చెందునని వార్తాకవి రాఘవయ్య 'లక్షణదీపిక'లో తెల్పినాడు.

తెలుగులో కృష్ణమాచార్యుడు (క్రీ. శ. 1295-1326) ప్రప్రథమ వచన కావ్యకర్త. అతని సింహగిరి నరహరి వచనములు 'చూర్ణిక' లనెడి వచనభేదము లని తాళ్ళపాక చిన్నన్న వివరించినాడు. వస్తువులో ఒక వచనమునకు మరొక వచనమునకు సంబంధముండదు. కనుక వీనిని ముక్తవచనములని చెప్పవచ్చు. సింహగిరి నరహరి వచనములకు ఛందోనియమములేదు. పరిమాణ నియమముకూడ కానరాదు. అప్పటి మనఃస్థితిని, భక్త్యావేశములనుబట్టి రచయిత వానిని దీర్ఘము గనో హ్రస్వముగనో రచించును, కృష్ణమాచార్యుల వచనములలోని క్రమము, సౌలభ్యము, లాలిత్యము ప్రశంసింపదగినవి. కృష్ణమాచార్యుల వచనముల ననుస రించియే తాళ్ళపాక పెద తిరుమలాచార్యులు వేంకటేశ్వర వచనమాలికా గీతములు లేక వేంకటేశ్వర వచనములను రచించినాడు.

వచనప్రక్రియ వైష్ణవేతర కవులనుకూడ నాకర్షించినది. శంకరకవి (క్రీ.శ. 1511-1554) భవానీ మనోహరవచనములు లేక శంకరవచనములు, పిడుపర్తివారి

వచనములు (కర్తపేరు తెలియదు), ఏగంటివారి వచనములు, చిట్టన్నగారి వచనములు, చిలుకపాటివారి వచనములు మొదలగునవి తెలుగులో శైవకవులు రచించిన వచనములలో ముఖ్యమైనవి. తెలుగు కవుల వచనములు కన్నడసాహిత్యమందలి 'వచనము'లను పోలినట్టివే.

(2) ఉదాహరణము :

అన్యసాహిత్యములనుండి ఎరువు తెచ్చుకొనబడని తెలుగు సాహిత్య ప్రక్రియలలో పేర్కొనదగినది ఉదాహరణము. తెలుగులో వెలసిన ఈ ప్రక్రియ సంస్కృతములో నిక్కూడ కొనిపోబడినది.

ఉదాహరణము ప్రధానముగా స్తోత్రరూపమగు లఘుకృతి. తెలుగుభాషలోని సప్తవిధ విభక్తులు, సంబోధనావిభక్తిని ఉదాహరించు కృతి. ఒక్కొక్కవిభక్తికి ఒక వృత్తము, ఒక కళిక, ఒక ఉత్కళిక నియతముగా నుండును. వృత్తములలో చంపకోత్పల మత్తేభ శార్దూలములుమాత్రమే వాడవలెను. కళిక మాత్రాచ్ఛందస్సునకు సంబంధించిన రగడభేదము. ఉత్కళిక. కళికలో సగభాగము; అర్ధకళిక - కళికలో ప్రతి పాదాంతమందును విభక్తి ప్రత్యయము భాసింపవలెను. ఉత్కళికలో చివరి రెండుపాదములలో మాత్రము విభక్తి ప్రత్యయ ముండవలెను. సంబోధనయందు అన్నిపాదములందును సంబోధనాంతముబుగానే యుండవలెను. చతుర్థి విభక్తియందు ప్రతిపాదాంతమున విభక్త్యాభాసము స్పష్టముగా నుండవలెను. కళికయందు ప్రతి పాదము స్వతంత్రవాక్యముగా నుండవలెను, ఉత్కళికయందు ఏకసమాసముగా పాదము ఉండవలెను. సార్వవిభక్తికపద్యమును అన్ని విభక్తులు వచ్చునట్లు రచింపవలెను. సాధారణముగ మత్తేభముగాని శార్దూలముగాని సార్వవిభక్తిక పద్యమునందు వాడుదురు. ఉదాహరణమునందు 25 లేక 26 పద్యము లుండును. ఈ సంఖ్య సదాశివుని షడ్వింశతితత్త్వమును సూచించునని విమర్శకుల భావము.

పాల్కురికి సోమన మొదట తెలుగులోను, అటుతరువాత సంస్కృతము లోను 'బసవోదాహరణము'ను ప్రత్యేకముగా రచించినాడు. రావిపాటి త్రిపురాంతకుని త్రిపురాంతకోదాహరణము, తాళ్ళపాక పెద తిరుమలయ్య వేంకటేశ్వరోదాహరణము, చిత్రకవి పెద్దన హనుమోదాహరణము, బాలకవి అనంతకవి శేషాశైలోదాహరణము, మదురుపాటి సాంబకవి రఘునాథీయోదాహరణము మొదలగునవి పాల్కురికి సోమన ఉదాహరణకావ్యము తరువాత పేర్కొనదగినవి. ఆధునిక

కాలమున దైవపరము లయినవే కాక మానవపరములయిన ఉదాహరణము లెన్నియో రచింపబడుచున్నవి.

స్తుతిరూపకమైన కృతి కాబట్టి ఉదాహరణముగాన యోగ్యమయినది. ఇందలి పద్యములు రాగప్రధానములు. కళికోత్కళికలు తాళాంగప్రధానములు. త్రిపుట, జంపె, రూపక తాళములతోడనే ఇవి పాడవలెను. ఆ తాళమున కనుకూలములైన త్ర్యశ్ర, చతురశ్ర, మిశ్ర జాతులందు ప్రకటితము కావలెను.

స్వరప్రధానమైన సంగీతమునకు, వర్ణప్రధానమైన సాహిత్యమునకు లక్ష్యభూతము లయినవి ఉదాహరణములు. ఉదాహరణములలోని వృత్తములు మార్గ కవితానుసరణములు - కళికోత్కళికలు దేశి కవితానుసరణములు. అక్షరగణబద్ధమగు వృత్తరచన. మాత్రాగణబద్ధమగు పదరచనకలిగి మార్గ-దేశి కవితా సమ్మేళన మొనర్చుకొనిన కావ్యప్రక్రియ ఇది. విభక్తి ప్రత్యయములను నియతముగా కూర్చుటవలన ఉదాహరణములు వ్యాకరణశాస్త్రమును, భాషాతత్త్వశాస్త్రమును తెలిసికొనుట కుపయుక్తములగుచున్నవి.

తెలుగులోని ఉదాహరణ కావ్యప్రక్రియ కన్నడములోని 'బెదెండె' అను కావ్యభేదమును పోలియున్నట్లు గమనింపవచ్చును. ఒక కందపద్యము తరువాత ఒక వృత్తముచొప్పున రచించుచు అందందు జాతులను పొదిగినచో అది 'బెదెండె' కావ్యమగునని కవిరాజమార్గము (1-34)న ఇట్లు చెప్పబడినది.

'కందము మనఃశిన వృత్తము
మొందొందెడె గొండు జాతి జాణెనెయె బెదం
గొంది పరిశ మదెపేల
ల్వందదర రూపిం బెదెండె గబ్బి మదక్కుం.'

'బెదెండె' యందును 'ఉదాహరణము' నందువలెనే మార్గదేశి సమ్మేళనము కన్పట్టుచున్నది. ఉదాహరణములందు చేర్పబడిన కళికోత్కళికలు కన్నడాంధ్ర ఛందము లందు ప్రాచీనములు. ప్రధానముగనయిన రగడభేదములే.

(3) రగడలు :

కన్నడములో రగడలకు ప్రత్యేక కావ్యగౌరవము కలదు. 'రగళె' ఛందస్సులో పూర్తి కావ్యమును వ్రాయుటలో హరిహరుడే (క్రీ. శ. 1200) మొట్టమొదటివాడు. హరిహరుడు 'శివశరణుల రగళె' అను పేరుతో పన్నెండువందల

లఘుకృతులను కన్నడములో రచించినాడు. హరిహరుడు దీర్ఘరఘటాబంధ కావ్యములో అక్కడక్కడ గద్యపద్యములనుకూడ చేర్చి రగళె చంపువును సృష్టించినాడు. హరిహరుని తరువాత కన్నడములో పెక్కు రగడకావ్యము వెలసినవి. తెలుగుకవి పాల్కురికి సోమనాథుడుకూడ కన్నడములో సద్గురు రగడ, చెన్నబసవ రగడలను రచించినాడు. పాల్కురికి సోమన తెలుగులోకూడ రగడకావ్యమును సృష్టించినాడు. అతని బసవరగడ ఉపలబ్ధములగుచున్న తెలుగురగడలలో మొట్టమొదటిది. ద్విపదవలె రగడకూడ ద్విపాదనియమము కలది. దీనికి అంత్యప్రాసకూడ విశేషముగా నుండును. పాల్కురికి సోమన బసవరగడ ఈ లక్షణమునకు కొంత వైలక్షణ్యము కలిగినది. మొత్తము 108 పాదములుగల బసవరగడలో మొదటి 78 పాదములలోనే ద్విపాదాంత్యప్రాస నియమము కలదు. తరువాత 14 పాదములు ద్విపదపంక్తులలోవలె అచ్చటచ్చట ప్రాసయతికూడ అంగీకరింపబడినది. తరువాతి 8 పాదములలో ఇట్టినియమమునే మరికొంత విలక్షణముగ పాటించినట్లు తోచును.

చక్రపాణి రంగన రచించిన 'నయన రగడ' లోని 342 పాదములలోను ప్రతిపాదము చివరను 'కంటి' అను మకుటమున్నది. నయన రగడకే 'శివభక్తి దీపిక' అనికూడ పేరు. చక్రపాణి రంగన 'నమశ్శివాయ రగడ' ను కూడ రచించినాడు. ఇది 108 పాదములకృతి. ఇందు ప్రతిపాదము చివర 'నమశ్శివాయ' అని యుండును. తాళ్ళపాక పెద తిరుమలాచార్యుడు 'సుదర్శన రగడ' ను రచించినాడు.

తెలుగు రగడలకు ప్రత్యేక కావ్యగౌరవము కన్నడ రగడలందువలె కలుగక పోయినను ప్రబంధములలో వర్ణనాదులందు శిష్టకవులు కొందరు రగడలను రచించినారు. శ్రీనాథుడు మొట్టమొదటిసారిగా చంపూ కావ్యమగు కాశీఖండమునందు రగడ ఛందస్సును వాడినాడు. మనుచరిత్రలో 44 పాదముల ద్విపదగతి రగడ. వసుచరిత్రలో 34 పాదముల వృషభగతి రగడ. మల్లన రాజశేఖరచరిత్రలో 40 పాదముల మధురగతి రగడ. అచలాత్మజా పరిణయములో 16 పాదముల తురగవల్గనగతి రగడ, కట్టా వరదరాజు శ్రీరంగమాహాత్మ్యములో హరిగతి రగడ ప్రయోగింపబడినది. రగడలు పాటలరూపమున యక్షగానాదులలో విశేషముగ ప్రయోగింపబడినవి.

(4) యక్షగానములు :

తెలుగుదేశి ప్రక్రియలకెల్ల తలమానికమైనది యక్షగానము. యక్షగానము

జనసామాన్యమున ప్రదర్శనార్థ ముపయుక్తమైన దేశి సాహిత్యప్రక్రియ. లభ్యమైన తెలుగు యక్షగానములలో కందుకూరి రుద్రకవి (క్రీ. శ. 16 వ శతాబ్ది) రచిత మైన సుగ్రీవవిజయమే మొట్టమొదటిది. తంజావూరినాయక రాజులకాలమునను, మహారాష్ట్ర రాజులకాలమునను యక్షగానమునకు రాజభోగము, రంగభోగము అతిశయించినది. తెలుగున వెలసిన ఈ యక్షగానప్రక్రియ కన్నడమునందును, తమిళమునందునుకూడ ప్రవేశించినది. తెలుగున అయిదువందలకుపైగా యక్షగాన ములు, కురవంజులు రచింపబడినవి. తమిళ కన్నడములందును పెక్కు యక్షగాన ములు కురవంజులు వెలసినవి.

ప్రాచీన దేశియ ప్రదర్శనానుకూల రచనయగు యక్షగానమునందు అనేక దేశీయ ఛందోరీతులు సంరక్షింపబడినవి. ద్విపదలు, పాటలు, దరువులు, కందార్థ ములు, సీసార్థములు, మంగళహారతులు, ధవళములు, ఏలలు, జోలలు మొదలగు నవియేకాక తాళబద్ధములగు దేశీయరచనలుకూడ యక్షగానములందు కన్పట్టు చున్నవి. కొంతవరకు సర్వజనసామాన్యమగు వ్యావహారికభాషలో యక్షగానములు రచింపబడినవి. కనుక దేశిరచనా పరిశీలనమునకేకాక భాషాపరిణామ పరిశీలనము నకుకూడ యక్షగానముల పరిశీలన అవసరములు. కన్నడాంధ్రములందలి యక్ష గానములనుగురించి ప్రత్యేకముగా తులనాత్మకముగా ముందు వివరింపబడును.

## (5) ద్విపద రచనలు :

కన్నడమున త్రిపది, షట్పది ఛందస్సులకు ప్రబలమగు ప్రచారము కలదు. త్రిపదికి తెలుగులో ప్రచారము లేదు. తెలుగున షట్పదికి గేయవాఙ్మయమునందు తప్ప పూర్వసాహిత్యమున ప్రచారము లేదు. ద్విపద తెలుగుదేశి ఛందస్సు.

దేశి కవితాశాఖ లన్నిటిలోను గుణమును, పరిమాణమును, ప్రయోజన మును, పండిత లోకాదరణమునుబట్టి అగ్రగణ్యమైనది ద్విపద కవితాశాఖ. క్రీ. శ. 12 వ శతాబ్దమున పాల్కురికి సోమనాథుడు ద్విపదలో బసవపురాణ, పండితారాధ్య చరిత్రలను రచించినాడు. అప్పటినుండి నేటివరకును అవిచ్ఛిన్నముగ తెలుగున ద్విపదరచనలు ప్రతి శతాబ్దములోను వెలయింపబడుచునే యున్నవి. గోన బుద్ధారెడ్డి రచించిన రంగనాథ రామాయణము, గౌరన రచించిన నవనాథ చరిత్ర, హరిశ్చంద్రోపాఖ్యానములు, మడికి సింగన ద్విపద భాగవతము, శ్రీనాథుని పల్నాటి వీరచరిత్ర, తాళ్లపాక చిన్నన్న రచించిన అష్టమహిషీకల్యాణము, ఉషా

కల్యాణము, పరమయోగి విలాసము, అన్నమాచార్య చరిత్రలు, దోనూరు కోనేరు నాథుని బాలభాగవతము, ద్విపద భారతము, కట్టా వరదరాజు రామాయణము మొదలగునవెన్నియో ద్విపదకావ్యములు వెలసినవి. తెలుగు సాహిత్యమున 245 ద్విపదగ్రంథము లున్నట్లు 'ద్విపదవాఙ్మయము' అను పరిశోధకగ్రంథమున గణింప బడినది. తెలుగులోని ద్విపద కవితాశాఖ విపులమైనదేకాక ఇతరశాఖలతో పోల్చి చూచిన బహువిధముల విశిష్టమైనది.

క్రీ. శ. 12 వ శతాబ్దమున వీర శైవ మత విజృంభణకాలమునందు తెలుగులో మహాకావ్యము లనిపించుకొనదగిన ద్విపదకావ్యములు పుట్టి వృద్ధిపొందినవి. గేయమును, పాఠ్యమును నయిన ద్విపదకవిత జనసామాన్యమున మతప్రచారము చేయుటకు మిక్కిలి ప్రయోజనకారియైనది. గోన బుద్ధారెడ్డి, తాళ్ళపాక చిన్నన్న కట్టా వరదరాజు మొదలగువారు వైష్ణవమతాభిమానముతో ద్విపదను స్వీకరించినారు.

దేశిజాతికిచెందిన ద్విపదను 'పాటల వాఙ్మయ' మని ప్రారంభమున కొందరు నిరసించినను తరువాత సరసులైన విద్వత్కవులుకూడ ద్విపదను చేపట్టి అందు మహాకావ్యములను రచించినారు. పండిత పామర సాహిత్యములకు ఒకవిధమగు సామరస్యమును సంఘటించినట్టి ద్విపద కవితాశాఖకు ఆంధ్రకవిత్వపరిణామచరిత్ర దృష్టితో చూచిన ఎంతేని ప్రాధాన్యము కలదు. ద్విపద ఆంధ్రవాఙ్మయమునకు ప్రత్యేకవ్యక్తిత్వము నొసగూర్చిన జాతీయవాఙ్మయశాఖ.

(6) దండకములు :

నగణద్వయముపై విచ్చవచ్చినన్ని రగణములను వ్రాయుట సంస్కృత దండకములందు సామాన్యముగ కన్పట్టును. కన్నడమున దండకవిషయమున సంస్కృతలక్షణమే గ్రహింపబడినది. తమిళమున 'తాండక' మనుపేరుతో దండకము వ్యవహరింపబడినది. తమిళమున దండకములోని గణపద్ధతి విలక్షణమైనది. తెలుగున తగణదండకము లెక్కువ. తెలుగుదండకము మాత్రాఛ్ఛందస్సుగ పరిగణింపబడుచున్నది.

తెలుగు కావ్యములందు స్తుత్యాదులలో దండకములు రచింపబడినవి. నన్నయ భారతమున అర్జునుడు శివుని స్తుతించుసందర్భమున ఒక తగణదండకము రచింపబడినది. ఈ దండకము శ్రీకారముతో ప్రారంభింపబడి 'నమస్తే నమః' తో ముగియుచున్నది. ఎఱ్ఱనకూడ నృసింహపురాణమున తగణదండకమునే రచించెను.

శ్రీనాథుడు శృంగారనైషధమునందును, కాశీఖండమందును సంస్కృతలక్షణ లక్షితమైన దండకములను రచించినాడు. తరువాత తెలుగు ప్రబంధములందును దండకము లున్నవి.

దండకములను ప్రత్యేక కావ్యములుగకూడ కొందరు రచించిరి. పోతన భోగినీదండకము లభ్యమైన మొదటిదండకము. భోగినీదండకము, గణపవరపు వేంకటకవి విద్యావతీదండకము, మదురుపాటి సాంబకవి చంద్రాననాదండకము మొదలగునవి శృంగారప్రధానములు. పోగాకుదండకము, తిట్లదండకము, దోమ దండకము, నల్లిదండకము మొదలయినవి హాస్యరసాత్మకములు. నూకాలమ్మ, పోలేరమ్మ మొదలయిన దేవతాస్తోత్రరూపములన్నియు స్తోత్రదండకములు. తిరునాళ్ల దండకము, భాషీయదండకము మొదలయినవి సాంఘికదండకములు.

కలుగోడు అశ్వత్థ నారాయణరావుగారు దండక రామాయణమును రచించిరి. ఆధునికకాలమునను తెలుగులో దండకరచన సాగుచునేయున్నది.

ఇట్లు కన్నడాంధ్ర సాహిత్యములందు కథావస్తువు, వర్ణనాంశములు, కవి సమయములు మొదలగువానియందేకాక కావ్యప్రక్రియలందును మార్గపద్ధతితోపాటు స్వతంత్రమగు దేశిపద్ధతికూడ ఆదరింపబడుచుండెనని పై పరిశీలనమునుబట్టి తెలియుచున్నది. కాని కన్నడాంధ్రములందు దేశికవితకు పురాణప్రబంధములతో సమానమైన గౌరవముమాత్రము పండితలోకమున లభించలేదనియే చెప్పవచ్చును.

## 13. మలయాళ సాహిత్యములో దేశికవిత :

ఏ భాషయందైనను తొలుత గేయసారస్వతము వెలసి ఆ తరువాత కావ్య వాఙ్మయము క్రమముగా ప్రచారములోనికి వచ్చును. మలయాళమునగూడ రామ చరితము మొదలగుకావ్యములు వెలయుటకుపూర్వము దేశిసాహిత్యము విస్తారముగ నుండినట్లు తెలియుచున్నది. తెలుగునందువలెనే మలయాళమున యతిప్రాస లున్నవి. మలయాళములోని గేయములను కొన్నిటిని పి. పి. గోవిందపిళ్ళెగారు 'పళయ పాట్టుగళ్' (పాత పాటలు) అను పేర ప్రకటించినాడు. ఈ గేయము లెప్పుడు రచింపబడెనో యిదమిత్థమని చెప్పుటకు వీలులేకున్నది. కాని కొందరు వీని రచనాకాలము క్రీ. శ. 4 వ శతాబ్దమని, మరికొందరు క్రీ. శ. 10 వ శతాబ్ద మని తలంచిరి. ఈ గేయములందలి భాష వాడుకభాషకు సన్నిహితముగానుండి సులభసుందరముగ నుండును.

ఈ ప్రాచీన మలయాళ జానపదగేయములలో భద్రకాళిపాట్టు, తీయాట్టు పాట్టు, పుళ్ళువన్‌పాట్టు, శాస్త్రకళిపాట్టు, తోట్టపాట్టు అనునవి ప్రసిద్ధిచెందినవి. వీనిని ఉత్సవాదులందు పాడుదురు. భద్రకాళిపాట్టు కాళికాదేవికి సంబంధించినది. పుళ్ళువన్‌పాట్టు అనునది పాముపాట. ఇది ప్రాచీనమైన గేయమని, శుద్ధ మలయాళములో వ్రాయబడెనని భావింపబడుచున్నది. కేరళదేశమునందలి బ్రాహ్మణులును, క్షత్రియులును 'శాస్త్రకళి' గేయమును పాడుదురు. ఓణప్పాట్టు, కృషిప్పాట్టు, వంజిప్పాట్టు (పడవపాటలు) మొదలగునవి పండుగదినములందును, వ్యవసాయపు పనులందును పాడు గ్రామికగీతములు. క్రీ. శ. తొలిశతాబ్దులలో పశ్చిమసముద్రతీరమున స్థిరనివాసములు కల్పించుకొనిన క్రైస్తవులుకూడ కొన్ని గేయములను రచించిరి. వానిలో మార్గం కళిపాట్టు ప్రశస్తమైనది. అందు సెయింట్ థామస్ మహిమలు వర్ణింపబడినవి. మలయాళమునందలి ఈ గేయసారస్వతమంతయు దేశిసారస్వతముగనే పరిగణింపవచ్చును.

మలయాళవాఙ్మయమునందు ఆదియుగమున తమిళ భాషాప్రభావము గోచరించును. పెరుమాళ్ రాజవంశీయులగు తమిళభూపతుల రాజ్యపరిపాలనము కేరళదేశమున క్రీ. శ. 8 వ శతాబ్దమున నంతమయ్యెను. ఈ రాజవంశీయులమూలమున కేరళదేశమునందు తమిళసంస్కృతి మిక్కుటముగ వ్యాపించెను. ఆ కాలమునకు మలయాళమున కావ్యభాష లేకుండెను. అందువలన మలయాళమున తమిళభాషయే కావ్యభాషగా ప్రయుక్తమయినది. మలయాళమున తమిళభాషాప్రభావము క్రీ. శ. 16 వ శతాబ్దమువరకు వేదోరూపమున గోచరించుచుండును. క్రీ. శ. 12 వ శతాబ్దమున వెలువడిన రామచరితము మలయాళకావ్యమునందు భాష కృతకమై తమిళభాషాప్రభావ మెక్కువగా నున్నది. మలయాళమునకు సంస్కృతముతో గాఢమైన సంబంధము కలదు.

మలయాళకవులు ప్రాచీనకాలమున సంస్కృత తమిళముల నాదరించినంతగా మలయాళము నాదరింపలేదు. వారు మలయాళచ్ఛందస్సులను చిన్నచూపు చూచిరి. అట్టి పరిస్థితులలో చెరుశ్శేరి నంబూద్రి మలయాళచ్ఛందమగు 'మంజరి' లో 'కృష్ణగాథ'ను రచించినాడు. మంజరిచ్ఛందస్సున రచింపబడిన కావ్యమునకే మలయాళమున గాథ అను వ్యవహారనామ మేర్పడినది. ఛందోవిషయమునందే కాక, భాషావిషయమునను 'కృష్ణగాథ' యందు స్వాతంత్ర్యము పాటింపబడినది. సంస్కృత తమిళభాషల ప్రభావములేని శుద్ధ మలయాళభాషలో కృష్ణగాథ రచింపబడినది.

మలయాళములోని ప్రాచీనకావ్యములు పెక్కు సంస్కృత పురాణముల ననుసరించి రచింపబడినవే. మలయాళమున మధ్యయుగమునందును, ఆ తరువాతను సంస్కృతప్రభావమున పెక్కు చంపూకావ్యములు, సందేశకావ్యములు వెలసినవి. ఉణ్ణునీలి సందేశము మొదలగునవి సంస్కృతప్రభావమునే రచితమైనను అందు కేరళదేశపు చారిత్రక సాంఘిక పరిస్థితులు వర్ణింపబడుటచే కొంతవరకు దేశీయత వ్యక్తమగుచున్నది.

కథకళి ప్రదర్శనమునకు వలసిన సాహిత్యమును సమకూర్చు 'అట్టకథ' అను సాహిత్యప్రక్రియ తెలుగు యక్షగానములు బోలియుండుటచే దేశిరచనగానే భావింపవచ్చును. మలయాళమున క్రీ. శ. 17, 18 శతాబ్దులందు 'అట్టక్కథ' వ్యాప్తికి వచ్చినది. కొట్టారక్కార తంబురాన్ రచించిన 'రామనాట్టం' మలయాళమునందలి అట్టక్కథలలో ప్రథమముగా పేర్కొనదగినది. ఆ తరువాత కార్తిక తిరునాళ్, అశ్వతి తిరునాళ్, ఉణ్ణాయివారియర్ మొదలగువారు అట్టక్కథలను రచించినవారిలో ప్రముఖులు.

కేరళదేశమునందలి ప్రసిద్ధ జానపద కళావిశేషములలో 'తుళ్ళల్' రచన ఒకటి. క్రీ. శ. 18 వ శతాబ్దికిచెందిన కుంజన్ నంబియార్ తుళ్లల్ ప్రాదుర్భావమునకు కారణభూతుడు. 'తుళ్లల్' రచనలందు పౌరాణికగాథలమూలమున సమకాలికపు జీవనవిధానము మనోజ్ఞముగా చిత్రింపబడినది. తుళ్ళల్ సామాన్యులను నయితము అలరించిన సాహిత్యప్రక్రియ అవియు, కుంజన్ నంబియార్ పండితాధీనమైన సాహిత్యమును సామాన్యజనులకు సన్నిహితమొనర్చిన ప్రగతిశీలియనియు చెప్పవచ్చును. నంబియార్ తరువాత తుళ్లల్ రచనలను వ్రాసినవారిలో ముఖ్యులు పూన్‌తోట్టత్తు, వలియ దామోదరన్ నంబూరి, వెణ్మణి అచ్చన్ నంబూరిపాడ్, రామపురత్తువారియర్, అందియాట్టు పణిక్కర్, కోయిపురత్తు పణిక్కర్ మొదలగువారు. నేటికిని మలయాళమున తుళ్లల్ రచన విశేషముగ ఆదరింపబడుచున్నవి.

ఆధునిక మలయాళసాహిత్యమున ఇతివృత్తమునందును గొప్ప పరివర్తన మేర్పడినది. సామాన్యమానవుని జీవితమే ఆధునికకాలమందలి పెక్కు రచయితలకు కావ్యవస్తువైనది. ఆధునిక మలయాళసాహిత్యము దేశిమార్గముననే పురోగమించుచున్నది.

మలయాళసాహిత్యమున, సంస్కృతభాషాప్రభావముచే పౌరాణికేతివృత్తము ప్రాధాన్యము వహించినను దేశి పారస్వతమునకూడ అందు సమప్రాముఖ్య మీయబడినది.

## 14. ద్రావిడభాషలలో దేశ్యపద విభాగము :

సంస్కృత ప్రాకృత సంప్రదాయమునకు భిన్నమైన శబ్దజాలమును 'దేశి' అని 'దేశ్య' మని ప్రాకృతవైయాకరణులు, దక్షిణదేశభాషా వైయాకరణులు వేరుపరచి చెప్పినారు. దాక్షిణాత్యభాషలందలి ప్రత్యేక వ్యక్తిత్వపోషణకు మూలమగు దేశ్యవిభాగమునుగురించి తెలిసికొందము.

### (1) తమిళభాషలో దేశ్య పదవిభాగము :

తొల్కాప్పియనార్ రచించిన తొల్కాప్పియము ప్రాచీనము, ప్రశస్తము నయిన తమిళ లక్షణగ్రంథము. అందు తమిళభాషాశబ్దములు నాల్గువిధములుగ విభజింపబడినవి. (1) ఇయర్ చొల్ - మలభముగా తెలియదగిన, వ్యవహారమున మార్పుచెందని, పూర్తి దేశీయములైన తమిళశబ్దములు. (2) తిరిచొల్ - వ్యవహారమున మార్పుచెందిన, కావ్యములం దుపయుక్తములగు తమిళపదములు; గ్రాంథికభాష లేక పండితభాషకు చెందిన పదములు. (3) తిశైచ్చొల్ - అన్యదేశ్యములు. (4) పడచొల్ - సంస్కృతమునుండి తమిళమున ప్రవేశించిన శబ్దములు. ఈ విభాగమునుబట్టి తొల్కాప్పియము కాలమునాటికే తమిళభాషలో సంస్కృతశబ్దములు, అన్యదేశ్యములు ప్రవేశించినట్లు స్పష్టమగుచున్నది. కాని తెలుగు కన్నడ మలయాళములందువలె తత్సమతద్భవములరూపమున కలిసి మెలసిపోయిన సంస్కృతశబ్దములు తమిళమునందు చాల తక్కువ. తత్సమ తద్భవ భాగములను పూర్తిగ విసర్జించినను తమిళము వ్యవహారయోగ్యసమర్థమై యుండునని భాషాశాస్త్రజ్ఞు లంగీకరించుచున్నారు.

క్రీ. శ. 10 వ శతాబ్దినాటికి తమిళభాషలో రెండుశాఖ లేర్పడినవి. ఒకటి కొడుం తమిళము. ఇది సంస్కారముపొందని ప్రాచీన తమిళభాష. వాడుకభాషకు సన్నిహితముగానుండు కొడుం తమిళమునందు అన్యభాషాపదములుకూడ హెచ్చుగా గ్రహింపబడినవి. రెండవది చెందమిళము. ఇది సంస్కారముపొందిన పరిశుద్ధమైన శుద్ధ తమిళభాష. ఇదియే తమిళమున గ్రాంథికభాషగ పరిగణింపబడుచున్నది. తమిళము క్రీ. శ. 1930 ప్రాంతమున భాషకు సంబంధించిన 'చెందమిళ్ ఉద్య

మము' అను పేర ఒక ఉద్యమము వ్యాప్తిలోనికి వచ్చినది. తమిళదేశమున ద్రవిడ కజగం. ద్రవిడ మున్నేట్ర కజగం అను రాజకీయసంస్థలు వెలసి ఆర్యుల భాషయైన సంస్కృతమును పరిహరించి శుద్ధతమిళమున వ్యవహరించి, ఆ భాషలోనే రచనలు వెలయించవలెనను ఆశయముతో కృషి చేయదొడగినవి. తమిళమునందలి తత్సమశబ్దములు దేశీయోచ్చారణ సంప్రదాయానుసారము మార్పునొందియే వ్యవహరింపబడును. ఈ చెందమిళ్ ఉద్యమమువలన సంస్కృత నిరపేక్షమైన శుద్ధ తమిళమున కాదరము హెచ్చినది.

(2) పచ్చ మలయాళము :

కోవుణ్ణి నెడుంగాడి (క్రీ. శ. 1828-86) 1875 లో ప్రకటించిన కేరళ కౌముది అను వ్యాకరణగ్రంథములో,

'సంస్కృత హిమగిరి కళితా
ద్రావిడ వాణీ కళింద జా మిళితా కేరళభాషా గంగా
విహరతు మమ హృత్సరస్వదానంగ.'

సంస్కృతమను హిమాలయములనుండి కేరళభాష (మలయాళము) గంగవలె ప్రవహించినట్లు చెప్పినాడు. మలయాళము సంస్కృతమునుండి పుట్టిన భాషయని అతడు అభిప్రాయపడినట్లు దీనివిబట్టి తెలియుచున్నది. మలయాళములోని సంస్కృత పదాధిక్యతనుబట్టి అది సంస్కృతభాష అపభ్రంశరూపమని వడక్కుంకూర్ రాజరాజవర్మ 'సాహితీసాహ్యం' అను వ్యాకరణగ్రంథమునందు తెల్పినాడు. తమిళ మలయాళములు చాలకాలము కలసియున్నవని, తరువాత కొద్దిమార్పులతో మలయాళము తమిళమునుండి విడిపోయినదని పలువురి విమర్శకులు వాదించినారు. కొడుం తమిళమే దేశభేదమున వేరుభాషగ నేర్పడి మలయాళభాషగా పరిణమించినదని కొందరు చెప్పుదురు. ఎల్. వి. రామస్వామి అయ్యర్ మలయాళము చెందమిళ్‌యొక్క మరొక రూపమని తెల్పినాడు. కాని మలయాళము స్వతంత్ర భాషయని నిరూపింపబడినది. మలయాళములోని గ్రాంథికభాషకు, వాడుకభాషకు మధ్య అంత భేదమున్నట్లు కానరాదు. మలయాళమున ఆదియుగమున తమిళభాషా ప్రభావము, మధ్యయుగమున సంస్కృతభాషా ప్రభావమున్నట్లు చెప్పుదురు. ఆధునిక మలయాళమున సంస్కృతపదభూయిష్ఠమయిన భాషగాని, కృత్రిమమగు మలయాళకావ్య భాషగాని ప్రయోగించుటలేదు. వ్యావహారికభాషకు సన్నిహితమగు భాష మలయాళమున నేడు స్వీకరింపబడుచున్నది. చంగంపూళ కృష్ణపిళ్లై,

అతని అనుచరులు కావ్యములందును, గీతములందును సులభసుందరమైన భాషను వాడవలెనని చెప్పినారు. స్వతంత్రమైన శుద్ధ మలయాళభాషనే 'పచ్చ మలయాళ' మను పేరుతో వ్యవహరింతురు.

## (3) తెలుగులో దేశ్యపద విభాగము :

దక్షిణదేశభాషలలో సంస్కృతశబ్దజాలము తత్సమరూపమున విశేషముగా ప్రవేశించినది. ఈ భాషలలో సహజముగాలేని మహాప్రాణములు, శ, ష, స మొదలగు వర్ణములు ఆ శబ్దములతోపాటు చేరి వ్యవహరింపబడుచున్నవి.

ఆంధ్రభాషాభేదములను పేర్కొనుచు 'తజ్జాన్యసమాజ దేశ్యాగ్రామ్యాచేయం చతుర్విధాభవతి' అనియు 'ప్రకృతిద్వయ జాతజ్యా తుల్యాతు సమా ప్రవాహిపి దేశ్యా' అనియు నిర్వచనము లుండుటచే తత్సమ తద్భవములకంటెను భిన్నము లగు దేశ్యపదము లనేకములు తెలుగునందు కలవని తెలియుచున్నది.

ప్రాకృత వైయాకరణులవలెనే దేశభాషా వైయాకరణులుకూడ భాషాశబ్దములను తత్సమ, తద్భవ, దేశ్యములనియే విభాగించినారు. తద్భవము లేర్పడు పద్ధతు లీ ద్రావిడభాషలన్నిటిలో చాలవరకు సమానములే. ఈ భాషలలో లేని వర్ణములను పరిహరించి, వారి యుచ్చారణ సంప్రదాయానుసారముగా ఆ శబ్దజాలములను మార్పునొందించి పరిగ్రహించుట ఇందలి ప్రత్యేకపద్ధతి.

తమిళభాషయందు సంస్కృతభాషాప్రభావము తక్కువయగుటచే ఈ రెండు భాషలకు సమానములుగానుండు వర్ణములతో కూడిన సంస్కృతశబ్దములే తమిళమునందు తత్సమములను పేర నప్లే గ్రహింపబడినవి. కనుక మహాప్రాణములు, శ, ష, స మొదలగు సంస్కృతవర్ణములు తమిళములో ప్రవేశింపలేదు.

కన్నడాంధ్రములందు ద్రావిడభాషలకు విజాతీయములగు వర్ణములతో కూడిన సంస్కృతశబ్దములనుకూడ అట్లే గ్రహించి, వానిపై మహదమహత్సూచక ప్రత్యయములనుచేర్చి వాడుకొనుసలవాటు ప్రబలినది. ఇట్టి తత్సమభాష సంస్కృతపండితుల శిష్టవ్యవహారమునందు చోటు చేసికొనినది.

'తల్లి సంస్కృతంబె యెల్లభాషలకును' అని కేతనాది లాక్షణికులు తెల్పినారు. ఆయనను సంస్కృతమువలన 'కొంత' వరకే 'కానఁబడియె' ననియు, 'కొంత తానకలిగె' ననియు, వంతయు నేకమై తెలుగుభాషగ వినుతికెక్కెననియు

చెప్పియుండుటచే తెలుగునందు దేశ్యశబ్దజాలము సంస్కృతమునుండి యేర్పడినది కాదని ప్రత్యేకమయినదని స్పష్టమగుచున్నది.

తెలుగుభాషలో యెల్లవారికి అప్రయత్నముగా సహజముగా తెలిసెడి శబ్దములను అచ్చతెనుగని కేతన ఇట్లు తెల్పినాడు.

'తల నెల వేసవి గుడి మడి
పులి చలి, మడుగూరు, పేరు బూరుగు, మగవా
డలుక యని యెల్లవారికిఁ
దెలిసెడి యా పలుకు లచ్చ తెనుఁగన బరగున్.'

సహజాంధ్ర దేశ్యములైన అచ్చతెనుగుపదములు సర్వజనులకు తేటపడియెడు వట్టివని విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణియందు తెల్పినాడు. అచ్చ తెనుగునందు తద్భవములు చేరవవి విన్నకోట పెద్దన చెప్పినాడు. కాని తరువాతివారు తద్భవములనుకూడ అచ్చ తెనుగులోనే చేర్చుటకు యత్నించినారు. సంస్కృత ఛాయిష్ఠరచనకు ప్రతిగా ఈ అచ్చతెనుగు రచన తొలుత ప్రారంభమయినది. కేతన, విన్నకోట పెద్దనలు అచ్చతెనుగు, దేశ్యము అనువానిని భిన్నములుగాచేసి చెప్పినారు. అచ్చతెనుగు సహజాంధ్రదేశ భవమనియు, దేశ్యము 'బహుదేశాసీయములై యాయా నెలవులఁ జెవులకు దీయములగు పలుకు' లనియు 'శేరనాడిన దేశ్యంపు బలుకులని'యు వీరు చెప్పినారు. అప్పకవి 'దేశ్య'మునే శుద్ధాంధ్రదేశ్యమవి, అన్యదేశజాంధ్రమవి రెండుభాగములుగా చేసినాడు. అప్పకవి చెప్పిన శుద్ధాంధ్రదేశ్యము కేతన పెద్దనలు చెప్పిన అచ్చతెనుగే. విశ్వవ్యవహారములోమందు ఈ శబ్దములకు ఇతర దక్షిణదేశభాషలలో సజాతీయశబ్దము లుండుటచే అవి దేశమునకు సహజములు, దేశ్యములు అగుచున్నవి.

(4) మణిప్రవాళము :

ప్రాచీనకాలమునుండియు దేశి, సంస్కృతభాషలను యథాతథముగ మేళనముచేసి కవిత్వము వ్రాయుట కలదు. భరతుడు ఈ భాషనే అర్ధసంస్కృతమని వ్యవహరించినాడు. ప్రాకృత సంస్కృతభాషలు మిశితమై యేర్పడిన అర్ధసంస్కృతమే తరువాత మణిప్రవాళ మనబడినది. తత్సమ వ్వరూపముదాల్చని కేవల సంస్కృత పదప్రయోగములను విషేధించుటవలన కవిరాజమార్గకర్త మణిప్రవాళ రచనాపద్ధతిని నిరాకరించినాడు. దేశభాషలలో సమ సంస్కృతమునే కాని

కేవల సంస్కృతపదములను కలపరాదని ; నృపతుంగుడు కవిరాజమార్గములో నియమ మేర్పరచినాడు. నృపతుంగుడు కన్నడ భాషావిషయమున చెప్పిన సూత్రములను తరువాతివారు పాటించినారు. సంస్కృతపదములను కన్నడభాషలో నెట్లు వాడవలయునో, ఎట్టి రూపములను దేశభాషాపదములతో కలిపి వాడరాదో కవిరాజ మార్గమునందు వ్యవస్థ చేయబడినది. పంపాది కన్నడకవులు తత్సమ భూయిష్ఠమగు భాషను తమ కావ్యములందు వాడినారు. బసవయుగమునందు భాషావిషయకముగా హళగన్నడమునకును, హొసకన్నడమునకును మధ్య నడుగన్నడము వ్యాప్తిలోనికి వచ్చెను.

ఆంధ్రశబ్దచింతామణి కర్తకూడ మణిప్రవాళశైలికి విముఖుడే. 'నపదాన్వ్యయ సుప్తిఙ్క్త్వాతుమునాం' అను సూత్రమట్టి ప్రయోగముల నిషేధించుచున్నది. రేచన (క్రీ. శ. 1100) కవిజనాశ్రయమను లక్షణగ్రంథమున మణిప్రవాళశైలిని నిరాకరించినాడు.

"'ఈతడు నృపస్య నగరం
యాతి' యనంజనిన సుప్తిఙంతంబులు కృ
త్వాతిర్త్వా జిత్వాయన
బ్రాతిగ నీ క్రియలు సొరవు భాషాకృతులన్.'
—దోషాధికారము-ప. 24, వావిళ్ళప్రతి (1969)

ఇందు 'ఈతడు నృపస్యనగరం యాతి' వంటి వాక్యరచనలు భాషాకృతులందు అనగా దేశభాషాకృతులలో సొరవు అని నిషేధింపబడినవి. ఇట్టి నిషేధములు కావించినను మణిప్రవాళ శైలిపట్ల ఆ తరువాతికాలములోకూడ సంస్కృతభాషా దురభిమానులగు కొందరు తెలుగుకవులు అభిమానము చూపియుండుటనుబట్టి కాబోలు పాల్కురికి సోమన తన వృషాధిపశతకములో,

'అనయము చేతులందు భవదంఘ్రి సరోజయుగం నమామి నె
మ్మనమున సంస్మరామియను మాటల నిస్వరి వక్కరోమ్యహ
మ్మనుచు మణిప్రవాళమున వంకన సేయుదు.' నని తెల్పినాడు.

అత్యంత ప్రాచీనకాలములోనే యేర్పడిన ఈ మిశ్రభాషా కవితా కల్పనాశక్తికి మూలము బహుభాషాజ్ఞానమేనని వాఙ్మయమహాధ్యక్ష వడ్లమూడి గోపాలకృష్ణయ్య గారు 'మార్గ-దేశి' అనుగ్రంథమునందు తెల్పియున్నారు.

కవిజనాశ్రయకర్తవలెనే కేతనకూడ ఆంధ్రభాషాభూషణములో మణిప్రవాళ పద్ధతికి మూలమైన సంస్కృతశబ్దములప్రయోగము తెలుగులో కూడదని చెప్పి నాడు.

'వృక్షేణ దక్షాయ పక్షిభిః పుత్రస్యయను విభక్తులు దెనుంగునకుఁ జొరవు.
అస్తిప్రయాతి గాయంతి భుంక్తే సంతి వయతిస్మరతియను క్రియలు సొరవు
గత్వాహపిత్వా ప్రకాశ్యసం త్యజ్యనా దనరుక్త్వాంతల్య బంతములు సొరవు
గంతుం పురీం రిపుంహంతుం సుతంపాతు మనుతుమున్నంతంబు లరయఁ
జొరవు

అపిచ తుహివైవ వానను లనఁగ బెక్కు
లవ్యయంబులు చొరవెందు నాంధ్రకవిత
బెరపదంబులతోడను దొరలి విల్చు
నవి తెనుంగులు కావింతు వఖిమతముగ.'

వృక్షేణ, దక్షాయవంటి సంస్కృతవిభక్తి ప్రత్యయములును, అస్తి, సంతి, గాయంతి వంటి క్రియలును, గంతుం, హంతుంవంటి తుమున్నంతములును, అపి, వ, తుహి మున్నగు అవ్యయములును ఆంధ్రకవితలో ప్రవేశించుటకు వీలులేదని కేతన స్పష్టీకరించినాడు. దీనినిబట్టి కేతనకుముందు ఇట్టిపదములు తెలుగుకవిత్వ మున చేరెదివేమోయని అనుమానించుటకు వీలగుచున్నది. మణిప్రవాళశైలిని దృష్టిలో నుంచుకొనియే కేతన ఈ హెచ్చరిక చేసినట్లు తెలియుచున్నది.

మలయాళమున క్రీ. శ. 14 వ శతాబ్దమున కేరళ సంస్కృతభాషా మిశ్ర రచనాపరమై 'మణిప్రవాళ' మను పేరుతో ఒక శాఖగా రూపొందినది. 'భాషా సంస్కృత యోగో మణిప్రవాళమ్' అని మలయాళమునకు సంస్కృతములో రచింపబడిన లీలాతిలకమను లక్షణగ్రంథమున మణిప్రవాళమునకు నిర్వచనము చెప్పబడినది. దేశభాషను సంస్కృతమునుకలిపి మిశ్రమముగా రచన చేసినచో మణిప్రవాళ మనబడునని దీని అర్థము.

(5) పళగన్నడము - ప్రాచీనతెనుగు :

నృపతుంగుడు, ప్రాచీనమైన ప్రజల కందుబాటులో లేక వ్యవహారభ్రష్టమై పోయిన పళకన్నడమును 'పిరసంతర మప్పుదేసిగె జరద్వధూవిషయ సురత రస రసికతవోల్' (కవిరాజమార్గము 1-50) అని నిరసించినాడు. పళగన్నడ నిరసన

మనగా మరుగునపడిన పాతవడిన కన్నడపద నిరసనమని అర్థము. తిక్కనకూడ నిర్వచనోత్తర రామాయణపీఠికలో ప్రాతవడ్డమాటల ప్రయోగమును. తద్రచన లను నిరాదరించినాడు.

కవిరాజమార్గమునందు పళగన్నడమునుగురించిన ప్రస్తావనలో దేశిని గురిం చిన వివరము లున్నవి. దేశి వేరువేరు విధములుగానుండుటచే కన్నడభాషలోని దోష మింతయని విచారించి నిశ్చయముగా చెప్పుటకు వాసుకికికూడ సాధ్యము కాదు. వేసటకూడ కలుగునట. కనుక కన్నడ దేశీయభాషకు లక్షణము చెప్పుట సాధ్యముకాదని కవిరాజమార్గకర్త తెల్పినాడు.

'దోసమిది తెందు బగెదు
ద్భాపిసి తటి సందు కన్నడం గళొళెందుం
వాసుగియు మఱియ లారదె
చేసఱుగుం దేశి బేఱిబే అప్పుదఱిం.'

—దోషాదోషాను వర్ణననిర్ణయము - 46 ప.

అప్పకవి తెలుగు మఱుంగులు, ప్రాదెనుగులు అను రెండువిధములయిన తెలుగులను పేర్కొనినాడు. తొల్లిటి కవుల వాక్యములు ప్రాదెనుఁగులు. అనగా నిత్యవ్యవహారములో లేని ప్రాతవడ్డ మాటలను ప్రాదెనుఁగులని అప్పకవి వ్యవహ రించినాడు. తెనుగు మఱుగులనగా సంస్కృతసమాసముల అర్థమును తెలుపుటకు గాను దేశ్యపదములతో చేయబడిన దీర్ఘసమాసపదములు.

వివిధ దేశభాషలలో వివిధార్థములతో ఒక్కొక్క సంస్కృతభాషా శబ్ద స్వరూపము జాతీయముగా రూపొందినది. దేశీయమైన ప్రత్యేకతతో రూపొందిన సంస్కృత సమపదములను దేశీయముగా ప్రసిద్ధమైన అర్థములతోడనే ప్రయో గింపవలెను కాని తద్భిన్నముగా ప్రయోగింపరాదు. దేశీయముకాని 'మార్గ'మును ప్రయోగింపరాదను భావముతోడనే మార్గమును దేశీయముగా ప్రయోగింపవలెనని నన్నెచోడుడు కుమారసంభవ పీఠికలో తెల్పినాడు. దేశీయప్రయోగ వ్యతిరిక్తమైన కొన్ని భిన్న సంస్కృతశబ్ద ప్రయోగములను కవులు చేయుచుండుటను గమనిం చియే కాబోలు తిక్కన తన నిర్వచనోత్తర రామాయణపీఠికలో 'జాత్యమిగామి నొప్పయిన సంస్కృత మెయ్యెడఁ జొన్పను' అని నిర్మోహమాటముగా వానిని తిరస్కరించియుండుట.

దేశీయములైన తెలుగుపదములకు కొన్నిటికి సంస్కృతపద స్వరూపములు కొరవడినందువలన తరువాతికాలములో సంస్కృతపదములను కొన్నిటిని కృతకముగా సృష్టించినారు. దేశీయముకాని దేశిప్రయోగములను దృష్టియం దుంచుకొనియే నన్నెచోడుడు దేశిని దేశీయముగా ప్రయోగింపవలెనని చెప్పినాడు.

నన్నెచోడునికాలమున సంస్కృత సమపదములలో సంస్కృతము ననుసరించి పూర్ణబిందువుకు బదులుగా ఆయా వర్గాంత్యాక్షరములనే ప్రయోగించుచుండెడివారు. ఈ వర్గాంత్యాక్షరప్రయోగము సంస్కృతములోనిదే కాని తెలుగు జాతీయమైనది కాదు. సంస్కృతశబ్దమును దేశభాషలో తత్సమములుగా ప్రయోగించునపుడు దేశీయతతో పూర్ణబిందుయుక్తముగా ప్రయోగింపవలెనే కాని దేశీయతకు భిన్నముగా వర్గాంత్యాక్షర ప్రయోగముతో ఉపయోగింపరాదని నన్నెచోడుడు భావించినాడు.

(6) జాణ్ నుడి :

కన్నడ సారస్వతమున నాగవర్మ. గుణవర్మలను వారు 'జాణ్ నుడి'కి ప్రసిద్ధులు. నయసేనకవి తన ధర్మామృతమునందును. జన్నకవి తన యశోధర చరిత్రలోను గుణవర్మ జాణ్ణుడిని ప్రశంసించియున్నారు. 'జాణ్ణుడి' సంస్కృత ప్రాధాన్యములేని జాతీయమైన కన్నడభాషాప్రయోగమును తెలుపునని ఊహింపవచ్చును. కనుక 'జాణ్ణుడి'ని అభిమానించిన కన్నడకవులు తమ కవితయందు దేశి ప్రాధాన్యము నభిలషించినట్లు భావింపవచ్చును. కావ్యోపయోగ్యమైన భాష జాతీయమైన కన్నడ నుడికారముతోనుండుట 'జాణ్ణుడి'ని పేర్కొనిన కన్నడ కవుల అభిమతము కావచ్చును. కన్నడకవుల ప్రయోగమునుబట్టి 'జాణ్ణుడి' అనునది 'తిరుళ్ కన్నడము'తో సమానమయినదని చెప్పవచ్చును. తిరుళ్ కన్నడమనగా సారభూతమైన కన్నడము. ఇది తెలుగులోని తేటతెలుగుతో సమానమనవచ్చునేమోనని కోరాడ రామకృష్ణయ్యగారు కుమారసంభవ పీఠిక (పుట. 30) లో తెల్పినాడు. కన్నడకవులు కొందరు 'జాణ్ణుడి' అనుపదమును ప్రయోగించియున్నను దానిస్వరూపమును తెలుపలేదు. 'జాణ్ణుడి' అనగా జాణతనముతో చమత్కారయుక్తముగా ప్రయోగింపబడిన కన్నడమని విమర్శకుల అభిప్రాయము. మొత్తముమీద 'జాణ్ణుడి' అనునది భాషావిషయికముగా దేశీయత నభిమానించు రచనాపైఖరి అని చెప్పవచ్చును.

(7) జాను తెనుగు :

కన్నడ 'జాణ్ణుడి'కి ప్రత్యామ్నాయమగు తెలుగుపదము జానుతెనుగు. తెలుగు కావ్యలోకమున తొలిసారిగా జానుతెనుగును ప్రవేశపెట్టినవాడు నన్నె చోడుడు. దీని నొక సిద్ధాంతముగాజేసి తరువాతికాలములో సమధికప్రాశస్త్యమును కూర్చినవాడు పాల్కురికి సోమన.

నన్నెచోడుడు జానుతెనుగును ఏ అర్థమునవాడెనో తెలుపుటకు పలువురు పండితులు ప్రయత్నించిరి. 'జాను' అనునది 'చదును' శబ్దమునకు రూపాంతర మని, 'చదును' చతురశబ్దమునకు వికృతియని సర్వజన సుబోధకమైన తెలుగే జాను తెనుగని చిలుకూరి నారాయణరావుగారు పండితారాధ్యచరిత్ర పీఠికలో తెల్పి నారు. కాని వీరిచ్చిన వ్యుత్పత్తికిని, వివరణమునకు సమన్వయము కుదురుటలేదు.

పాల్కురికి సోమనాథుని వృషాధిపశతకములో జాను తెనుగును సూచించు పద్యమొకటి కలదు.

'బలుపొడతోలు సీరయును బాపసరుల్ గిలుపారు కన్ను వె
న్నెలతల పేరుగుత్తికయు నిండిన వేలుపు టేఱువల్గు పూ
సలుగలతేని లెంకవని జానుదెనుంగున విన్నవించెదన్.'

పై పద్యమున నున్నవి శుద్ధాంధ్రపదములే. వీనిలో తత్సమశబ్దముల ప్రసక్తియే లేదు. నన్నెచోడుని కవిత్వములో తత్సమములు కొల్లలు. పాల్కురికి సోమన కృతులలో పరిమితము తత్సమశబ్దములు లెక్కకుమించి యున్నవి. జాను తెనుగనగా అచ్చతెలుగేమో అను భ్రాంతిని శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు కుమార సంభవ విమర్శనమున వ్యక్తము చేసినారు. పై వివరణమునుబట్టి జాను తెనుగు యయాతి చరిత్రాదులలోని అచ్చతెనుగు కానేరదు. జానుతెనుగు తేటతెనుగుకంటె విశిష్టమయినది.

'జాను'శబ్దము శుద్ధ దేశ్యపదము. ఇంపు సొంపు, సరసత, ప్రసన్నత అను నవి జానుతెనుగునందలి విశేషగుణములు. తెలుగుభాషలో స్వభావసిద్ధముగ వాడెడి సంస్కృతసమాసములు, జనసామాన్యమున వ్యవహరింపబడు దేశిపదములతో నొప్పి అన్వయక్లిష్టత లేక మంజులమై, సరసమై, ప్రసన్నమైన తెలుగుభాషయే జానుతెనుగని చెప్పవచ్చును.

నన్నెచోడుడు కుమారసంభవావతారికలో జానుతెనుగును ప్రస్తుతించినను, దేశీయమార్గము ననుసరింతునని చెప్పినను అతడే తన ప్రతిజ్ఞను నిల్పుకొనలేక పోయెను. కెలసము (=పని, చేత), తిప్ప (=నేయి), మొసరు (=పెరుగు), హాలు (=పాలు), మున్నగు కన్నడపదములను, వేలగొని (=మరులుగొనుట), నాయి (=కుక్క) మొదలగు తమిళపదములను, పోండిగ, మూండు, ఏండు, పుడమిపుడు, ఎయిదనేరమివంటి వింతపదములను ప్రయోగించి తన రచనను కొంత క్లిష్టపరచినాడు. నన్నెచోడుడు పాండిత్యప్రకర్షకు, చమత్కారబంధురమునకు సంస్కృతజటిల సమాసములను వాడినాడు. అయినను నన్నయ ప్రయోగించని కొన్ని దేశిపదములను, దేశీయ సంప్రదాయములను, దేశి నాడులను ప్రవేశపెట్టి కొంతవరకు తన 'జానుతెనుగు' ప్రతిజ్ఞను నిలిపికొనెనని చెప్పుటలో విప్రతిపత్తి లేదు.

జానుతెనుగు వ్యవహారములో నన్నెచోడునికి పాల్కురికి సోమనాథునికి కొంత భేదము కలదు. నన్నెచోడుడు దేశికవితనే జానుతెనుగని పేర్కొనినాడు. అనగా స్పష్టముగా అర్థమగు తెలుగు. విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణి (8 వ ఉల్లాసము - 16 పద్యము)లో చెప్పిన దేశ్యలక్షణముబట్టి దేశ్యపదములందు అన్యదేశ్యము లుండవచ్చును. కాని అవి స్థానికుల చెవులకు ప్రియములుగా నుండవలెను. కనుక పెద్దన చెప్పిన దేశ్యము నన్నెచోడుని జానుతెనుగు ఒకటే అయియుండవచ్చును. పెద్దన ఉదాహరించిన దేశ్యపదములలో చాలభాగము నన్నెచోడుడు వాడినవే. పాల్కురికి సోమనాథుని భాషాపదనిర్వచనము ప్రకారము జానుతెనుగనగా ప్రామాణికముగా దేశితెనుగేనని వాఙ్మయ మహోధ్యక్ష వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు 'జానుతెనుగు' అను గ్రంథమునందు వివరించినాడు. పాల్కురికి సోమనాథునిప్రకారము తత్సమము కాని, తద్భవము కాని, దేశ్యము కాని, అన్యదేశ్యము కాని తుదకు సంస్కృత సమాస భూయిష్ఠరచన కాని అది దేశీయ ఛందోనిబద్ధమై యుండినచో జానుతెనుగు అగునని చెప్పవచ్చును. పాల్కురికి సోమనాథుని తరువాత ఈ జానుతెనుగును ఎవరుగాని పేర్కొనలేదు.

దేశి కవితోద్యమమునకు మూలపురుషుడగు పాల్కురికి సోమనాథుడు ప్రజావ్యవహారమునకు, ఉచ్చారణకు సన్నిహితముగానుండు భాషలో కావ్యరచనము కావించి భాషావిషయమున దేశీయతను సాధించినాడు. సాధారణముగా లాక్షణిక గ్రంథములకు విధేయములుకాని భాషాప్రయోగములు, వైరి సమాసములు, సంధి

విశేషములు, కారకరీతులు, పదముల వర్ణక్రమవిధానము, క్రియారూపములు మొద అగువానికి సంబంధించినవి దేశ్యభిమానులగు శివకవుల రచనలలో ఎక్కువగ కన్పట్టును. దేశి రచనలందలి భాష ప్రజల శిష్ట వ్యావహారికభాషకు చాల సన్నిహిత ముగా నున్నది. జాతులకు, వృత్తులకు, పనిముట్లకు, కొన్ని వస్తువర్గములకు సంబంధించిన దేశీయపదావళులు దేశి రచనలందు సందర్భోచితముగ కొల్లలుగా కూర్పబడినవి. ఇట్టి దేశీయపదప్రయోగములు ప్రబంధాది చంపూకావ్యములందు కానరావు. తెలుగుభాష దేశీయతను, జాతీయతను, నుడికారపు సొంపును అధిక ముగా ఆరోపించుకొనినవి ద్విపదాది దేశిరచనలే.

ఇతివృత్తము, వర్ణనాంశములు, కావ్యప్రక్రియలందువలెనే భాషావిషయము నందును సంస్కృత సంప్రదాయములు తెలుగు కన్నడ మలయాళములందువలె తమిళమున ప్రవేశించినట్లు లేదని పై పరిశీలనమునుబట్టి వ్యక్తమగుచున్నది.

## 15. దాక్షిణాత్య దేశిరచనలలో ఛందోరీతులు :

బండారు తమ్మయ్యగారు మార్గ-దేశి భేదములను ఛందశ్శాస్త్రానుగుణముగ నన్వయించినారు. కేవల గీర్వాణములయిన స్రగ్ధరాదులు (అక్షరగణములు) కూర్ప బడినది 'మార్గ'మని, దేశీయములగు కందము, గీతము మొదలగు మాత్రాగణబద్ధ మయినది దేశికవిత అని వారి అభిప్రాయము.[1] 'దేశీయములగు మాత్రాఛందస్సు నుండి పుట్టిన జాతిపద్యముల రచన దేశికవిత' అని రావూరి దొరసామిశర్మగారు తన ఛందోరీతులలో తెల్పినారు.

లఘుగురువర్ణములు మూడేసికూడిన యేర్పడునవి అక్షరగణములు. ఇవి అన్నియుచేరి ఎనిమిది గణములయినవి. ఇవి ఛందః ప్రస్తారముచే కల్పవించును కనుక వీనికి విసర్గగణములనికూడ పేరు కలదు. వీనిలో సమానమాత్రాకములగు గణములు నయితము ఒకదానికి వేరొకటి ప్రయోగింపరాదు. ఈ అక్షరగణములు సంస్కృతవృత్తములందు వినియోగింపబడును. అక్షరగణబద్ధములగు సంస్కృత వృత్తములు కన్నడ తెలుగు మలయాళమునందు అధికముగా ప్రవేశించినవి. తెలుగు కన్నడ మలయాళములపై సంస్కృతప్రభావ మధికమగుటచే మాత్రాగణ

---

1. బండారు తమ్మయ్య-'మార్గదేశి కవితలు'-ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. ఖరనామ సంవత్సరము-సంపుటము-40.

ములుకూడ గురులఘు పరిణతములయినవి. కాని తమిళమున పద్యలక్షణము, గణ పద్ధతి విలక్షణముగ నున్నది. కన్నడ తెలుగు మలయాళములందువలె తమిళము నందును మొదట అక్షరములనుబట్టియే పద్యనిర్మాణము జరుగుచుండెనని 'అశై' పద్ధతి తరువాతి పరిణామమే అని 'ఎ. సి. చెట్టియార్‌గారు 'Advanced studies in Tamil prosody (పుట 19) అను గ్రంథమున తెల్పినారు.

సంస్కృతములోని మాత్రాగణములకు కన్నడాంధ్రములలోని మాత్రాగణములకు భేదమున్నది. మాత్రాసంఖ్య నియతముగానున్నను గురులఘువులసంఖ్య నియతముగాలేని పాదములుగల పద్యములు మాత్రాచ్ఛందస్సులని సంస్కృత లాక్షణికుల మతము. మాత్రాగణచ్ఛందస్సులలో గణములు వరుసగా సరిపోవలెను. పాదములోని మొత్తము మాత్రలసంఖ్యకూడ సరిపోవలెను. కావి పాదములో మాత్రాగణములు వరుసగా సరిపోయినను, మాత్రాసంఖ్య సరిపోనక్కరలేని కొన్ని ఛందస్సులు ద్రావిడభాషలలో కన్పట్టుచున్నవి.

(1) దేశీయగణములు :

తమిళములో 'ఛందస్సు'ను 'యాప్పు' అనుపేరుతో వ్యవహరింతురు. తమిళఛందస్సులో లాక్షణికులు గణవిభాగమును తక్కిన భాషలలోవలె కాక ప్రత్యేకముగా నేర్పాటు చేసికొనినారు. తమిళ ఛందోలక్షణములో 'కుఱిల్' అనగా హ్రస్వాక్షరము. 'నెడిల్' అనగా దీర్ఘాక్షరము; ఒొల్లులు అర్ధమాత్రాకములు. ఈ మూడును ప్రత్యేకముగా గాని, వానిలో రెండు, మూడు కలిసికాని యేర్పడి ఉచ్చరింపబడు ధ్వనిని 'అశై' అందురు. దీనిని ఛందోక్షర మనవచ్చును. ఈ మూడింటి కలయికనుబట్టి 'అశై' అనునది 'నేర్ అశై', 'నిరై అశై' అని రెండువిధములుగా నుండును. సంస్కృత పరిభాషప్రకారము ఒక లఘువుకాని, గురువుకాని 'నేర్ అశై' అగును. 'నేర్ అశై'కు మొదట ఒక 'కుఱిల్' లేదా లఘువును చేర్చినచో 'నిరై అశై' యేర్పడును. నేర్, నిరైల సంయోగమువలన ఒక 'శీర్' లేక గణము యేర్పడును.

తమిళములో ఒక్కొక్క 'శీర్' లో క్రమపద్ధతిలోలేని ఒక 'అశై', రెండు 'అశై'లు, మూడు 'అశై'లు, నాల్గు 'అశై'లు కల్గిన నాల్గువిధములైన 'శీర్'లు ఉన్నవి.

(1) ఒరశైచ్చీర్ - ఒక 'నేర్'గాని, ఒక 'నిరై'గాని కలిగిన గణము. ఉదా: కాల్, మలర్. 'వెణ్బా' పద్యము అంతమందు దీనిని సాధారణముగా వాడుదురు. ఒకప్పుడు 'కాల్' వంటిదికాక 'కాశు' వంటి రూపముగల గణమును, 'మలర్' వంటిదిగాక 'పిఅప్పు' వంటి రూపముగల గణమును 'వెణ్బా' పద్యము అంతమందు వాడుటకూడ కలదు. అనగా నేర్, నిరైల తరువాత అర్ధమాత్రాకమైన 'ఉ' కారమును చేర్చుచుందురు. నిందు ఉకారమును చేర్చుట అరుదు.

(2) ఉరిచ్చీర్ లేక ఆశిరియవురిచ్చీర్ :—దీనిని 'అగవల్' అను పద్యములో వాడుదురు. దీనిలో రెండు ఛందోక్షరము లుండును. ప్రస్తారమువలన ఇట్టివి నాలుగు యేర్పడును. ఇవి తెలుగులోని సూర్యగణములను పోలినవి. ఇందలి గణములకు 'మాచ్చీర్' లని, 'విళచ్చీర్ల'ని పేరు.

(3) వెణ్ చీర్ లేక వెణ్బా ఉరిచ్చీర్ :—ఇది 'వెణ్బా' పద్యములో నుపయోగింపబడును. దీనిలో మూడు ఛందోక్షరము లుండును. ప్రస్తారమువలన ఇవి ఎనిమిదిభేదము లేర్పడును. మాచ్చీర్లకును, విళచ్చీర్లకును 'కాయ్' అని చేర్చుటవలన వీనిపేర్లు యేర్పడును.

(4) పొదుచ్చీర్ :—ఇది 'వఞ్జి' పద్యములో నుపయోగపడును. వెణ్బా పద్యములో దీని నుపయోగింపరు. దీనిలో 16 భేదము లున్నవి. ఇవి తేమా, పుళిమా, కరువిళమ్, కూవిళమ్ అను పేర్లకు వరుసగా 'తణ్ణిళల్, తణ్ బూ, నఱుంబూ, నఱు నిళల్' అను మాటలను చేర్చుటవలన ఈ పదహారింటికి పేర్లేర్పడును. ఇవి నాల్గు ఛందోక్షరములుగల 'శీర్'లు.

తమిళములోని 'శీర్' నిర్మాణపద్ధతి కన్నడాంధ్రములందలి దేశీయగణనిర్మాణమునకు మార్గదర్శికమైనట్లు తోచును.

తమిళములో ఉరిచ్చీర్ లేక ఆశిరియవురిచ్చీర్, వెణ్ చీర్ లేక వెణ్బా ఉరిచ్చీర్, పొదుచ్చీర్లును, కన్నడములో బ్రహ్మ, విష్ణు, రుద్రగణములును, తెలుగులో సూర్య, ఇంద్ర, చంద్రగణములు - వీనియందు మాత్రాసంఖ్యానియమము కన్పించదు. ద్రావిడ లాక్షణికులు మాత్రాగణప్రస్తారముకొరకు కేర్పాటుచేసికొనిన దేశీయగణము లివి. వీనికి ఉపగణములనికూడ పేరు. ఈ దేశీయగణములు సంస్కృతమునందు లేవు.

తమిళ, కర్ణాటక, ఆంధ్ర మాత్రాగణ ప్రస్తార సంప్రదాయ మొకతీరు ననుస రించియున్నది. ఆ యా జాతిగణములు మూడు భాషలలోను కొన్ని సమానముగా నున్నవి. ఒకభాషయందుకంటె మరియొకభాషలో అధికముగా కొన్ని యున్నవి. జాతిగణముల పరస్పరసంబంధము ఈ క్రింద వివరింపబడినవి.

తమిళము:—తేమాగణములు - గగ, గల
పుళిమాగణములు - య, జ, స, వ

వీనిలో 'య-జ' గణములను తొలగించిన కన్నడ బ్రహ్మగణములు. వానితోపాటు 'గగ, స' గణములనుకూడ తొలగించినచో తెలుగు సూర్యగణము లగు నగును.

తమిళములోని—కరువిళమ్ - నల, నగ, జల, జగ
కూవిళమ్ - భ, ర
తేమాంగాయ్ - మ, త
పులిమాంగాయ్ - సగ, సల, యగ, యల

అనువానిలో జల, జగ, యల, యగ లను తొలగించినచో కన్నడములోని విష్ణు గణములును, వానితోపాటు మ, నగ గణములనుకూడ తొలగించినచో తెలుగు ఇంద్రగణము లేర్పడును.

తమిళములోని—
కరువిళంగాయ్ - నవ, నలల, జలగ, జలల, జగగ, జగల, నగగ, నగల
కూవిళంగాయ్ - భగురు, భల, రగ, రల
తేమాంగణి - తగ, తల
పుళిమాంగణి - సలగ, సలల, యలగ, యలల
తేమాతణ్ను - మగ, మలఘు
పుళిమాతణ్ను - యగగ, యగల, సగగ, సగల

అనువానిలో, నవ, నలల, నగగ, నగల. భగురు, భల, రగ, రల, తగ, తల, సలగ, సలల, మగ, మలఘు, సగగ, సగల - ములను 16 మాత్రము కర్ణాటక రుద్రగణములు. వీనిలోనుండి మగ, సగగ లను తొలగించినచో తెలుగు చంద్ర గణము లేర్పడును.

తెలుగునందుకంటె ముందుగా కన్నడమున కావ్యరచన తద్వారా ఛందః ప్రయోజనముకూడ ప్రారంభమయినది. అందువలన పలువిధములుగా కన్నడ ఛ్ఛందోవిధానము తెలుగునకు అనుకార్య మయినది.

దేశ్యజాతులలో నుపయోగించు కన్నడ బ్రహ్మ, విష్ణు, రుద్రగణములు, తెలుగు సూర్య, ఇంద్ర, చంద్రగణములు వరుసగా రెండు, మూడు, నాలుగు గురువులను పెట్టి ప్రస్తరింపగా నేర్పడును. అట్లు ప్రస్తరింపగా వచ్చిన గణము లన్నిటిని గ్రహించి మొదటివరుసలోని నాల్గు గణములకు బ్రహ్మగణములని, రెండవవరుసలోని ఎనిమిదిగణములకు విష్ణుగణములని, మూడవవరుసలోని పదునారుగణములకు రుద్రగణములని సంజ్ఞచేసిరి. తెలుగులో తొలిఛ్ఛందోగ్రంథమగు కవిజనాశ్రయమున కన్నడ లక్షణపద్ధతి ననుసరించుచు ప్రస్తారములో మొదటి వరుసలోని నాల్గుగణములకు సూర్యగణములని, రెండవవరుసలోని ఎనిమిది గణ ములకు ఇంద్రగణములని, మూడవవరుసలోని పదునారుగణములకు చంద్రగణము లని వ్యవహరింపబడినది. సూర్య, ఇంద్ర, చంద్ర గణోత్పత్తివిషయమున విన్న కోట పెద్దన కావ్యాలంకార చూడామణి (8 వ ఉల్లాసము - 52 పద్యము) యందు కవిజనాశ్రయకారునే అనుసరించినాడు. అనంతాదులమతమునకూడ ఈ గణనిర్మాణ మిట్లే. కాని పై ప్రస్తారములో మూడువరుసల గణములలోను ప్రతివరుసలోను మొదటి రెండేసిగణములను అనగా మొదటి వరుసనుండి గగ, న గణములను, రెండవవరుసనుండి మ, సగ - గణములను, మూడవవరుసనుండి మగ, సగగ - గణములను తొలగించగా వరుసగా మిగిలిన రెండుగణములుగల వర్గమునకు సూర్య గణములని, ఆరుగణములుగల వర్గమునకు ఇంద్రగణములని, పదునాల్గుగణములు గల వర్గమునకు చంద్రగణములని అనంతుడు ఛందోదర్పణము (1-19) నందు స్పష్టముగా తెల్పినాడు. ప్రస్తుతము సూర్యేంద్రచంద్రగణముల విషయమున అనంతాదులమతమే వ్యవహారమందున్నది. గణములపేర్లలోని మార్పు, ప్రస్తార ములో ప్రతివర్గములోను రెండేసిగణములు తక్కువపడుట అనునవి తెలుగు ఉప గణముల ప్రత్యేకతను సూచించుచున్నవి. కనుకనే 'ఇంద్రాద్యా అపిచ గణాః' అని చింతామణిలో ఈ గణముల ప్రత్యేకతను సూచించుచు చెప్పియుండుట.

తెలుగు కన్నడములలోని దేశీయగణములు సయితము సంస్కృతఛ్ఛందో గణములతోడనే వ్యవహరింపబడుటకు కారణము సంస్కృతభాషా ప్రభావమే. తమిళములో సంస్కృతభాషాప్రవేశము విరాఘాటముగ సాగనందున, అందలి గణపద్ధతి, పద్యలక్షణము తెలుగు కన్నడములకంటె సర్వదా విలక్షణమయినది.

దేశీయగణములందు మాత్రాసంఖ్య నియతము కాదు. తమిళములో మాచ్చీరులలో మూడునుండి అయిదువరకు మాత్రలున్నవి. విళచ్చీరులలో నాలుగునుండి ఆరువరకు మాత్రలు కలవు. కాయ్చ్చీరులలో అయిదునుండి ఎనిమిదివరకు మాత్రలున్నవి. కణిచ్చీరులలో ఆరునుండి తొమ్మిదివరకు, పూచ్చీరులలో ఏడునుండి పన్నెండువరకు మాత్రలు కలవు.

కన్నడములోని బ్రహ్మగణములలో మూడునుండి నాలుగువరకు, విష్ణుగణములలో నాలుగునుండి ఆరువరకును, రుద్రగణములలో అయిదునుండి ఎనిమిదివరకు మాత్రలున్నవి.

తెలుగులోని సూర్యగణములకు మూడుమాత్రలుమాత్రమే. ఇంద్రగణములకు నాలుగునుండి అయిదువరకు, చంద్రగణములకు అయిదునుండి ఏడువరకు మాత్రలు గలవు.

తమిళ గణములలోనుండి కన్నడ లాక్షణికులు కొన్నిటిని, కన్నడగణములలోనుండి తెలుగు లాక్షణికులు కొన్నిటిని తొలగించుటకు కారణమును డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు "మాత్రాచ్ఛందస్సులు" అను వ్యాసమునం దిట్లూహించినారు. "కన్నడులకున్ను, తెలుగువారికిన్ని యగణ, జగణములుగాని, వాటితో గురులఘువులుగాని, ఇతరగణములుగాని చేరిన గణములుగాని యిష్టములేదు. అట్టివానిని తమిళగణములనుంచి తొలగిస్తే కర్ణాటక బ్రహ్మ, విష్ణు, రుద్రగణము లేర్పడినవి. సూర్యగణములలో మూడుమాత్రలకు మించినవిన్ని, ఇంద్రగణములలో ఆయిదుమాత్రలకు మించినవిన్ని, చంద్రగణములలో ఏడుమాత్రలకు మించినవిన్ని గణము లుండగూడదని తెనుగువారు నియమము చేసుకొన్నారు. అందుచేత ఆ యా జాతుల కర్నాటకగణములనుంచి ఆ సంఖ్యానియమము నతిక్రమించినవాటిని వారు తొలగించినారు."

ఆ యా గణములను తొలగించుటకు ముఖ్యకారణము లయకు సరిపోవుటకు, శ్రుతికి సుభగముగా నుండుటకును అని డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారి అభిప్రాయము. మూడక్షరముల గణములమధ్య గురువు చేరినచో గర్భము దాల్చినట్లుండునట. జగణము కొన్ని మాత్రాచ్ఛందస్సులలో నిరసింపబడినట్లు ప్రాకృత పైంగళములోను, ఛందోంబుధియందును తెలుపబడినది. జగణము చేరవచ్చునని చెప్పిన ఆర్యాకందములందుకూడ ప్రత్యేకస్థలములలో జగణము విశే

ధింపబడినది. ఈ కారణమువలననే కాబోలు ఆంధ్ర కర్ణాటకులు జగణముతోపాటు యగణమునుకూడ నిషేధించియుండుట.

తెలుగు లాక్షణికులు, సూర్యగణములలో తుదిని గురువుగలవానిని, ఇంద్ర గణములలో తుదిని రెండు గురువులు గలవానిని, చంద్రగణములలో చివర మూడు గురువులు గలవానిని, కర్ణాటకగణములలోనుండి తొలగించినారు. దీనికికూడ శ్రుతి సుభగత్వమే కారణమని చెప్పవచ్చును.

దేశి చ్ఛందస్సు : పద్యపాదనియమము :

సంస్కృతమున వేదవాఙ్మయములో రెండు పాదములుగల ద్విపదా విరాట్, ద్విపదా జగతీ మొదలగు ఛందస్సులును, మూడుపాదములుగల గాయత్రీచ్ఛంద మును కనిపించును. లౌకిక వాఙ్మయమున సర్వపద్యములకును నాల్గుపాదము లుండుట నియతమయిన లక్షణము. కాని దేశీయచ్ఛందస్సులకు నాల్గుపాదము లుండుట నియతము కాదు.

తమిళమున 'అడి' అనగా పద్యపాదము. పాదములో ఒకటిగాని అనేక ములుగాని 'తళై'లు వచ్చును. 'తళై' అనగా నేర్ నిరై ల కూడిక. 'నేర్', 'నేర్' తోడను, 'నిరై', 'నిరై' తోడను పొందియుండును. నేర్ నిరై తోకాని, నిరై నేర్‌తోగాని పొందియుండదు. ఈ 'తళై' అనునది ఏడువిధములుగా తమిళ లాక్షణికులు వివరించినారు.

'అడి' లేక పద్యపాదము అయిదువిధములుగా నుండును. (1) రెండు 'శీర్'లు గలది 'కుఱలడి'. ఇందు 4 నుండి 6 వరకు అక్షరము లుండును. (2) మూడు 'శీర్'లు గలది 'సిందడి'. ఇందు 7 నుండి 9 అక్షరముల వరకుండును. (3) నాలుగు 'శీర్'లు గలది 'అళవడి'. ఇందు 10 నుండి 14 వరకు అక్షరము లుండును. (4) ఐదు 'శీర్'లు గలది 'నెడిలడి'. ఇందు 15 నుండి 17 వరకు అక్షరము లుండును. (5) ఆరు 'శీర్'లు గలది 'కళినెడిలడి'. ఇందు 18 నుండి 20 వరకు అక్షరము లుండును.

అక్షర గణబద్ధములగు సంస్కృతవృత్తములు తమిళమున అవలంబింపబడ లేదు. ప్రాచీన తమిళకవిత్వమున మూడేసి, నాలుగేసి దేశీయ ఛందోగణములుగల మూడేసి నాలుగేసి పాదములతోకూడిన పద్యములే ఎక్కువగా నుండెడివి. 'కురల్' అను ఛందస్సు రెండుపాదములుగల చిన్నపద్యము. మలయాళమునందును

'ఈరడి' అను పద్యమునందు రెండుపాదము లున్నవి. తమిళములో అయిదు పాదములకు మించిన పద్యములు కలిఅడి, చిందు, అలరు, నెడిల్, కళినెడిల్ అనునవి. కన్నడాంధ్రములందలి ద్విపద (2 పాదములు), త్రిపద (3 పాదములు), చౌపద (4 పాదములు), షట్పది (6 పాదములు) మొదలగు దేశీయచ్ఛందస్సులు పాదసంఖ్యనుబట్టియే యేర్పడినవి. ఈ ఛందస్సులకుగల పేర్లనుబట్టి దేశీయచ్ఛందస్సులకు పాదనియతి లేదని చెప్పవచ్చును.

దేశ్యజాతులు మాత్రాగణబద్ధములై మొదట పాదనియమములేక రచింపబడినను, కాలక్రమమున సంస్కృతవృత్తముల ననుసరించి వీనికికూడ పాదసంఖ్యానియమ మేర్పడినది. దేశికవితను అభిమానించిన చాళుక్యరాజులు పాటలరూపముననున్న దేశిరచనలను కొన్నిటిని సంస్కరించి పద్యరూపము నొందించుటకు ప్రోత్సహించిరి. తెలుగులోని 'తరువోజ' అను దేశిపద్యము అట్టి సంస్కారఫలితముగా నేర్పడినదే. ద్విపదలోని రెండుపాదములను ఒక పాదముగా చేసి, అట్టి నాల్గుపాదములను ప్రాసబద్ధముగా చేయుటయే తరువోజపద్య మేర్పడినది. దేశీయమును, రెండుపాదములు గల ద్విపద, సంస్కృతమునందువలె నాల్గుపాదములుగల తరువోజగా కూర్పబడుటయే శాసనపద్యరచయితలగు కవులు మార్గకవితాపద్ధతి ననుసరించి చేసిన సంస్కారము. దేశిచ్ఛందమగు ద్విపద వృత్తరూపమునుపొంది తరువోజయై శాసనములలోని కెక్కినదని చెప్పవచ్చును.

నాల్గు పాదములకంటె అధికముగానుండు పద్యమును 'మాలిక' అను పదము చేర్చి పేర్కొనుట కలదు. సీసమాలిక, ఉత్పలమాలిక మొదలగునవి ఇందులకుదాహరణములు. ద్విపద, రగడ లందు అధికపాదములున్నను ద్విపదమాలిక, రగడమాలిక అని పేర్కొనరు. వానిని కేవలము ద్విపద, రగడలనియే పేర్కొందురు. ద్విపద, రగడలలో రెండుపాదములు మొదలుకొని యెన్ని పాదములయినను సరిసంఖ్యలో నుండును.

(3) యతిప్రాసలు :

పద్యపాదమును చదువుచున్నపుడు మధ్యలో కొంత ఆగి విశ్రాంతిని తీసికొనవలసియున్నది. ఈ విశ్రాంతిస్థానమునే సంస్కృతములో యతిస్థానమందురు. ఛందోబద్ధపాదమందు స్వాభావికమైన విరామమే సంస్కృతయతి. యతిస్వరూపవిషయమున సంస్కృతమునకు తెలుగునకు చాల భేదమున్నది. తెలుగులో అక్కడ

అన్నిపదములు సంస్కృత ఛందశ్శాస్త్రమునుండి గ్రహింపబడినను. యతివిషయమునమాత్రము 'వడి' లేక 'వళి' అని ప్రయోగింపబడినది. తమిళములోని 'వఝి ఎదుగై' (అనుప్రాస)లోని 'వఝి' (ఝి అనునది డ, ళ గా మారుట కలదు) అనునదియే 'వడి' అయినదని రావూరి దొరసామిశర్మ తెల్పినారు. తెలుగులో 'వళి' అనగా పాదాద్యక్షరమునకు సవర్ణమైన అక్షరము వచ్చుటయే. ఈ సవర్ణము పదాదియందయినను, పదమధ్యమందయినను రావచ్చును. తెలుగునకు ప్రత్యేక లక్షణములైన ప్రాసవళ్ళు సంస్కృతమున లేవు. ఛందోవిషయమున సంస్కృతమునందలి అక్షరగణబద్ధములగు వృత్తములను స్వీకరించినను వానికి దేశీయావాహాను పారముగ ప్రాసవళ్ళనెడి మంగళసూత్రములను గట్టియే తెలుగుకవులు గ్రహించినారు; సంస్కృతవృత్తములకు దేశీయములగు యతిప్రాసలను కూర్చుటవలన వానికి కొంత దేశీతనము కల్పించినట్లయినది.

తమిళమునందలి 'మోనై' లేక 'మోనైత్తొడై' అనునవి తెలుగువడిని పోలినట్టిదే. తొడై అనగా మైత్రి; అక్షరమైత్రి. తొడై అనునది అయిదువిధములుగా నున్నది. మొదటిఅక్షరములు మైత్రి కలిగియుండుట 'మోనై' అనబడును. మోనైత్తొడైలో ఎనిమిదేపిరీతులు కలవు. ఈ భేదములలో పొఝిప్పుమోనై ఒరూఉమోనై అను రెండింటిలోమాత్రమే తెలుగు యతికి సంబంధము కలదు. మొదటి 'శీర్', మూడవ 'శీర్'ల మొదటి అక్షరములు తమలో తాముసు, రెండవ శీర్, నాల్గవ శీర్ల మొదటి అక్షరములను తమలో తాము మైత్రికలిగియుండుట పొఝిప్పుమోనైలోని నియమము. సామాన్యముగా ఇది పాదమునకు నాల్గుగణములుగల పద్యములనుగూర్చి చెప్పినట్లు కన్పట్టుచున్నది. కావున తెలుగు దేశీయపద్యములగు ద్విపద, తరువోజ, సీసము, రగడ మొదలగువానియందీ నియమము పాటింపబడుట కవకాశము కలదు.

ఒరూఉమోనైలోని లక్షణము మొదటి శీర్, నాల్గవశీర్ల మొదటి అక్షరములు మైత్రి కలిగియుండుట. తెలుగునందలి ఆటవెలది, తేటగీతి మొదలగు పద్యములందు ఇట్టి నియమము పాటింపబడుచున్నది. ఈ రెండురీతుల మోనైతప్ప తమిళమునందలి తక్కిన ఆరురీతుల మోనైలను తెలుగుశిష్ట కవితలోని పద్యములందు కానరావని, వానికి ప్రాచీన దేశీయకవితలో నుదాహరణములు లభింపవచ్చునని కోరాడ రామకృష్ణయ్యగారు తెల్పినారు. తమిళమునందలి ఈ సరూపాక్షరయతి ఐచ్ఛికమే కాని తెలుగువందువలె నియతము కాదు. తెలుగుయతికి తమిళమునందలి 'మోనై'కి పొత్తు కలదనుట తథ్యము.

కన్నడమునందు 'యతియెంబుదు పిర్వతాణం' అని నృపతుంగుడు కవిరాజ మార్గమందును, 'యతియెంబుదు గణనియమప్రతతి గుసుర్దాణం' అని నాగవర్మ ఛందోంబుధిలోను యతిని పేర్కొనినారు. కాని ఈ యతినియమమును కన్నడ లాక్షణికులు ముఖ్యముగా సంస్కృతవృత్తముల లక్షణములను చెప్పునపుడు వాని దృష్ట్యానే చెప్పినారని తోచును. కర్ణాటకవిషయజాతులనుగూర్చి చెప్పునపుడు నాగవర్మ యతివిషయమును ప్రస్తావించలేదు. దీనివిబట్టి, సంస్కృతములోని యతి ననుసరించి ప్రత్యేకస్థానమున యతి యుండవలయునను నియమము కన్నడమునకు సహజమయినది కాదని తెలియుచున్నది. అచ్చ గన్నడమందు యతి లయయే కాని వేరుకాదు. ఈవిధమైన సహజయతి ప్రతి చరణమందును, గణగణమునకు చివర నుండును. అయితే ఈ గణగణమున కుండెడు యతి సంస్కృతసంబంధి యతివలె త్వరగా గుర్తించుటకు వీలుకానిది. అందువలన స్థూలముగా కన్నడమున యతి లేదని చెప్పుట జరుగుచున్నది. 'కన్నడక్కె యతియిల్ల కోణక్కె మతియిల్ల' (కన్నడమునకు యతిలేదు కోణంగికి మతిలేదు) అను నానుడినిబట్టి కన్నడమునందున్నదని చెప్పబడు యతికి ఛందశ్శాస్త్రరీత్యా 'యతిత్వము' లేదని చెప్పవచ్చును. 'ఇంద ప్రాసమనతిశయ మిందెందు యతియం మిక్కర్' అని నృపతుంగుడు కవిరాజమార్గమందును, 'యతి విలంఘన దిందరిపత్తె కన్నడం' అని కేశిరాజు శబ్దమణిదర్పణమునందును చెప్పియున్నారు. పద్యములందు విరామరూపయతి నుల్లంఘించుట యనువిషయమున చెప్పినది కన్నడమునకు తెలుగునకు సమానమే. యతి ప్రాసలు రెండును మలయాళమునం దున్నవి. 'యతిక్కృతి కధికశ్రావ్యంబై జెశంగుగా విడవలయున్' అని కవిజనాశ్రయమున చెప్పియుండుటచే తెలుగులోని యతి తొలుత శబ్దాలంకారముగనే ప్రయోగింపబడి క్రమముగా పద్యలక్షణముగా మారినట్లు తోచుచున్నది.

వళిప్రాస నియమములు రెండును సంస్కృతప్రాకృత కవితాసంప్రదాయ సిద్ధములు కావు. అవి ప్రాచీన దేశీయ సంప్రదాయసిద్ధములే.

తెలుగు కన్నడ మలయాళములందలి ప్రాసను తమిళమున 'ఎదుగై' లేక 'ఎదుగైత్తొడై' అని అందురు. పద్యమందలి ప్రతిపాదములోని రెండవ అక్షరములు పొందిక కల్గియుండుట దీనిలక్షణము. 'ఎదుగై' వంటి ప్రధానములగు ఎనిమిది భేదములనేకాక మరికొన్ని భేదములనుకూడ తమిళ లాక్షణికులు వివరించినారు.

తమిళములోని పాద ద్వితీయాక్షర మైత్రీరూపమగు 'అడియెదుగై తొడై' అనునది తెలుగుప్రాసకు సమానమయినది. అడియెదుగై అనగా ఒకపద్యము అన్ని పాదములలోని మొదటి శీర్‌లోని రెండవ అక్షరములు పరస్పరము పొందిక కల్గి యుండుట. కాని తమిళమునందు యతి (మోనై) వలెనే ప్రాస (ఎదుగై) కూడ ఐచ్ఛికమే.

కన్నడములో ప్రాసకు అత్యంత ప్రాధాన్యమున్నది. ప్రాస లేకుండ ఏ పద్యముకూడ కన్నడమందు లేదు. కన్నడమున గీతికలలోకూడ ప్రాసనియమము పాటింపబడినది.

మలయాళపద్యములకు యతికంటె ప్రాస చాల ముఖ్యము. ప్రాసను మల యాళమున కేరళప్రాస మందురు. యతిమాత్రము 'కళకాంచి' అను ఛందస్సులో పాటింపబడినది. O. M. Anujan వ్రాసిన ఈ క్రిందివాక్యములు గమనింపదగినవి.

"Mōna is strictly observed only in one metre called Kalakānci where the first syllables of the two lines differ in length; there, only the first syllable should agree and even if the second one agree it would not impress the reader since the whole foot is composed of short syllables. Prāsas have not been divided into atimovai, inamovai, ācedukai, talaiyakedukai etc. as in Tamil. Antādi was Prevalent in the early works bearing Tamil influence. Endrhyme is not common in the metres of both these languages though musical verse sometimes employ it."

—Malayalam and Tamil Metres - A comparative study.

తెలుగులోని ప్రాస కేవల మైచ్ఛికము కాదు. తెలుగు కన్నడములలోని జాతులను పద్యము లన్నిటిలోనేకాక సంస్కృత ప్రాకృతములనుండి గ్రహింప బడిన పద్యము లన్నిటిలోనుకూడ ప్రాస పాటింపబడినది. దేశికవితను యతి ప్రాసలుగల దేశికవితగానే రూపొందింపవలెనని, మార్గకవితాలక్షణముల ననుస రించి తెలుగుఛందస్సులో యతిప్రాస [illegible]మును ప్రవేశపెట్టరాదని నన్నె చోడుడు 'దేశిమార్గంబులు దేశీయములుగా [illegible]' చెప్పినాడు. తెలుగులో ప్రవేశించిన మార్గఛందస్సులో [illegible] శార్దూల మత్తేభాది వృత్తము [illegible] దే[illegible] [illegible] [illegible]ప్రాసలు కూర్పబడినవి. [illegible] [illegible] వృత్తములందును [illegible] ప్రాస[illegible]. [illegible] గుప్త గీతాదులందు ప్రాసనియమము [illegible] నిషిద్ధ[illegible] [illegible]. [illegible]ములో

'అగవల్ పా'లో ప్రాస లేదు. తెలుగు సీస గీతాదులలో యతికి బదులుగా ప్రాస యతిని వాడుదురు. నాల్గుపాదములందు ప్రాసయతిని ప్రయోగించిన, ఆ పద్యము నందు 'అడియెదుగై' యేర్పడును. తెలుగునందలి సర్వతః ప్రాస సీసమున ఈ 'అడియెదుగై' పాటింపబడినది. కనుక ప్రాస తెలుగులో కొన్ని ఛందములకు లక్షణము, మరి కొన్నిటికి అలంకారమని భావింపవచ్చును. సర్వచ్ఛందస్సామా న్యము కానందువలన ప్రాస తెలుగు ఛందమునకు శోభాసూచకమైన అలంకార ముగా గ్రహింపవలసియున్నది. ప్రాసవలన పద్యమునకు శోభ చేకూరునని నాగ వర్మ ఛందోంబుధిలో నిట్లు చెప్పినాడు.

> 'నుత శబ్దాలంకార దొ
> శతిశయ మదు కన్నడక్కె సతతం ప్రాసం
> కృతకృత్య మప్పుదెల్లర
> మత దిందదు తప్పె కావ్యమేం శోభిపుదో॥'

కాని దక్షిణదేశభాషలందు ప్రాస నేడు పద్యలక్షణములలో చేరియున్నది.

తమిళమునందలి 'ఇణై యెదుగై' అనునది తెలుగులోని వృత్తప్రాససీసము లేదా అక్కలిప్రాస సీసమున కుదాహరణము కావచ్చును. అన్నిపాదములలోని మొదటి రెండు గణములలోని రెండవయక్షరములు మైత్రికలిగియుండుట 'ఇణై యెదుగై' లక్షణము. 'పొఱిప్పెదుగై' అనునది తెలుగులోని సర్వతః ప్రాస సీస మున కుదాహరణము కాగలదు. అన్ని పాదములలోను గణములలో నొకటి విడిచి యొకదాని రెండవ అక్షరము మైత్రి కలిగియుండుట 'పొఱిప్పెదుగై' లోని నియమము. ఇట్లే, అన్ని పాదములలోని ఒకటవ నాల్గవ గణములలోని రెండవ యక్షరములు మైత్రి కలిగిన 'ఒరూఉవెదుగై' అనువానికిని, అన్నిపాదములలోని అన్నిగణముల రెండవ యక్షరములు మైత్రి కలిగియుండు 'ముత్తెదుగై' అను వానికికూడ తెలుగు గేయములందు ఉదాహరణములు కలవు.

ఇట్లు తెలుగునందలి యతిప్రాసలనునవి అలంకారముకొరకు కవులు కొందరు తెచ్చిపెట్టుకొనినవి కాక క్రీస్తు శకమునకుముందే తమిళ వాఙ్మయమున పరిపాటిగా నిల్చియున్న ప్రాచీన ద్రావిడ కవితా సంప్రదాయసిద్ధమైన 'తొడై' అను దాని రెండువిధములతో సంబంధించినవేయని తెలియుచున్నది. సంస్కృతమున లేని ప్రావళ్ళు రెండును తెలుగు తమిళ మలయాళములలో నున్నవి. ఇవి తెలుగు సాహిత్యమునకు ప్రత్యేకలక్షణము లైనవి. తెలుగు అజంతభాష యగుటతోపాటు

యతిప్రాసలవలన మరింత శ్రుతి సుభగత్వమును గై కొని పాఠకుల వీనులకు విందు చేకూర్చుచున్నది. ఇట్టి విశేషమునుగూర్చి కొరవి గోపరాజు 'సింహాసనద్వాత్రింశిక' (ప్రథమభాగము-ఆ. 4-ప. 190, 191, 192) లో నిట్లు ప్రశంసించినాడు.

'పుణ్యశ్రీకి గుణంబు మంగళగుణంబు న్పొమ్ముల్లై యొప్పఁగా
బుణ్యశ్రీకి సువర్ణమౌక్తిక సురూపవ్యక్తి భూషాకృతుల్
గణ్యంబౌగతి సంస్కృతంబునకు వాగ్వాపంబు శబ్దంబు లా
వర్ణ్యాకారము లొంది తెనుంగునకుఁ బ్రాల్పెక్కుం గడున్వన్నియల్.'

'పలు దెఱుంగులైన పలుకులు గలిగియుఁ
బ్రాలు వళ్ళులేని బేలగలిత
వెన్నెలెల్ల గూర్చివ్రాయుచోఁ గాటుక
వన్నెలేని ప్రతిమ వ్రాఁతఁబోలు.'

'తప్పక వళ్ళును బ్రాలును
ముప్పిరి గొనఁదగిన శబ్దములు మెఱుఁగెక్కం
జెప్పిన కవితా చాతురి
యొప్పము పెట్టిన పసిండి యొఱపున మెఱయున్.'

(4) తమిళ మలయాళ దేశి చ్ఛందోరీతులు :

తమిళమున పద్యమునకు 'పా' లేక 'పాడల్' అని పేరు. సంస్కృతములో పద్యము, గద్యము అను విభాగమున్నట్లే తొల్కాప్పియనార్ తమిళములో చెయ్యుళ్ (రచన) రెండువిధములుగా తెల్పినాడు. (1) 'పా' తమిళ పద్యపాదములవిషయములో పరిమితి కలదు. (2) 'ఉరై' ఇందులో అయిదువిధములున్నవి. పాదముల సంఖ్యావిషయములో పరిమితి లేదు.

తమిళ పద్యములలో వెణ్బా, అగవల్పా, లేక ఆశిరియప్పా, కలిప్పా, వఞ్జిప్పా, మరుప్పా అని అయిదు భేదములున్నవి. ఈ భేదము లొక్కొక్కటి యందు తుఱై, తాడి(ళి)శై, విరుత్తమ్ అని తిరిగి మూడుభేదము లున్నవి. తొల్కాప్పియము ప్రకారము తమిళములోని పద్యములు రెండువిధములు. (1) అగవల్ (2) వెణ్బా. తదితర తమిళ పద్యభేదములన్నియు వీనివలన యేర్పడి నట్టివే అని తొల్కాప్పియనార్ తెల్పినాడు. 'వఞ్జి' పద్యము 'అగవల్‌పా' లేక 'ఆశిరియమ్' ను పోలినట్టిది. 'కలి' ఛందస్సు 'వెణ్బా' పద్ధతి ననుసరించినది.

వెణ్బా పద్యములో గణములవిషయమునను, పద్యపాదములవిషయమమునకు కొన్ని అంశలు విధింపబడినవి. 'అగవల్' పద్యమున అట్టి నియమము లేవియు లేవు. ఇందు 'శీర్'ల పరిమాణవిషయమునమాత్రము క్రమపద్ధతి పేర్కొనబడినది. కలి, వఞ్జి పద్యములవిషయమునకూడ నియమము లేవియు లేవు.

'వెణ్బా' లోని నాల్గుపాదములలో మొదటి మూడుపాదములలోను నాలుగేసి శీర్లుండును. మావిళ, కాయ్‌శీర్లనుమాత్రము వాడవలెను. నాల్గుపాదములలోను ఒకే ఎదుగై రావచ్చును. లేదా మొదటి రెండుపాదములకు ఒక ఎదుగై, తక్కిన రెండింటికి ఒక ఎదుగై రావచ్చును. 'వెణ్బా' అయిదువిధములు. కుఱువెణ్బాట్టు లేక కుఱళ్ వెణ్బాలో రెండు పాదములు, పిన్నియల్ వెణ్బాలో మూడుపాదములు. నేరిశై వెణ్బాలో నాల్గుపాదములు, ఇన్నిశై వెణ్బాలోకూడ నాల్గుపాదములును, ప: (అయ్దమ్) తొడై వెణ్బాలో అయిదునుండి పండ్రెండుపాదములవరకును, కలి వెణ్బాలో పన్నెండుకంటె ఎక్కువ పాదములు కల్గియుండును. క్రీ. శ. 7, 8 శతాబ్దులకాలమున పెరిందేవనార్ అనుకవి దేశీయమగు 'వెణ్బా' పద్యములలో భారతమును రచించినాడట. పెరిందేవనార్ భారతము నేడు అలభ్యము.

అగవల్పా లేక ఆశిరియప్పాలో సాధారణముగా రెండేసి అశైలుగల శీర్లుండును, ఇట్టి శీర్లు పాదమునకు ఆరుండవలెను. అవగా పాదము కళినెడిలడిగా నుండవలెను.

నేరిశై ఆశిరియప్పాలో తుదిపాదమునకు వెనుకపాదములో మూడుశీర్లును, తక్కిన పాదములలో నాలుగేసి శీర్లును నుండును. నిలైమణ్డిల ఆశిరియప్పాలో అన్నిపాదములలోను నాలుగేసి శీర్లుండును. ఆశిరియ విరుత్తములో మొదటిపాదములో వరుసగా ఏ శీర్లుండునో తక్కిన పాదములందుకూడ వరుసగా అట్టి శీర్లే రావలెను.

కలిప్పాలో పాదమునకు నాలుగు శీర్లుండును, ఇవి సాధారణముగా కాయ్చ్చీర్లు. తరవు కొచ్చగక్కలిప్పా పాదములలో కాయ్చ్చీర్లవిషయములో నియమమేదియును లేదు. కలివిరుత్తమ్ మొదటిపాదములో వరుసగావచ్చు నాలుగుశీర్లే వరుసగా తక్కిన పాదములలోను వచ్చును. కలిత్తురై మొదటిపాదములో వరుసగావచ్చు అయిదుశీర్లే తక్కిన పాదములలోను వరుసగా రావలెను. కట్టళై కలిత్తురైలో అయిదేసి శీర్లుగల నాలుగుపాదము లుండును. మొదటి నాలుగుశీర్లు ఈరశైచ్చీర్లుగాను, అయిదవది విళంగాయ్చ్చీర్‌గాను నుండవలెను. ప్రతి పాదము

లోను ఒకేరీతి వెణ్డలై రావలెను. పాదాదిని నేరశై వచ్చినచో ప్రతిపాదమునందు ను ఒట్రుకాక 16 అక్షరములు రావలెను. పాదాదిని రై అశై వచ్చినచో ప్రతిపాదము లోను 17 అక్షరము లుండవలెను. తుది అక్షరము 'ఏ' అయి యుండవలెను.

వఙ్జిప్పా ఒక్కొక్క పాదములోని రెండుగాని, మూడుగాని శీర్లుండ వచ్చును. వఙ్జివిరుత్తమ్‌లో మూడేసి శీర్లుగల నాలుగుపాదము లుండును. వఙ్జిత్తురైలో రెండేసి శీర్లుగల నాలుగుపాదము లుండును.

మరుప్పా పద్యములో మొదట వెణ్బాపాదములు రెండును, తరువాత ఆశిరి యప్పా పాదము లెన్నైననూ వచ్చును.

సంగకవులు ఆశిరియమ్, కలి, పరిపాడల్ అను పద్యములనుకూడ ప్రయో గించినారు. సంగసాహిత్యములో ఎక్కువగా అగవల్‌పా ఉపయోగింపబడినది. ఇది Blank verse ను పోలినది. కథాకథనమున కుపయోగించు అగవల్‌పాలోని లయను 'అగరలోశై' అనియు, సంభాషణాత్మకమున కెక్కువగా నుపయుక్త మగు 'వెణ్బా' పద్యములోని లయను 'సెప్పలోశై' అనియు, కలిప్పాలోని లయను 'తుళ్లలోశై' అనియు, వఙ్జిప్పాలోని లయను 'తూంగలోశై' అనియు తొల్కాప్పియమునందు తెల్పబడినది. తమిళములో 'ఇనమ్' అను పద్యజాతి సంగీతప్రధానమైనట్టిది.

తెలుగులోని సీసపద్యమునకు 'అగవల్‌పా'కు సంబంధమున్నట్లు తెలియు చున్నది. తెలుగు సీసపద్యమునకు తండకము (దండకము) తోడను, ఆశియ విరుత్తమ్‌తోడను సంబంధము కలదు. తెలుగు సీసములో ఇంద్రగణము లుండ వలసినచోట సూర్యగణములను బోలిన 'శీర్'లు ఉపయోగింపబడినచో ఇది సాధ్య మగును.

సంస్కృతప్రభావముచే తమిళములోని పద్యములలో కాలక్రమమున కొన్ని భేదము లేర్పడినవి. పద్యపాదములలోని అక్షరముల విషయమునందు కొన్ని నియమము లేర్పడినవి. కట్టళై క్కలిత్తురై, కట్టళక్కలిప్పా మొదలయినవి సంస్కృతప్రభావమువలన తమిళములో నేర్పడిన ఛందస్సులు.

కీర్తనై, కుమ్మి మొదలగు పాటలందుమాత్రమే కాక వెణ్బా, ఆశిరియప్పా మొదలగు పద్యములందును లయానుసారముగ హల్లును పెక్కుమాత్రలుగ పొడి గించి పాడుట తమిళపద్యములందు కలదు. తమిళమునందు కవులే లయను సూచింతురు.

తమిళములో మలయాళమునందుకంటె చాలముందుగా కావ్యరచన జరిగినది. ప్రాచీన మలయాళగ్రంథమగు రామచరితములో తమిళప్రభావ మెక్కువగా కన్పట్టును. క్రీ. శ. 12, 13 శతాబ్దులనాటి మలయాళ పద్యగ్రంథములలోని పదబంధములు, వ్యాకరణములందే కాక ఛందస్సులోకూడ తమిళప్రభావము గోచరించును. ఈ శతాబ్దులలో తమిళమాతృకగల ఛందోరీతులు మలయాళమున చోటు చేసికొనినవి. ఈ కాలమున మలయాళములో మణిప్రవాళశైలికూడ ప్రాచుర్యమునకు వచ్చినది. అందు పదబంధము, వ్యాకరణము, ఛందస్సు అంతయు సంస్కృతమయమే. క్రీ. శ. 14 వ శతాబ్దిలో నిరణంకవులు తమిళప్రభావములేని మలయాళమును వ్యాప్తికి తెచ్చినారు. వీరు నిరణవృత్తమును వాడినారు. క్రీ. శ. 15 వ శతాబ్దికి చెందిన చెరుశ్శేరి రచనలో మలయాళ దేశీయత గోచరించును. చెరుశ్శేరి కృష్ణగాథలో మంజరీచ్ఛందస్సు ప్రయోగింపబడినది. క్రీ. శ. 16 వ శతాబ్దినాటి ఎళుత్తచ్చన్ మలయాళ జానపదచ్ఛందమగు కిళిప్పాట్టునకు కావ్యగౌరవమును కల్పించినాడు. కిళిప్పాట్టులో నాల్గువృత్తము లున్నవి. (1) కేక (2) కాకళి (3) కళకాంచి (4) అన్ననడ. అన్ననడనుమాత్రము ఎళుత్తచ్చన్ మొదటిసారిగా భారతములోని కర్ణపర్వమున ప్రవేశపెట్టినాడు. క్రీ. శ. 18 వ శతాబ్దికి చెందిన కుంజన్ నంబియార్ సంస్కృత ఛందస్సులను తన సాహిత్యమున కనుగుణముగా మార్చుకొని మలయాళములో వివిధమాత్రా చ్ఛందస్సుల నుపయోగించినాడు. వళ్లత్తోళ్ మంజరీఛందస్సును ప్రయోగించినాడు. చంగంబుళ (క్రీ. శ. 20 వ శతాబ్ది) మలయాళ చ్ఛందస్సులో విప్లవాత్మకమైన మార్పులు తెచ్చినాడు. అతడు మలయాళ జానపదగేయములలోని ఛందోరీతులకు కావ్యగౌరవమును కల్పించినాడు. మొత్తము మీద మలయాళ ఛందోరీతులన్నియు గానప్రధానములే. 'లయ' లేక 'గతి'ని బట్టి మలయాళ పద్యపాదములను విభజింతురు. త్ర్యశ్రగతి, చతురశ్రగతి, ఖండగతి, సంకీర్ణగతి ఇత్యాదిగ మలయాళపద్యములను విభజించుట కలదు. క్రీ. శ. 16 వ శతాబ్ది ఉత్తరార్ధమున మలయాళచ్ఛందస్సులోని 'గతి'కి లేక 'లయ'కు ఛందోరీతిస్థిరముగా కుదురుకొనినది. కేరళ కౌముది కర్త మలయాళచ్ఛందోరీతులు గ్రహించుటకు తమిళచ్ఛందోగ్రంథముల పరిశీలనకూడ నావశ్యకమని భావించినాడు. ఎ. ఆర్. రాజరాజవర్మ (1904) రచించిన 'వృత్తమంజరి' మలయాళములో ప్రామాణికమైన ఛందోగ్రంథము. ఇందు తమిళ చ్ఛందోరీతులు వివరింపబడినవి. కాని మలయాళ చ్ఛందస్సులతో వానికిగల సంబంధము అందు తెలుపలేదు.

ప్రాచీన సంస్కృతములోవలె మలయాళములోని అక్షరచ్ఛందస్సులు ఏక రూప పరిమాణములో నుండవు. మలయాళమునం దెక్కువగా రెండక్షరములు, మూడక్షరముల గణములే యుండును. 'కేక' వంటి కొన్ని మలయాళచ్ఛందో పాదములందు వరుసగా ఈ రెండువిధములైన గణము లుండును. మలయాళము లోని మాత్రాగణములు సాధారణముగా మూడు. నాల్గు. అయిదు మాత్రలనుండి యేర్పడును. అక్షరగణ మాతృకములైన కొన్ని మలయాళచ్ఛందస్సులు కాలక్రమమున మాత్రాగణఛందస్సులుగకూడ రూపొంది వ్యాప్తిలోనికి వచ్చినవి. వాని యందు పద్యపాదములో కొంతభాగము మాత్రాయుక్తముగను, మరికొంతభాగము అక్షరయుక్తముగను కూర్పబడియుండును. తుళ్లల్ రచనలలోని కృషమధ్య. వత్క్రిమలకూడిక, స్వాగత, మల్లికలకూడిక వీని కుదాహరణములు.

మలయాళములోని పద్యములను మూడువిధములుగ విభజింపవచ్చును. (1) తమిళమాతృక కలవి, (2) సంస్కృతమాతృక కలవి, (3) దేశీయ గేయ మాతృక కలవి. అందువలన ఒకే విధానమును మలయాళ చ్ఛందస్సునందు పాటించుటకు వీలుపడదు.

కృష్ణగాథలో మంజరిచ్ఛందస్సు ప్రయోగింపబడినది. మంజరి ఛందస్సు మొదటిపాదములో 12 అక్షరములు, రెండవపాదమున 10 అక్షరము లుండును. ఇది తమిళములోని కుమ్మిపాట (కోలాటపు పాట)కు సరిపోవును.

మలయాళములోని 'సర్పిణి' ఛందస్సును 'పాన' అనికూడ అందురు. ఈ పద్యపాదమునకు 11 అక్షరములుండును. దీనిని తమిళములోని కలివిరుత్తమ్‌తో పోల్చవచ్చును.

'కాకళి', 'మంజరి' అను రెండు ఛందస్సులు త్ర్యశ్రగతిలో నడచును. ఇందలి ఒక్కొక్కగణములోను అయిదుమాత్ర లుండును. 'కాకళి'. 'మంజరి'కి పొడిగింపు. 'కాకళి' పద్యములోని రెండవపాదములో 'మంజరి' రెండవపాదములో కంటె అదనముగా రెండక్షరము లుండును.

'కేక' అను పద్యపాదములో 14 అక్షరములుండును. ఇది రెండు భాగములుగ విభజింపబడును. ప్రతి అర్ధభాగములోను మూడక్షరములగణము ఒకటి. రెండక్షరముల గణములు రెండు యుండును. ఈ ఛందస్సు తమిళములోని అరుశీర్‌ఆశిరియవిరుత్తమ్ నుండి యేర్పడినదని కొందరి అభిప్రాయము.

యన్. వి. కృష్ణవారియర్ మలయాళిచ్ఛందస్సులనుగురించి యం. లిట్. పరిశోధకగ్రంథమును ప్రకటించినాడు. అతడు తన గ్రంథమున తమిళ మలయాళ ఛ్ఛందస్సులకుగల సంబంధమును తెల్పినాడు.

'కాకళి' అను మలయాళ పద్యపాదములోని సగము తమిళపద్యమగు 'కలిత్తురై' అగును. మలయాళములోని 'తరంగిణి' అను పద్యము తమిళములోని 'ఎణ్ శీర్కళి నెడిలడి ఆశిరియవిరుత్తమ్' నకు సమానము. మలయాళములోని 'కుఱత్తి' అనునది తమిళ కురవంజి నాటకములందు కన్పట్టుచున్నది. మలయాళములోని 'సమానమం' అనునది తమిళకావ్యములలో 'అశిరియవిరుత్తమ్' అను పేర ప్రయుక్తమయినది. సంస్కృతచ్ఛందస్సుగాతోచు 'శంకరచరితమ్' అను మలయాళ దేశిచ్ఛందస్సు తమిళములోని 'కలిప్పా' అను పద్యమును పోలినదే. నాల్గు సమపాదములుగల కలివిరుత్తమ్ (కంబరామాయణమున ప్రయుక్తమయినది) నకు మలయాళములోని 'అన్ననడ' కు పోలిక కలదు. మలయాళమున ప్రయోగింపబడిన తోటకమ్ (సంస్కృతఛందస్సు), ఇందువదన (కంబరామాయణమున వాడబడినది), స్వాగత (తుళ్లల్ రచనలో వాడబడినది) మొదలగు పద్యములు తమిళకావ్యములందు కన్పట్టుచున్నవి. ఛందోబద్ధగణ విభజనమున మాత్రము తమిళ మలయాళములకు భేదము కలదు.

తమిళములోని 'ఇన్నిశై వెణ్బా' కు తెలుగు ఆటవెలదికి సంబంధము కలదు. 'కలిప్పా' పద్యముచివర 'ఆశిరియమ్' అను పద్యముకాని, 'వెణ్బా' పద్యముగాని చేర్చినప్పుడే కలిప్పా పద్యము పూర్తగును. తెలుగులో సీసపద్యమునకుకూడ చివర ఆటవెలదికాని తేటగీతికాని చేర్చవలెను. తెలుగులోని ఆటవెలది, తేటగీతి పద్యములు తమిళములోని 'వెణ్బా' పద్యభేదములను పోలియున్నవి.

తెలుగు తమిళ ఛ్ఛందస్సులకుగల సారూప్యమును జేకుమళ్ల రాజగోపాల రావుగా రిట్లు తెల్పినాడు.

"Some of the songs that have come down to us as the 'kuccelakatha' and the 'kāmēswari (or Akkala) Pāta' are in the AgavalPā metre of Tamil and their scansion is not possible unless Tamil cirs are used. Songs like 'Sita Surati' are in the Taruvoja metre which is simply a line of 'agaval Pā' doubled."

—Comparative prosody of dravidian Langauges. P. 29.

తెలుగులోని ద్విపద, సీసము మొదలగు పద్యములుకూడ 'అగవల్‌పా'తో సంబంధము కల్గియున్నట్లు కోరాడ రామకృష్ణయ్యగారు తెల్పినారు.

" Dwipada may be said to be related to the Ahavalpa type of metrical composition in Tamil. This Ahavalpa of Tamil consists of lines of 4 feet of two syllables each. These syllables are either ner or nirai and when combined correspond to the Surya and Indra ganas of Telugu Prosody."

—Telugu literature outside the Telugu country—Annals of oriental Research - Telugu. Vol. V. Part I.

తెలుగు 'సువ్విపాట' ఉత్సాహ పద్యభేదముగా భావింపబడుచున్నను దానిని తమిళములోని నేర్, నిరై విభాగమునకు మార్చుటకు వీలున్నది. ఉత్సాహమును కూడ తమిళ అగవల్‌పా ఛందస్సునకు సంబంధించినదిగా నిరూపింపవచ్చును. ఏల, జోల, లాలి, మేలుకొలుపులు, మంగళం మొదలగు పాటలనుకూడ తమిళము లోని నేర్ నిరై విభాగముక్రిందికి తీసుకొనిరావచ్చును.

ద్విపద, తరువోజ, సీసము, రగడ పద్యములు తమిళములోని ఆశిరియపా అను పద్యమునకు సంబంధించినవిగా వానిలోని గణములకూర్పునుబట్టి నిరూపింప వచ్చును.

పాదమునకు అయిదుగణములుగల తెలుగు ఛ్ఛందస్సులన్నియు తమిళములో కలిప్పా భేదమునకు చెందును. ఇన్నిశై వెణ్బాకు తెలుగు తేటగీతికి సంబంధము కలదు. ఆటవెలదిని కొంత భేదముతో వెణ్బారూపముగనే చెప్పవచ్చును.

తమిళ మలయాళ ఛందోరీతులకు, తమిళ తెలుగు పద్యములకు సన్నిహిత సారూప్యసంబంధము వ్యక్తమగుచున్నదని పై పరిశీలనమునుబట్టి తెలిసికొన వచ్చును.

## (౫) తెలుగు కన్నడ దేశి చ్ఛందోరీతులు :

తెలుగుపద్యములు వృత్తములని జాతులని రెండువిధములు. వృత్తములు అక్షరగణబద్ధములు. అవి సంస్కృతమునుండి గ్రహింపబడినవి. జాతులు దేశీయ ములగు పద్యములు. జాతులు సాంస్కృతికములని, దేశ్యములని రెండువిధములు. సాంస్కృతికములైన జాతులు మాత్రాసంఖ్యానియమముకలిగి నాల్గుపాదములతో కూడియుండును. కందపద్యము వీని కుదాహరణము. దేశ్యజాతులు మాత్రాగణబద్ధ

ములై పాదనియమము లేక రచింపబడినవి. కాలక్రమమున సంస్కృతవృత్తముల ననుసరించి వీనికికూడ పాదసంఖ్యానియమ మేర్పడినను మొదట నట్టి నియమ మేదియు లేనట్లే తోచును. సీసము, తేటగీతి, తరువోజలు ఈ తెగకు చెందును. దేశ్యజాతులు మరల జాతులు, ఉపజాతులని రెండువిధములు. వృత్తములయందు వలె యతిప్రాసనియమము కలని జాతులు. తరువోజ, మధ్యాక్కర, ద్విపద, ఉత్సాహము మొదలగునవి వీని కుదాహరణములు. ఉపజాతులలో యతిమాత్రమే యుండును. కాని ప్రాస యుండదు. సీసము, ఆటవెలది, తేటగీతి ఈ వర్గమునకు చెందిన పద్యములు. ఇందు యతికిబదులు ప్రాసయతికూడ నుపయోగింపవచ్చును. ఇందు ద్వితీయాక్షరప్రాసమునకు బదులు ప్రాసయతి యుండును. జాతులలో ప్రాస పూర్వాక్షరనియమము పాటింపబడును. ఉపజాతులలో ప్రాస యుండదు. కనుక నాల్గుపాదములందును ప్రథమాక్షరములు యథాసంభవముగా మార్పు చెందు చుండును. కన్నడమునందు ఈ ఉపజాతిభేదము లేదు. జాతులలో ప్రథమపాదము మొదట గురులఘువులలో నేదియుండునో మిగిలిన మూడుపాదముల ప్రారంభము లందుకూడ నదే యుండవలెను. గురులఘువులు సమముగా నున్నచో గణములు మారినను దోషములేదు. ఉపజాతులలో నాల్గుపాదములందు ప్రథమాక్షరములు యథాసంభవముగా మార్పు చెందవచ్చును.

మాత్రాగణబద్ధములగు దేశీయ ఛందోరీతులను జాత్యుప జాతిభేదములచే ప్రత్యేకించి వాని దేశీయతాగుణమును తెలుగు లాక్షణికులు వ్యక్తము చేసినారు.

కన్నడ ఛందోంబుధి కర్తయగు నాగవర్మ మొదట వృత్తములనుగూర్చి చెప్పి తరువాత జాతులనుగూర్చి ఇట్లు తెల్పినాడు. 'అనటి పొలగె పుట్టువ మాలా వృత్త, దండక, రఘట, మాత్రార్య, త్రిపది, చతుష్పది, షట్పది, అష్టపది, శంఖా (సంఖ్యా?) వృత్త, తాళవృత్త ఆది జాతిగళఉంటు అవావుపెంచోదె'. నాగవర్మ జాతులనేకాక దేశీయజాతులనుకూడ ప్రత్యేకముగా పేర్కొనినాడు.

'మదనవతి, అక్కరం, చౌ
పది, గీతికె, ఏళె, త్రిపది, యుత్సాహం, ష
ట్పది, అక్కరికె, కరంబె
లొప్పువినిద ఛందోవతంస పడ్డికెగళ్.'

దేశీయజాతులుగా త్రిపద్య, షట్పద్య, ఉద్ర [illegible]మయిన మాత్రాగణబద్ధములను పద్య ములని నాగవర్మ అభిప్రాయపడియుండును. ఇవియో మాత్రాఘటితములైన రగ

డాది జాతులకును, అక్కరాది జాతులకును భేదమే లేకుండును. నాగవర్మ కన్నడమున పేర్కొనిన ఈ జాతిభేదములను తెలుగు లాక్షణికులుకూడ చెప్పినారు.

(6) కందము :

ఆర్యాజాతిలో చేరిన ఛందస్సులను కన్నడ తెలుగు లాక్షణికులుకూడ వివరించినారు. సంస్కృత ప్రాకృతములందలి ఆర్యలకును, కన్నడాంధ్రములందలి ఆర్యలకును లక్ష్యమొకటే కాని తెలుగు కన్నడములలో మొదటిపాదము గుర్వాదియయినచో తక్కినపాదములును గుర్వాదులుగాను, లఘ్వాదియయినచో తక్కిన పాదములను లఘ్వాదులుగా నుండవలెనను నియమమున్నది. ఆర్యలలో సంస్కృతములోని ఆర్యాగీతి, ప్రాకృతములోని ఖందపీ అను పేరుగలదిమాత్రము తెలుగు కన్నడములలో కందమను పేరుతో విపులప్రచారమం దున్నది. తక్కిన ఆర్యలు కేవలము లక్షణగ్రంథములందుమాత్రమే పేర్కొనబడినవి. అప్పకవి కందభేదములుగా వివరించిన పథ్య, విపుల, చపల, ముఖచపల, జఘనచపల అనునవి ఆయా ఆర్యలకు తగియున్నవి కాని కందములకు కాదు. కన్నడములో చెప్పబడిన సంకీర్ణమను ఆర్యాభేదము పూర్వార్ధము కందలక్షణములు, అపరార్ధము ఆర్యాలక్షణమును కల్గియున్నది. ఇది సంస్కృత ప్రాకృతాంధ్రములలో కానరాదు. తెలుగు లాక్షణికులు కందపద్యము మూలముగాగొని ఆర్యాభేదములను వివరించినారు. కన్నడ ఛందోంబుధి సంపాదకుడగు కిట్టెల్ పండితుడుకూడ కందము దేశీయ చ్ఛందస్సనియే అభిప్రాయపడినాడు. ప్రాచీన కన్నడాంధ్ర కావ్యములలో కందమునకు అపరిమిత ప్రయోజనముండుటచే ఆయా భాషలలో దాని ప్రత్యేకత వ్యక్తమగుచున్నది. కన్నడమున కవిరాజమార్గమునకు ముందే ప్రాచీన కన్నడకావ్యములలో కందమునకు విపులమైనప్రచారము కలదు. నన్నయభారతములో కందపద్యములను వాడినాడు. మల్లికార్జున పండితారాధ్యుని శివతత్త్వసారము కందపద్యములలో కూర్పబడినది. కేవల కందపద్యశతకము లెన్నియో తెలుగున కలవు. తిక్కన భారతములో కందపద్యముల నెక్కువగా వాడినాడు, 'కందము చెప్పినవాడే కవి' అను నానుడినిబట్టి కందము తెలుగు దేశ్యజాతిపద్యమే అని చెప్పవచ్చును.

(7) రగడలు :

కన్నడము ననుసరించియే తెలుగులోనికి 'రగడ' వచ్చియుండునని యూహింపబడుచున్నది. రఘట అని కన్నడములో దీనికి పేరు. గణనియమ

విపర్యాసముండినను, సమానమాత్రా సంఖ్యగలిగి తాళబద్ధమైయుండునది రఘటా బంధమగునని నాగవర్మ ఛందోంబుధిలో రగడకు లక్షణమును చెప్పినాడు.

'గణనియమ విపర్యాస దొ
ళెణెవడె దొళ్పెసెయెమాత్రె సమనాగి గుణా
గ్రణియ మతదిందె తాళద
గణనె గొడం బట్టెడ దుమె రఘటా బంధం.'

—ఛందోంబుధి-3-222.

నాగవర్మ కన్నడములో మందానిల, లలిత, ఉత్సాహ (ఉత్సవ) అని మూడు విధములగు రగడలను పేర్కొనినాడు. ఇవి మాత్రాగణాత్మకములై తాళమునకు సరిపోవును, ఒక్కొక్క పాదములో లలితకు 20 మాత్రలు, మందానిలకు 16 మాత్రలు, ఉత్సాహకు 24 మాత్రలు యుండును. వీనిలో మందానిలము తెలుగు లోని మధురగతి రగడకు, లలిత ద్విరదగతి రగడకు, ఉత్సాహము తురగవల్గన రగడకు సరిపోవును. దేశీయమాత్రా గణచ్ఛందములలో కన్నడమున చెప్పబడిన మరియొక ఉత్సాహమునకును తెలుగు ఉత్సాహమునకును లక్షణ మొక్కటే.

తెలుగులో కవిజనాశ్రయకర్త రగడ భేదములనుగూర్చి చర్చింపలేదు. కావ్యాలంకారచూడామణి (4 వ ఉల్లాసము-ప-40)లో విన్నకోట పెద్దన ఉదాహరణములతోపాటు రగడను ప్రత్యేక చాటుప్రబంధముగా గుర్తించినాడు, అనంతుడు ఛందోదర్పణము (3-52 నుండి 64 వరకు) లో నవవిధ రగడభేదములను, కళికోత్కళికలను, చాటుప్రబంధములలోని ఉదాహరణములను చెప్పినాడు. అప్పకవి వీనినేకాక యక్షగానములలోని రగడభేదములను, త్రిపుటాది తాళప్రశంసనుకూడ చేసినాడు. దక్షిణదేశీయ సంప్రదాయసిద్ధమగు గణములలో ఆ యా మాత్రలు గలవి అనేకవిధములుగా నుండును. కనుక ఈ రగడభేదములు అనేకవిధములై యుండు ననుటకు సందేహము లేదు. కావుననే అప్పకవి వీనిని వైతాళీయములతో ముడి పెట్టి 'వైతాళీయ భేదంబులైన రగడ లనేకంబులు గలవందు ప్రసిద్ధంబులైన హయ ప్రచారాది నవవిధంబులు ప్రబంధంబుల వర్తిల్లు' (అప్పకవీయము-4-477) నని నవవిధరగడలనుమాత్రము వివరించినాడు. వివిధ తాళాన్వితములయినవానిని వైతాళీయము లందురు. కనుక రగడలు వైతాళీయభేదములగు జాతిపద్యము లనవచ్చును. తక్కిన జాతిపద్యములందలి ఆదిప్రాస నియమముతోపాటు రగడలకు అంత్యప్రాస

నియమముకూడ కలదు. సంస్కృతమున రగడ లేదు. కాని కాలక్రమమున కర్ణాటాంధ్రజాతి పద్యమగు రగడ సంస్కృతమునందును ప్రవేశించినది.

లయగ్రాహి, లయవిభాతి, లయహారులు మూడును మాత్రాసమక వృత్తములు. ఇవి మూడును సంస్కృతచ్ఛందములందు చెప్పలేదు. తెలుగున అన్ని ఛందములందును ఇవి చెప్పబడినవి. ఈ మూడింటికి అక్షరసంఖ్యలో భేదము కలదు. కాని మాత్రాసంఖ్యలో భేదములేదు. అన్నిటికి 30 మాత్రలే. కాబట్టి ఈ మూడింటికి నడక (లయ) సమానము. మాత్రాసమక మగుటచేతను, మాత్రాగణబద్ధముగా తోచుటచేతను ఇవి దేశీయచ్ఛందమునకు చెందినవను భ్రమను కల్గించుచున్నవి.

లయగ్రాహి కన్నడములో రఘటాభేదముగకూడ పేర్కొనబడినది. అప్పకవి చెప్పిన మాలికావృత్తములలోని లయగ్రాహిలక్షణమును కన్నడ లయగ్రాహిలక్షణమును ఒకటే. నాగవర్మ ఈ లయగ్రాహినే మాలావృత్తములలో లలితపద మనుపేరుతో ప్రత్యేకముగా చెప్పినాడు. నాగవర్మ చెప్పిన కుసుమశరమను మాలావృత్తమునకు అప్పకవి చెప్పిన లయవిభాతి సరిపోవును. కాని వారిద్దరు ఆ పాదములకు చేసిన గణవిభజనములో భేదమున్నవి. అప్పకవి లయహారి, త్రిభంగి అను మరి రెండు మాలావృత్తములను చెప్పినాడు.

చౌపది, అష్టపది, త్రిపుడెతాళము, ఏకతాళము అనువానినికూడ రఘటాభేదములుగనే కిట్టెల్ సంపాదించిన కన్నడ ఛందోంబుధిలో పేర్కొనబడినవి. రేవన కవిజనాశ్రయములో చెప్పిన చౌపదిలో ప్రతిపాదమునందును 16 మాత్రలుండును. ఇది తెనాలి అన్నయ సుదక్షిణాపరిణయము (3-69) లోని చౌపదికి సరిపోవుచున్నది. అనంతాదులమతము ననుసరించి చౌపది పాదమునకు 15 మాత్రలుండును. అప్పకవితప్ప తక్కిన తెలుగు లాక్షణికులందరు చౌపదకు అంత్యానుప్రాసము తెల్పినారు. అష్టపదులను తెలుగు ఛందఃకర్తలు చెప్పలేదు. కాని ఇవి జనసామాన్యములోని స్త్రీలపాటలలో నిల్చియున్నవి. ఇవి మధురగతి రగడకు సరిపోవును. ఛందోంబుధిలో త్రిపుటతాళమున కిచ్చిన ఉదాహరణము హయప్రచారగతి రగడకు సరిపోవును.

(3) షట్పది :

షట్పది కర్ణాటజాతిపద్యము. తెలుగు లాక్షణికులు దీనిని కన్నడము నుండియే గ్రహించియుండిరి. షట్పది అను పేరునుబట్టియే ఇందులో ఆరుపాదము లుండు

వని తెలియుచున్నది. కన్నడమున షట్పదీచ్ఛందస్సునకు ప్రబలమగు ప్రచారము కలదు. తెలుగున షట్పదికి గేయవాఙ్మయమునందు తప్ప పూర్వసాహిత్యమున ప్రచారములేదు. కనుక కన్నడలాక్షణికులు చెప్పిన షట్పదీభేదములను తెలుగు లాక్షణికులు చెప్పలేదనవచ్చును.

కన్నడమున నాగవర్మ షట్పదిని జాతులలోను, దేశ్యజాతులలోను చేర్చి చెప్పినాడు. దేశియగణములగు బ్రహ్మ, విష్ణు, రుద్రగణముల నుపయోగించుట వలన షట్పదిని దేశ్యజాతిగానే పరిగణింపవచ్చును. కన్నడ ఛందోంబుధికర్తయగు నాగవర్మ ఒక్క శరషట్పదినిమాత్రమే చెప్పినట్లగపడును. తరువాతి కన్నడ లాక్షణికులు కుసుమషట్పది, శరషట్పది, భోగషట్పది, భామినిషట్పది, పరివర్ధిని షట్పది, వార్ధికషట్పది అని ఆరుతెరగుల షట్పదులను తెల్పినారు. ఈ ఆరు రకముల షట్పదులలో భామినీషట్పదికి, వార్ధకషట్పదికి కన్నడసాహిత్యమున ప్రచారమెక్కువ. నారాయణప్ప రచించిన కుమారవ్యాసభారతము, కుమార వాల్మీకి రచించిన తొరవె రామాయణము, చాటువిట్ఠలని భాగవతము మొదలగునవి భామినీషట్పదిలో కలవు. జైమినీభారతము, హరిశ్చంద్రకావ్యము మొదలగు మధ్యయుగము నాటి కన్నడకావ్యములు వార్ధకషట్పదిలో రచింపబడినవి.

రేచన కవిజనాశ్రయములో షట్పదీలక్ష్యమున రెండుపాదములే చూపినాడు. (చూ. జాత్యధికారము ప-33). అప్పకవి నాల్గుపాదము లుండవలెనని లక్షణపద్యములో చెప్పినను రెండుపాదములే వ్రాసినాడు. (అప్పకవీయము-4-476). అనంతుడుమాత్రము ఛందోదర్పణము (3-46) లో షట్పదికి లక్షణమును స్పష్టముగా తెల్పినాడు. తెలుగు షట్పదిలో వరుసగా రెండుపాదములలో రెండేసి చంద్రగణములు, మూడవపాదమున వరుసగా రెండు ఇంద్రగణములు, ఒక చంద్రగణముండును. ఈ పూర్వార్ధమువలెనే ఉత్తరార్ధముకూడ నుండును. ఇంద్రగణములలో అయిదుమాత్రల ఇంద్రగణములను అప్పకవి లక్ష్యపద్యమున నుపయోగించినాడు. కన్నడ కుసుమ షట్పదిలో అయిదుమాత్రలగణములు మొదటి రెండు పాదములలో రెండును, మూడవపాదమున అయిదుమాత్రలగణములు మూడును, ఒక గురువును చెప్పబడినవి. కనుక తెలుగు షట్పదికిని కన్నడ కుసుమషట్పదికిని మొత్తముమీద లక్షణ మొకటిగానే యేర్పడుచున్నది.

శరషట్పది మధురగతి రగడ కావచ్చును. తెలుగులోని,

'మరో ప్రపంచం
మరో ప్రపంచం
మరో ప్రపంచం పిలిచింది'

అను శ్రీ శ్రీ గేయము శరషట్పదికి ఉదాహరణము.

కుసుమషట్పది ఛందస్సు ద్విరదగతి రగడకు సరిపోవును. భోగషట్పది శరషట్పదికి రెట్టింపు అనవచ్చును. తెలుగులోని సువ్విపాట భోగషట్పదీ రూపమే. ఇది హయప్రచార రగడభేదముకూడ కావచ్చును. భామినీషట్పది జలషట్పదికి రెట్టింపు. తెలుగులోని గుమ్మడిపాట భామినీషట్పదికి సరిపోవుచున్నది. ఈ భామినీ షట్పది హరిణగతి రగడభేదము కావచ్చును.

పరివర్ధినిషట్పది శరషట్పదికి రెట్టింపు. ఇది మధురగతిరగడ భేదము కావచ్చును. వార్ధికషట్పది కుసుమషట్పదికి రెట్టింపు. ఇది ద్విరదగతిరగడ భేదము కావచ్చును. ఇట్లు కన్నడషట్పదీభేదములు తెలుగు రగడభేదములే అనుటకు వీలున్నది.

(9) ఏళె:

శార్ఙ్గదేవుడు సంగీతరత్నాకరమున 356 ఏలాభేదములను తెల్పినాడు. 'ఒకేధాతువు లేక స్వరరచనతో సమానమయిన గణములతో నడచు రెండుపంక్తులు పాడినతరువాత గమకాలాపయుతమైన ప్రయోగముండును. పిదప పల్లవమను పేరున మూడుఖండము లుండును. ఔదార్యము, లోకానురాగము, ధార్మికత్వము మొదలగు నాయకగుణములు కీర్తింపవలెను. ఈ ఏలలలో నాంధ్రైలా యనునది కూడ నొక భేదము.'

నాగవర్మ కన్నడమున కర్ణాటజాతులలోచేర్చి 'ఏళె'కు లక్షణము చెప్పినాడు. 'ఏళె'కు ఆరింద్రగణములు, ఒక బ్రహ్మగణముండును. 'ఏళె' నడక తెలుగు 'ఏల' పాటలతో సరిపోవుచున్నట్లు కన్పట్టదు. దేశభేదములనుబట్టి పాటలో కలిగిన మార్పు మూలమున లక్షణమునకూడ కొంతభేద మేర్పడవచ్చును.

పాల్కురికి సోమనాథుడు (క్రీ. శ. 12 వ శతాబ్ది) బసవపురాణమున ఏలలు పెట్టి పాడినట్లు చెప్పియున్నాడు. కావున పాల్కురికి సోమనాథునికి పూర్వమే 'ఏల' దేశీయరచనా భేదముగ కన్నడమునందువలె తెలుగులోకూడ ప్రచారములో నుండి

యున్నట్లు తెలియుచున్నది. కందుకూరి రుద్రకవి (క్రీ. శ. 16వ శతాబ్ది) రచించిన సుగ్రీవవిజయమను యక్షగానములోని 'ఏల' ఈ క్రిందిది.

'భానువంశా మూనబుట్టి
దానావా కామిని గొట్టి
పూని మఖము నిర్వహింపా-వా-ఓ-రామచంద్ర!
మౌనివరులు సన్నుతింప-గా,'

నాలుగు త్రిమాత్రాగణములు కలిగిన రెండుపాదములు, నాలుగు త్రిమాత్రా గణములు ఒక గురువు కలిగిన రెండుపాదములు. మూడవపాదమునకు, నాల్గవ పాదమునకు మధ్య ఒక సంబోధన (ఓ-రామచంద్ర!) యున్నచో దానిని 'ఏల' పాట అందురు. ఈ 'ఏల'కూడ హయప్రచారరగడకు సంబంధించినట్లు గుర్తింప వచ్చును. ఇది నాలుగేసి సూర్యగణములుగల పాదములతోగూడి భోగషట్పది రకములో చేరగలదని తోచుచున్నది.

(10) అక్కరలు :

నాగవర్మ కన్నడఛ్ఛందోంబుధిలో అక్కరము కేవల కర్ణాట జాతిపద్యముగా పేర్కొనినాడు. అక్కరలు కన్నడమునుండి తెలుగులోని కవతరించినవనుట నిక్కము. అక్కరలు కన్నడాంధ్రములకు సామాన్యములయినను లక్షణమునను, పేర్లలోను కొంతభేదము లేకపోలేదు.

| తెలుగు అక్కరలు | కన్నడ అక్కరలు | గణ సంఖ్య | కన్నడ ఛందోంబుధిని ప్రకటించిన కిట్టెల్ యిచ్చిన అర్థములు |
|---|---|---|---|
| 1. మహాక్కర | పిరియక్కరె | 7 | పిరి = Great |
| 2. మధ్యాక్కర | దొరెయక్కరె | 6 | దొరె = Equal |
| 3. మధురాక్కర | నడునణక్కరె | 5 | నడువ = Middle |
| 4. అంతరాక్కర | ఎడెయక్కరె | 4 | ఎడె = Nice |
| 5. అల్పాక్కర | కిరియక్కరె | 3 | కిరి = Little |

కన్నడ అక్కరకు ప్రాసమాత్రమే కాని యతిలేదు. తెలుగు అక్కరకు ప్రాసతోపాటు యతినియతికూడ యుండును. తెలుగులో చంద్రగణోపయోగము ఈ అక్కరలందుతప్ప తక్కిన పద్యములం దంతగా కానరాదు. అందును మధ్యాక్కరలో చంద్రగణముల ఆక్కరకూడ లేదు.

లాక్షణికులు అయిదువిధములయిన అక్కరలను చెప్పినను కన్నడవాఙ్మయములో ఒక్క పిరియక్కర (తెలుగులో మహాక్కర దీనికి సమానము) మాత్రమే వాడబడినదని డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు 'మాత్రాచ్ఛందస్సులు' అను వ్యాసమునందు తెల్పినారు. ప్రాచీన కన్నడకవులలో పంపడు తన భారతములో ఏడింటిని, ఆదిపురాణములో మూడింటిని, పొన్నడు తన శాంతిపురాణములో అయిదింటిని పిరియక్కరలను వాడినారు. మరి యే కన్నడగ్రంథములలోను ఈ పిరియక్కరలు కనపడవనికూడ డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు వ్రాసినారు. తెలుగులో మధ్యాక్కర ఒకటే ప్రసిద్ధముగా వాడబడినది. నన్నయ ఒక మధురాక్కరను, ఎఱ్ఱన రెండు మధురాక్కరలను వాడినారు. తక్కిన మూడక్కరలను ప్రాచీన తెలుగుకవు లెవ్వరు వాడకున్నను వానికి ఛందోగ్రంథములందుమాత్రము లక్షణములు చెప్పబడినవి. ఆధునికకాలమున శ్రీమద్రామాయణ కల్పవృక్షమున విశ్వనాథ సత్యనారాయణగారు మహాక్కరలను విరివిగా వాడినారు. అక్కరికె, మదనవతి, ఛందోవతంస, చౌపది, గీతికె, సాంగత్య, ఏళె - అనువానిని అక్కరల భేదములుగా కన్నడ లాక్షణికులు చెప్పినారు.

## (11) ద్విపద :

ద్విపద తెలుగు దేశిచ్ఛందస్సు. ద్విపదయందు రెండుపాదము లుండును. పాదసంఖ్యనుబట్టియే దానికి 'ద్విపద' యని పేరు కలిగినది. కావ్యాలంకార చూడామణియందు విన్నకోట పెద్దన 'ద్విపది' అని వాడినాడు. కాని 'ద్విపద' అనుపదమే సాహిత్యప్రపంచమున రూఢికెక్కినది. రెండుపాదములకు లక్షణసామ్యము కల్గిన వన్నియు ద్విపదలను భావములో ద్విపదిక, ద్విపది, ద్విపదగ, దోధకము, ద్విపదీఖండము, దోహా మొదలగు సంస్కృత ప్రాకృత ద్విపదభేదము లన్నియు ద్విపదలే కావచ్చును. కాని తెలుగు ద్విపదలక్షణము వానికి విలక్షణమైనది. తెలుగు ద్విపద దేశిచ్ఛందము. సంస్కృత ప్రాకృత ద్విపద భేదములతో దానికి జన్యజనక భావ సంబంధము లేదు.

కన్నడ ద్విపదకును తెలుగు ద్విపదకును సంబంధము లేదు. కన్నడములోని 'దువయి' అను ఛందస్సులోని రెండు పాదములలోను ఒక్కొక్క పాదములో వరుసగా 6 మాత్రలగణము + 5 కందపద్యగణములు = 26 మాత్ర లుండును. కందపద్యగణములు అనగా చతుర్మాత్రాగణముల — తరువాత ఒక గురువు చేర్చబడినవియు, మొత్తము 28 మాత్రలవియు 'దువయి' లక్షణమునకు పాఠాంతర

మున్నది. దీనినిబట్టి 'దువయి' పాదమునందు 26 లేక 28 మాత్రలుండును. కన్నడ 'దువయి' లక్షణము తెలుగు ద్విపద లక్షణమునకు భిన్నమైనది. ఇచే దువవిగ, దువది మొదలగు కన్నడ ద్విపదలకును తెలుగు ద్విపదతో జన్యజనక సంబంధములేదని ఊహింపవచ్చును.

చిత్రకవి పెద్దన, అప్పకవిమాత్రమే కర్ణాటక చతుష్పదను చెప్పినారు. కర్ణాటక చతుష్పదలో పాదమునకు పంచలఘుగణములు మూడు, 3 మాత్రలుగల ఒక సూర్యగణముండును. (అప్పకవీయము-4-473). కన్నడ ఛందోంబుధిలో నాగవర్మ సంస్కృత ప్రాకృత మాత్రాగణచ్ఛందములలో చేర్చిచెప్పిన చతుష్పదికి కూడ ఇట్టి లక్షణమే కలదు. కర్ణాటక చతుష్పదలోని రెండుపాదములు తెలుగు ద్విపద యగునని చెప్పవచ్చును. కాని, తెలుగులోని ఇంద్రగణములయిన 'నల', 'భ' గణములనుకూడ వాడవచ్చునని, 'భ గురువు', 'నలల' ములను తొలగించ వలెనని తెలుగులక్షణములో నెక్కువగా చేర్చుకొనవలెను.

తెలుగు చతుష్పదలో పాదమునకు 16 మాత్రలు అనిమాత్రము చెప్పబడి నది. ఇది కర్ణాటక ఛందోవతంసమునకు సరిపోవును. కన్నడ ఛందోవతంస లక్షణము పాదమునకు మూడు విష్ణుగణములు, ఒక బ్రహ్మగణము. ఇది ద్విపద లక్షణమే. తెలుగులో విష్ణుగణమును కింద్రగణమని, బ్రహ్మగణమునకు సూర్య గణమని చెప్పికొనవలెను. ద్విపదలోవలె రెండు పాదములుకాక ఛందోవతంసలో నాల్గుపాదము లుండును.

ప్రాసముగాని ప్రాసయతిగాని నియమములేక వరుసగా చెప్పిన ద్విపద పాదమునకు 'మంజరి' అని పేరు. ఒక్కొక్క ద్విపదలోని రెండు పాదముల లోను సమానయతికలిగి, అట్టి నాల్గు ద్విపదల అన్నిపాదములకును ప్రాసమును పాటించినచో అది తరువోజ పద్యమగును. ద్విపదవలె మంజరి, తరువోజలుకూడ దేశీయచ్ఛందస్సులే.

## (12) త్రిపది :

త్రిపది కన్నడజాతి పద్యములలో నొకటి. కన్నడమున ఈ ఛందస్సునకు అధికప్రచారము కలదు. సర్వజ్ఞుని వచనములు త్రిపది ఛందస్సులోనే రచింప బడినవి. త్రిపదికి తెలుగు కావ్యములలో ప్రచారము లేకపోయినను, తెలుగు లక్షణ కర్తలందరు దీనికి లక్షణము చెప్పియున్నారు.

సంస్కృతచ్ఛందస్సులో చెప్పిన మాత్రాసమకములలో చిత్ర, ఉపచిత్ర, చిత్రలతె అనువానిని కన్నడమాత్రా చ్ఛందస్సులుగా నాగవర్మ వివరించినాడు. కాని ఇవి కన్నడములో మూడుపాదములు కలవి. సంస్కృతములో చిత్ర, ఉపచిత్రలు నాలుగుపాదములు కలవి. తెలుగులో అప్పకవి ఉపచిత్రను నాలుగుపాదములు కలదిగానే చెప్పినాడు. కాని మాత్రాసమకముగా చెప్పలేదు. కన్నడ చిత్ర, ఉపచిత్ర, చిత్రలతెలు కన్నడ త్రిపదిమీద ఆధారపడియున్నది.

కన్నడ త్రిపదిలో మొదటిపాదములో అయిదేసి మాత్రలగణములు నాలుగును, రెండు, మూడు పాదములలోని రెండవగణములు బ్రహ్మగణములును నుండును. మొదటిపాదమునకు 20 మాత్రలు, రెండవపాదమునకు 17 మాత్రలు, మూడవపాదమునకు 13 మాత్రలుండును. తక్కినగణములు ఆయా పాదముల మాత్రాసంఖ్యకు సరిపోవునట్లు చెప్పికొనవలెను. ప్రతిపాదములోను త్రిపదిలోని ఆరవ, పదవ స్థానములలో రుద్రగణముతో బ్రహ్మగణముకూడి తక్కినవి విష్ణుగణములైనచో చిత్ర అగును. ఉపచిత్ర, చిత్రలతల లక్షణములను అనేక పాఠభేదము లుండుటచే సరిగా నిర్వచింప వీలులేకున్నదని డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు తెల్పినారు.

కన్నడ త్రిపది లక్షణమునకు తెలుగు త్రిపది లక్షణమునకు భేదమున్నది. మొదటిపాదమునందు వరుసగా నాల్గు ఇంద్రగణములు, రెండు, మూడు పాదములందు వరుసగా రెండు ఇంద్రగణములు, ఒక సూర్యగణముండునని అనంతుడు ఛందోదర్పణము (3-47) లో త్రిపదికి లక్షణము చెప్పినాడు.

(13) దండకము :

దండకము, లయగ్రాహి, లయవిభాతి, లయహారి, త్రిభంగి మొదలగు వానితో చేర్చి మాలికావృత్తము లేక యుద్ధురమాలావృత్తము లేక యుపరివృత్తమని పిలువబడుచున్నది, మాలికావృత్తములు 26 ఛందముల మించినట్టివి. దండకమునందు యతిప్రాసలు పాటింపబడవు. ఇది సంస్కృతవృత్తమయినను తెలుగున దీనికి మిక్కిలి వ్యాప్తికలదు.

నగణద్వయముపై నిచ్చవచ్చినన్ని రగణములు నిలుపుట సంస్కృతదండక సంప్రదాయము. సంస్కృతదండకలక్షణము ననుసరించియే కన్నడ దండకలక్షణము చెప్పబడినది. కన్నడములో మూడుమాత్రలగణములు రెండును, తరువాత

ఏడు రగణములను చేర్చిన దండకములోని ఒక పాదమగును. అట్టి పాదములు దండకములో నాల్గుండును. దండకమును నాల్గుపాదములుగనైనను ఏకపాదమున నైనను వ్రాయుచుందురు.

'దండకో నౌరః' అని పింగళచ్ఛందమున చెప్పబడినది. నగణముపై సప్తరగణములుగల యిరువది యేడక్షరములవృత్తము మొదటి దండకము. దీనికి చండవృష్టి ప్రయాతమని పేరు. అట్లు రగణవృద్ధిచే దండకభేదములు పెక్కు కలవు.

తెలుగు దండకమునుగురించి రేచన కవిజనాశ్రయములో 'అమరంగ ననహంబులం దాదిగా నొండెఁ గాదేని నాదిన్ దకారంబుగా నొండెలోనం దకారమ్ము లిమ్మైగ గకారావసానంబుగాఁ జెప్పినన్ దండకంబండ్రు' అని చెప్పినాడు. దీనికి 'అమరంగ సనహంబులం దాదిగానొండె' నని పాఠాంతరము కలదు. మొదట 'ననహ' ములతో 'త' గణము లెన్నైనను కాని లేదా మొదటినుండి తుదివరకు 'త' గణములేకాని చేర్చి చివర గురువును చేర్చవలెనని రేచన చెప్పినాడు. మొదట 'న' గణము, నహము, తరువాత 'త' గణము లెన్నైననుకాని లేదా మొదటి నుండి తుదివరకు 'త' గణములే కాని చేర్చి చివర గురువును చేర్చవలెనని విన్నకోట పెద్దన, అనంతులు దండకమునకు లక్షణము చెప్పినారు. అప్పకవిమాత్రము చెప్పిన దండకలక్షణము మరొకతీరుగ నున్నది. అప్పకవిప్రకారము మొదట హగణముగాని, నగణముగాని, సగణముగాని చెప్పి తరువాత 'త' గణము లెన్నైనను చేర్చి చివర గురువును పొందుపరచిన దండకమగును. నగణయుగముపై యగణములుంచి దండకము రచింపవలెనని లక్షణసార సంగ్రహమున తెలుపబడినది. హ, న, స, త లలో నొక్కదానితో మొదలుపెట్టి దండకమంతయు రచింపవలెనని సరసాంధ్రవృత్త రత్నాకరము చెప్పునని రావూరి దొరసామిశర్మ గారు వ్రాసినారు. ఇట్లు దండకమునకు పలువురు లాక్షణికులు పలువిధములుగ లక్షణమును చెప్పినారు.

తెలుగులో ననరలతోడను, సనహలతోడను దండకములు కన్పట్టుచున్నవి. తగణదండకములే తెలుగులో నెక్కువ. దండకములో ఏకపాదమైనను, చతుష్పాద మైనను వ్రాయవచ్చును. నగణద్వయముపై 931 రగణములైనను, తగణదండకములలో 999 తగణములైనను దండకపాదముగ వ్రాయవచ్చును.

(14) సాంగత్యము :

కన్నడమున సాంగత్యమను పద్యమునకు ప్రబలప్రచారము కలదు. హొన్నమ్మ రచించిన హదిబదేయధర్మము, రత్నాకరవర్ణి రచితమైన భరతేశ వైభవము మొదలగునవి సాంగత్య చ్ఛందస్సులోని కన్నడకావ్యములు. ఈ సాంగత్యచ్ఛందస్సునకు తెలుగులో ప్రచారము తక్కువ. దక్షిణాత్యాంధ్రవాఙ్మయమున కొన్ని సాంగత్యములు తెలుగులో రచింపబడినవి.

'సాంగత్యము' మాత్రాచ్ఛందస్సులోనిది. ఒకటవ, మూడవపాదములలో నాలుగేసి విష్ణుగణములు, రెండు, నాలుగు పాదములలో రెండేసి విష్ణుగణములు, చివర బ్రహ్మగణముండును. సాంగత్యచ్ఛందస్సు కన్నడమున మొట్టమొదటిసారిగా శిశుమాయణుని కావ్యములలో కానవచ్చును. సాధారణముగ స్త్రీలపాటలన్నియు ఈ ఛందస్సులోనే వ్రాయబడియున్నవి.

(15) సీసము :

సీసపద్యలక్షణము కన్నడములో పాదమునకు వరుసగా అయిదుమాత్రల గణములు ఆరును, మూడుమాత్రలగణములు (లగము తప్ప) రెండును నుండును. సీసపద్యమం దిట్టివి నాల్గుపాదము లుండును. దీనికి ఒక ఆటగీతెను చేర్చుదురు. తెలుగు సీసపద్యమున ఆరింద్రగణములును, రెండు సూర్యగణములును గల పాదము లుండును. అనగా కన్నడ పాదములలోని గణములలో తెలుగునందుండు నల, భ, స అనునవి యుండవు. నగ, ర, త గణములుమాత్ర ముండును.

కన్నడమున సీసపద్యమునకు ప్రచారము లేదు. తెలుగుకవులు సీసమును అనేకవిధములుగా వాడినారు. సీసపద్యమున కనేకభేదములను తెలుగు లాక్షణికులు కల్పించినారు. రేచన 6, చిన్నకోట పెద్దన 8, అనంతుడు 10, అప్పకవి 7, కస్తూరి రంగకవి 12 సీసభేదములను చెప్పినారు. సీసపద్యము నాలుగు పాదముల తరువాత తెలుగులో తేటగీతినికూడ వాడుచుందురు. తెలుగు సీసపద్యములో రెండేసి గణములపై ప్రత్యేక యతులుండును. సీసపద్యము భరతునికాలమునాటికే ప్రచారములో నున్నట్లున్నదని కోరాడ రామకృష్ణయ్యగారు తెల్పినారు. తెలుగులో సీసము అతి ప్రాచీనపద్యము. తెలుగులో సీసమున కున్నంత చరిత్ర కన్నడమున లేదు.

(16) గీతపద్యములు :

కన్నడమున 'గీతికె' అనుదానికికూడ ప్రాసనియమ ముండుటచే అది జాతులలోనే చేరును. తెలుగునందలి గీతమునకు ప్రాసనియమము లేదు కాని వడి నియమముమాత్రము కలదు. ఇంతేకాక పద్యలక్షణమంతే ఈ రెంటికిని భేద మేర్పడినది.

తేటగీతి కన్నడములో కన్పింపదు. ఆటవెలది ఇటీవల కన్నడమున కొంత ప్రయోగమునకు వచ్చినదని రావూరి దొరసామిశర్మగారు 'తెలుగుభాషలో ఛందో రీతులు (పుట 388) అను గ్రంథమునందు తెల్పినారు.

ఆటవెలది, తేటగీతి సమగీతులు. ఆటవెలదికి ఒకటవ, మూడవపాదము లలో మూడు సూర్యగణములు + రెండు ఇంద్రగణము లుండును. రెండు, నాల్గు పాదములలో అయిదు సూర్యగణము లుండును. తేటగీతిలో నొక్కొక్కపాదమున ఒక సూర్యగణము + రెండింద్రగణములు + రెండు సూర్యగణము లుండును.

ఆటగీతి లక్షణమును కిట్టెలు, మొదటిపాదములో నాల్గు సూర్యగణములు, ఒక చతుర్మాత్రాగణము, ఒక సూర్యగణముగాను, రెండవపాదములో మూడు సూర్యగణములు, ఒక చతుర్మాత్రాగణము, ఒక సూర్యగణముగాను ప్రస్తరించి చూపినారు. ఈ ప్రస్తారము సరియైనట్లు తోచదు. కన్నడములో తెలుగులోవలె మొదటిపాదములో మూడు సూర్యగణములు, రెండింద్రగణములు అని చెప్పవలసి యుండును. రెండవపాదములోమాత్రము తెలుగు కన్నడములకు భేదమున్నది. దానిలో నాల్గవగణము కన్నడమున నాల్గుమాత్రలు కలది తెలుగులో సూర్యగణమే. ఆటగీతి నాల్గుపాదములందును ప్రాస యున్నచో పవడగీతి యగునని అప్పకవి చెప్పినాడు. బేసిపాదములలో 3 సూర్యగణములు + 2 ఇంద్రగణములును. సరి పాదములలో 5 సూర్యగణములును పవడగీతియం దుండును. ప్రాస అన్నిపాద ములలోను కలదు.

తెలుగు లక్షణగ్రంథములలో 'ఎత్తుగీతి' పేర చెప్పబడినపద్యము, నాగ వర్మ చెప్పిన 'చౌపది'కి సరిపోవుచున్నటు కన్పించునని శ్రీ సంపత్కుమారగారు తెల్పినారు. కాని లక్షణవిషయమున కొంత భేదము కలదు. నాగవర్మ చౌపదికి ఒక విష్ణుగణము + ఒక రుద్రగణము ప్రతిపాదమున నుండునని చెప్పినాడు. అనం తామలు ఎత్తుగీతికి 1 ఇంద్రగణము + 2 సూర్యగణములని లక్షణము చెప్పినాడు.

అప్పకవి చెప్పిన కమలనగీతి ప్రతిపాదమున 7 సూర్యగణము లుండును. అప్పకవి చెప్పిన కమలనగీతినే తక్కినవారు 'మేళనగీతి' అని వ్యవహరించినారు. అప్పకవి చెప్పిన ఎత్తుగీతి, కమలనగీతులను తెలుగుకవులు ప్రయోగింపలేదు. తాను వ్రాసిన ఎత్తుగీతిలక్షణమును అప్పకవి లక్ష్యములో పాటించలేదు.

గీతులలో భేదములుగా అప్పకవి చెప్పిన సమగీతి, ఉద్గీతి, ఉపగీతి, ఆర్యాగీతి అనునవి సంస్కృతచ్ఛందస్సులో వివరింపబడినవే. ఆర్యాగీతియే తెలుగు కన్నడములలో కందము అనుపేర స్థిరముగానిలిచి వ్యాప్తిగాంచినది.

ఇట్లు తమిళ మలయాళ కన్నడాంధ్ర ఛందస్సులను వాని సామ్యవైషమ్యములనుగూర్చి, సహజత్వమునుగూర్చి చర్చించినచో వివిధాంశములు బోధపడును. దక్షిణ భారత సాహిత్యములందలి ఛందోరీతులందలి విశేషములనుబట్టి ప్రాచీన దక్షిణ దేశీయమగు 'దేశి' ప్రత్యేకతను నిరూపింపవచ్చును.

## 16. ప్రకరణ సారాంశము :

దక్షిణదేశభాషలలోని దేశి సారస్వతమును పరిశీలించినపుడు మనకు కొన్ని సామ్యములు కన్పట్టును. తమిళ కన్నడ తెలుగు మలయాళములందు ప్రారంభదశలో దేశి సారస్వతమే విస్తారముగ నుండినట్లు తెలియుచున్నది. తరువాత సంస్కృత ప్రాబల్యముచే దేశి సాహిత్యమునకు ఆదరము సన్నగిల్లినయి. సంస్కృతభాషా పద్ధతులకు గౌరవము చేకూరుటయు ఈ నాల్గుభాషలందును సమానముగా కన్పించును. ఇట్లు పండితకవులు ఒకవైపు మార్గసాహిత్యమును సృష్టించుచుండగా మరొకవైపు దానికి సమానాంతరముగ దేశి సారస్వతముకూడ ఈ భాషలన్నిటియందును పెంపొందుచునే వచ్చినది. దేశి సాహిత్యపద్ధతులు ప్రజానురంజకములగుటచే క్రమముగా నవి మార్గసాహిత్యమందును చోటుచేసికొన నారంభించెనని నిరూపించితిమి. అందువలన దేశిచ్ఛందములవాడుక, దేశీయమైన ఇతివృత్త స్వీకరణము, సంస్కృతప్రభావము సోకని అచ్చమగుభాషను ప్రయోగింపవలెనను దీక్ష, సంస్కృతమునకు భిన్నమైన స్వతంత్రప్రక్రియలను చేపట్టుట అనునవి ఈ దాక్షిణాత్యభాష లన్నిటియందును సమానముగా కానవచ్చును. కాని ఈ భాషలందలి దేశితనమును తులనాత్మకముగా పరిశీలించి చూచినపుడు తక్కిన అన్నిభాషల కంటెను తమిళమునందే దేశీయత మిక్కుటముగా నున్నట్లు స్పష్టమగుచున్నది. తమిళమునకు తరువాతిస్థానమును కన్నడము గ్రహించును. తెలుగు మలయాళము

లందు సంస్కృతభాషాప్రభావము అధికముగా గోచరించుటవలన వానియందు దేశీయత తమిళ కన్నడములకంటె తక్కువ అనియే చెప్పవలసియుండును. ఆధునిక కాలమునందుమాత్రము దాక్షిణాత్యసాహిత్యములు నాలుగింటను దేశీయతకే ప్రాముఖ్యము కావచ్చును.

## ఉపయుక్త గ్రంథ సూచి

తెలుగు :


1. అనంతుడు. *ఛందోదర్పణము* వావిళ్ళప్రతి - తృతీయముద్రణము (1958)
2. అప్పకవి. *అప్పకవీయము* వావిళ్ళప్రతి (1961)
3. అప్పారావు. పి. యస్. ఆర్. *నాట్యశాస్త్రము* (అనువాదము)
4. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, *దక్షిణ భారత సాహిత్యములు*, హైదరాబాదు (1962)
5. ఆంధ్ర సాహిత్య పరిషత్తు, *కవిజనాశ్రయము* (1917)
6. కోదండరామయ్య. తిమ్మావజ్ఝల. *కవిరాజ శిఖామణి*, సారస్వత కుటీరము. మద్రాసు-21. (1966)
7. కోదండరామయ్య. తిమ్మావజ్ఝల. *ఆంధ్ర సాహిత్యములో దేశికవితోద్యమము - పాల్కురికి సోమనాథుని పాత్ర*, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయములో డాక్టరేట్ పట్టము పొందిన పరిశోధక గ్రంథము. అముద్రితము (1966)
8. కోదండరామయ్య. తిమ్మావజ్ఝల. ఇరుగుపొరుగు సాహిత్యప్రక్రియలు. 1, 2, 4, ఆంధ్రప్రభ (దినపత్రిక) ఆదివారం అనుబంధము. (1970 సంవత్సరము - అక్టోబరు 10, 25, సెప్టెంబరు 13)
9. గోపాలకృష్ణయ్య. వడ్లమూడి. వాఙ్మయ మహాధ్యక్షుని పరిశోధనావాఙ్మయం. *జానుతెనుగు* కళాకృష్ణులు అండ్ బ్రోజెవి, హైదరాబాదు. (1972)
10. గోపాలకృష్ణయ్య. వడ్లమూడి. వాఙ్మయ మహాధ్యక్షుని పరిశోధనావాఙ్మయం. *మార్గ-దేశి* కళాకృష్ణులు అండ్ బ్రోజెవి, హైదరాబాదు. (1974)
11. తమ్మయ్య. బండారు. 'మార్గదేశి కవితలు' ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. సంపుటము 40. ఖరనామ సంవత్సరము.

12. దోరస్వామిశర్మ, రావూరి, తెలుగుభాషలో ఛందోరీతులు మద్రాసు. (1982)

13. నాగయ్య. జి. ద్విపద వాఙ్మయము తిరుపతి (1967)

14. నారాయణరావు, చిలుకూరి. 'మాత్రాఛ్ఛందస్సులు' వ్యాససంగ్రహము (గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారి సప్తతి తమ జన్మదినోత్సవ ప్రచురణము). సంపాదకుడు - తెలికిచెర్ల వెంకటరత్నం. (1938)

15. పెద్దన, విన్నకోట. కావ్యాలంకార చూడామణి. వేదమువారి ప్రతి. (ఆరవ కూర్పు) (1968).

16. రాజగోపాలనాయుడు, పి. పాటలలో ఛందస్సు. భారతి ప్రచురణలు. గిరింపేట. చిత్తూరు. ప్రథమముద్రణ. (1971)

17. రామకృష్ణయ్య. కోరాడ. దక్షిణదేశ భాషాసారస్వతములు - దేశి. కోరాడ ప్రచురణాలయము. మద్రాసు. (1954)

18. వేంకటావధాని, దివాకర్ల. ప్రాఙ్నన్నయ యుగము.

19. సంపత్కుమార. తెలుగు ఛందోవికాసము. కులపతిసమితి. వరంగల్లు. (1962)

20. సంపత్కుమార, 'తెలుగు కన్నడ ఛందోరీతులు. ఏకత్వములోని భిన్నత్వము. భారతి—సంపుటము-52. సంచిక-1. (1975)

21. సుందరం, ఆర్వీయస్. తెలుగు సాహిత్యములో దేశికవిత. మానవ వికాస ప్రచురణలు, నెల్లూరు (1970).

ENGLISH :

1. Anujan, O. M. Malayalam and Tamil Metres. A comparative study. Dravidian Linguistic Association seminar paper on Metre (1974)

2. Chidambaranadha Chettiar, A. *Advanced studies in Tamil prosody* (1949).

3. Domodaram, G. 'Commonness in the Metres of Tamil and Telugu—Dravidian Linguistic Association seminar papers on Metre, (1974)

4. Kodandaramaiah, T. 'The commonness in the Metre of Tamil and Telugu'. Dravidian Linguistic Association seminar papers on Metre (1974).

5. Meenakshi Sundaram, T. P. *History of Tamil Literature*. Annamalai University, Annamalai Nagar (1965)
6. Nagaiah, G. 'Commonfeatures of Desi Metre in Kannada and Telugu'. Dravidian Linguistic Association seminar paper on Metre. (1974)
7. Parameswaran Nair, P. K. *History of Malayalam Literature*. (Transtated from the Malayalam to English by Vemiyoor, E.M J.). Sahitya Akadami, New Delhi. (1967)
8. Rajagopala Rao, Tekumalla. *Comparative prosody of the Dravidian Languages, part, I* (1913)
9. Ramachandra Dikshitar, V. R. *The Silappadikaram* Translation with an Introduction and Notes. Humphrey Milford Oxford University Press (1939).
10. Rice, E. P. *A History of Kanarese Literature* (1921).
11. Vaiyapuri Pillai, S, *History of Tamil Language and Literature (Beginning to 1000 A. D,)* New Century Book House, Madras (1956)
12. Venkatachalam, K. 'Commonness in the Metre of Tamil and Malayalam'. Dravidian Linguistic Association Seminar paper on Metre (1974)

KANNADA :

Nagavarma's Canarese Prosody, Ed. with an introduction by Kittel, F. Mangalore (1875).

3

# యక్షగానములు - ద్రావిడ దృశ్యరీతులు :

ఆంధ్ర కర్ణాట తమిళ దేశములందలి జనపదములలో యక్షగానము దేశి ప్రక్రియగ బహుళవ్యాప్తినొంది ప్రత్యేకశాఖగా ప్రవర్ధిల్లినది. 'యక్ష', 'గాన' ములు రెండును సంస్కృతపదములే అయినను యక్షగానముమాత్రము సంస్కృత సాహిత్య సంబంధికాదు. అది దేశి సాహిత్యప్రక్రియలలో తలమానికముగ పేర్కొనబడినది. యక్షగానము కేవలము గానప్రధానమైనదిగానే కాక ప్రదర్శన మున నృత్త నృత్యాత్మకమైనదిగా, రూపకోపయుక్తమైన రచనగా పరిణమించి ఒక సాహిత్యప్రక్రియగ వెలసినది. యక్షగానములు తెలుగునందేకాక కన్నడ తమిళ భాషలందును అనేకము వెలసినవి. యక్షగానమునకు ప్రతిరూపమగు కథకళి మల యాళమున ప్రసిద్ధిచెందినది. దక్షిణ భారత సాహిత్యములందలి యక్షగానముల చరి త్రను, వాని సామ్యవైషమ్యములను, యక్షగానములకు ఇతర దేశి, దృశ్య కళా రీతులతోడి సంబంధమును తులనాత్మకముగ పరిశీలించుట ప్రస్తుతవిషయము.

(1) యక్షులు - గానము :

యక్షులు దేవయోనులని పురాణములలో చెప్పబడినది. పిశాచాది దరదజాతు లలో చేరిన ఒక తెగవారని చారిత్రకపరిశోధకుల నిర్ణయము. బౌద్ధభిక్షువులని కొందరి భావము. బౌద్ధసాహిత్యమున 'యక్షులు' పీఠిప్రవర్తకులుగా, రక్షకులుగా పేర్కొనబడినారు. బౌద్ధశిల్పములందు యక్ష యక్షిణీ ద్వారపాలకప్రతిమలు కాన వచ్చును. క్రీస్తువెనుక ద్రవిడ, సింహళప్రాంతముల పరిపాలకముగనుండి అవత రించిన ఒక జాతియని కొందరి అభిప్రాయము.

" But we know from history and legends as testified to by the Rāmāyana and Mahāvamsa that the yaksas were one of the

early ruling tribes in ancient South India and ceylon, and died out some time before the commencement of the christian era."

—Adikka Lakkadia - Śilappadikaram - Notes, Page 214.

యక్షులు 'అక్షస్' (oxus) నదీప్రాంతమువారో, యచీ (yuchi) అను మంగోలుజాతివారో, జక్షర్టస్ (Jaxartes) ప్రాంతమువారో యైయుందురని కొన్ని అభిప్రాయములుకలవని సురవరం ప్రతాపరెడ్డిగారు ఆంధ్రుల సాంఘిక చరిత్ర (పుట 195) యందు తెల్పినారు. ఆయా ప్రాంతములందలి యక్షులకు యక్ష గానములతో సంబంధముండినట్లు నిర్ణయించుట చాలకష్టము.

వి. ఆర్. ఆర్. దీక్షితార్‌గారు యక్షులనువారు దేవయోనులేకాక మానవుల వలె భౌమజీవులై కూడ యుండెడివారని పేర్కొనినాడు.(1) దేవయోనియైన కుబే రుడు మానవునివలె భౌముడుగా జీవితము గడపినట్లు ఉత్తరరామాయణాదులలోని కథలనుబట్టి తెలియుచున్నది. కనుక ఇది సత్యసమ్మతముగానే యున్నది.

'యక్ష' శబ్దమునకు 'ఉత్సవము' (festivity) అను నర్థమును ఆడ్విగ్, గెల్డ్‌నర్ అను పాశ్చాత్యపండితులు చెప్పినారు. యక్షగానము ఒక ఉత్సవసమయ మున చేయబడు సంగీత గోష్ఠియని దీనినిబట్టి చెప్పవచ్చును. గానప్రియులైన యక్ష శబ్ద వాచ్యులతోనే యక్షగానమునకు సంబంధముండియుండును. యక్షులు ప్రయో గించు దృశ్యరూపములే యక్షగానములని చెప్పబడుచున్నది.

(2) యక్షరాత్రి :

'యక్షరాత్రి'కి యక్షగానమునకు సన్నిహితసంబంధమున్నట్లు కొందరు చెప్పుదురు. వాత్స్యాయనుని (క్రీ. పూ. 3, 4 శతాబ్దులు) కామసూత్రగ్రంథము (1-4-42) న 'యక్షరాత్రి' ఒక క్రీడావిశేషముగ చెప్పబడినది. హేమచంద్రుడు (క్రీ. శ. 1088-1172) దేశినామమాల (III—43) లో 'జక్ఖరత్తి' అను ప్రాకృత రూపమును గ్రహించి 'యక్షరాత్రి'కి 'దీపావళి' అని అర్థము చెప్పినాడు. దీపావళి దినముననే యక్షరాజైన కుబేరుడు బలిచక్రవర్తినుండి తన సంపదను తిరిగి పొందె నట. యక్షులు, నిధినిక్షేపముల కధిదేవతయగు లక్ష్మీదేవిని ఆ రాత్రి పూజించి, ఆటపాటలతో ఉల్లాసముగ గడపిరట. యక్షరాత్రిఉత్సవములలో యక్షులు చేసిన నృత్యగీతాదులకు యక్షగానమని పేరు వచ్చినదని చెప్పుదురు. కన్నడదేశమందలి

(1) A. I. O. C. Baroda Vol. (1933) Page 248.

దక్షిణ కెనరా మండలమునగల యక్షగానమేళమువారు, దీపావళినాడు తమ ఇష్ట దైవతముల ఆలయములందు తమ ప్రథమ ప్రదర్శనమును ప్రదర్శించు సంప్రదాయము నేటికిని కలదు. మందర్తి, మర్ణకట్టె, కటిల్, ధర్మస్థల మొదలయినవి అట్టి యక్షగానమేళములుగల దేవాయతనములని ఎమ్. గోవిందరావుగారు తెల్పినారు.(2) కాని వాఙ్మయమనికాలమున కన్నడదేశమున కాని, మరి యెచ్చటను కాని యక్షగానములున్నట్లు ఆధారములు లేవు. కనుక 'యక్షరాత్రి' యక్షగానోత్పత్తిని సమర్థించునని చెప్పలేము.

(3) యక్షగానావతరణము :

యక్షరాత్రి, బౌద్ధయక్షులు మొదలగువానితో యక్షగానమున కేదైన సంబంధమును స్థిరపరుపగల్గినచో యక్షగానచరిత్ర అతి ప్రాచీనమని చెప్పవచ్చును. కాని అట్టి సంబంధమును స్థాపించుటకు తగిన ఆధారములు ఇప్పటికి లభించలేదు. లభించిన ఆధారములనుబట్టి యక్షగానచరిత్ర అంత ప్రాచీనము కాదనియే చెప్పవలసివచ్చును. కాని కన్నడపండితులు కొందరు యక్షగానరచన ప్రాచీనమైనదనియే భావించుచున్నారు. " Kannada scholars are of the opinion that as early as the 9th century A. D. this kind of Composition could be traced. They suggest that 'chattana'. 'Nalpagarana' etc. mentioned in kavirajamarga of Nripatunga (814-817 A. D.) are nothing but yakshagana works " అని యమ్. గోవిందరావుగారు వ్రాసినారు. కన్నడమున లభించిన మొదటి లక్షణగ్రంథమగు కవిరాజమార్గమున పేర్కొనబడిన చత్తాణాదులకు లక్ష్యము లిపుడు కానరాకున్నను వానికి లక్షణములు మాత్రము కవిరాజమార్గమున చెప్పబడినవి. ఒక కందము, తరువాత ఒక వృత్తము చొప్పున రచించుచు అందందు జాతులను పొదిగినచో అది 'బెదండె' కావ్యమగును. పలు కందపద్యములతో అందమైన వృత్తములను, అక్కర చౌపది, గీతికె, త్రిపది మొదలగువానిని అందముగా అనుసంధించినచో అది 'చత్తాణ' కావ్యమగును. ఈ బెదండె, చత్తాణములందు రెండింటను కందపద్యము ప్రాధాన్యము వహించును. వృత్తములు, అక్కరాదిజాతులుకూడ అందు ఉపయోగింపబడును. పురుషులు పాడు యక్షగానములవంటి రచనలు 'బెదండె' అనియు, స్త్రీలు పాడు శోభనగీతములవంటి పాటలు 'చత్తాణ' అనియు కవిరాజమార్గమునుబట్టి తెలియుచున్నది. కాని వేదుపలబ్ధములగు యక్షగానములలో కందములు, అందందు వృత్తములు, అక్క-

(2) A. O. R. University of Madras. Vol. X, Part II. 1952-53.

రాది జాతిపద్యములలో కొన్ని కలవు. అందు 'అక్కర' పద్యము లసలు లేవు. బెదండె, చత్తాణ కావ్యలక్షణములందు పేర్కొనబడని రగడవికారములగు తాళ ప్రధానములగు రేకులు, ద్విపదలు, వచనములు, పదములు, అర్ధచంద్రికలు, షట్పదులు, ధవళశోభనములు మొదలగు రచనావిశేషములే యక్షగానములందు ఎక్కువగా నున్నవి. కనుక బెదండె. చత్తాణములు సామాన్య నిర్వచన పద్యకావ్యములై యుండును, కాని యక్షగాన రచనలవంటివి కావని తోచును.

కవిరాజమార్గమున పేర్కొనబడిన 'వాళ్‌పగరణములు' కూడ యక్షగానములేయని నిష్కర్షగా చెప్పలేము. నాళ్ లేక నాడు - అనగా దేశము. 'పగరణ' లేక ప్రకరణము అనగా దేశీయరూపకమని చెప్పవచ్చును. ఇందు క్లిష్ట కల్పనాదులు దోషములని, గ్రామ్యాశ్లీలభాషణములు హాస్యరసభాజనములగుటచే నవి దోషము లనిపించుకొనవనియు కవిరాజమార్గము (1 ఆశ్వా. 66-68 ప) న కలదు. ఈ లక్షణములు సామాన్యజనామోదకములగు దేశిరూపకము లన్నిటికి తగియున్నవి. ప్రత్యేకముగా యక్షగానములకే వర్తించునని చెప్పుటకు వీలులేదు.

కన్నడ కవిరాజమార్గము (1-36) న కావేరినుండి గోదావరివరకుగల దేశము కన్నడదేశముగా పేర్కొనబడినది, కనుక కవిరాజమార్గములో పేర్కొనబడిన గేయనాట్యములు క్రీస్తుశకము 9 వ శతాబ్దమున ఆంధ్రదేశములోకూడ ప్రచారములో నున్నట్లు భావింపవచ్చును.

కన్నడ 'ఛందోంబుధి' (1-47) అను మరొక లక్షణగ్రంథములో అక్కర, చౌపది, గీతికె, ఏల, ఉత్సాహ మొదలైన ఆనాటికి ప్రసిద్ధములైన జాతీయగీతి ఛ్ఛందోవిశేషములుగా పేర్కొనబడినవి. 'రఘటా' ఛందమును వేర్వేరుమాత్రలలో పేర్చి విల్చి రచించిన వేర్వేరు తాళగతుల కనుకూలమైన గేయములు రూపొందునని నాగవర్మ (క్రీ. శ. 1145) కావ్యావలోకనము (సూత్రం. 222) లో తెల్పినాడు. పాడుకొనుట కనుకూలించు రచనలు కనుక వీనికి 'పాడుగబ్బ' అని పేరు. నాటకములలోను, నృత్యములలోను తాళ లయానుగుణ్యముగ అభినయించుట కనుకూలించు మరొకరకమైన రచనలను 'బాజనెగబ్బ' అని నాగవర్మ వ్యవహరించినాడు. ఈ 'బాజనెగబ్బ' లో పాటలు, పద్యములు, వచనములు మొదలయినవి యుండునని, యథానుకూలముగా నగర, ఋతు, వన, పర్వతాది వర్ణనలకుకూడ ప్రవేశముండునని, ముఖ, ప్రతిముఖాది నాటకసంధులుకూడ ప్రయోగింపబడునని నాగవర్మ కన్నడ కావ్యావలోకనము (సూత్రాలు. 245-249) నందు

తెల్పినాడు. ఈ 'పాడుగబ్బా'. 'బాజనగబ్బా'లు కన్నడదేశమున సంగీత నాట్య కళలకు అనాడుగల ప్రాముఖ్యమును చాటుచున్నవి.

పాల్కురికి సోమనాథుడు (క్రీ. శ. 1160-1240) పండితారాధ్యచరిత్రలో సమకాలికములు, పూర్వకాలికములు నగు పాటల ఫక్కికలను ఉత్సవాదులలో ప్రదర్శింపబడు దేశిదృశ్యరీతులను ఆహార్యాదులతోపాటు పట్టికలుగా ఏకరువు పెట్టినాడు.

'భరతోక్తి నేలలు పాడెడువారు, నరుదండజింపుల నాడెడువారు' (పండితారాధ్యచరిత్ర, పర్వతప్రకరణము-పుట 366). 'లీల నమ్మాడిక్కి గేళికలు సేయుచును' (పం. చ. పుట 305) 'కోడంగియాటల గునిసెడువారు ......ప్రథమ పురాతన పటుచరిత్రములు. గ్రమమొంద బహునాటకములాడువారు, లలితాంగరస కళాలంకారరేఖ. లలవడ బహురూపమాడెడువారు, సమరాంగనలు దవినాడెడుమాడ్కి, సమరంగ గడలపై నాడెడువారు, నావియద్గతిఁ బిషులాడెడునట్టి, భాసన్మహాకులపై నాడువారు, భారతాదికథలఁ జీరమఱుఁగుల నారంగబొమ్మల నాడించువారుఁ, గడు నద్భుతంబుగఁ గంబసూత్రంబు, లడరంగ బొమ్మల నాడించువారు, నాటగంధర్వ యక్ష విద్యాధరాదులై పాడెడు నాడెడువారు' (పండితారాధ్యచరిత్ర, పర్వతప్రకరణము-పుటలు 435-436).

ఇందు బయలాటలు, బొమ్మలాటలు, తోలుబొమ్మలాటలు, పెద్దంగము, ఏలలు, దాసరుల చిందులు, గంతులు, కేళికలు మొదలగు దేశిరీతులు పేర్కొనబడినవి. పలువురు యాత్రికులు చేరు పుణ్యక్షేత్రములందో, ముఖ్యనగర వీథులందో, ఉత్సవములందో యక్షభూమికలను ధరించి, గాననృత్యములను ప్రదర్శించి, ప్రజలకు వినోదము కల్గించి, జీవించుట వృత్తిగా గలవారు, కొందరు పాల్కురికి సోమనాథుని కాలమునాటికే తెలుగుదేశమునం దుండియున్నట్లు పైవి పేర్కొనినవానిని బట్టి యూహింపవచ్చును. పాల్కురికి సోమనాథుడు యక్షగానమును ప్రత్యేకముగా ఆ పేరుతో పేర్కొనకపోవుటచే అతనికాలమునకు ఆ ప్రక్రియకు ఆ పేరు సిద్ధింపలేదనియో, యక్షగానము ఒక విశిష్ట సాహిత్యప్రక్రియగా అప్పటికి రూపొందలేదనియో భావింపవచ్చును.

కన్నడవాఙ్మయమున యక్షుల గానాభినయ కళానుబంధమునుగురించి ముట్నూరి సంగమేశంగారు 'కన్నడ యక్షగానములు' అను వ్యాసమునందు వివరముగా తెల్పినారు. యక్షశబ్దమునకు తెలుగు కన్నడభాషలు రెండింటిలోను 'జక్క-'

శబ్దము తద్భవముగా వాడబడుచున్నది. ఈ 'జక్క' శబ్దము నేటికిని ఒకానొక జాతిజనులకు నియతాభిదానముగా పేర్కొనబడుచున్నది. శార్ఙ్గదేవుని (క్రీ. శ. 1210-1247) సంగీతరత్నాకరమునందును 'జక్క' శబ్దము ప్రయోగింపబడినది.

తెలుగుసాహిత్యమున జక్కుల పురంధ్రులపాటలు ప్రస్తావింపబడినట్లుగానే కన్నడసాహిత్యములో 'ఎక్కలగాణ'ల నృత్యగానములు పలుచోట్ల ప్రస్తావింపబడినవి. అగ్గళుడు (క్రీ శ. 1105) రచించిన చంద్రప్రభా పురాణము (7 ఆ. 96 వ.) లో వనవిహారము చేయుచున్న నాయకుడు, మేళతాళము లక్కరలేకుండా, దేశీయగీత మొకదానిని ఒక 'ఎక్కలగాణ' యింపుగా పాడుచుండగా విన్నట్లు వర్ణింపబడినది. అభినవపంపడను నాగచంద్రుని (క్రీ. శ. 1187) మల్లినాథపురాణము (8 ఆ. 98 ప.) లో కమలామోదియైన తుమ్మెద ఝుంకారము కమలాలయయైన లక్ష్మిని కీర్తించుచు పాడు 'ఎక్కల' గానముతో పోల్చి వర్ణింపబడినది. రత్నాకరవర్ణి (క్రీ. శ. 16 వ శతాబ్ది) వ్రాసిన భరతేశవైభవము (చూ. ఆస్థాన సంధి-పద్యం 58) లో వెనుక పాటకులతోడను, మేళతాళములతోడను 'ఎక్కడిగలు' (Musicians) నాట్యమాడినట్లు వర్ణింపబడినది. రత్నాకరవర్ణి, కన్నడ యక్షగానములకు విశేషవ్యాప్తిగల దక్షిణకెనరా మండలమునకు చెందినవాడు. 'ఎక్కల', 'ఎక్కడిగ' 'జక్క' అను శబ్దముల అర్థవిషయములో పండితులలో అభిప్రాయభేదము లున్నవి. సంస్కృతములోని 'ఏక' అను పదమునుండి ఇవి నిష్పన్నమైయుండునని కొందరు చెప్పుదురు. కాని భరతేశవైభవమునందు ఒకరు కాక పలువురు ఎక్కడిగలు నాట్యమాడినట్లు వర్ణింపబడియుండుటచే ఈ అభిప్రాయము సరికాదు.

కన్నడములో పైని పేర్కొనిన అంశములనుబట్టి ఈ ఎక్కలగాణలు, తెలుగు జక్కుల పాటకులవలెనే జానపదగాయకులని, లక్ష్మీప్రసక్తిని వర్ణించుట వారికికూడ కులాచారమని, నృత్యముకూడ వా రెరుగుదురని, అందులో హంగుదారుల ఆలోపముకూడ వారి కవసరమేనని బోధపడును. మేళతాళములతో నిమిత్తములేని 'ఎక్కలగాణ'ల జాతీయగీతాలాపమే యక్షగానావతరణమునకు ప్రాతిపదికయైనదనియు, ఎక్కలగాణము దేవతాస్తుత్యాత్మకమైనదనియు చెప్పవచ్చును.

పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రలోని యక్షాది నేపథ్యముల తోడి ఆటపాటలప్రసక్తిని, కన్నడ వాఙ్మయములోని అగ్గళుని చంద్రప్రభాపురాణము అభినవపంపని మల్లినాథపురాణములందలి 'ఎక్కలగాణ'ల ప్రసక్తినిబట్టి పరిశీలిం

చినచో యక్షగానచరిత్ర తెలుగు కన్నడ దేశములందు క్రీ. శ. 12 వ శతాబ్దినాటికే వ్యాప్తియందున్నట్లు తెలియును.

విస్సా అప్పారావుగారు 'ఆంధ్రుల నాట్యకళ - కూచిపూడి కళావైభవము' అను వ్యాసము (3) నందు 'కులోత్తుంగ చోళదేవుని శాసనములో నట్టువమేళముల వారు యక్షగానముల నాడిరని యున్నది' అని వ్రాసినారు. చోళరాజులలో క్రీ. శ. 11-13 శతాబ్దులనడుమ కులోత్తుంగ చోళనామధేయులు పలువురున్నారని (చూ. స్యూయలు-దక్షిణ హిందూదేశశాసనములు). అందెవరి శాసనమునందును యక్ష గానశబ్దము కానరాదని, చోళరాజుల శాసనములలో (154 ఆఫ్ 1895, 120 ఆఫ్ 1925) కానవచ్చు 'అరియకూత్తు' నే విస్సా అప్పారావుగారు యక్షగాన మనుకొని రేమో అని డాక్టర్ యస్వీ జోగారావుగారు 'ఆంధ్ర యక్షగాన వాఙ్మయచరిత్ర' (ప్రథమభాగము. పుట 94, Foot notes) లో వ్రాసినారు.

(4) యక్షగానము - గానశైలి :

ఇప్పటికి లభించినంతవరకు తెలుగులో 'యక్షగానమనెడి సమస్తపదమును ప్రయోగించినవారిలో ప్రథముడు శ్రీనాథుడు (క్రీ. శ. 1381-1446). అతడు భీమేశ్వరపురాణము (3-65) న 'కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు గాంధర్వమున యక్షగాన సరణి' అని పేర్కొనినాడు. దీనినిబట్టి యక్షగానము ఒకవిధమగు గాన ఫణితి అనుట స్పష్టము.

నేపాలు (=జాఫ్నా) దేశమున జగజ్జ్యోతిర్మల్లనికాలమున (క్రీ.శ. 1617-1633) గాంధర్వగానమని యక్షగానపు పోలికలుగల నాటకము లుండినవని పరిశోధ కులు నిర్ణయించినారు. గోవిందదీక్షితుడు (క్రీ. శ. 1614-1673) తన సంగీత సుధ (4) లో 'యక్షాశ్చనాగా అపి కిన్నరాశ్చ గాంధర్వముఖ్యా అపి గానలోలాః' అని గంధర్వాదులతోపాటు యక్షులును గానలోలురని చెప్పబడినది. 'యక్షౌఘ గీతామ్ అపి గానశైలిమ్' - యక్షులచే గానము చేయబడునది యక్షగానమని 'సంగీతసుధ' లో వివరింపబడినది. ఆంజనేయవిరచితమని చెప్పబడు ఒక ప్రాచీన సంగీతగ్రంథమునందు యక్షుల గానశైలిప్రశంస కలదని సంగీతసుధలో సూచింప బడినది. కాని ఆంజనేయ విరచితమగు సంగీతగ్రంథము నేడు లభింపలేదు.

---

3. ఇది విజయవాడ శ్రీ కనకదుర్గా కళాసమితి తృతీయ వార్షికోత్సవసంచికలో ప్రచు రితము-1954 సం.

(4) Published in the Journal of Music Akademi. Madras-Vol I (1930).

కన్నడములో క్రీ. శ. 17 వ శతాబ్దికి చెందిన రుక్మిణీ స్వయంవరమను యక్షగానము (కవిపేరు తెలియదు) నందు గాంధారగానము పేర్కొనబడినదని కె. వి. కారంత్‌గారు 'yakṣaganā' (పుట 64) అను గ్రంథమునందు తెల్పి నాడు. గాంధార గ్రామమను గానశైలి ఒకటి మనదేశమున వ్యాప్తిలో నున్నది. గంధర్వపదము ఆఫ్‌గనిస్తాన్‌లోని గాంధారనుండి యేర్పడినదని కొందరు చెప్పు దురు. Herbert poplay అను నతడు ప్రాచీన మధ్యమగ్రామ అను గానశైలి నుండి కర్ణాటకసంగీతమును, షడ్జగ్రామమను గానశైలినుండి హిందూస్థానీ సంగీత మును యేర్పడినట్లు తెల్పినాడు. గంధర్వగానము హిందూస్థానీ, కర్ణాటకి సంగీత ములకంటె భిన్నమయినది. ఈ గాంధారగ్రామమను గానశైలిలో రచింపబడిన దృశ్యరీతులకే యక్షగానప్రసంగము లనుపేరు యేర్పడినట్లు కొందరు చెప్పుదురు. ఈ అంశములనుబట్టి యక్షగానము ఒకవిధమగు ప్రత్యేకగానశైలి అని ప్రాచీన కాలముననే గుర్తింపబడియున్నట్లు తెలియుచున్నది.

(5) యక్షగానము - జక్కుల జాతిసంబంధము :

యక్షశబ్దమునకు వికృతియే 'జక్కు'. యక్షగానమునకు జక్కులకుగల సంబంధమును పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు 'యక్షగానములు (జక్కుల పాటలు)' అను వ్యాసము(5) నం దిట్లు విరూపించియున్నారు. 'ఆంధ్రదేశము నందలి వివేకఘనులగు ప్రాచీన జాతులవారిలో జక్కులు. బవినీలు మున్నగువారు మిక్కిలి ప్రాచీనులు....... ఆంధ్రదేశమునందు ప్రాచీన కళాకౌశల్యమును వెలువ రింపఁజాలిన స్మరణచిహ్నము లేవైన వాఙ్మయరూపమున నున్నవని మనము తలంతుమేని అయ్యది జక్కుల పాటలును, జక్కుల యాటలును, జక్కుల చిత్ర కళాకౌశలములునుమాత్రమే యగును గాని వేఱుకావు...............యక్షగానములు అనగా ఆ కాలములోని జక్కులపాటలే అవియును, ఆ కాలమందు పర్వదినము లలో సంతానకాంక్షులగు శ్రీమంతులు శుభార్థులయి జక్కులను బిలిపించి వారిచేతఁ బాటలఁ బాడించు నాచారముండెననియు తెలియుచున్నది.'

జక్కులవారికి నాట్యకళతో సంబంధముండినట్లు E. Thurston-'castes and Tribes of South India.' Part II. (P. 438) అను గ్రంథములోని ఈ క్రింది వాక్యములనుబట్టి తెలియుచున్నవి.

5. ఆంధ్రపత్రిక - దుర్మతి సంవత్సరాది సంచిక (1921)

"Jakkula - Described as an inferior caste of Prostitutes, mostly of the Balija caste; and as wizards and a dancing and theatrical caste."

జక్కులజాతి ఒకప్పుడు యక్షగానప్రదర్శనమును ప్రధానవృత్తిగా అవలంబించిన జాతి అని, వారివృత్తికి సంబంధించిన 'యక్ష' శబ్దము క్రమముగా వారికి జాతివాచకముగా పరిణమించియుండునని భావింపవచ్చును. యక్షగానములను ప్రయోగించుట కారణముగనే ఆ తెగవారికి 'యక్షులు' - 'జక్కులు' అను పేరు వచ్చినది.

రాయలసీమలోని 'జక్కసానికుంట్ల' (పత్తికొండ తాలూకా). జక్కుల చెఱువు (గుత్తి తాలూకా). జక్కుల చెఱువు (హిందూపురము తాలూకా). జక్కసముద్రము (హిందూపురము తాలూకా). జక్కలాదికి (బళ్లారి జిల్లా) అను గ్రామములు జక్కులవారికి ఇనాములుగ నొసగబడిన గ్రామములని ప్రతీతి కలదు. 'జక్కుల కథ' లను గేయరచనలు జనసామాన్యమున నేటికిని కలవు. జక్కుల కన్నాయి యను నామె 9-7-1481 సంవత్సరమున తిరుమల దేవస్థానమున వేయించిన శాసన మొకటి కలదు. (తిరుమల దేవస్థానము శాసనములు - ద్వితీయ సంపుటి నెం. 77)

## (6) కన్నడ యక్షాందోళనము :

అభినవపంపని (క్రీ. శ. 1187) మల్లినాథ పురాణములో 'యక్షాందోళన' మను నృత్యము ప్రసక్తమయినది. ఈ ఆందోళికా నృత్యమునుగురించి ముట్నూరి సంగమేశంగారు 'కన్నడ యక్షగానములు' అను వ్యాసమునం దిట్లు తెల్పినారు. "కన్నడ యక్షగానాల్లో నటివేషాన్ని యక్షిణీవేషమనీ, శ్రీ వేషమనీ, మోహినీ వేషమనీ పరివరివిధాల పిలుస్తారు. ఈమె మొదటిసారి రంగస్థలానికి వచ్చినపుడు నడుమువరకు ఆట్టతో కట్టిన ఒక తొట్టెవంటి చౌకంలో నిల్చి నృత్యగతులు ప్రదర్శిస్తుంది. ఈ నృత్యాన్ని ఆందోళికానృత్యమనీ, మంచెచప్పర నృత్యమనీ పిలుస్తారు" ఈ యక్షిణీవేషము నృత్యమే జక్కిణియై యుండును. యక్షగానమునకు యక్షాందోళనమునకు కొంత సంబంధమున్న ట్లూహింపబడుచున్నది. క్రీ. శ. 12 వ శతాబ్దినాటికే యక్షగానమునకు నృత్యకళాసాహచర్యము కల్గినదని చెప్పవచ్చును. కన్నడ యక్షగాన నాట్యప్రదర్శనలలో 'యక్షిణీవేషము, ఆందోళికానృత్యమును

నేటికివి ప్రదర్శిస్తున్నందువలన గానములోవలెనే నాట్యమునకూడ యక్ష లది ఒక ప్రత్యేకసంప్రదాయమని ఊహింపవచ్చును.

క్రీడాభిరామము (క్రీ. శ. 15 వ శతాబ్ది) న 'జక్కులపురంధ్రి' గానకళా ప్రావీణ్యము విశేషముగా నిట్లు ప్రకంపింపబడినది.

'కోణాగ్ర సంఘర్ష ఘుమఘుమధ్వని తార
కంఠస్వరంబుతో గారవింప
మసిబొట్టు బోనాన నసలుకొల్పిన కన్ను
కొదువుచేఁ దాటించు నెడవ దడప
శ్రుతికి నుత్కర్షంబుఁ జూపంగవలయుచోఁ
జెవిత్రాడు బిగియించు జీవగట్టి
గిల్కుగిల్కునమ్రోయు కింకిణీగుచ్ఛంబు
తాళమానంబుతో మేళవింప

రాగమునసుండి లంఘించు రాగమునకు
నురుమయూరుద్వయంబుపై నొత్తిగిల్లి
కామవల్లీ మహాలక్ష్మి కైటభారి
వలపు వాడుచువచ్చె జక్కులపురంధ్రి.'

—క్రీడాభిరామము—ప. 136.

జక్కులకే యక్షులని సంస్కృతీకరణరూపము. జక్కులను నట్టువజాతిపడచులే 'యక్షకన్య'లని క్రీడాభిరామమున వర్ణింపబడిరి. 'అక్కదేవతలు' (అక్కలు) అనెడు ఏడుగురు 'యాక్షకన్య'లను, అందు ముఖ్యముగా కామేశ్వరి (కామవల్లి)ని ఆరాధించెడువారు. ఆంధ్రదేశములో నేటికిని అన్నివర్ణములవారిలోను కలరని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు క్రీడాభిరామ పీఠిక (పుటలు 103) యందు తెల్పినారు. 'యక్షకన్యల' నృత్యప్రదర్శనముకూడ క్రీడాభిరామము (ప. 138) న ప్రసక్తమయినది.

'హరహర యింత యొప్పునె మహోరభటీజగరుంఝృత స్వన
మ్మరశి విమిశ్రితాంకరవ మూర్ఛలఁ జిత్తముఁబ్బి యక్క లే
ద్మ్వరు నదె యాడఁజొచ్చిరి కడుంగడు వేడ్కసమున్న మత్పయో
ధరయుగభార భీరుతమ తన్వవలగ్నములైన నృత్యముల్.'

జక్కులరేకు లనుపదములు. 'జక్కిణి' అను నృత్యవిశేషము జక్కులపురంధ్రుల పేరనే ప్రసిద్ధమునై యుండవచ్చును. యక్షిణీశబ్ద వికృతియే జక్కిణి. అయ్యలరాజు రామభద్రకవి రామాభ్యుదయము, తరిగొప్పుల మల్లన చంద్రభానుచరిత్ర, కంకంటి పాపరాజు ఉత్తరరామాయణము, కాకమాని మూర్తికవి పాంచాలీ పరిణయము మొదలయిన ప్రబంధములందు 'జక్కిణి' ఒక నాట్యభేదముగా పేర్కొనబడినది. విజయరాఘవ నాయకుని రఘునాథ నాయకాభ్యుదయము, ప్రహ్లాదచరిత్రలను యక్షగానములనుబట్టియు, చెంగల్వకాళకవి రచించిన రాజగోపాలవిలాస ప్రబంధమునుబట్టియు, తంజాపురాంధ్రనాయక రాజాస్థానమున 'జక్కిణి నాట్యగోష్ఠి' జరుగుచుండినట్లు తెలియుచున్నది. జక్కుల రంగసాని పదకేళిక ప్రసక్తి తంజాపురాన్నదాన నాటకమున కలదు. 'జక్కిణి' ఒక వర్ణవిశేషముగాకూడ వెన్నెలకంటి సూరన (క్రీ. శ. 1500_1550) విష్ణుపురాణము (7-277) న పేర్కొనబడినది. శహాజీ (క్రీ. శ. 1684-1712) రచితమగు త్యాగవినోద చిత్రప్రబంధమునందును, విజయరంగ చొక్కనాథుని (క్రీ. శ. 1706-1732) ఆస్థానాశ్రితుడగు తిరుమలకవి రచించిన చిత్రకూటమాహాత్మ్యమునందును జక్కిణిదరువు లుదాహరింపబడినవి. ఇట్లు తెలుగుప్రబంధములందు నాట్యప్రభేదమును, నాట్యోపయోగియైన గీతిప్రబంధవిశేషముగ 'జక్కిణి' ప్రయోగింపబడినది. చరిగొండ ధర్మన (క్రీ శ. 16 వ శతాబ్ది) తన చిత్రభారతము (4-80) న తాళసంఘ ప్రభేదంబుల గతులచే యక్షకామినులు నాట్యంబులాడి' అనుచోట 'యక్షకామినుల నాట్యము'ను, అందే మరొకచోట (7-26) 'మంగళమస్తు రమానాథయని యక్షవనితలు కర్ణపర్వముగఁబాడ' అనుచోట యక్షవనితలపాటలను ప్రత్యేకముగా పేర్కొనినాడు. తెలుగు ప్రబంధములందు పేర్కొనబడిన జక్కిణికిని యక్షగానమునకు సంబంధముండియుండును.

యక్షపాత్ర వేషధారణము ఒక వృత్తిగా నవలంబించినవారని చెప్పదగిన ఎక్కలగాణల, జక్కులపురంధ్రుల గానప్రధాన వినోదక్రీడలే యక్షగానోత్పత్తికి కారణమైయుండునని నిశ్చయింపవచ్చును. 'యక్ష' శబ్దమునకు 'జక్క', 'ఎక్క' అను రూపాంతరములే కాక 'అక్క' అను రూపవికృతినికూడ భాషాశాస్త్రజ్ఞు లంగీకరించినారు.

## (7) యక్షగాన ప్రాథమికస్వరూపము :

తాళ్ళపాక అన్నమాచార్యుడు (క్రీ. శ. 1408-1503) సంస్కృతములో

రచించిన 'సంకీర్తనలక్షణ'మను గ్రంథమును అతని మనుమడగు తాళ్ళపాక చిన్నన్న (క్రీ. శ. 1537) తెలుగులోనికి అనువదించినాడు. (6) అందు దరువులు, జక్కుల రేకులు, ఏలలు, చందమామలు, చౌపదలు మొదలయినవి పేర్కొనబడినవి. వీనిలో కొన్నిటికి లక్షణములుకూడ విస్తరింపబడినవి. యక్షగానపదములను గూర్చి సంకీర్తనలక్షణగ్రంథము (ప. 66) నం దిట్లు చెప్పబడినది.

'యక్షగానపదంబులు నవ్విధమున
సముచితానేకవిధ తాళ సంగతులను
నవరసాలంక్రియా సవర్ణంబులగుచు
నలరునవి హాటకీర్తనా చార్యవరుఁడపియె.'

తాళ బహుళములును, నవరసాలంకృతములునైన పలువిధములగు పదములతో కూడినవి యక్షగానములని దీనినిబట్టి స్పష్టమగుచున్నది.

ప్రాచీన తెలుగు లాక్షణికు లెవ్వరును యక్షగానమున కిదమిత్థమగు లక్షణ నిర్వచనము చేయలేదు. చిత్రకవి పెద్దన (క్రీ. శ. 16 వ శతాబ్ది పూర్వార్ధము) లక్షణసారసంగ్రహము (2-411) న త్రిపుటరేకు, జంపెరేకు, రచ్చరేకు, అట తాళము మున్నగువానిని పేర్కొని 'యక్షగానాదికృతులలో నార్యులిడిన రగడ భేదంబు లివియౌ' నని చెప్పినాడు. ఇందలి 'ఆర్యులిడిన' అను ప్రయోగమును బట్టి యక్షగానము చిత్రకవి పెద్దనకు చాల ప్రాచీనకాలముననే వ్యాప్తిలో నుండి యుండునని భావింపవచ్చును.

ప్రోలుగంటి చెన్నశౌరి సాళువ నరసింహరాయల (క్రీ. శ. 1485-1491) కాలమువాడు. విజయనగరమును పరిపాలించిన వీరనరసింహరాయలు (క్రీ. శ. 1506-1509) కూడ ప్రోలుగంటి చెన్నశౌరిని అగ్రహారాదులచే సత్కరించెనట (7) ప్రోలుగంటి చెన్నశౌరి 'లాలిత నవరసాలంకృతముగ', 'సౌభరిచరిత' మను 'జక్కుల కథ' ను చెప్పినట్లు హరిభట్టు ఉత్తర నారసింహ పురాణావతారిక (ప. 33) వలనబట్టి తెలియుచున్నది. ఈ సౌభరిచరిత్ర నేడు ఎచట దాగియున్నదో! తాళ్ళపాక చిన్నన్న 'సంకీర్తనలక్షణము' లో చెప్పిన యక్షగానమట్లు ఈ సౌభరిచరిత్ర 'నవ

6. చూ. తాళ్ళపాకకవి కుటుంబకృతి సముచ్చయము-సం. 1. తిరుపతి దేవస్థానము ప్రచురణ (1935)

7. డా॥ నేలటూరి వేంకటరమణయ్య- 'తంజావూరు - యక్షగానము' - ఖర ఉగాది ఆంధ్రపత్రిక.

రసాలంకృతముగ రచింపబడినదని పేర్కొనుట గమనింపదగిన విశేషము. 'సౌభరిచరిత్ర' మను 'జక్కులకథ'ను యక్షగానమని భావించినచో యక్షగానరచన తెలుగున క్రీ. శ. 1500 ప్రాంతముననే వ్యాప్తిహొందినదని చెప్పవచ్చును.

వెల్లంకి తాతంభట్టు (క్రీ. శ. 1 00) కవిలోక చింతామణిలో నుదాహరించిన 'లక్ష్మీకల్యాణము' యక్షగానమైయుండునని డాక్టర్ యస్వీ జోగారావుగారు తలంచినారు. (8) ఈ లక్ష్మీకల్యాణముకూడ లభింపలేదు.

పైని పేర్కొనిన యక్షగాన లక్ష్యలక్షణములనుబట్టి తెలుగులో యక్షగాన రచన క్రీ. శ. 1450-1550 మధ్యకాలమున కొంత సాగినదని నిర్ణయింపవచ్చును.

'లక్షణదీపిక' అను ఒక ప్రాచీనలక్షణగ్రంథమునందు చతుర్విధ కవితారీతుల పరిగణన ప్రకరణమున:—

'యక్షగానంబులన్ వెలయు పదంబులు దరువులు
వేలలు, ధవళంబులు, మంగళహారతులు, శోభనంబులు
నుయ్యాల జోలలు జక్కులరేకు పదంబులు చందమామ
సుద్దులు అష్టకంబులు ఏకపద ద్విపద త్రిపద చతుష్పద
షట్పదాష్టపదులు నివి యాదిగాగల్గు నన్నియు లయ
ప్రమాణంబులనొప్పి మృదుమధుర వచన రచనల ప్రసి
ద్ధంబైన యవి మధుర కవిత్వంబులు.'

అని యున్నది. మధుర కవితా ముగ్ధహృదయులగు యక్షగానకవులు తమ రచనలలో పైని పేర్కొనిన మధుర కవితారీతులను వాడియున్నట్లు తెలియును.

అప్పకవి (క్రీ. శ. 1650) యక్షగానములందుపయుక్తములైన రగడభేదములను వివరించినాడు.

'తుదనేడు లఘువులు తొలఁగించి చదివినఁ
ద్రిపుటకు వృషభగతి పదయుగము
లలిఁగడపల నొక్క లఘువుమానిన జంపె
మను ద్విరదగతి సమపదయుగము
గురుతగు రచ్చరేకుఁ దురగవల్గ నా
హ్వయ. మేకతాళి యా మధురగతికి. (యతి ?)

8. ఆంధ్ర యక్షగానవాఙ్మయచరిత్ర - ప్రథమభాగము-పుట-105.

నంఘ్రి కీర్వది నాలు గటతాళమున మాత్ర
లోలి విశ్రాంతి పద్నాలుగింటఁ
దెలియ నర్థంబు నర్ధచంద్రికలు వీన
యక్షగాన ప్రబంధంబు లఱకవచ్చు
రగడభేదంబు లివియంద్రు రసఁగవీంద్రు
లలిత విజసేవక స్తోమ యద్రిధామ.'

—అప్పకవీయము - 4-303.

అంతియేకాక 'అంబికా వాదనామక యక్షగానకృతియుఁ జేసితిఁ గాకునూరి కుల యప్ప' (అప్పకవీయము. 4 ఆ. 304 వ.) అనుటనుబట్టి అంబికావాద' మను యక్షగానమును అప్పకవి రచించియున్నట్లు తెలియుచున్నది. అప్పకవి అంబికావాదము కూడ అలభ్యమే.

(8) తెలుగు యక్షగాన పరిణామచరిత్ర - మొదటిదశ :

గానాత్మకమై కేవలము గేయరూపమున నుండుట యక్షగానచరిత్రలో మొదటిదశ. ఇది దేశిచ్ఛందస్సులలోని విడివిడిపాటల సంపుటీకరణము కావచ్చును. లేదా కథనాత్మకము కావచ్చును. శ్రీనాథుని కాలమునాటికే తెలుగుదేశమున 'యక్షగానసరణి' కలదు. యక్షగానములకు సంబంధించిన గానాత్మకములగు మొదటి పాటలను 'జక్కులరేకు' లందురు. క్రీడాభిరామమున 'జక్కులపురంధ్రి పాట'తో పాటు, మాలెతలు ఏకవీరనుగురించి పాటలు పాడుట, బవనీలు పరశురాముని గూర్చిన పాటలు పాడుట, ఒక పూర్వసువాసిని విద్దికంచి (కూచిక) రామాయణ గానము, ఒకపడతి పల్నాటి వీరకథను పాడుట అనునవికూడ వర్ణితములయినవి. గానాత్మకములగు ఈ ఆరాధ్యదేవతల స్తుతులు, జాతీయవీరుల స్మృతులును యక్షగానచరిత్రలోని మొదటిదశకే చెందును. ఈ మొదటిదశలో పైని పేర్కొనిన యక్షగానకవుల అజ్ఞాతరచనలు ప్రాధాన్యము వహించియుండును.

తెలుగులోని తొలింతటి యక్షగానములలో వచనభాగము స్వల్పముగా నుండును. ఎడనెడ కథానుసంధానమున కుద్దిష్టములైన చిన్నచిన్న సంధివచనముల వంటివి గద్యములో నున్నవి. సూత్రధారుడుమాత్ర ముండడు. ఒక స్త్రీగాని, పురుషుడు కాని వీనిని గేయరూపమున హావభావములతో చదివి, పాడి వినిపించుచుండును. 'సౌభరిచరిత' మను 'జక్కులకథ' ఇట్లే రచింపబడియుండును.

యక్షగాన ప్రాథమికస్వరూపమును భీమేశ్వరపురాణోదాహరణమునుబట్టి గాన రూప స్తోత్ర పాఠమని, క్రీడాభిరామోదాహరణమునుబట్టి గాన రూప కథాఖ్యానమని నిర్ణయింపవచ్చును. కన్నడములోకూడ ఏ మేళతాళము లవసరము లేకుండ జానపదులు పాడుకొని కాలక్షేపము చేయుట కనువుగ రచింపబడిన యక్షగానములే మొదట వెలసినట్లు తెలియుచున్నది.

(8) తెలుగు యక్షగాన పరిణామచరిత్రలో ద్వితీయదశ :

యక్షగాన చరిత్రలో ద్వితీయదశకు చెందినవి సుగ్రీవవిజయాది యక్షగానములు. ఉపలభ్యములగు యక్షగానములలో కందుకూరి రుద్రకవి (క్రీ. శ. 16 వ శతాబ్ది) కృతమగు సుగ్రీవవిజయమే మొట్టమొదటిది. చక్రపురి రాఘవాచార్యుని కృతిగా నూహింపదగిన 'విప్రనారాయణ చరిత్ర' అను యక్షగానము సుగ్రీవ విజయముకంటె ప్రాచీనతరముగా గోచరించుచున్నదని, రెండింటియందును రచనా సామ్యము స్ఫుటముగా కానవచ్చుచున్నదని డా॥ యస్వీ జోగారావుగారు 'ఆంధ్ర యక్షగాన వాఙ్మయచరిత్ర' (ప్రథమభాగము-పుట 107) లో నూహించినారు. క్రీ. శ. 16 వ శతాబ్దిలో సుప్రసిద్ధులైన పలువురు కవులు యక్షగానరచనను చేపట్టినారు. వారిలో కందుకూరి రుద్రకవియే ప్రఖ్యాతుడు. అతని సుగ్రీవవిజయమునకే బహుళవ్యాప్తి కలదు.

సుగ్రీవవిజయ యక్షగానమందు తాళప్రభేద విశిష్టములగు రగడబంధము (రేకులు) లేకాక ద్విపదలు, అర్ధచంద్రికలు, ఏలలు, ధవళశోభనములు, కొలది పద్యములు, సంధివచనప్రాయములయిన చిన్నచిన్న వచనములును కన్పట్టును. సంవాదము పద్య-ద్విపద-గేయములతో జరుగుచుండును. పాత్రల సంభాషణలు వచనమున లేకపోయినను సుగ్రీవవిజయమున ఆఖ్యానశైలికంటె సంవాదశైలికే ప్రాధాన్యము కలదు. సంభాషణ లెక్కువగా దరువులలో సాగినవి. సంవాదాత్మకములగుటచేత పాత్ర సమారోపముతో, కొలదిమార్పులతో ఇవి నాటకమువలె ప్రదర్శనయోగ్యముగా నుండును. సుగ్రీవవిజయము జనార్దనదేవుని వసంతోత్సవ సమయమందు మొదట ప్రదర్శింపబడియుండెనని డా. నేలటూరి వేంకటరమణయ్యగారు తెల్పినారు.(9)

ప్రోలుగంటి వెంకటాద్రి వాసంతికాపరిణయము, బాల పాపాంబ అక్కమహాదేవి చరిత్ర, కంకంటి పాపరాజు విష్ణుమాయానాటకము, శేషమఖి రంగశాయి

9. 'యక్షగానము-తంజావూరు'—ఆంధ్రపత్రిక ఖర సంవత్సరాది సంచిక, పుట 21.

జానకీపరిణయము మొదలగునవి క్రీ. శ. 1600 ప్రాంతమున రచింపబడిన యక్షగానములలో ప్రధానముగ పేర్కొనదగినవి. ఈ యక్షగానములందు సుగ్రీవ విజయ రచనాప్రక్రియ గోచరించును. బాల పాపాంబ ప్రథమాంధ్ర యక్షగాన కవయిత్రి. క్రీ. శ. 16 వ శతాబ్దినాటికే యక్షగానరచన ప్రసిద్ధకవులనేకాక కవయిత్రులనుకూడ ఆకర్షించినదని చెప్పవచ్చును. తెలుగులో యక్షగానరచన ఇంచుమించు రెండు మూడు శతాబ్దములవరకు ఇట్లే కొనసాగినది.

ఈ ద్వితీయదశలో యక్షగానము సంవాదరూపము దాల్చినదని చెప్పవచ్చును. యక్షగానరచనలోని కవితాధోరణికి గంధర్వుల గాంధర్వము తోడయి కనకప్రసూనములకు చక్కని తావి అబ్బినట్లైనదని కట్టా వరదరాజు (క్రీ. శ. 1630) శ్రీరంగమాహాత్మ్యమునం దిట్లు తెల్పినాడు.

'కవితాధోరణి యక్షగానరచనల్ గంధర్వ గాంధర్వమున్
హవణింపం గనక ప్రసూనముల కత్యామోద సంపర్కమై
మివులన్ మెచ్చఁగఁజేసి శేఖరుల భూమిన్ సత్కళావంతులన్.'
భువనంబెల్లను ముంచె నద్భుత రసాంభోరాశి నుల్లాసియై.'

(10) యక్షగాన నాటకములు :

తెలుగు యక్షగానచరిత్రలో తృతీయదశ యక్షగానము వీథినాటకములతో అభేదమును చెందుట. ఈ మార్పు ప్రధానముగ క్రీ. శ. 17 వ శతాబ్దిలో తంజావూరి నాయకరాజులకాలములో వచ్చినదని చెప్పవచ్చును. యక్షగానమునకు పుట్టినిల్లు రాయలసీమయే అయినను అవి రాజభోగము, రంగభోగ మనుభవించినది మాత్రము తంజావూరు నాయకరాజుల ఏలుబడిలోనే.

రాజకవియగు రఘునాథనాయకుడు (క్రీ. శ. 1600-1633) జానకీపరిణయము, రుక్మిణీ కృష్ణ వివాహమను యక్షగానములను రచించినట్లు తెలియుచున్నది. కాని అతని యక్షగానములు లభ్యము కాలేదు. రఘునాథనాయకుని కుమారుడగు విజయరాఘవుని రాజ్యకాలమున (క్రీ. శ. 1633-1673) యక్షగాన ప్రతిష్ఠ మిన్నుముట్టినది. విజయరాఘవుడు 23 నాటకములను రచించినట్లు ప్రహ్లాద చరిత్ర పీఠికలోని పద్యమునుబట్టి తెలియుచున్నది. వానిలో కాళియమర్దనం, కృష్ణ విలాసం, విప్రనారాయణ, రఘునాథాభ్యుదయం, పూతనహరణం, ప్రహ్లాదచరిత్ర అను ఆరు యక్షగాననాటకములే ముద్రితములై బహుళప్రచారము నందియున్నవి.

విజయరాఘవుని నాటకములు గేయధర్మముకంటె రూపకకళ నెక్కువగా సంత రించుకొనినవి. అతడు ఉద్దేశ్యపూర్వకముగనే యక్షగానమునకు నాటకమని పేరు పెట్టినట్లు తోచును. విజయరాఘవునికాలమున యక్షగానమునకు నాటకనామము ధ్రువపడినది. యక్షగానకృతులను నాటకరీతులలో నడిపించిన కవులలో విజయ రాఘవుడే మొదటివాడు.

యక్షగానము వీథినాటకములో అభేదమును పొందుటలో రెండుదశలను గుర్తింపవచ్చును. యక్షగానము వీథినాటకగుణములను గ్రహించుచుండుట మొదటిదశ; ఇక రెండవది యక్షగాన వీథినాటకములు ఒకటే అగుట. విజయ రాఘవుని 'రఘునాథ నాయకాభ్యుదయము', విజయరాఘవుని ఆస్థానకవయిత్రి యగు పసుపులేటి రంగాజమ్మ లేక రంగాజీ 'మన్నారుదాసవిలాస నాటకము', విజయరాఘవుని కుమారుడగు మన్నారుదేవుని 'హేమాబ్జనాయికా పరిణయము', కామరసు వేంకటపతి సోమయాజి 'విజయరాఘవచంద్రికా విహారము', కోనేటి దీక్షితకవి 'విజయరాఘవ కళ్యాణము', పురుషోత్తమదీక్షితుని 'తంజాపురాన్నదాన మహానాటకము' మొదలగునవి క్రీ. శ. 17 వ శతాబ్దపు యక్షగానములలో ప్రసిద్ధి చెందినవి. ఇవి అన్నియు నాడు కొలువు నట్టువమేళములవారిచే నాటకమువలె రంగ స్థలముపై ప్రదర్శింపబడుటచే కాబోలు వీనికి 'నాటకము'లను పేరు యేర్పడి యుండును. 'నాటక' శబ్దమిచట సామాన్య దృశ్యప్రబంధవాచి. అనాడది ఒక చాటుకావ్యముగా పరిగణింపబడుచుండెడిది. యక్షగాననాటకములలో పాత్రల సంభాషణలు విపులముగా నుండవు. కనుక వానివి నృత్యనాటికలుగ, గేయప్రబంధ ములుగ పరిగణించినారు. ఈ యక్షగాననాటకములందలి దరువులకు తాళప్రాధా న్యము తగ్గి రాగప్రాధాన్యము హెచ్చినది. మధురకవితారీతుల ప్రాచుర్యము కొంత తగ్గి క్షేత్రయ్య పదములవంటి పదములు, జానపదగేయములును చేరినవి. సంధి వచనములసంఖ్య తగ్గి పాత్రలు వచనమున పరస్పరము సూటిగా సంభాషించు పద్ధతి యెక్కువగా పాటింపబడినది. అచ్చటచ్చట రంగప్రయోగసూచనలుకూడ కలవు.

విజయరాఘవునితో తంజావూరున నాయకరాజ్య మంతరించినది. మహా రాష్ట్రులు తంజావూరుకు ప్రభువులయినారు. మహారాష్ట్రరాజులుకూడ నాయక రాజులవలె తెలుగు యక్షగాననాటకములను రచించినారు. శహాజీ (క్రీ. శ. 1684-1712) స్వయముగా 20 యక్షగానములను రచించినాడు. వానిలో ముఖ్యమైనవి

కొన్ని. (1) కిరాతవిలాసము, (2) కృష్ణలీలావిలాసము, (3) గంగా పార్వతీ సంవాదము, (4) జలక్రీడలు, (5) ద్రౌపదీకల్యాణము, (6) పార్వతీకల్యాణము, (7) రతీకల్యాణము, (8) రామపట్టాభిషేకం, (9) రుక్మిణీ సత్యభామ సంవాదం, (10) వల్లీకల్యాణం, (11) విఘ్నేశ్వరకల్యాణం, (12) త్యాగరాజవినోద చిత్ర ప్రబంధము, (13) విష్ణుపల్లకి సేవాప్రబంధము, (14) శంకరపల్లకి సేవాప్రబంధం. శహాజీ యక్షగానములలో కొన్ని నాటకములుగ, మరికొన్ని ప్రబంధములుగ పేర్కొనబడినవి. ఇట్టి రచనలలో నాటకలక్షణమైన సంభాషణలు, ప్రబంధలక్షణ మైన వర్ణనలు కూడ ఉండుటచే వీనికి ఈ రెండు పేర్లును చెల్లుచుండును. శహాజీ రచించిన యక్షగాననాటకములు, యక్షగానప్రబంధములు రెండును ప్రయోగోద్దిష్ట ములయినవే. అతని నాటకములలో గ్రంథారంభమున ద్విపదలలో కథాసంగ్రహ ముండును. పాత్రోచితభాషతో వచనప్రచురముగ రచించెను.

యక్షగానములవంటివే వీథిభాగవతములును. భాగవతప్రదర్శనమునందు భరతవిద్యాప్రవీణులైన కూచిపూడి భాగవతులకు విశిష్ట గౌరవస్థానము కలదు. కిరాతార్జునీయము, గరుడాచలము, త్రిపురసంహారము, పార్వతీపరిణయము, గంగా గౌరీవిలాసము మొదలయిన యక్షగానములను కూచిపూడి భాగవతులు ప్రదర్శించి వ్యాప్తికి తెచ్చినారు. క్రీ. శ. 17 వ శతాబ్ది ఉత్తరార్ధమునందలి కూచిపూడి భాగ వతుల కులపతి సిద్ధేంద్రయోగి అపూర్వసృష్టియగు 'కలాపము' ప్రదర్శనప్రక్రి యలో నృత్యప్రధానమైనది. దాని రచనాప్రక్రియకు యక్షగానమే కొంతవరకు మూలకారణమని చెప్పవచ్చును. కూచిపూడివారి నృత్యప్రక్రియ యక్షగానప్రదర్శ నల కొక వినూత్నచైతన్యమును, ప్రాచుర్యమును కలిగించినది. కూచిపూడివారి కలాపప్రభావము తరువాతి యక్షగాననాటకములం దధికముగా గోచరించును.

క్రీ. శ. 17 వ శతాబ్దినుండి దక్షిణదేశమున కొన్ని తెలుగు యక్షగానములు వెలువడినవి. పెదకెంపరాయడు (క్రీ. శ. 1628-1678) గంగా గౌరీవిలాసమను యక్షగానమును రచించినాడు. చిక్కదేవరాయల (క్రీ. శ. 1672-1704) కంకిత ముగా 'ఉలా' ప్రబంధప్రక్రియ గలిగిన 'చిక్కదేవరాయ విలాస'మను యక్ష గానము వెలసినది. చిక్కదేవరాయల కుమారుడగు కంఠీరవ నరసరాజు (క్రీ. శ. 1704-1713) తెలుగు కన్నడ తమిళ ప్రాకృతభాషలలో 'కొరవంజి' దృశ్యకావ్య రచనలను కావించినాడు. అతడు తెలుగులో ఏడు యక్షగానములను రచించినాడు. అందు ఆరు 'విలాస' శబ్దాంతములు. అందు వసంతోత్సవవిలాసము, విభక్తి

కాంతావిలాసము అనువానిలో నటీసూత్రధారుల పూర్వరంగప్రస్తావనలు, అష్ట దిక్పాలక విలాసమను యక్షగానములో పాత్రల ప్రవేశసూచనలు కలవు. ఇవి ప్రదర్శనోద్దిష్టములే. ఇవి రచనలో యక్షగానప్రాయములైనవే కాని ప్రదర్శనలో పదచాళికాప్రాయము లయినవి.

మధురలో క్రీ. శ. 1706-1732 ప్రాంతమున విజయరంగ చొక్కనాథ నాయకుని 'సభార్హము'గా, 'నర్తనయోగ్యము'గా వెలసినది తిరుమలకవి రచించిన తిల్ల గోవిందరాజ నాటకము లేక చిత్రకూటమాహాత్మ్యమను యక్షగానము. క్రీ.శ. 1712 సంవత్సరము ప్రాంతమున సేలంలో అన్నదానము వెంకటాంబయను కవయిత్రి రామాయణ బాలకాండమును యక్షగానముగా రచించినది. ఇది స్త్రీలు పాడుకొనుట కుద్దేశించిన రచన. చిన్న బయలాచార్యుని (క్రీ. శ. 1767) గుడుగూచి చరిత్ర శృంగేరిమఠమునకు చెందిన యక్షగానకృతి. పుదుక్కోట కోటిరాయ రఘునాథ తొండమాన్ (క్రీ. శ. 1769-1789) ఆస్థానకవియగు సుదురుపాటి వెంకన పార్వతీకల్యాణమను యక్షగానమును రచించినాడు. ఎల్లయకవి చంద్రతారా విలాసము, మారుపెద్ది చెంగల్వరాయశాస్త్రి సుందరేశ్వరవిలాసము, చల్ల నారాయణకవి పారిజాతము, నెడాదూరు వెంకటాచార్యుని సమగ్రరామనాటకము మొదలగునవి క్రీ. శ. 19 వ శతాబ్దమున దక్షిణదేశమున తెలుగులో వెలసిన యక్షగానములు.

క్రీ. శ. 18 వ శతాబ్ది ఉత్తరార్ధమునుండి తెలంగాణమునందుకూడ పెక్కు యక్షగానములు రచింపబడినవి. క్రీ. శ. 1780 ప్రాంతమున వెలసిన శేషాచలకవి ధర్మపురి రామాయణము, రాపాక శ్రీరామకవి అధ్యాత్మ రామాయణమును లభించినంతలో తెలంగాణప్రాంతమందలి మొదటి యక్షగానములు. కానూరి వీరభద్రకవి (క్రీ. శ. 1800) బసవ మహిమామృతవిలాసము, చెల్వూరు సన్యాసికవి (క్రీ. శ. 1800) బసవ కల్యాణము అనునవి రెండును వీరశైవ యక్షగానములు. క్రీ. శ. 20 వ శతాబ్దిలో తెలంగాణమున యక్షగానము లనేకము వెలువడినవి. తెలంగాణ యక్షగానకవులలో మిక్కిలి ప్రసిద్ధుడు చెర్విరాల భాగయ్య. అతడు 34 యక్షగానములను రచించినాడు. బభ్రువాహనచరిత్ర, కృష్ణగారడి, మాయాసుభద్ర, ఆరె మరాటీలు, కాంభోజరాజు కథ, బాలనాగమ్మ కథ మొదలగునవి అతడు రచించిన యక్షగానములలో బహుళప్రచార మొందినవి. అల్లిరాణి కథ, నాగార్జున చరిత్రము మొదలగు అప్రసిద్ధగాథలనుకూడ యక్షగానములుగ భాగయ్య రచించినాడు. చెర్విరాల భాగయ్యగారి శిష్యుడగు మహమ్మదు అబ్దుల్లా 'హనుమద్రామ సంగ్రామ'మను

యక్షగానమును రచించినాడు. అంబేద రాజవీరప్ప బహు యక్షగానకర్త. అతవి మల్లనచరిత్ర జానపదగాథ ఇతివృత్తముగా కలది. వల్లోరి వీరప్ప మన్మథసంహారము, క్రోధాపురి రైతువిజయము అను రెండు యక్షగానములను రచించినాడు. తెలంగాణమునందు యక్షగానము విరివిగా రచింపబడి ప్రదర్శితము లయినవి.

క్రీ. శ. 18 వ శతాబ్దమున రాజప్రోత్సాహమున వెలసిన యక్షగానములలో వరుల నరసింహకవి దుష్యంతచరిత్రము, అకలంక శ్రీకృష్ణమాద్యుని కృష్ణవిలాసము, నారాయణకవి సుందరకాండము, నరకూరు నారాయణకవి పారిజాత నాటకము మొదలగునవి పేర్కొనదగినవి. క్రీ. శ. 18 వ శతాబ్దమున వెలసిన యక్షగానములు కొన్ని నాట్యపద్ధతికి గేయపద్ధతికికూడ నుపయోగపడుచుండెడివి. దశవాయి తిమ్మప్ప ప్రసన్న వేంకటేశ్వర విలాసమున దరువులకు ముందుగా ఒక రాగము నొకతాళము పేర్కొవి తరువాత 'నాట్యపద్ధతి' కనుగుణమగు రాగ తాళముల జంటను పేర్కొనినాడు. గోగులపాటి కూర్మనాథకవి మృత్యుంజయ విలాసము 'నాటక గేయప్రబంధ'మని పేర్కొనబడినది. నరుకూరు నారాయణకవి పారిజాత నాటకము 'ఆట భాగవత'మని పేర్కొనబడినది. దీనిపై భామపలాప ప్రభావము యెక్కువగా కలదు. ఆంధ్రదేశమున యక్షగానమునకు నాటకనామము క్రీ. శ. 18 వ శతాబ్దినుండి కన్పట్టును. అది వీథినాటకములతోడి యనుబంధమువలన యేర్పడియుండును.

క్రీ. శ. 18 వ శతాబ్దిలో వీథిభాగవతమువంటి తెలుగునాటకములు మేలట్టూరు ప్రాంతములో ప్రదర్శింపబడినవి. కూచిపూడి భాగవతులకు, మేలట్టూరు భాగవతులకు సన్నిహితసంబంధము కలదు. వరదరాజు పెరుమాళ్ళ వసంతోత్సవములో మేలట్టూరు భాగవతులు నేటికివి తెలుగు వీథినాటకములను ప్రదర్శించుచున్నట్లు తెలియుచున్నది. తెలుగు వీథినాటకముల ననుసరించియే తమిళనాడులో భాగవత నాటకములు, వీథినాటకములు వెలసినట్లు చెప్పుదురు. వానిలో అరుణాచల కవి 'రామనాటకము', గోపాలకృష్ణభారతి 'నందనచరిత్రము' ముఖ్యముగా పేర్కొనదగినవి. తమిళ కన్నడాంధ్ర దేశములందలి వీథి భాగవతములనుగురించి, మేలట్టూరు భాగవత మేళనాటకములనుగురించి ముందు వివరింపబడును.

క్రీ. శ. 19 వ శతాబ్దమున ఏకాంతసేవాప్రబంధము లనుపేర యక్షగాన ప్రాయములగు రచనలు తెలుగులో వెలువడినవవి డా. యస్వీ జోగారావుగారు "ఆంధ్ర యక్షగాన వాఙ్మయచరిత్ర" (పుట 131-132) లో వానినిగురించి ఇట్లు

తెల్పినాడు. 'ఏకాంతసేవ' యనగా నిత్యార్చనసాగు దేవాయతనములలో ముఖ్యముగా భోగనిలయములగు వైష్ణవాలయములో రాత్రి గుడితలుపులు మూయుటకు ముందర్చకులు యథావిధి నుపచరించి అమ్మవారి, స్వామివారి యుత్సవ విగ్రహములను బానుపుపైఁ బవళింపుచేసి గుడి చేటులు లాలిపాటలు పాడి ద్వారపాలన నిమిత్తము షష్టిక్పాలకులకు 'బహూపరాకులు' చెప్పి వెడలిపోఁగా నిక నమ్మవారు స్వామివారికిఁ జేయునదిగా మాహింపఁదగిన పర్యంక సపర్య. మధురభక్తి ముదితాత్ములగు కవివతంసులు కొంద అా సన్నివేశమునుగ్రహించి దానికిఁ బూర్వరంగముగా నింత కథాంగము (భామకలాపము 'జాడీ'లో) కల్పించి నాయకుని వివిధోపచారములకు వివిధ గీతాప్రభేదములను బ్రయోగించి ఏకాంతసేవామకుటముతో ననేక గేయప్రబంధములను వెలయించిరి. అవి యక్షగానములవలె సంగీతసాహిత్యముల కాలవాలములు; ఎట్టి రచనావిశేషమునైన నిట్టే యిముడ్చుకొనఁగలట్టివి. ఈ జాతి కృతి రచన యంత ప్రాచీనమైనదిగాఁ దోఁపదు. 19 వ శ. ప్రాంతముననే యక్షగాన మొకవడిగా బయల్వెడలినట్లు తోఁచును. అందు కొన్ని యక్షగానములవి యా కవులచేతనే వ్యవహృతములయినవి. నాటక నామకరణము చేయించుకొన్నవియుఁ గొన్ని లేకపోలేదు. ఉదా: (1) మామిళ్ళపల్లి వేంకటాచలకవి ఏకాంతసేవానాటకము (కవిచేతనే య. గా. అనియుఁ బేర్కొనఁబడినది.) (2) అక్కెన ప్రగడ హరిదాసు 'శ్రీరామ నిత్యోత్సవ యక్షగానము'. (3) కుందుర్తి ఆదినారాయణశర్మ 'ఏకాంతసేవా కథానామకంబగు యక్షగానము.'

(11) యక్షగానము - ప్రబంధానుకరణము :

పౌరాణికేతి వృత్తములతోకూడిన యక్షగానములే మొదట రచింపబడుచుండెడివి. సంకల్ప సూర్యోదయాదులనుబోలిన వేదాంతపారమ్యములగు యక్షగానములు కొన్ని రచింపబడినను వానికి వ్యాప్తి చాల తక్కువ. తరువాత పోషకులగు రాజుల జీవితఖండములను కథావస్తువుగ గ్రహించి రచింపబడిన శృంగార ప్రధానములగు యక్షగానములు కొన్ని వెలువడినవి. యక్షగానములు ప్రదర్శనమునకేకాక శ్రవ్యప్రయోజనమునుకూడ కల్గియుండినవి. ప్రౌఢులయిన కొందరు కవులు యక్షగానరచనను చేపట్టుటచే అందు ప్రబంధలక్షణములు చోటు చేసుకొనినవి.

కందుకూరి రుద్రకవి మొదలయినవారు తమ యక్షగానములను యక్షగాన ప్రబంధములని పేర్కొనినారు. వీనియందు అక్కడక్కడ కొన్నిదరువులు, పాటలు,

కవి వచనములుండుటచే యక్షగానములని కొందరు భ్రమించిరి. క్రీ. శ. 18 వ శతాబ్దమున రచితమైన యక్షగానములపై ప్రబంధప్రభావము అధికముగా కన్పట్టును. గోగులపాటి కూర్మనాథకవి (క్రీ. శ. 1788) తన మృత్యుంజయ విలాస'మును ఎత్తుగడలో 'యక్షగాన'మని పేర్కొనినను చివర 'నాటకగేయప్రబంధము' అని వ్యవహరించినాడు. రచనాప్రౌఢిలో, కథాప్రణాళికలో, ఆశ్వాసవిభాగములో, వర్ణనాప్రాచుర్యములో, శబ్దాలంకార స్వారస్యములో, శృంగారప్రాధాన్యములో మృత్యుంజయ విలాసమునందు ప్రబంధముద్ర స్ఫుటముగా గోచరించును. మృత్యుంజయ విలాసమును యక్షగానప్రబంధమునమసరించి ప్రబంధధోరణిలో రచింపబడిన యక్షగానములలో పేర్కొనదగినవి ఇటికెల తిమ్మయ (క్రీ. శ. 18 వ శతాబ్ది) కవ్యకాపురాణము, శివలెంక మల్లనారాధ్యుని వీరభద్రవిజయము మొదలయినవి. వీరభద్రవిజయమను యక్షగానప్రబంధమున గర్భకవిత్వముకూడ అచ్చటచ్చట నిర్వహింపబడినది. ఇందు శివలెంక మల్లనారాధ్యుడు కవిపురస్కార తిరస్కారములనుకూడ ప్రవేశపెట్టినాడు.

కొన్ని ప్రబంధములుకూడ యక్షగానములుగ పరివర్తితములయినవి. దినవహి ఓబయమంత్రి రచించిన 'గరుడాచల విలాస'మను యక్షగానమున ప్రబంధములందు కానవచ్చు షష్ఠ్యంతపద్యములు ప్రవేశపెట్టబడినవి. మృత్యుంజయ విలాసాది యక్షగాన నాటకప్రబంధములందు కన్పించు ఆశ్వాసవిభజనమునకు ప్రబంధములే మాతృకలని చెప్పవచ్చును. యక్షగానములందు కన్పట్టు భరతవాక్యమునకు కావ్యాదులలోని ఆశ్వాసాంత గద్యకు పోలిక కలదు.

పురవీథుల నూరేగవచ్చిన నాయకునిచూచి నాయిక మరులుగొనుట అను తమిళ 'ఉలా' ప్రబంధపుపోకడ విజయరాఘవ నాయకుని 'రఘునాథాభ్యుదయ' మను యక్షగానమందు కలదని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు మొదట గుర్తించినారు. తరువాతి దక్షిణదేశపు ప్రభునాయకములయిన యక్షగానములందు ఈ పోకడ తరచుగ కన్పట్టును.

## (12) యక్షగానములు - మార్గనాటక ప్రభావము :

సాధారణముగ యక్షగాననాటకములందలి గీతులను 'దరువు'లని వ్యవహరింతురు. సంస్కృతమునందలి 'ధ్రువా' పదమే కన్నడ తెలుగుభాషలలో 'దరువు' అయినదనియు, శార్ఙ్గదేవుడు పేర్కొనిన 'రహడి' ఛందము తెలుగులోని రగడ' వంటిదే అనియు, యక్షగానము సంస్కృతప్రాకృతములందలి నృత్య

(ఉప) రూపకములనుండియే యుత్పన్నమయినదని డాక్టర్ వి. రాఘవన్‌గారు అభిప్రాయపడినారు. (10) ఈ అభిప్రాయము సమంజసముకాదని పలువురు తెల్పినారు.

ప్రాచీనములయిన సుగ్రీవవిజయాది యక్షగానములలో 'దరువు' అను పదము లేదు. తాళప్రధానములయిన ఏకజంపె, త్రిపుటాదులే అందు పేర్కొనబడినవి. తెలుగులో 'దరువువేయుట' అనగా తాళమువేయుట లేక మద్దెల వాయించుట అని అర్థము. ఇది క్రమముగా తాళలయానుగుణమగు గీతికికూడ పేరైనది. అందువలన 'దరువు'నకు 'ధ్రువా'కును సంబంధమును కల్పించుట సమంజసము కాదు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'దేశిరచనలలోనుండి పింగి, పింగడు, కోణంగి, దరువు అనునవి నటీనటులుగను, విదూషకుడుగను, ధ్రువగను సంస్కృత నాటకములం జేరెనేమోయనికూడ యోజింపదగినట్టిది' అని సుగ్రీవవిజయ పీఠిక (పుట 6) యందు వ్రాసినారు. వేటూరి ప్రభాకరశాస్త్రిగా రూహించినట్లు అతి ప్రాచీనమైన తెలుగుదరువే సంస్కృతమునందు 'ధ్రువా' అయినదని చెప్పవచ్చును. కనుక యక్షగానము సంస్కృతసాహిత్యముతో సంబంధములేని దేశి సంగీత సాహిత్య ప్రక్రియగా నిర్ణయింపవచ్చును.

దేశి ప్రక్రియయైన యక్షగానములలో కాలక్రమమున మార్గనాటకచ్ఛాయలు కొన్ని ప్రవేశించినవి. మార్గనాటకములలోని విష్కంభములు, కథోద్ఘాతాది పాత్ర ప్రవేశ సూచకములు యక్షగానములందు కానరావు. యక్షగానములలో కవియో, కటికవాడో, చోపుదారో, హెగ్గడికత్తెయో వచ్చి కథాసంధానము చేయుచుండురు. నేపథ్యమున నుండవలసిన కవి రంగముమీదికి అరుదెంచి నాటక గతపాత్రలతో కలసి నటించుట యక్షగానములలోని ప్రత్యేకత. యక్షగానములందలి 'కటికవాడు' ఇంచుమించు మార్గనాటకములలోని 'కంచుకి'ని బోలినవాడు.

సంస్కృతనాటక సంప్రదాయములు కాలక్రమమున యక్షగానములందు ప్రవేశ పెట్టబడినవి. విజయరాఘవుడు తన యక్షగాన నాటకములలో మార్గరూపక సంప్రదాయమననుసరించి భరతవాక్యమును ప్రవేశపెట్టినాడు.

శహాజీ తన యక్షగానములలో గణపతి ప్రార్థనముతోపాటు గణపతిని ఒక పాత్రగా ప్రవేశపెట్టినాడు. కటికవాని వాలకమును ఒక సాంప్రదాయిక హాస్య పాత్రగా శహాజీ తన యక్షగానములందు రూపొందించినాడు. పాత్రోచితభాషతో,

10. 'Yakshagana' - Triveni, Sep. Oct. 1934. Vol. III. No. 2.

వాక్యపద్ధతితో వచనప్రచురముగా శహాజీ రచన కావించినాడు. అడుగడుగున పాత్రప్రవేశసూచక కథానుసంధానకములయిన సూత్రధారప్రసంగములు, అచ్చటచ్చట భాగవతులు పాత్రలను పలుకరించుట మొదలగువిశేషములు శహాజీ యక్షగానములందు కన్పట్టును. శహాజీ రచించిన త్యాగవినోద చిత్రప్రబంధ యక్షగాన నాటకమున సంస్కృతనాటకములం దున్నట్లు అంకవిభజనముకూడ కలదు. త్యాగరాజు (క్రీ. శ. 1847) రచించిన ప్రహ్లాదవిజయ నాటకమునందుకూడ అంకవిభజనమున్నది. శహాజీకాలము (క్రీ. శ. 1684-1712) నుండి శివాజీకాలము (క్రీ. శ. 1833-1855) వరకుగల మధ్యకాలములో వెలసిన యక్షగానములందు మార్గనాటకప్రభావము విశేషముగా కన్పట్టును.

విజయరాఘవుని భరతవాక్యము, శహాజీనాటి అంకవిభాగము మొదలగు విషయములమూలమున వికీర్ణముగా పొడచూపిన మార్గనాటకప్రభావము శాహరాజు తమ్ముడగు తుళుజరాజు (క్రీ. శ. 1728-1736) 'శివకామసుందరీ పరిణయ'మను యక్షగానములోని నాందీప్రస్తావనలద్వారమున విస్తరిల్లి, శివాజీ (క్రీ. శ. 1885) రచనయగు 'అన్నపూర్ణా పరిణయ'మున పరిపూర్ణత నందినది.

యక్షగానము ఉత్పత్తిలో దేశియయినను పరిణామమున కవిపండితుల ఆదరమువలన సంస్కృతరూపకచ్ఛాయలను సంతరించుకొని 'మార్గి' యైనదని చెప్పవచ్చును. ఇట్లు దక్షిణదేశమున యక్షగానప్రదర్శనలు రాజాస్థానములం దతి వైభవముతో, భరతవిద్యాపద్ధతిని యించుమించు మార్గరూపకప్రదర్శనల స్థాయిలో జరిగినవని భావింపవచ్చును.

## (13) కన్నడములో యక్షగానములు :

కన్నడములో క్రీ. శ. 1600-1700 ప్రాంతమున నూటికిపైగా యక్షగానములు రచింపబడినవని కె. యస్. కారంత్‌గారు 'యక్షగానము' అను గ్రంథమునందు తెల్పినారు. మనకు తెలిసినంతవరకు కన్నడములో మొట్టమొదటి యక్షగానము విష్ణువారంబళ్ళి (క్రీ. శ. 1564) రచించిన విరాటపర్వమే. విష్ణువారంబళ్ళి బాణాసురకళగ, ఇంద్రకీలక అను యక్షగానములనుకూడ రచించినాడు. విరాటపర్వ యక్షగానమున కుమారవ్యాస భారతమునందలి కొన్నిపద్యముల పోలిక కలదు. బాణాసురకళగలో ఉషానిరుద్ధుల వివాహము వర్ణింపబడినది. విరాటపర్వము, బాణాసురకళగ అను రెండు యక్షగానములు ముద్రితములయి బహుళప్రచారము పొందినవి. ఇంద్రకీలకమాత్రము అముద్రితము.

క్రీ. శ. 16 వ శతాబ్దమునకు చెందిన కన్నడ రచయితలలో నగిరె సుబ్రహ్మణ్యము 'శంబరాసుర కళగ' రావణోద్భవ అను రెండు యక్షగానములను, దేవిదాసు అనునతడు కృష్ణసంధానము, భీష్మపర్వము, అభిమన్యు కళగ, సైంధవ వధ, చిత్రసేన కళగ, గిరిజాకళ్యాణము అను ఆరు యక్షగానములను రచించినాడు. దేవిదాసు కృష్ణార్జున, పుత్రకామేష్టి, బభ్రువాహన కళగ, శ్రీకృష్ణ బాలలీలా అను యక్షగానములనుకూడ రచించినట్లు తెలియుచున్నది.

నందీశ్వర వెంకటప్ప (క్రీ. శ. 1663) 'కృష్ణార్జున కళగ'ను, నాగప్పయ్య (క్రీ. శ. 17 వ శతాబ్ది) 'చంద్రావళి', 'నలదమయంతి', 'ఘటోత్కచ' అను యక్షగానములను, హాళేమక్కి రామప్ప (క్రీ. శ. 17 వ శతాబ్ది ప్రారంభము) 'గయచరితె'ను, రాముడు (క్రీ. శ. 1691) 'తామ్రధ్వజ కళగ'ను, రామభట్టు (క్రీ. శ. 1674) లవకుశ, ద్రౌపదీస్వయంవరము, అతికాయ కళగ, సుభద్రా పరిణయము, ధ్రువచరితె, రతికళ్యాణము, కంసవధ, ద్రౌపదీ వస్త్రాపహరణము, రాజసూయము, సులోచనాచరితె, సేతుమాధ్వవ, శేషగర్వాపహరణము, గిరిజా విలాసము, ఇంద్రజిత్తు కళగ అను 14 యక్షగానములను, నిత్యానంద అవధూత (క్రీ. శ. 17 వ శతాబ్ది) 'కనకాంగి కళ్యాణము'ను కన్నడములో రచించినారు. వీరందరు క్రీ. శ. 17 వ శతాబ్దమునకు చెందినవారు.

క్రీ. శ. 18 వ శతాబ్దమునకు చెందిన కన్నడ యక్షగానములలో అజపుర నివాసియగు సుబ్బన్న 'పారిజాతము, రుక్మిణీ స్వయంవర'మను రెండు యక్షగానములను, సుబ్బన్న కుమారుడగు వెంకటప్ప 'మైరావణ కళగ' అను యక్షగానమును, వెంకన్న 'మానసచరితె'యును, వెంకన్న శిష్యుడగు వాసుదేవప్రభువి సముద్రమథనము, చంద్రహాస, కంసవధె అను యక్షగానములును పేర్కొనదగినవి.

క్రీ. శ. 19 వ శతాబ్దమునకుచెందిన కన్నడ యక్షగానములలో ముఖ్యమైనవి- మైసూరు రాజవంశీయుడగు అళియ లింగరాజు రచించిన 40 యక్షగానములును, భీముడు రచించిన 'రాజసూయ'మను యక్షగానమును, మయ్యావతి వెంకటప్ప 'ప్రహ్లాద చరితె'యును, ఎణ్ణెమాడి వెంకటరమణయ్య 'భీష్మపర్వము'ను, గేర్సొప్పె శాంతప్పయ్య, 'పుత్రకామేష్టి, కర్ణార్జున కళగ' అను యక్షగానములును, ముద్దణ అను పేరుతో వ్యవహరింపబడు నందళికె లక్ష్మీనారాయణప్ప రచించిన రత్నావళి కల్యాణము, కుమారవిజయమను రెండు యక్షగానములును.

క్రీ. శ. 20 వ శతాబ్ది ప్రారంభమునకూడ కన్నడమున పెక్కు యక్షగానములు రచింపబడినవి. హలసినహళ్ళి నరసింహశాస్త్రి (క్రీ. శ. 1930 లో మరణము) 30 యక్షగానములను రచించినాడట. వానిలో భీష్మవిజయము, విద్యున్మతీ కల్యాణము అను రెండు యక్షగానములుమాత్రము నేటికిని ప్రదర్శింపబడుచున్నవి.

కన్నడమున 'యక్షగాన'మను ముద్రతో వెలసినరచనలు క్రీ. శ. 16 వ శతాబ్దికిముందు కానరావని పైని పేర్కొనిన వివిధ యక్షగానములనుబట్టి తెలియుచున్నది. ఇ. పి. రైస్, ఆర్. నరసింహాచార్య, యమ్. హరియప్పభట్, యమ్. గోవిందరావు మొదలగు కన్నడ విమర్శకులు ఈ విషయమును అంగీకరించియున్నారు. కన్నడ యక్షగానవాఙ్మయమునుగురించి ప్రత్యేకముగ పరిశోధనచేసిన యమ్. గోవిందరావుగారు ఇట్లు తెల్పినారు.

"In a study of a good number of yakshagana works, I was not able to come across a work earlier than the end of the 17th century".—(Madras University Annals of Oriental Research, Vol. X, Part 2).

యక్షగానము తమిళులకు ఆంధ్రులుపెట్టిన భిక్షగనే తోచుచున్నది. తంజావూరును ఆంధ్రనాయకులు పాలించినకాలమున ఇది సంభావ్యమే యగును. నాయకరాజులకుముందు తమిళమున యక్షగానములు లేవు. తెలుగు యక్షగానములనే కొన్నిటిని తమిళకవులు అనువాదము చేసికొనియుండుట గమనింపదగిన విశేషము. రాజగోపాలన్ అను కవి రచించిన 'సుక్కిరీవవిజయం' అను తమిళ యక్షగానము (ప్రా. లి. పు. భాం. డి. సం. 509-511) కందుకూరి రుద్రకవి తెలుగులో రచించిన సుగ్రీవవిజయమున కనువాదప్రాయమయినది. సుక్కిరీవవిజయమునందు కొరవంజిపాత్ర లేదు. దీనివిబట్టి తమిళయక్షగానములం దన్నిటను కొరవంజిపాత్ర లేదని చెప్పవచ్చును.

యక్షగానరచన తమిళమున కన్నడముకంటెను అర్వాచీనమైనది. తెలుగునందుమాత్రము కన్నడ తమిళములకంటె యక్షగానరచన ప్రాచీనమైనదిగా తోచును. 'తమిళ కన్నడ యక్షగానములా దేశములం దాంధ్రుల వ్యాపక మతిశయించినపిమ్మటనే రచింపబడె'నని డా. నేలటూరి వేంకటరమణయ్యగారు, 'మధుర తంజావూరు నాయకరాజులనాటి ఆంధ్రవాఙ్మయచరిత్ర' (పుట 88) యందు వ్రాసిన వాక్యములు స్మరణీయములు. యక్షగానరచన క్రీ. శ. 14 వ శతాబ్ది ప్రాంతము

లందో అంతకింకను మునుపో తెలుగుదేశమందే ఆరంభమైనదని, తెలుగుదేశము నుండియే క్రమముగా కన్నడ తమిళభాషలకు వ్యాపించెనని శిష్టా రామకృష్ణశాస్త్రి గారు నిరూపించియున్నారు.(11) తెలుగులోని ప్రోలుగంటి చెన్నశౌరి 'సౌభరి చరిత్ర'మూ, కందుకూరి రుద్రకవి 'సుగ్రీవవిజయము' రెండును కన్నడ యక్షగాన ములకంటె ప్రాచీనములయినవి. కనుక యక్షగానములకు పుట్టినిల్లు ఆంధ్రదేశము. కన్నడ తమిళదేశములు వానికి విహారభూములని చెప్పవచ్చును.

(14) యక్షములు - వీథినాటకములు :

యక్షగానములందు పాటకు ప్రాముఖ్యముండును. ఇక ఆటకు ప్రాధాన్య మేర్పడినపుడు అది క్రమముగా సంవాదమునకు, రూపారోపమునకును దారితీసినది. తత్ఫలితముగ నేర్పడినదే వీథినాటకము.

యక్షగానప్రదర్శనములలోని హంగుదారుల వంతపాటకుల మేళ మించు మించు ప్రాచీన గ్రీకునాటకములలోని 'కోరస్' బృందగానముచేయు గాయక బృందమువంటిది. తొలి గ్రీకురూపకములలో 'కోరస్'ల కున్నంత ప్రాముఖ్యము వీథినాటకములందలి సూత్రధారునకు కలదు. ఈ సూత్రధారుడు హితోపదేశకుడైన పెద్దగాను, సాక్షీభూతుడైన ప్రేక్షకుడుగాను, విమర్శకుడుగాను, వీథినాటకములోని ప్రకృతిగా మారుచుండును. ఈ పద్ధతి అస్సామునందలి ప్రాచీన 'అంకియానాట్' (Ankiā Nat) ప్రదర్శనములందును గమనింపవచ్చును. 'అంకియానాట్' అను దేశిరూపక రచన క్రీ. శ. 16వ శతాబ్దినుండియు అస్సాములో ప్రచారములో నున్నట్లు తెలియుచున్నది.

బెంగాలులో జాత్రానాటకము (Jātra Plays) ప్రసిద్ధిచెందిన జానపదదృశ్య కళారీతి యక్షగానమువలె గానప్రాధాన్యము, హంగు, పౌరాణికేతివృత్తముల ప్రతి పత్తి, ప్రదర్శనవిరాడంబరత, జనసామాన్యాను రంజకత్వము మొదలగు లక్షణ ములుగల వంగదేశపు 'యాత్ర'లకును యక్షగానములకును సాదృశ్యము కలదు. జాత్రానాటకములలో మొదట కృష్ణునిజీవితమునకు సంబంధించిన సన్నివేశములే కథావస్తువుగ స్వీకరింపబడుచుండెడివి. చైతన్యుడు (క్రీ. శ. 1485-1533) రుక్మిణీహరణమను నాటకమును రచించి తానే స్వయముగ ప్రదర్శింపజేసినాడు. జాత్రానాటకములలో తరువాత క్రమముగా రాముడు, శివుడు, కాళి మొదలగువారికి

11. 'Yakshagana'—Madras University Journal. Jan. 1958 XXVIII. No. 4

సంబంధించిన ఇతివృత్తములుకూడ గ్రహింపబడినవి. పౌరాణికేతివృత్తములే కాక చారిత్రకములు, సాంఘికములుకూడ జాత్రానాటక కథావస్తువు లయినవి. జాత్రా నాటకములు సాధారణముగా రథోత్సవసందర్భములందు ప్రదర్శింపబడును. యక్షగానములలో భాగవతారువలె జాత్రానాటకములలో పాత్రలను ప్రవేశపెట్టువానిని 'అధికారి' అని వ్యవహరింతురు. జాత్రానాటకములలోని ముఖ్యపాత్రధారులు శాస్త్రీయసంగీతమును, తదితరపాత్రలు జానపదసంగీతమును వాడుచుందురు. జాత్రానాటకప్రదర్శన సుమారు నాల్గుగంట లుండును.

మహారాష్ట్రలో ప్రసిద్ధిచెందిన జానపద కళావిశేషము తమాశా (Tamāsā). ఇది ఔరంగజేబు అధీనములోని మొగల్ సైన్యమునకు వినోదము కల్గించుట కేర్పడినది. క్రీ. శ. 18, 19 శతాబ్దులలోని ప్రఖ్యాత మరాఠీకవులుకూడ ఈ జానపద కళారీతిని చేపట్టినారు. తమాశా రచనను చేసిన ప్రఖ్యాతకవులలో రామ్‌జోషి (క్రీ. శ. 1762-1812) ఒకడు.

బెంగాలులోని జాత్రానాటకమునకు, మహారాష్ట్రలోని 'తమాశా'కును వీథి నాటకములతో పోలిక కన్పట్టును.

ఊరి చావడులయందో లేక అరుబయట నిర్మించిన తాత్కాలిక వేదికల యందో ప్రదర్శింపబడు యక్షగాననాటకములకు వీథినాటకములని, వీథి భాగవతము లని, బయలు నాటకములని పేరు కలిగినది. కన్నడదేశమున యక్షగాననాటకము లకు బయలాటలని, దశావతారములని, భాగవతార ఆటలని, మేళములని వ్యవహార నామము లెన్నియో కలవు. మలబారుప్రాంతమునందు కేరళదేశపు ప్రాచీన దృశ్య విశేషమగు 'పాణ్‌కళి' (12) వేసవిలో రాత్రిపూట ఆరుబయట ప్రదర్శింపబడెడిది. 'పాణ్‌కళి'లో 'తెక్కత్తియమ్', 'తెక్కణమ్' అను రెండుపాత్రలే ప్రధానముగ నుండును. ఈ రెండు పాత్రములకుతోడు ప్రాముఖ్యముగ విదూషకునివంటి వా డొకడు ప్రవేశపెట్టబడు చుండును.

తమిళభాషయందలి 'తెరిక్కూత్తు' ఆరుబయటనందు ఆడబడు దృశ్య భేదము. 'తెరిక్కూత్తు' అనగా బయలునాటకమని అర్థము. ఇది తమిళనాడులో ప్రసిద్ధిచెందిన జానపదకళావిశేషము. ఆరుబయట నిర్మించినపందిరిలో మూడువైపుల ప్రేక్షకులు కూర్చొనియుందురు. నాల్గవప్రక్క ఒకవైపు పాత్రప్రవేశ నిష్క్రమ

12. See. Kali Worship in Kerala—By C. Achyuta Menon.

ఊదుటను, వెనుకవైపున మద్దెల, నాగస్వరము మొదలగు వాయిద్యములను వాయించు సంగీతకారుడు ఎత్తైన ఒకబల్లపై కూర్చొనియుందురు. విఘ్నేశ్వరుడు, శివుడు, దక్షిణామూర్తి, మీనాక్షి మొదలగు దైవతముల ప్రార్థనముతో 'తెరికూత్తు' ప్రదర్శన ప్రారంభమగును. చాలవరకు పౌరాణికేతివృత్తములే తెరికూత్తుకు వాడబడుచుండెను. ప్రదర్శనారంభమున ఏనుగుతలతో ప్రవేశించిన నటుడు విఘ్నేశ్వరపాత్రను నిర్వహించును. ప్రార్థనాదికములు ముగిసినతరువాత 'కట్టయకారణ్' (Stage Manager) తెరవెనుకనుండి ప్రదర్శింపబోవు 'తెరికూత్తు'ను, నటులనుకూడ ప్రేక్షకులకు పరిచయము చేయును. తెరికూత్తులో సంగీతము, సాహిత్యము, నృత్యము మూడింటికికూడ ప్రాధాన్యమీయబడును. వివిధపాత్రలకు వివిధవేషాలంకరణము లుండును. 'కోమలి' (Clown) అను నటుడు 'తెరికూత్తు' ప్రదర్శనలో మధ్యమధ్య ప్రవేశించి హాస్యము పండించును. ఇతడు సంస్కృతనాటకములలోని విదూషకుని వంటివాడు.

రాయలసీమయందు ప్రదర్శింపబడు యక్షగానములు, వీథినాటకములకు కన్నడభాషయందలి బయలాటలకు పరస్పర సాహచర్యము, సామ్యము, పోష్యపోషకభావము కొంత గోచరించును. యక్షగానములందువలె బయలాటలందును పాటలు, పద్యములు, దరువులును కలవు. పాత్రధారులను ప్రేక్షకులకు పరిచయము చేయుటలో బయలాటలకును యక్షగానములకును సామ్యము కలదు. శాహాజీ (క్రీ. శ. 1682-1710) రచించిన గంగా పార్వతీ సంవాదము, పార్వతీకల్యాణము లందును, వల్లీకల్యాణము, రామపట్టాభిషేకము, చంద్రశేఖర విలాసము, సీతా కల్యాణము, శివపారిజాతము, రుక్మిణీ సత్యభామా సంవాదము మొదలయిన యక్షగానములందును పాత్రలను ప్రేక్షకుల కెరుకపరచుపద్ధతి గోచరించును.

యక్షగానములు ఆంధ్రదేశములోను, ఆంధ్రేతరదేశములందును తరతరం పరగ వెలువడినను వాని ప్రదర్శనవిషయములోమాత్రము అభివృద్ధి కనిపించదు. అప్పటికప్పుడు ఊరిబయటనో, గుడి ముంగిటనో తాత్కాలికముగా నిర్మింపబడిన పందిరిక్రింది గరుకు నేలయే యక్షగానప్రదర్శనకు రంగస్థలము. అటు నిటు చెరి యొకవిచే పట్టుకొనబడిన తెల్లనిగుడ్డయే తెర. తెరకిరువైపుల నూనెదివిటీలు, తెర వెనుక హంగుదారులు, వంతపాటకులు, హంగు-తిత్తి-మద్దెల, తాళపుచిప్పలు, తెరముందు సూత్రధారుడు. అతడే ప్రదర్శనప్రవర్తకుడు. ప్రార్థనాదికము, కథా సందర్భవివరణ, పాత్రప్రవేశ సూచన, పాత్రలను పలుకరించుట, పాత్రలకు వంత

పాటకులకు పల్లవు లందించుట, పాత్రల అభినయానుకూలముగ తాళము వేయుట, సంధివచనములు చదువుట, అప్పుడప్పుడు హాస్యప్రసంగములు నెరపుట మొదలగునవి సూత్రధారుని పనులు. సాధారణముగ ప్రదర్శనలు పాతతరకలతో, చిరిగిన తెరలమధ్య జామురాత్రికి ప్రారంభమై తెల్లవారునప్పటికి తెల్లవారుచుండును. వీధి నాటకములలో కొన్ని కథలు అయిదు, ఆరురాత్రులు ప్రదర్శింపబడుటకూడ కలదు. పంతవేలూరు కుశలవనాటకము ఆరురాత్రుల కథ.

వీథినాటక ప్రదర్శనములు నీచజాతివారినుండి అగ్రవర్ణములవారు స్వీకరించి భరతశాస్త్రానుగుణముగ వీనిని ప్రయోగించినారు. కూచిపూడి భాగవతులు, గద్దిపాటి భాగవతులు ప్రదర్శించు భామాకలాపమునకు, 'అసాది' తెగవారు ప్రదర్శించు చెంచునాటకమునకు పోలికలు కలవు. పాత్రల ఆహార్యవిషయమున కూచిపూడివారి పద్ధతులు ప్రసిద్ధికెక్కినవి. కాని వీరు దేశద్రిమ్మరులగుటచే రంగస్థలవిషయమున వీరు శ్రద్ధ చూపలేదు.

కన్నడ యక్షగాన నాటకముల ప్రదర్శనమునుగురించి ముట్నూరి సంగమేశంగారు 'కన్నడ యక్షగానము' అను వ్యాసమునందు వివరముగా తెల్పియున్నారు. కన్నడములో యక్షగాన వాఙ్మయకర్తగా ప్రసిద్ధికెక్కిన పార్తి సుబ్బన్న (క్రీ.శ. 1760-1824) అనునతడు రామాయణకథకు సంబంధించిన యక్షగానము లెన్నిటినో రచించినాడు. అతని కాలమునాటికే కన్నడదేశములో పూర్వరంగప్రదర్శనమునకు కావలసిన కలాపము 'సభాలక్షణ' మనుపేరుతో గ్రంథరూపమున ప్రసిద్ధి చెందియున్నది. పార్తి సుబ్బన్న దీనిననుసరించి తన నాటకప్రదర్శనలలో పూర్వరంగమును జోడించినాడు. ఈ సభాలక్షణములోని కొన్ని పాటలు, మాటలు తెలుగు యక్షగానములందలి పూర్వరంగములో వినిపించునట్టివే. సంప్రదాయముకూడ సజాతీయమైనట్టిదే. ఇష్టదేవతాప్రార్థన, బాలగోపాల ఇంద్ర అర్ధనారీశ్వర వేషముల ప్రవేశము, కోడంగి హాస్యము, యక్షిణీ (స్త్రీవేషము) నృత్యము, కథాప్రారంభము, పాత్రలు తెర బయలుదేరుట, వచ్చిన ప్రతిపాత్రను పృచ్ఛించి ఊరుపేరులను రాబట్టి సభ కెరుకపరచుట, నృత్యగానములతో ప్రవేశించి నృత్యగానముల తోడనే తమ నాదము వెల్లడించుట మొదలగు లక్షణములు కన్నడ బయలాటల లోను, తెలుగు వీథినాటకములలోను సమానముగ కనుపించునట్టివే.

కన్నడ యక్షగాన నాటకములలో వీరరసాభినయమునకు ప్రాధాన్యమెక్కువ. ఆరభటీవృత్తి ప్రదర్శనములోను, యుద్ధదృశ్యములను అభినయించుట

లోను కన్నడ భాగవతుల ప్రత్యేక ప్రజ్ఞ గోచరించును. వీరరసోచితమైన భీష్మ విజయము, విరాటపర్వము, ద్రౌపదీప్రతాపము, వాలినిగ్రహము, అతికాయవధ మొదలగు యక్షగాన నాటకములనే కన్నడిగులు అభినయింతురు. మోహినీ రుక్మాంగదవంటి శాంతప్రధాన కథలోకూడ వీరు సాత్వతీ ఆరభటీ వృత్తులకు ప్రాముఖ్యమును కల్పించుకొని నటింతురు. అందువలన కన్నడ యక్షగాన నాటకములలో శృంగారమునకు ఆదరము తక్కువ అని చెప్పవచ్చును. వీనియందు స్త్రీపాత్ర ఉపేక్షింపబడినవి. నాయకునికంటె ప్రతినాయకునివేషము సభారంజకముగా నుండును. కన్నడ నాటకములలో హాస్యమున కంత విలువలేదు.

డాక్టర్ కె. యస్. కారంత్‌గారు కన్నడ యక్షగానములపై పరిశోధనచేసి వాని ప్రదర్శనవ్యాప్తికి మిక్కిలి తోడ్పడినారు. అతనివలన యక్షగానరూపకమునకు ప్రపంచఖ్యాతి చేకూరినది. కారంత్ రచించిన 'యక్షగాన బయలాట'ను కేంద్ర సాహిత్య అకాడమి 1958 లో గుర్తించి గౌరవించినది. నలదమయంతి, కనకాంగి అను యక్షగానములు 'కారంత్' దర్శకత్వముక్రింద ఇటీవల బొంబాయిలో ప్రదర్శింపబడినవి. కన్నడదేశములో సంగీత నాటక అకాడమీవారు యక్షగానబృందములకు తర్ఫీదునిచ్చి భారతదేశమునందలి ఇతరప్రాంతములందు కన్నడ యక్షగానములను ప్రదర్శించుచున్నారు. రానురాను కన్నడ యక్షగానములలో సంభాషణలు కూడ వదలివేయబడుచున్నవి.

తెలుగు వీథినాటకములలోని నటకులు కన్నడ బయలాటలలోని నటకుల మాదిరి మూగనోముపట్టి నటించరు. తెలుగు వీథినాటకములలో పాత్రలు స్వయముగా ప్రవేశగీతములు పాడి, ప్రవేశనృత్యములు నెరపును. భరతుడు చెప్పిన ప్రవేశిక, నిష్క్రామణాదిధ్రువములు తెలుగు వీథినాటకపు దరువులలో నిర్వహింపబడినంత చక్కగా కన్నడ యక్షగాన నాటకములలో నిర్వహింపబడవు. తెలుగు వీథినాటకములలో పాటకు విలువ. కన్నడ వీథినాటకములలో మాటకు విలువ. తెలుగువారు లాస్యమును ఆదరించినారు. కన్నడిగులు తాండవమును ఆదరించినారు. కన్నడదేశమున ఈనాడు యక్షగానము 'తాళ మద్దల' యనుపేరుతో హరికథవలె వ్యాఖ్యానింపబడుటయును కలదు.

క్రీ. శ. 19 వ శతాబ్దిలో వీథినాటకములను ప్రదర్శించెడి మేళము లనేకములు వెలసినవి. పుట్టుదేశపువారి మేళము. లేపాక్షివారి మేళము, వేములపల్లివారి మేళము, ధర్మపురివారి మేళము, తాడిపత్రివారి మేళము, పడకండ్ల స్వామిరాయకవి

మేళము త్వరకవి రామకృష్ణయ్యగారి మేళము (నెల్లూరు మండలము). చక్క-లూరివారి మేళము. దేమవకొండవారి మేళము. సంకవేలూరివారి మేళము. తిట్రి కంటివారి మేళము. భాగవతుల రంగయ్యగారి మేళము మొదలగునవి. ఈ నాటక సాంఘికులందరును చక్కని పండితులు. వీరు తమ మేళములతో సంచారము లొనర్చుచు ప్రదర్శనము లొసంగినారు. వీరియొద్ద పనిచేసి ప్రయోగరహస్యము లను గ్రహించి వెళ్ళిన మరికొందరు మరికొన్ని మేళములను ఏర్పాటుచేసినారు. అట్లేర్పడినవే గొల్ల భాగవతులు. సిద్ధ్రక కుంట్లు భాగవతులు. యానాది భాగవతులు మొదలగువారి మేళములు.

పై మేళములలోని వారందరును పురుషులే. పదకండ్లవారి మేళములో మాత్రము స్త్రీలుకూడ నుండెడివారట; కాని ఇది చాల అరుదు. తంజావూరులోని 'నాటకవేషధారి జాస్తా'లలోకూడ స్త్రీలు కన్పట్టరు. కాని, క్రీ. శ. 1900 ప్రాంత ముల కేవలము స్త్రీలమేళములే కొన్ని బయలుదేరినవి. వీరు కళావంతుల కుటుంబ ములకు చెందినవారు; గురువులుమాత్రము బ్రాహ్మణులే. తెలంగాణములోని వీథి నాటక ప్రదర్శనములందుకూడ స్త్రీలకు ప్రవేశము కలదు. ఆధునిక రంగస్థల నాటక ప్రదర్శనములు ప్రముఖస్థానము వహించియున్నను నేటికిని పల్లెపట్టులలో వీథి నాటక ప్రదర్శనములు విరివిగ సాగుచునేయున్నవి. ఇట్లు వీథినాటకములను దేశి రచనలు పండిత పామర రంజకములైనవని చెప్పవచ్చును.

## (15) కథకళి - యక్షగానము :

మలయాళములో మిక్కిలి వ్యాప్తినందిన నృత్యప్రదర్శనములు 'కూడి యాట్టం', కథకళి అనునవి. 'కూడియాట్టం' అనగా సామూహికనృత్యమని అర్థము. ఈ కూడియాట్టములో కొన్ని సాంకేతికమైన మార్పులుచేసి అట్టప్రకారము లేక క్రమదీపిక అని పిలువసాగినారు. క్రీ. శ. 13 వ శతాబ్దపు ఉత్తరార్ధములో కుల శేఖరవర్మ, భాస్కర రవివర్మ అనువారు ఈ అట్టప్రకారములను మణిప్రవాళ శైలిలో రచించినారు.

మలయాళములో క్రీ. శ. 17, 18 శతాబ్దములందు 'కథకళి' నృత్యప్రదర్శ నము బహుళవ్యాప్తి పొందినది. అట్టకథాప్రకారములను రంగస్థలముపై ప్రదర్శిం చుటను కథకళి అని అందురు. 'కళి' అనగా నాటకమని అర్థము. కథతోచేర్చి నాట్యమును ప్రదర్శించుట కథకళిలోని ముఖ్యవిశేషము. అట్టకథలో కథకుమాత్రమే

ప్రాముఖ్యముండును. కథకళిలో ప్రదర్శనమునకు, సాహిత్యమునకుకూడ ప్రాముఖ్య మీయబడినది.

కథకళి యక్షగానముల భేద సాదృశ్యములనుగురించి కోరాడ రామకృష్ణయ్య గారు 'Telugu Literature outside the Telugu country' (Page 19) అను గ్రంథములోని 'Yakshagana and Desi' అను ప్రకరణమునం దిట్లు వ్రాసినారు.

"This Veedhinataka in Telugu may be said to be only a counterpart of the Malabar Kathakali, but with this difference, that while in the Telugu Veedhinataka the actors speak and take to singing the songs whose meaning they also seek to interpret by means of gestures-ie, by Abhinaya; the kathakali actors enact the whole story by means of mute abhinaya leaving speaches and songs entirely to the troup behind them, who supply the musical and and other accompaniments necessary for the successful enactment of the drama. The dress, the make up, the method of performance, and all their paraphermalia required for the enactment seems to point towards the identity of their origin, though there may be some minor differences due to later independent developments."

యక్షగాన ప్రాయములగు కన్నడదేశపు బయలాటలపైనను, మెలట్టూరు భాగవతమేళ నాటకములపైనను కథకళి ప్రత్యేకత ప్రభావము కొంత కలదు. బయలాటలందును, యక్షగానములందును 'కథకళి' నృత్యవైఖరి యందువలెనే పాటలు, పద్యములు, దరువులు కలవు. శబ్దాలంకారముల కధిక ప్రాధాన్య మిందు కలదు. ఆహార్యాభినయము అన్నిటియందును నొకటే. వీథినాటకములందు వాచిక మెక్కువ. కథకళి ప్రత్యేకత మూకాభినయము. ఇందు వంతపాటగాండ్రు వాచికమును పూర్తి చేయుదురు. కన్నడములోని బయలాటలందును కథకళియందువలెనే పురుషపాత్రముల పాటలన్నియును వెనుక (వంత) పాటగాండ్రు పాడుదురు. కన్నడమువ పార్తి సుబ్బన్న (క్రీ. శ. 1760_1820) అనునతడు కేవల కవిమాత్రుడే కాడు. గాయకుడు, నటుడుకూడ. అతడు కథకళి నాట్యమునుండి అనేకసంప్రదాయములను గ్రహించి కన్నడ యక్షగానమేళముల నెలకొల్పి నడిపించినాడు. వేషధారణము, మూకనృత్యము మొదలగు విషయములందేగాక చండీవాద్యము, జేగంట మొదలైన వాద్యసంగ్రహణలోకూడ కన్నడ యక్షగాన నాటకములు కథకళిని అనుసరించినవి.

ఇది పార్తి సుబ్బన్నకాలమున యేర్పడిన సంప్రదాయమే. కన్నడ బయలాటలందు పాడవలసిన కలాపమంతయు భాగవతారు (సూత్రధారుడు) పాడును. అతడు పాడు చున్నసమయములో నటులు మూకనృత్యాభినయములు ప్రదర్శింతురు. పాట ముగి సినపిదప ఆ పాటలోనిభావమును నటులు తమ స్వంతవాక్యములలో పేర్చి సంభాషణ శైలిలో వివిపింతురు. దీనివిబట్టి కన్నడ బయలాటలలో మూకనృత్యము జరుగు చున్నపుడు కథకళిని, సంభాషణము జరుగుచున్నపుడు యక్షగాన నాటకమును స్మరింపజేయుచుండును.

సాధారణముగా దేవాలయములలో జరుగుచుండు కథకళి ప్రదర్శనములు కూడ బయలాటలవలె రాత్రి ఎనిమిదిగంటలకు ప్రారంభమై తెల్లవారుజామున అయిదుగంటలవరకు ప్రదర్శన సాగుచుండును. ఈ ప్రదర్శనలకు తెరలు మొద లయినసదకరములతో నిమిత్తము లేదు. మామూలు నేలమీదనే ఏవిధమైన అలం కారములు, ఆడంబరములు లేకుండగనే నాట్యము ప్రదర్శింపవచ్చును.

## (16) మేలట్టూరు భాగవత మేళనాటకములు - కథకళి:

తంజావూరున రాజాశ్రితులు కాని నారాయణతీర్థులు, త్యాగరాజు (క్రీ. శ. 1759-1847) మేలత్తూరు వెంకటరామశాస్త్రి మొదలగు యక్షగానకవులును వెలసి నారు. వీరిలో వెంకటరామశాస్త్రి కృతులను మేలత్తూరు భాగవతమేళ నాటకము లందురు. ఇవి రచనాప్రక్రియలో తంజావూరు యక్షగానములను బోలినను ప్రద ర్శనప్రక్రియ, సంప్రదాయములలో 'కథకళి'వలె విశిష్టమైనవి. వీనికి నృత్యనాటక ములని పేరు. ఇవి బ్రాహ్మణ భాగవతమేళములచేమాత్రమే ప్రదర్శింపబడును. కథకళి కళాసాంప్రదాయ ప్రతిష్ఠ పరాకాష్ఠనందుటకు కారణభూతుడైన త్రయమ్మణ తంపి మెలత్తూరు వెంకటరామశాస్త్రి సమకాలికుడే.

తమిళనాడులో తెరికూత్తులేకాక తంజావూరుజిల్లాలో మెలత్తూరు యక్షగాన ములు వ్యాప్తినొందినవి. మెలత్తూరు భాగవతమేళ నాటకములలో ప్రదర్శనసంప్ర దాయమున కూచిపూడివారివి, ప్రదర్శన ప్రవర్తనలోను, రచనాప్రక్రియలోను శహాజీ యక్షగాన నాటకములను పోలియున్నవని డా. యస్వీ జోగారావు తెల్పి నారు. [13] నృత్యప్రధానములగుటచే నృత్యనాటకములవి. భాగవతులైన నట బృందమువారు ప్రదర్శించుటవలన భాగవతమేళనాటకములవి వీనివి వ్యవహరిం

13. మెలత్తూరు భాగవత మేళనాటకములు - భారతి-సెప్టెంబరు, 1955.

తురు. కూచిపూడివారివలెనే ఈ భాగవతులందరును బ్రాహ్మణులే. ఈ నాటకములు మెలత్తూరునందలి వరదరాజ దేవాలయప్రాంగణమున ఒక పెద్ద పందిరిలో వైశాఖమున వసంతోత్సవకాలమున నృసింహజయంతినాడు ప్రహ్లాదనాటకముతో ప్రారంభింపబడును. ఇవి వరుసగా ఆయిదారురాత్రులు మధ్యలో ఒకనాటి విరామముతో ప్రదర్శింపబడును.

మెలట్టూరి వేషధారణలో వర్ణవైశిష్ట్యము (Colour values) పాటింపబడును. రాజవేషములు తంజావూరి రాజులకు అనుకరణగా నుండును. మృదంగము, తిత్తి, ముఖవీణ, సూత్రధారునిచేతి తాళముచిప్పలు - ఇవి వారి ముఖ్యమైన వాద్యములు. నాటకము రాత్రి సుమారు పదిగంటలకు ప్రారంభింతురు. 'నట్టువాంగం' (హంగు) జరుపు భాగవతులిద్దరు, ముగ్గురు పాటగాండ్రు, జంత్రగాండ్రు, గ్రాంథికుడు లేక ప్రసంగి (అనగా సంధివచనాదులను చదివెడువాడు) - వీరు హంగుదారులు. జంత్రగాండ్రు సర్వము సిద్ధమయినదనగానే భాగవతులు ధ్యానశ్లోకములను పఠింతురు. వెంటనే 'తై తై' మనుకొనుచు 'కోణంగి' రంగమునకు వచ్చును. సూత్రధారిచే పృచ్ఛితుడై వసంతోత్సవ కార్యక్రమము జరిపించుటకై సభవారిని హెచ్చరింపవచ్చితి ననును. అటుతరువాత భాగవతులు 'తోడై మంగళము'ను (తాళ్ళపాక చిన్నన్న రచించిన కీర్తనపంచకము) పఠింతురు. ఇక్కడి కిదియంతయు 'మేళం కట్టుదల్' అనగా పూర్వరంగ నిర్వహణము.

అటుతరువాత 'ప్రసంగి' వచ్చి కథాసంగ్రహవిషయికమైన 'అవి ద్విపద'ను రాగమాలికలో పఠించి, ఒక వచనమున వినాయకపాత్ర ప్రవేశసూచనచేసి, ఒక 'జతి' చెప్పును. భాగవతులు ప్రావేశికీధ్రువను పఠింతురు. తదనుగుణముగా నృత్యముచేయుచు గణపతిపాత్ర ప్రవేశించును. 'పండారకురుక్కళులు' (పూజారులు)చే పూజలందుకొని నృత్యముచేయుచు గణపతిపాత్రధారి నిష్క్రమించును. అటుపిమ్మట ప్రసంగి జాతియుక్తముగా ఒక వచనమును పఠించి సభవారికి రాజుగారి రాకను హెచ్చరింపవచ్చు కటికవానిప్రవేశమును సూచించును. అతడు భాగవత దరువుల కనుగుణముగ నృత్యముచేయుచు ప్రవేశించును. శహాజీ యక్షగాన నాటకములలో కటికవాడు ఒక సాంప్రదాయికపాత్ర కటికవాడు నిష్క్రమించిన తరువాత క్రమముగా సూచన వర్ణనలైనవెంటనే కథాపాత్రలు ధ్రువానుగుణనృత్యముతో ప్రవేశించి నాటకప్రవర్తనలో పాల్గొందురు. కూచిపూడి ప్రదర్శనములందువలె నాయికపాత్రధారి మొదట నర్తనకళాప్రావీణ్యమును ప్రదర్శింపవలెను.

ప్రసంగి నాటకములోని సంధివచనములవేకాక వర్ణనాత్మకములయిన ద్విపదలనుకూడ చదువును. సంవాదాత్మకములైన ద్విపదలు, పద్యములుమాత్రమే పాత్రలచే పఠింపబడును. నృత్యప్రధానములయిన నాటకములగుటచే పాత్రధారి నృత్యప్రధానముగ నటించవలెను. సూత్రధారుడే పాత్రల దరువులను పఠించును. పాత్రధారులు, సూత్రధారుడు, హంగుదారులవంతల కనుగుణముగ అభినయము చేయుచుందురు. ఈ విషయమున ఇది కథకళికి సన్నిహితమయినది. కథకళిలో కేవలము ఆంగికాభినయమే ప్రధానము. కథకళియందు వాచికము పూర్తిగా పరిహరింపబడును.

ఇట్లు యక్షగానమునకు కథకళికి గల సాదృశ్యము ఆ తరగతికి చెందిన దేశిరూపములన్నిటికి సరిపోవునట్టిదేకాని విశేషమేమియు కానరాదు. కన్నడ బయలాటలపై, మేలత్తూరు భాగవతమేళ నాటకములపై కథకళి ప్రభావము కొంత యున్నది. కాని తెలుగు యక్షగానములపై కథకళి ప్రభావము కన్పట్టదు. పైగా కథకళి తెలుగు యక్షగానములవలె ప్రాచీనమయినది కాదు. కథకళినిగురించి కె. ఆర్. పిషరోడి ఇట్లు తెల్పియున్నాడు.

"We shall not be far from the truth if we place this in the latter half of the 17th century... It is quite probable that this new variety must have been devised, some where in the sixth decade of the 17th century."(14)

కథకళి సాహిత్యములో మొట్టమొదటివాడు కొట్టారక్కారతంబురాన్ (క్రీ. 1575-1650). అతడు క్రీ. శ. 17 వ శతాబ్దపు ఉత్తరార్ధములో జీవించినాడని కొందరు, క్రీ. శ. 18 వ శతాబ్దపు పూర్వార్ధములో జీవించినాడని కొందరు చెప్పుదురు. దీనినిబట్టి మలయాళసాహిత్యమున కథకళిచరిత్ర క్రీ. శ. 16 వ శతాబ్ది ముందటిది కాదని చెప్పవచ్చును. కథకళి పుట్టుటకుముందే తెలుగు కన్నడములలో యక్షగానరచన ఆరంభమై సాగుచుండినది. పైగా కథకళి యక్షగాన నామోత్పత్తిని సమర్థింపజాలదుకూడ.

(17) కొరవంజి యక్షగానములు :

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు కొరవంజుల పుట్టుకనుగురించి సుగ్రీవవిజయ యక్షగానపీఠిక (పుట 4) యం దిట్లు వ్రాసినారు. "తొలుత ద్రావిడభాషలలో వెల

(14) See. vide. "South Indian Theatre - By K. R. Pisharoti chap. IX of "The Theatre of the Hindus - Published by Susil Gupta, Ltd. Calcutta-12 (1955).

పిన దృశ్యరచనలు కురవంజు లనఁబడినవి. ఆంధ్ర కర్ణాట ద్రవిడదేశముల యరణ్యములలో వసించు నాటవికులు, చెంచులు, కురవలు (కోవ, కోయ) అనువారు. అందు కురవజాతివారి యంజె - అడుగు (నృత్యవిశేషము) 'కురవంజె' అనఁబడెను.

తమిళ కన్నడాంధ్ర నిఘంటువులందు 'కొరవంజి' శబ్దమునకు 'కొరవజాతి స్త్రీ' అను నర్థము కలదు. తమిళభాషయందు 'వంజి' అనగా 'స్త్రీ' అని అర్థము.

1. Madras University Tamil Lexicon :—

Kuṙa - Vañci - woman of the Kurava tribe; fortune teller. A kind of dramatic poem. Vañci (వంజి)=woman.

I bid. Kuravan. n [T. Korava, K. Korava, M. Kuravan] In habitant of the hilly tract, of the desert tract; Kurava, a caste of fowlers, snake catchers, basket makers and fortune tellers, Kuravi. n. [K. Koravanji] a woman of Kurava caste.

Kuri V. tr. To foretell, predict, forebode; n. omen, presage.

2. కొఱవంజి - (కొఱవతి - కొఱవితి) A female of the Koravas, who commonly is a fortune teller. (కుఱవంజి, కుఱత్తి.)

—(F. Kittal's Kannada - English Dictionary)

3. (a) (కుఱవంజి) A gypsy. A gypsy dance; (C. P. Brown's Telugu - English Dictionary)

(b) (లేక) కుఱవంజి - కొరవజాతి స్త్రీ. ఎఱుకుది (సూర్యరాయాంధ్ర నిఘంటువు).

(c) - 'కొరవంజి అను పాత్రప్రవేశముగల యక్షగానరచనకు కొరవంజి అని పేరు'.—ఆంధ్ర వాఙ్మయ సూచిక.

కొరవజాతులవారు చేయు నృత్యములు కొరవంజాలు. తెలుగులో మొట్ట మొదటిసారిగా అయ్యలరాజు రామభద్రుని (క్రీ. శ. 1500-1580) రామాభ్యుదయము (2-131) నందు 'అణువిభమధ్యలా క్రియలు నా పరిభాషలు నొప్పఁ జిందు, జక్కిణి, కొరవంజి మేళములఁ గేళి సల్పిరి' అని 'జక్కిణి' తోపాటు 'కొరవంజి' ఒక నాట్యభేదముగ పేర్కొనబడినది. తెలుగు యక్షగానములలో 'కొరవంజి'

పాత్ర విజయరాఘవుని (క్రీ. శ. 1631-1673) కాలమునుండి కన్పట్టుచున్నది. విజయరాఘవున కంకితముగా వెలసిన మన్నారు దాసవిలాసము, విజయరాఘవ చంద్రికావిహారము, విజయరాఘవ కల్యాణము అను యక్షగాన నాటకములందు ఎఱుకఘట్టము కలదు. విజయరాఘవ చంద్రికావిహారము, విజయరాఘవ కల్యాణములందు ఎఱుకత కురవంజిగా పేర్కొనబడినది. ఈ రెండు యక్షగానములందును కొరవంజి వేషభాషలు వర్ణితములైన దరువులకు 'కొరవంజి దరువు' లని యుండుట ఒక విశేషము. 'చెంగల్వరాయ (1684-1710) విరచితమగు "నెఱుకుల కథ" (15) లో నెఱుకుల యాచారవ్యవహారములు నాహారవిహారములం గూర్చిన వివరాలు కలవు. ఎఱుకులకే "కొఱవంజా" లనియుం 'గొఱవత' లనియుం 'గొరతి' యనియు 'పింగి' యనియుం బర్యాయవ్యవహార నామములున్నటులా గ్రంథమువలనం దెలియుచున్నది. (16) అని ఆచార్య తూమాటి దొణప్పగారు వ్రాసినారు. దక్షిణ హిందూదేశమునందలి ఒక దేశద్రిమ్మరి తెగ కొరవజాతి. దక్షిణమున కొరవలని, ఆంధ్రదేశమున ఎఱుకలని వీరిని వ్యవహరింతురు. వీరిభాష తమిళ కర్ణాటాంధ్ర భాషలను కలగాపులగముగా చేసినట్లుండును. కొరవలకు ఎరుకలకును కొల్లాపురమ్మను కొల్చుట, ఎఱుక చెప్పుట ప్రధానవృత్తి. తెలుగుదేశపు ఎఱుకలవిషయమున వృత్తివాచకమైన శబ్దమే జాతివాచకముగా వారికి పరిణమించినది. ఈ విషయములను ఇ. థర్స్టను (E. Thurston) గారు 'Castes and Tribes of South India' అను గ్రంథమున తెల్పియున్నారు.

'కొరవంజె యన్నపేరు తొలుత వారి నృత్యమునకును పిదప నృత్యవిశిష్టమయినవారి చిన్నిచిన్ని గేయరచనలకును, నాపై కురవజాతివారికివిగూడ బేరైనది. కురవజాతివారు తొలుత చేయునృత్యవిశేషము కాలక్రమమున నాయా పర్వత ప్రదేశముల స్థలమాహాత్మ్యకథలతోను, శివ విష్ణు లీలాకథలతోను మిశ్రితములయి గేయ విశిష్ట నాట్యరూపములను పడసెను' అని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సుగ్రీవ విజయ యక్షగాన పీఠికయందు తెల్పినారు.

'కొరవంజి' ద్రావిడసామాన్యమగు నృత్యవిశేషము. తమిళమునందలి 'కురవైకూత్తు' మలయాళమునందలి 'కొఱత్తియాట్టం' లు కొరవపడుచులు

15. 486, ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారి వ్రాతప్రతి, 10 వ సంపు.

16. 'యక్షగానములు: ప్రాచీనాంధ్ర నాటకస్వరూపము' - జానపదకళాసంపద (మొదటి సంపుటము) పుట. 38.

నట్టి నాట్యవిశేషములే కొలుత్తి కొర్తి అనగా మలయాళమున కురవపడుచని అర్థము.

"Kuravai: *n.* Dance in a circle prevalent among the women of sylvan or hill tracts; chorus of shrill sound made by wagging the tongue. Uttered on festive occasions" అని Tamil Lexicon లోని వివరణ.

'కురవై' ప్రాయికముగా కురవల జాతీయ నృత్తవిశేషమైయుండునని వలువుర పండితుల అభిప్రాయము. అది బహుళభంగులుగా నుండునని శిలప్పది గారము (క్రీ. శ. 2 వ శతాబ్ది) ను బట్టి తెలియుచున్నది. కాని శిలప్పదిగారమున రెండువిధములగు 'కురవై'లు మాత్రమే పేర్కొనబడినవి. ఆయరులు (గొల్లలు) విష్ణువును లేదా కృష్ణుని ప్రార్థించుచు చేయు కురవై (నృత్యము) ఆయచ్చియర్ కురవై, మురుగన్ (సుబ్రహ్మణ్యస్వామి) ప్రశంసాత్మకముగా కొండజాతికన్యలు (కొరవంజులు) చేయు నృత్యమును 'కున్రక్కురవై' అందురు. ఈ రెండింటికిని ప్రక్రియలో కొంత భేదమున్నను అవి రాసక్రీడకు సన్నిహితముగా నుండునని చెప్పుదురు. ఇవికాక మరికొన్ని 'కురవైక్కూత్తు'లు కూడ తమిళమున ప్రచారమందున్నవి. కార్క్కురవై అనునది శీతకాలానుగుణమైన గీతనృత్యములు కలది. ప్రిణక్కురవై, మున్రెక్కురవై అనునవి రణజయసూచకముగా రథ సన్నిధిని జరుగు నృత్యగీతములు. ఇవికాక కొట్టవై (దేవత?) గౌరవార్థము జరుపబడు 'కూత్తు' ఒకటి కలదనికూడ వి. ఆర్. రామచంద్రదీక్షితార్‌గారు తెల్పియున్నారు.

పైని పేర్కొనిన అంశములనుబట్టి 'కున్రక్కురవై' అనునది కొరవంజులకు సంబంధించిన నృత్యవిశేషమని తెలియుచున్నది.

పన్నిరుప్పాట్టియల్, ఇళక్కణవిందనై మొదలగు తమిళలక్షణ గ్రంథములందు 'కుఱత్తిప్పాట్టు' (కుఱవతపాట) పేర్కొనబడినది. అది మొదట 'కుఱత్తి' చెప్పు 'కురి' (ఎఱుక) విషయముగాగల 'కురమ్' అను పద్యరూపమున నుండెడిది. ఈ 'కురమ్' తరువాత 'కలంబకమ్' అను ప్రబంధమున ఒక అంకముగా పరిగణింపబడినది. ఆటుతరువాత ఇది 'కురవంజి' దృశ్యరచనగ పరిణమించినది. త్రికూట రాశప్పకవిరాయర్ (క్రీ. శ. 18 వ శతాబ్ది) రచించిన 'తిరుకుట్రాన క్కురవంజి' అనునది తమిళ కురవంజులలో మిక్కిలి ప్రసిద్ధిచెందినది. తమిళ వాఙ్మయములో క్రీ. శ. 16 వ శతాబ్దములోకాని, ఆ వెనువెంటనే కాని 'కురవై

కూ_త్తు' ఒక దృశ్యరచనగా లేదా ఒక సాహిత్యప్రక్రియగా రూపొందినట్లు చెప్పదగిన ఆధారములు కన్పట్టవు.

కొరవంజియే యక్షగానముగ పరిణమించినదని వేటూరి ప్రభాకరశాస్త్రిగారి వాదము. వేటూరివారి కొరవంజి_యక్షగాన సంబంధవాదమును సమర్థించిన వారిలో ముఖ్యులు - చింతా దీక్షితులు, ఖండవల్లి లక్ష్మీరంజనము, తూమాటి దొణప్పగార్లు.

చింతా దీక్షితులు 'కొరవంజి' వ్యాసము (ఆంధ్రపత్రిక ప్రమాది సంవత్సరాది సంచిక) నం దిట్లు వ్రాసినారు.

'కొన్ని యక్షగానాలలో కొరవంజిపాత్ర వుంటుంది. అట్టి యక్షగానాలకు కొరవంజులని పేరు....తెలుగు యక్షగానాలు ప్రశస్తమైన వాఙ్మయశాఖ అవిన్నీ. ద్రావిడవాఙ్మయంతో సంబంధం కలవి అవిన్నీ వెల్లడి అవుతోంది.'

ఖండవల్లి లక్ష్మీరంజనంగారు 'రూపకావిర్భావములో మొదటిదశ కురవంజులు వెడలుట....కురవల నాటకములు రూపకనిర్మాణములో ప్రథమ ప్రజా ప్రయత్నములగుటచే ఇవి అసంస్కృతములై యుండుట సహజము....కురవంజులు ఆటవికులమూలమున పట్టణములకు ప్రాకి, నగరకవులు కురవంజులవంటి రచనలు చేయసాగిరి. వీటిని ప్రదర్శించువారు జక్కులు గనుక నివి యక్షగానములను పేరు దాల్చెను' అని ఆంధ్రసాహిత్యచరిత్ర సంగ్రహము (పుటలు 262-264) నందు తెల్పినారు.

తూమాటి దొణప్పగారు 'యక్షగానమునకుఁ గొరవంజికిని జన్యజనక భావము లేదనుటయు సరికాదు' అని 'యక్షగానములు - ప్రాచీనాంధ్రనాటక స్వరూపము' జానపదకళాసంపద (పుట 39) అను గ్రంథమునందు వ్రాసినారు.

కాని పైన పేర్కొనిన వారందరు వేటూరి ప్రభాకరశాస్త్రిగారివలె యక్షగాన నామోత్పత్తివిషయమున జక్కులజాతి సంబంధమును అంగీకరించినవారే. కేవలము కురవల అంజెయే దృశ్యరచనమునకు మూలమనుటయు సత్యసమ్మతము కాదు. 'కొరవంజి' శబ్దము యక్షగాన నామోత్పత్తిని సమర్థించదు. కనుక కొరవంజియే యక్షగానమునకు పూర్వరూపమనుట సమర్థనీయము కాదు.

ముట్నూరి సంగమేశంగారు కన్నడములోని కొరవంజులను మూడువిధములుగా విభజించి వివరించినారు. [17] ఈ విభజనము సమంజసముగా కన్పట్టు

17. 'కన్నడ యక్షగానములు' - భారతి - ఫిబ్రవరి, 1958.

చున్నది. 'కొరవంజి యక్షగానాలు ముఖ్యవిధాల కన్పిస్తాయి. కొరవంజి, కొరవ నాయకుల ప్రణయవృత్తాంతాన్నే వర్ణించేవి మొదటిరకం. ఇందులో చెంచులక్ష్మి (కొరవంజి)ని నృసింహస్వామి (కొరవనాయకుడు) వలచి వరించినగాథ వర్ణించ బడుతుంది. కొరవంజిని సింగి అనీ, కొరవనాయకుని సింగడనీ యిందులో వ్యవహ రిస్తారు. తెలుగులో గరుడాచలమాహాత్మ్యం, చోడిగాని కలాపం వగైరా రచన లిట్టివి. విశాఖమండలంలో ప్రదర్శింపబడే ఎఱుకలకీర్తన యీ చోడిగాని కలాపమే. ఈ కథలోగల ప్రణయఘట్టం యీ పాత్రలు మిగిలిన కొరవంజి రచనలన్నిటికీ మూలాలు. లక్ష్మీనృసింహులకు బదులుగా పార్వతీ పరమేశ్వరులను ఎఱుక దంప తులుగా మార్చివ్రాసిన యక్షగానాలుకూడ దీని ననుకరించి వెలసిన రచనలే. శహాజీ మహారాజుగారు తెలుగులో వ్రాసిన కిరాతవిలాసమనే యక్షగాన మిట్టి అనుకరణమే.... ....

నాయకుడు ఎఱుకతవేషంతో పోయి, నాయికను కలసి, ఆమె హస్తరేఖలు పరీక్షించి, త్వరలో ఆమెకు అనుకూలుడైన భర్త దొరుకుతాడనిచెప్పి కొంత పూర్వరాగం ప్రదర్శించినట్లు వర్ణించిన రచనలు కొరవంజి రచనలలో రెండవ రకం. తెలుగులో రాములవారి ఎఱుక, సీతాకల్యాణం వగైరాలు, కన్నడంలో అర్జున కొరవంజి, కృష్ణకొరవంజి వగైరాలు యీరకమైన రచనలు.

ముఖ్యకథలో ఏవిధమైన సంబంధమూ లేకపోయినా ఏదోవిధంగా ఎఱుకత పాత్రకు ప్రవేశం కల్పించి ఆమెచేత నాయికకు సోదె చెప్పించడం, తదుపరి ఎఱుక రాజును ప్రవేశపెట్టి పరిహాసపూర్వకంగా వర్ణించడం, ఆమీద నా ఎఱుకదంపతుల వాదవివాదాలు ముతుకగా ఏకరువుపెట్టి ప్రదర్శించడం అనే ఘట్టాలు కల రచనలు మూడవరకమైన కొరవంజి రచనలు. ఈ రచనలలో ముఖ్యకథలో పూర్వభాగం ఎఱుకల సంవాదానికి పీఠికగా ఉపకరిస్తుంది. వీరిసంవాదం ముగిసినపిదప ముఖ్య కథలో మిగతాభాగం ఏదో అయిందంటే అయిందన్నట్లుగా పూర్తిచేయబడుతుంది. ఉదా: కన్నడంలోని పార్వతీ కురవంజి. తమిళభాషలోగల 'తిరుక్కుర్ర లక్కుర వంజి' అనేరచనలోకూడ కథ పార్వతీ కురవంజి కథలాగానే మధ్యలో ఆగిపో తుంది. అంటే ఈ కొరవలగొడవే యీ రచనలలో ప్రధానము.'

కన్నడములోని కురవంజులు పదిహేడవశతాబ్దమునకుమించి ప్రాచీన మని పించుకొనవు. ప్రాచీన కన్నడకావ్యములందు మొదట కొరవంజి నృత్యవర్ణనలు.

కొరవంజి పాత్రవర్ణనలు కన్పట్టుచున్నవి. అటుతరువాత యక్షగానములందును, వీథి నాటకములందును కొరవంజిపాత్రకు ప్రవేశము కలిగినది.

'కురవంజి' రూపధారణ తమిళప్రాంతమునకు చెందియున్నది. క్రీ. శ. 18 వ శతాబ్దమున తమిళమున వెలసిన యక్షగానములలో కురవంజిపాత్ర ఒకటి. కురవంజిలోనే నాటకరూపముకూడ కలదు. తమిళములోని కురవంజి తెలుగులోని చెంచునాటకమునవలె నుండును. సింగి సింగని సంవాదమే ఈ రూపకములో ప్రధానముగా నుండును. ఈ సంవాదములో వేదాంతము మొదలుకొని హాస్యమునకు కూడ ప్రవేశముండును. నవతులకయ్యమే ఆధారముగా గ్రహించి వెలువడిన 'పళ్ళు' అను రూపకముకూడ తమిళములో ఈ కాలమున వెలసినది. ఇది తెలుగులోని గంగా గౌరీ సంవాదమును బోలియుండును.

తెలుగు కొరవంజులలో మొట్టమొదటిది శహాజీ ఆస్థానకవియగు దర్భా గిరిరాజకవి (క్రీ. శ. 1684-1712) రచించిన రామమోహన కొరవంజి. ఇందు 'కొరవంజి', 'ఎఱుకత', 'సింగి' అనుపదములు సమానార్థకముగా ప్రయోగింపబడినవి. శంఠీరవ నరసరాజు (క్రీ. శ. 1704-1713) తెలుగులోనేకాక తమిళ కన్నడ ప్రాకృత భాషలందును కొరవంజులను రచించినాడు. కంఠీరవ నరసరాజు 'కొరవంజి కల్లె' యుండును. 'కొరవంజి' పాత్రకు ప్రాముఖ్యము కలదు.

తమిళ కర్ణాటాంధ్రములందు మూడింటను కొరవంజులు, యక్షగానములు రెండును వెలసినవి. ఈ దాక్షిణాత్యభాషలలో కొన్ని కొరవంజులు యక్షగానములనియే పేర్కొనబడినవి. 'పార్వతి కొరవంజి' అను కన్నడ కొరవంజి గ్రంథారంభమున 'కొరవంజికల్లె యక్షగానక్కె కథాప్రారంభ వదెంతనె' అని చెప్పబడినది. సన్నిధిరాజు జగ్గకవి తాను రచించిన 'ఎఱుకల కురవంజి' అను గ్రంథమును 'కురవంజి యక్షగాన మహాప్రబంధంబు' అని గ్రంథావతారికలోను, గ్రంథాంత గద్యయందును పేర్కొనినాడు. దీనినిబట్టి కొరవంజి, యక్షగానము రెండును రచనాప్రక్రియలో అభిన్నములని తెలియుచున్నది. కొరవంజిపాత్ర ప్రధానములయిన యక్షగానరచనలకే కొరవంజులని మరొక పేరని గ్రహింపవచ్చును.

కొరవంజులు అనాగరికులైన ఆటవికుల దృశ్యకావ్యరీతులు. యక్షగానములు సభ్యులయిన కవుల దృశ్యరచనలు. యక్షగానములలో నృత్యమునకంటె గేయమునకే ప్రాధాన్యము హెచ్చు. కురవంజులలో రెండు, మూడు పాత్రలు

మాత్రమే యుండును, యక్షగానములలో అనేకపాత్రలు ప్రవేశపెట్టబడును. హాస్యము కురవంజులందువలె యక్షగానములందును పొడచూపినది. కొరవంజులు వృత్తప్రధానముగను యక్షగానములు గేయ బాహుళ్యముగ నుండుట గమనింప దగినది.

(18) బొమ్మలాట - యక్షగానము :

పాల్కురికి సోమనాథుడు పండితారాధ్యచరిత్ర (పర్వత ప్రకరణము-పుట 435) లో,

'భారతాది కథలఁ జీరమఱుఁగుల
నారంగ బొమ్మల నాడించువారు;
కడు నద్భుతంబుగఁ గంబసూత్రంబు
లడరంగ బొమ్మల నాడించువారు.'

అని బొమ్మలాటలను పేర్కొనినాడు. క్రీ. శ. 12 వ శతాబ్దికిపూర్వమే బొమ్మలాటలు తెలుగుదేశమందు ప్రసిద్ధములై యుండెనని దీనివలన తెలియుచున్నది. బొమ్మలాటలు తోలుబొమ్మలాటలని, కొయ్యబొమ్మలాటలని రెండు విధములు. చీర మఱుగుల భారతాదికథల నాడించుట తోలుబొమ్మలాట. కంబసూత్రముల ఆట కట్టె బొమ్మలాట. బొమ్మలాట ప్రాచీనకాలమునుండి ఒక ప్రసిద్ధ జానపద వినోద కాలక్షేపముగ, విజ్ఞానవికాసమునకు ఆధారముగ, ఒక నిసర్గమనోజ్ఞ కళాస్వరూపముగ నుండుటయేగాక ధర్మప్రబోధసాధకముగ నుపయోగపడినట్లు తెలియుచున్నది. బొమ్మలాటలప్రశస్తిని, ప్రచారమునుగురించి ఆచార్య తూమాటి దోణప్పగారు 'బొమ్మలాట' అను వ్యాసము [18] నందు విపులముగ వివరించియున్నారు.

ఉత్సవసందర్భములలో వినోదమునకు, ధర్మప్రచారమునకు కొయ్యబొమ్మలాటలు, తోలుబొమ్మలాటలు విరివిగా ప్రదర్శింపబడుచుండెడివని అశోకుని ధౌలీ, గిర్నారు శిలాశాసనములు స్పష్టము చేయుచున్నవి. సర్గూజా సంస్థానము (మధ్య ప్రదేశ్) నందలి రామగిరి కొండలమీద కనుగొనబడిన సీతాబెంగాగుహలో క్రీ. పూ. రెండవశతాబ్దమునాటి శిలాశాసనము కలదు. ఈ గుహ ఛాయానాటక మందిరముగా నుపయోగపడినట్లు తెలియుచున్నది. అసురశిల్పియగు మయుని కుమార్తె సోమప్రభ మయనిర్మితములగు కీలుబొమ్మలను కొన్నిటిని కళింగసేనయను రాజ

18. తెలుగుసంస్కృతి - 3 వ సంపుటము - పుట 948.

నందినికి యిచ్చెనని కథాసరిత్సాగర కథనము ప్రకారము విదితమగుచున్నది. పార్వతీదేవి సృజించిన కీలుబొమ్మ అందచందముల కానందించి శివుడు దానికి ప్రాణము పోసెనని పరంపరాగతమగు ప్రతీతి కలదు. పర్వదినములందు నాగరక జనులు పాల్గొనవలసిన గోష్ఠివిశేషములనుగురించి వ్రాయుచు వాత్స్యాయనుడు పేర్కొనిన పాంచాలానుయానము బొమ్మలాటవంటిదయియుండునని చరిత్రకారు లూహించుచున్నారు. జయచంద్రుడను రాజు తన కుమారుడగు అమరచంద్రుని వివాహసందర్భమున కొయ్యబొమ్మలనాట్యము నేర్పాటుచేసెనని దేశములో ప్రచార మొందిన కొన్ని కథలనుబట్టి గ్రహింపవచ్చును. రాజశేఖరుని బాలరామాయణ నాటకములో పంచమాంకమున మాయాసీత, సిందూరికఅపాత్రల నిర్వహణము కీలుబొమ్మలమూలమున జరిగినట్లు కలదు. సుభటుని దూతాంగము, భవభూతి మహా వీరచరితము, రాజశేఖరుని బాలరామాయణము, జయదేవుని ప్రసన్నరాఘవమును ఛాయానాటకములుగా నాటబడుచుండెడివని పలువురి విమర్శకుల అభిప్రాయము. తూర్పిండియా దీవులలోని 'వాయంగ్' వినోదములు, సింహళమునందలి 'కలమ్ నాటిమ', తుర్కీదేశపు 'కరఘేజ్' ప్రదర్శనములు ఈ తెగకుచెందినవే. యూరపు ఖండమునందలి కొయ్యబొమ్మలాటలకు మాతృకలు ప్రాచ్యసీమలలోని బొమ్మ లాటలేయని పిషెల్ మొదలగు పండితులును అంగీకరించియున్నారు.

తెలుగునాట కొయ్యబొమ్మలాటలకుగల ప్రచారము చాల తక్కువ. కొయ్య బొమ్మలు బోలుబొమ్మలు. వివిధావయవములకు సూత్రములుకట్టి వానినన్నిటిని బొమ్మతలగుండాతెచ్చి ఒక యుంగరమునకుగూర్చి దానిని చేత నుంచుకొందురు. ఈ సూత్రములతో బొమ్మల నాడించుటకు చాల నేర్పు కావలెను. తెరముందు వీని నుంచి బొమ్మలాడించువారు తెరవెనుక ప్రేక్షకులకు కన్పింపకుండనుండి ఆడింతురు. వీరిని గంపెడుభాగవతు లందురు. తెలుగుదేశమున నేడవి చాల అపురూపము లయిపోయినవి. కేరళ, మైసూరు, రాజస్థానప్రాంతములలోమాత్రము అరుదుగా ప్రదర్శింపబడుచున్నవి.

కట్టెబొమ్మలాటలకు యూపద్వారతప్రసిద్ధి కలదు. కాని తోలుబొమ్మలాటలు కేవలము దక్షిణదేశమునకుమాత్రమే చెందినవని మహాభారతములోని 'రూపోప జీవనము' (XII-CCXCV 5) అనెడి పదమును వ్యాఖ్యానించుచు నీలకంఠపండి తుడు తెల్పియుండుట గమనార్హము. 'రూపోపజీవన' మనునది 'జాలమండపిక' అను పేర దాక్షిణాత్యులందు ప్రసిద్ధము. సూక్ష్మవస్త్రమునుకట్టి (దాని వెనుకనుండి)

చర్మమయములయిన ఆకారములతో రాజామాత్యులచర్యలు ప్రదర్శింపబడును. మరియు దాక్షిణాత్యులలో తెలుగువారే ఈ కళయందు సుప్రసిద్ధులగుట గమనింప దగినదని డాక్టర్ పి. యస్. ఆర్. అప్పారావుగారు 'తెలుగునాటక వికాసము' (దృశ్యకళారూపములు. పుట 147) నందు వ్రాసినారు.

తోలుబొమ్మలాటలను ప్రదర్శించువారు పశ్చిమాంధ్రప్రాంతములలో చాల వరకు మరాఠీవారు. వీరిని కన్నడదేశములో కి(షి)ళ్లెక్యా (ఖ్యా)త జాతివారని, పశ్చిమోత్తర తమిళమండలములలో కల్లెక్యాతవారని, తెలుగుదేశమున బొమ్మలాటవారు, చర్మనాటకులని వ్యవహరింతురు. ఆ ప్రాంతములందలి మరాఠీవారిని 'ఆరె'వారని పేర్కొందురు. పాల్కురికి సోమనాథుడుకూడ పండితారాధ్యచరిత్రలో శ్రీ పర్వత దర్శనోత్సవముల కేతెంచిన మహారాష్ట్రులను 'ఆరె' వారనియే వ్యవహరించినాడు. వీరి మాతృభాష అపభ్రంశ మహారాష్ట్రీ మాండలికము. దీనినిబట్టి బొమ్మలాటలు మహారాష్ట్రసంప్రదాయమునకు చెందియుండునని కొందరు తలంచిరి. కాని మహారాష్ట్రవాఙ్మయము క్రీ. శ. 14 వ శతాబ్దమునకంటె ప్రాచీనమైనది కాదు. తెలుగుదేశమునందు క్రీ. శ. 12 వ శతాబ్దమునకుముందే బొమ్మలాటప్రదర్శన లున్నట్లు పండితారాధ్యచరిత్రనుబట్టి తెలియుచున్నది కదా! పైగా 'ఆరె' వారికి భిన్నులగు జాతివారుకూడ మైసూరు, తిరువాన్కూరు ప్రాంతములందు బొమ్మలాటలను ప్రదర్శించుచున్నారు. మైసూరుసీమలో దేవజంగమములు బొంబాయి, మైసూరు సరిహద్దులలో 'కతుబు'లనువారు, మధుర, తంజాపుర మండలములలో 'కూత్తాడే' లను నట్టువజాతివారు, బళ్లారిలో కొన్నిప్రాంతములందు 'బలిజలు' మొదలగువారు ఆరెవారికంటె భిన్నులగు బొమ్మలాటకాండ్రు.

జావాద్వీపములలో తోలుబొమ్మలాటలు (Wayang purva) కొయ్య బొమ్మలాటలు (Wayang klitik) కలవని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తెల్పినారు.[19] మలయాళదేశమునందలి పావకూత్తు ప్రదర్శనము తోలుబొమ్మలాటలను బోలినది. మైసూరుప్రాంతమున నేటికిని కొయ్యబొమ్మలాటలు విరివిగ ప్రదర్శింపబడుచున్నవి.

కడప మండలమందలి కమలాపురముతాలూకా చిడిపిరాలగ్రామమున చంద్రయ్య యనునతడును (ఇతనిని బొమ్మలాట రయితు అనియందురు) బొమ్మ

19. 'జావాద్వీపవాసుల వినోదములు: వాయంగ్ ఆటలు' - చారిత్రకవ్యాసములు - పుటలు, 98-107.

లాట యమృతకవి యను వతడును తెరనాటకము లాడుటకై పెద్ద చిట్టయ్య యను వతని కొసంగిరని తెల్పు శాసనమొకటి కలదు. ఈ శాసనపాఠమును చాగంటి శేషయ్యగారు ఆంధ్రకవితరంగిణి (9 వ సంపుటము - పుట 246) లో పేర్కొనినారు. దీనినిబట్టి ఆనాటి బొమ్మలాటవారి ప్రోత్సాహత వారికి తెరనాటకము (తెర వెనుక బొమ్మల నెక్కించి ఆడించునాటకము - అనగా బొమ్మలాట అని అర్థము) లందుగల అభినివేశము వ్యక్తమగును.

బొమ్మలాటల ప్రసక్తి తెలుగుకావ్యములందు బహుధా కలదు. కుమార ధూర్జటి (క్రీ. శ. 1650) కృష్ణరాయవిజయము (4-119) లోని.

'మదనుఁడను బొమ్మలాటగాఁ డదనెఱింగి
రాజు నెదుటికిఁ దెరలోన రహిఁ జెలంగు
మెచ్చుబంగారు ప్రతిమను దెచ్చెనననఁగ
వచ్చెఁ బెండ్లికుమారి చెల్వంబుమీఱ.'

అను వర్ణన కట్టుబొమ్మలాటను సూచించును. బొమ్మలాటలు కథాసంయుతములుగా జరిగెడివని తరిగొప్పుల మల్లన (క్రీ. శ. 16 వ శతాబ్ది చివరిభాగము) చంద్రభాను చరిత్ర (2-88) లోని ఈ క్రిందిపద్యమునుబట్టి తెలియుచున్నది.

'తెరసంధించి ప్రఫుల్ల హల్లక శిఖాదీపచ్ఛటల్నించిలోఁ
గరమర్థిన్ జలమానుషీ ప్రతిమలంగైసేసి యా సింధు సుం
దరి గంగావతరప్రసంగత కథా నాట్యంబు సూపన్ప్వరల్
సరవిన్వైచు నొసంగులో యనఁగ నంచల్ ప్రాలెడిం జూచితే.'

పైడిపట్టి వేంకటపతి (క్రీ. శ. 1650) చంద్రాంగద చరిత్ర' అను ప్రబంధమున బొమ్మలాటవేశము, బొమ్మలాట ప్రదర్శనవిధానము వర్ణింపబడినది. చూడుడు.

'వికటష్ఠేకిఁ బువ్వుపీడఁ దెరయై, పీడల్ సభాసీనులై
శుకరాజంబు ప్రసంగియై, కినలయప్రోమంబు దీపంబులై
పికముల్ పాఠకులై, యళుల్ ప్రతిమలై వెంపొందఁ జైత్రుండు ద
ర్పకుఁ దీక్షింపఁగ బొమ్మలాటఁ గనుపింపన్ జూచితే నెచ్చెలీ.'

—చంద్రాంగద చరిత్రము - 4 ఆ. 207 ప.

కాకమాని మూర్తికవి (క్రీ. శ. 1568) పాంచాలీ పరిణయములోని.

'అప్పు దిద్దినవాని యటులు, వేఁగినదాఁక
బొమ్మలాటగన్న భోగివగిది.'

అను పద్యమునుబట్టి బొమ్మలాటలు తెల్లవారువరకును జరిగెడివను విషయము నూహింపవచ్చును.

కనుపర్తి అబ్బయామాత్యుని (క్రీ. శ. 18 వ శతాబ్ది మధ్యకాలము) అనిరుద్ధచరిత్రము (1-12) లోని కుకవినిందా సందర్భమున తోలుబొమ్మలాట ప్రదర్శనము, కీలుబొమ్మలాట ప్రదర్శనముల ప్రసక్తి కలదు.

'సుకవుల సూక్తులందు సరసుల్ నెరసుల్ వెదుకంగబోరు, మ
క్షి కవితతుల్ వ్రణంబు పరికించుగతిం గొదవల్ గణింపటల్
కుకవుల నైజబుద్ధి తెరలో కథచొప్పున బొమ్మలాడఁగా
నొకకడ హాస్యపుం బ్రతిమలుండవె పెక్కులు వెక్కిరించుచున్.'

బొమ్మలాట ప్రదర్శనము జరుగునపుడు కథాగతపాత్రములు ఒకవైపు ప్రవేశపెట్టబడి సంభాషణాదులు కావించుచుండగా ఇంకొకప్రక్క హాస్యపాత్రలగు గాందోళిగాడు, బంగారక్క మొదలగునవి నిలిచియుండును. గందోళిగాడు, కేతిగాడును కలిసి ప్రదర్శన కారకులను ప్రశంసించి గ్రామప్రముఖులను పేరుపేరున పేర్కొని పొగడుదురు. సూత్రధార పారిపార్శ్వకులను పోలినవారు గందోడిగాడు, కేతిగాడును. వీరి తొలిసంభాషణము గీర్వాణరూపకములందలి ప్రస్తావన వంటిది. నాటకప్రస్తావనతో వారి పని సరి. ఆట పూర్తియగువరకు వీరపుడపుడు తెర యెక్కుచునే యుందురు. ఆట చప్పచప్పగానుండి ప్రేక్షకు లల్లరి మొదలుపెట్టినపుడు వీరితోపాటు బంగారక్కయు తెరమీద ప్రత్యక్షమగుచుండును. వీరు బండబూతు ప్రసంగములు చేయుచుందురు. జానపదదృష్టిలో బంగారక్క, కేతిగాండ్రు ముఖ్యులు. రాయలసీమలో కేతిగానిబొమ్మను కిల్లేగిత్తిరిగా దందురు. కొంచె కోణంగి, జగదాలమారి అని ఈ పదమునకు ద్రావిడభాషా సామాన్యమగు నర్థము.

తోలుబొమ్మలాటలో హాస్యపాత్రలను కొంతసేపు ఆడించి, మరల పని పడువరకు ఒకప్రక్కగా తెరకు గ్రుచ్చియుంచుదురు. కీలుబొమ్మలాటయందు వెనుకతెరమాత్రమే యుండును. కథావశమున బొమ్మలు ఆ తెరచాటునుండి వెడలి వచ్చుచుండును. తోలుబొమ్మలాటలు మాత్రము తెరలోపలనే జరుగును. వివిధము లయిన వర్ణములతో చిత్రింపబడిన ఆ బొమ్మలు వెనుకగానున్న దీపముల వెలుతురు వలన సన్నని తెల్లని తెరలోనుండి సామాజికులకు స్పష్టముగా కన్పించుచుండును.

భారతరామాయణాదులలోని కథాంశములే బొమ్మలాటల ప్రధాన కథావస్తువులు. లంకాదహనము, మైరావణచరిత్ర, ఇంద్రజిత్తువధ, యయాతిచరిత్ర, కీచకవధ, దుశ్శాసనవధ, ప్రహ్లాదచరిత్ర మొదలయినవి వీని ఇతివృత్తములు. దేశీయములగు దేశింగురాజు కథ, పల్నాటివీరచరిత్ర, కరెభంటన కథ, కుమారరాముని కథ మొదలగునవియు అరుదుగా ప్రదర్శింపబడుచుండును. ఈ కథావస్తువు లన్నియును ప్రేక్షకులకు చిరపరిచితములే. ముఖారి, అసావేరి, దేవగాంధారి, రేగుప్తి మధ్యమావతి, ఆరభి, ఆనందభైరవి వీరు వాడునట్టిరాగములు. అందును ముఖారిరాగము వీరి గుత్తసొమ్ము.

మలయాళభాషలో 'పావకూత్తు'లు దేవాలయప్రాంగణములలో ప్రదర్శించుట కలదు. 'పావకూత్తు'ల ప్రదర్శనమునుగురించి పి. అచ్యుతమీనన్‌గారు ఇట్లు తెల్పినారు.

"This is a kind of shadow-play conducted by two men, who exhibit shadow-characters on the screen and speak for them. The performance is regarded as sacred by the masses who attend it in the same spirit of devotion as they visit temples. Kamba Ramayanam is generally the literature followed by the conductors, who very often deviate into learned discussions on philosopical and literary subjects in the form of dialogue. This is often done in a competitive spirit."

—Ezuttaccan and His Age. Page. 16.

కన్నడములో 'చక్కలద గొంబె'. 'సూత్రదగొంబె' అను పేర్లతో వ్యవహరింపబడు తోలు–కొయ్య బొమ్మలాటలకు వెనుకపాటగా యక్షగాన వీథినాటకములే ఉపయోగింపబడుచున్నవని కన్నడ విమర్శకులు పలువురు తెల్పియున్నారు. తెలుగులో రంగనాథ రామాయణమువంటి ద్విపదరచనలను తోలుబొమ్మలాటలవారుపయోగించుకొనుచుండురు. బొమ్మలాట ప్రదర్శనములలో యక్షగానకవుల రచనలనుకూడ యథాతథముగగాని మార్పుకూర్పులు చేర్చిగాని తెలుగుదేశములో వినియోగించుకొనుట కలదు. కొన్ని యక్షగానములు కేవలము బొమ్మలాటలకొరకే వ్రాయబడినట్లు తెలియుచున్నది. బొమ్మలాట సాంబయ్య (క్రీ. శ. 17:0) తెలుగులో కిరాతార్జునీయమును, కన్నడభాషలో కరియబంటన విజయము, సారంగధర చరిత్రములను యక్షగానములను రచించినాడు. అతనితండ్రి సిద్ధయ 'బొమ్మలాట శాపన', 'మోహనకవి' బిరుదాంచితుడట. ఈనాటికిని కన్నడదేశములో మైసూరు

ప్రాంతమున వారి బొమ్మలాటలగు చక్కలద సూత్రద గొంబెలకు యక్షగానము లకు అనుబంధమున్నట్లు తెలియుచున్నది. అట్లే ఆంధ్రదేశమునందును ఈనాడు అక్కడక్కడ వ్యాప్తిలోనుండు బొమ్మలాటవారి ప్రదర్శనలను గమనించినచో ఆ యా ప్రాంతపు యక్షగానకవుల రచనలను వినియోగించుకొనుచున్నట్లు తెలియ గలదు. ఉత్తరగోగ్రహణము బొమ్మలాటగా ప్రదర్శింపజేసినచో వర్షములు కురియు నను నమ్మకము ఈనాటికి కొన్నిప్రాంతములందు కలదు. ఉత్తరగోగ్రహణములో ధేనువుకొండ వెంకయ్యగారి విరాటపర్వ యక్షగానములోని దరువులను బొమ్మ లాటవారు గ్రహించుచుందురు.

గంజాంజిల్లా గుజ్జువాడ నివాసియగు మరింగంటి భట్టరు రామానుజా చార్యులు (క్రీ. శ. 1860) రచించిన శ్రీరామనాటకము 'బొమ్మలాట రామాయ ణము'గా ప్రసిద్ధిపొందినది. దీనిని గుజ్జువాడ లక్ష్మణమూర్ఛ అనికూడ వ్యవహ రింతురు. మాధవపట్నము బొమ్మలాటవారి లక్ష్మణమూర్ఛలో ఇందలి పద్యములు, దరువులు వినిపించును. చతుర్వేదుల వెంకటనరసింహయ్య (క్రీ. శ. 19 వ శతాబ్ది) రచించిన ద్రౌపదీవస్త్రాపహరణము, సీమంతినీపరిణయము, రాధాకృష్ణసంవాదము మొదలయిన యక్షగాన నాటకములను బొమ్మలాటవారిచే ఆడించెడివారట. వీణె సుబ్బరాజా, గాజులపెండ్లూరి శేషగిరిరాజా అనువారు రచించిన సంతవేలూరు కుశలవుల నాటకము బొమ్మలాటల కుపయోగముగా ఆరురాత్రికు ప్రదర్శించు నాటకముగ రచింపబడినది. కోట వెంకటప్పయ్యశాస్త్రి (క్రీ. శ. 1893) రచించిన బాణాసురనాటకమను యక్షగానము బొమ్మలాట ప్రదర్శనమున కనుకూలముగ నున్నది. ఈ యక్షగాన నాటకమందలి లొట్టకిత్తడు, రత్నాలు, పోలిగాడు అను పాత్రలు, వారి హాస్యప్రసంగములు బొమ్మలాటలోని జుట్టుపోలిగాడు, బంగారక్క, గాంధోళిపాత్రలను, వారి హాస్యప్రసంగములను తలపించుచుండును.

మహారాష్ట్రుల నాటకగ్రంథములలో సూత్రధారుడు, భాగవతులను పాత్ర లను పలుకరించినట్లు కలదు. అందు గణపతి సరస్వతుల స్తుతులతోపాటు పాత్ర ప్రవేశములును చెప్పబడినవి. మహారాష్ట్రదేశపు జనరంజకరూపక ప్రక్రియలలో నొకటియగు 'లలిత'యందు ఈ పద్ధతి కలదు. ఇందు దశావతారకథలకు ప్రసక్తి కలదట. దానిపై తంజావూరి నాటకప్రభావము పడినదట. కన్నడమునకూడ యక్ష గానమునకు 'దశావతారద ఆట' అనియు వ్యవహారము కలదు.

తంజావూరు రాజులు, తదాస్థాన పండితకవులు రచించిన యక్షగాన నాటక ప్రదర్శనములందు ఒక క్రొత్తవిశేషమును గుర్తింపవచ్చును. నాటకారంభమున గణపతిప్రార్థన జరిగినప్పుడు గణపతివేషమును, సరస్వతీప్రార్థన జరిగినప్పుడు సరస్వతీవేషమును రంగస్థలము మీదకువచ్చి, పూజలంది, నటులను ప్రేక్షకులను దీవించి వెడలుట జరుగుచుండును. ఈ పద్ధతి బొమ్మలాటయందును, కన్నడ యక్షగాన ప్రదర్శనములందును కలదు. ఇది భరతోక్తమైన పద్ధతికాదు. కేవలము దేశీయమైన పద్ధతియే. క్రీ. శ. 1880 ప్రాంతమున తెలుగుదేశమున ఆధునిక రంగస్థల నాటకప్రదర్శనములకు పునాదులువేసిన ధార్వాడ నాటకసమాజమువారు కూడ ఈ దేశిపద్ధతినే అనుసరించియుండినట్లు డాక్టర్ పి. యస్. ఆర్. అప్పారావుగారు 'తెలుగునాటక వికాసము' (పుట 169) నందు తెల్పినారు.

బొమ్మలాటకు సూత్రధారుడు బ్రహ్మవంటివాడు. బొమ్మలకు కట్టినదారములను ధరించువాడు సూత్రధారుడు, అతడు తెరవెనుకనుండి పద్యములనో, పదములనో, దరువులనో ఆయా పాత్రల ప్రవేశప్రసంగాదులతో కథను నడపుచు నడుమ సంధివచనములతో అపదృశ్యకథాను సంధానముచేయుచు, తదనుగుణముగ దారములనులాగి బొమ్మల నాడించుచుండును. 'సూత్రధారుడు' అను శబ్దము బొమ్మలాటలకు కుదిరినంతగా ఇతర రూపకములకు కుదరదు.

బొమ్మలాటలో తెర మరుగైనను చివరివరకు సూత్రధారుని అవసరముండును. యక్షగానములందు పెక్కింట సూత్రధారునిప్రసక్తి కలదు, కొన్ని యక్షగానములలో కథామధ్యలోకూడ సూత్రధారప్రసంగము లుండును. ప్రదర్శన కుద్దిష్టములయిన యక్షగానములందు సంధివచనము లుండుటయు గమనింపవచ్చును. ఈ సంధివచనములు బొమ్మలాటలో అత్యవసరము. అవి యక్షగానములందును నిలిచియుండుటవలన బొమ్మలాట యక్షగానములకు గాఢమైన అనుబంధము కలదని చెప్పుటకు వీలగుచున్నది. బొమ్మలాటలో కథాకథన సమయమున వచ్చు వ్యక్తులనామములను, ప్రధానపదసముదాయమునుగూర్చి వివరించుచు సూత్రధారుడు అమరకోశము, విశ్వకోశము, ఆంధ్రనిఘంటుత్రయములనుండి పర్యాయపద పట్టికలను ఏకరువు పెట్టుచుండును. జిల్లెళ్ళమూడి వెంకటరామదాసామాత్యుని (క్రీ. వ. 19వ శతాబ్ది) జాంబవతీకళ్యాణము ఇత్యాది యక్షగాన నాటకములందును అమరకోశము శ్లోకము లుదాహరింపబడియుండుట గమనింపవచ్చును. ఈ యక్షగాన నాటకములు బొమ్మలాట ప్రదర్శనముల కుద్దిష్టము లయినట్టివే.

బొమ్మలాటకు పాశ్చాత్యదేశములలో 'ఒపెరా'లను గేయనాటికలు, జావాదిద్వీపములలో "లాకన్లు", మనదేశములో సంస్కృతమున ఛాయానాటకములు మొదలయినవానివలె కన్నడాంధ్రదేశములందు యక్షగానము ఉపయోగపడుచున్నవి. సంస్కృతమున మేఘప్రభాచార్యుని 'ధర్మాభ్యుదయము', సుభటుని 'దూతాంగము' మొదలయిన రూపకములు 'ఛాయానాటకము' లనెడి తెగకుచెందినవి. ఇవి తోలుబొమ్మలాటల కుపయుక్తమైన రూపకములని కొందరు తలంచినారు. ఇవి తోలుబొమ్మలాటలకు సంబంధించినవి కావని, మూలరూపకములకు 'ఛాయ'గా రచింపబడినవని డా. ఎస్. కె. డే నిర్ణయించియున్నాడు. (20)

'Shadow play' అనుదానికి భిన్నమైన 'ఛాయానాటక ప్రదర్శనము' (Silhouette) అను ఇంకొకపద్ధతి అధునికకాలములో ప్రచారములోనికి వచ్చినదని డా. పి. యస్. ఆర్. అప్పారావుగారు 'తెలుగునాటక వికాసము' (పుట 150) నందిట్లు వ్రాసినారు. "సజీవవ్యక్తులను కాని, జంతువులను కాని దీపమునకును తెల్లని సన్నని తెరకును మధ్య నిలబెట్టి వానినీడలు తెరపై పడునట్లు చేయుదురు. తోలుబొమ్మలాటలయందు తోలుబొమ్మలు తెరను అంటిపెట్టుకొని యుండవలెనట్లు ఇందు వ్యక్తులు తెరకు అంటిపెట్టుకొని యుండనక్కరలేదు; వారి బొమ్మలు తెరపై నల్లగా పడుచుండును. ఆకారరేఖలుమాత్రము ప్రస్ఫుటముగా కన్పట్టుచుండును. మరియు వ్యక్తులుగాని, జంతువులుగాని, చివరకు బొమ్మలుగాని అక్కరలేకయే కేవలము చేతులతోను, చేతివ్రేళ్ళతోలు పెక్కు ఆకారములు సృష్టింపవచ్చును.'

పైని పేర్కొనిన వివిధాంశములనుబట్టి బొమ్మలాటకు యక్షగాన నాటకమునకు గాఢమైన అనుబంధమేకాక సాదృశ్యముకూడ యున్నదని చెప్పవచ్చును. ఇది కేవలము అనుబంధము మాత్రమే. జన్యజనక సంబంధమని చెప్పుటకు వలనుపడదు. బొమ్మలాటపరిణామమే యక్షగానమని డా. నేలటూరి వేంకటరమణయ్యగారి వాదము. (21) బొమ్మలాటకున్నంత ప్రాచీనత యక్షగానమునకు లేదు. బొమ్మలాటలు ప్రాచ్య పాశ్చాత్యదేశములందు బహువిధములుగా ప్రవర్తిల్లుచున్నవి. వివిధప్రదేశములందలి బొమ్మలాట లన్నిటికి యక్షగానము ఉపయుక్తమగుటలేదు. యక్షగానసదృశములగు వివిధరూపక ప్రక్రియలను బొమ్మలాటల పరి

20. A History of Sanskrit Literature. Vol. I (Calcutta, 1947) P. 501.

21. మధుర తంజాపూరు నాయక రాజులనాటి ఆంధ్రవాఙ్మయచరిత్ర-6 వ ప్రకరణము.

నామమేయని చెప్పలేముకదా! యక్షగానము - బొమ్మలాట జన్యజనక సంబంధ వాదము యక్షగాన శబ్దోత్పత్తిని సమర్థింపదు.

(19) హరికథ - యక్షగానము :

'హృద్యపద్య గేయాత్మకమై, అనవద్య వచన రచనా భాసురమై, సంగీత నృత్యకళా సమ్మిశ్రితమై, ఉపకథావ్యాఖ్యానాదిక బృంహితమై, పండిత పామర జనరంజకమైన విశిష్టకళారూపమే హరికథ' అని ఆచార్య తూమాటి దోణప్పగారి నిర్వచనము. హరిభక్తి యుపన్యసింపబడుటవలన 'హరికథ' యనబడినది. కథాగానముల ఇతివృత్త మేదయినప్పటికిని కథనకాలములో కథాగాయకుడు సామాజికులను సమాహితచిత్తులను గావించుటకుచేయు పుండరీకములు (హెచ్చరికలు) లోని ప్రతిపాద్యదేవతగా ప్రథమముగా, ప్రచురముగా హరినే కల్పించును. విష్ణుపరమైన హెచ్చరికలు మొదట వాడబడుచుండెడివి. అటుతరువాత శివపరములయిన హెచ్చరికలుకూడ వాడుకలోనికి వచ్చినవి. 'ఆ ప్తివాక్యమును ధర్మాధర్మములను సర్వజన మనోరంజకముగా నృత్యగీతవాద్యములతో నుపన్యసించుట హరికథ యనబడగు' (22) నని నారాయణదాసుగారు నిరూపించినారు. మహారాష్ట్రమున 'అభంగ్' అనియు, తమిళ కన్నడ మలయాళభాషలలో 'కాలక్షేపము'నియు, 'కథాకాలక్షేపము' నియు, తెలుగులో 'హరికథ' అని 'హరికథాకాలక్షేప'మని హరికథను వ్యవహరింతురు.

వేదకాలమునాటికే హరికథ బీజరూపమున నున్నట్లు, ఐతిహాసిక యుగమున కుశలవుల రామాయణగానము మొదలగు సందర్భములందు దాని స్వరూపము విస్తరించినట్లు కొందరు భావింతురు.

'పురాణపఠన'మను జానపద కళారూపము తెలుగునాట సుప్రసిద్ధమైనది. పురాణప్రవచనరీతికి సంగీతప్రధానమైన కీర్తనాదులను జోడించిన హరికథగా రూపొందునని కొందరు చెప్పుదురు. ఒరిస్సాదేశములోని పురాణప్రవచనముతో హరికథాసోరణి స్పష్టముగా కల్పించుచున్నది. కర్ణాటకరాష్ట్రములోని దక్షిణప్రాంతములలో మరొకవిధమగు పురాణప్రవచనరీతి వ్యాప్తిలో నున్నది. సాధారణముగా రామమేంద్రస్వాములవారి ఆలయములలో ఈ పురాణప్రవచనములు జరుగుచుండును.

---

22. ఆదిభట్ల నారాయణదాసు హరికథ - ఆంధ్రపత్రిక-విరోధికృత్ ఉగాది సంచిక (1911).

పౌరాణికుడు గ్రంథమును చదువుచుండును. మధ్యలో పురందరదాసు, కనకదాసు మొదలగు వాగ్గేయకారుల పదములను గానము చేయుచుండును. పౌరాణికునికి ఇరు వైపుల వాయిద్యములుండును. హరికథాగానములోని ఆశుకవితా స్పర్శ ఇందులో ప్రవచనసందర్భమునందు కన్పట్టును.

'సంస్కృతనాటకములలోని సూత్రధారునికి, హరికథకునికి, బుర్రకథల లోని ముఖ్యగాయకునికి, భామాకలాపములోని మాధవునికి పౌరాణికుడే మూల పురుషు'డని ఆచార్య తూమాటి దొణప్పగారి నిశ్చితాభిప్రాయము.

హరికథ వేదకాలముననే బీజరూపముననున్నట్లు చెప్పబడినను మధ్యయుగ మున మహారాష్ట్రదేశమున రూపొంది, ప్రచారము గాంచినదని చెప్పవచ్చును. హరికథకు మహారాష్ట్రదేశము పుట్టినిల్లు. మరాఠీభాషలో హరికథను 'కీర్తన' అని సాధారణముగ వ్యవహరింతురు. 'కీర్తన' అనగా ఈశ్వరభజనము, నామోచ్చార ణము అని అర్థము ఉన్నది. కథాగాయకుని, మరాఠీలో 'కీర్తనకార్' అనియు, 'కథాకార్' అనియు, 'హరిదాస్' అనియు పిలుతురు. మహారాష్ట్ర భాగవతుడగు తుకారామ్ (క్రీ. శ. 17 వ శతాబ్ది పూర్వార్ధము) హరికథాకాలక్షేపములు చేయు చుండినట్లు తెలియుచున్నది. అది మహారాష్ట్రమున 'అభంగ్' అనబడుచున్నది. తుకారామ్ మొదలగు భక్తకవులు రచించిన అభంగములను గానము చేయుకీతిని 'హరిపాద'మని వ్యవహరింతురు. మహారాష్ట్రభాషలో రచింపబడిన హరికథారచ నలు కీర్తనతరంగిణి, కీర్తన సుమనహార్ అను పేర్లతో అనేకసంపుటములుగ వెలువడినవి.

క్రీ. శ. 17 వ శతాబ్దిలో కర్ణాటకరాజ్యమును, తంజావురాంధ్ర నాయకరాజ్య మును మహారాష్ట్రులస్వాధీనమైన తరువాతనే దక్షిణదేశమున హరికథలు వ్యాప్తికి వచ్చినవి. హరికథ మహారాష్ట్రదేశమునుండి తంజావూరు మహారాష్ట్రరాజుల కాల ములో తమిళదేశమునకు అక్కడనుండి తెలుగుదేశమునకు వ్యాపించినదని చెప్ప వచ్చును. తంజావూరునేలిన మహారాష్ట్రరాజులు స్వయముగా యక్షగానములను రచించినారు. ఆస్థానకవులచే రచింపజేసినారు. వారెవ్వరును తమ యక్షగానములను 'హరికథలు'గా పేర్కొనలేదు. హరికథలనుకూడ వారు తెలుగులో రచింపలేదు.

తమిళదేశములో హరికథలకు పర్యాయవాచకముగా బహుళప్రచారములో నున్న పదబంధము కాలక్షేపము. 'కాలస్యక్షేపః కర్తవ్య కర్మకాలలంఘనే-కాలం యాపనేచ' అని వాచస్పతిలోని వ్యుత్పత్తి. సత్కథావిషయముగా కాలమును గడ

పుచే కాలక్షేపము. తుకారామ్, నామదేవు, సమర్థ రామదాసు మున్నగు భక్తుల భక్తిపద్ధతిని మహారాష్ట్రనుండివచ్చిన హరిదాసులు, కీర్తనకారులు, గాయకులు దక్షిణదేశమునందు బాగుగా ప్రచారము గావించినారు. మరాఠీభాషలోని అభంగ, ఓవి, ద్రుపద్ మొదలగు ఛందోభేదములతోకూడిన వారి కీర్తన సంప్రదాయము తెలుగు తమిళ కళాకారులను ఆకర్షించినది. సంగీతత్రిమూర్తులుగ ప్రసిద్ధిచెందిన త్యాగరాజు (క్రీ. శ. 1759-1847), శ్యామశాస్త్రి (క్రీ. శ. 1763-1827), ముత్తుస్వామి దీక్షితులు (క్రీ. శ. 1775-1835) అనువారి రచనల ఆధారముగా ఆనాడు కాలక్షేపములు తమిళములో ప్రచారమున నున్నట్లు తెలియుచున్నది.

తంజావూరు కృష్ణభాగవతిని (క్రీ. శ. 1841-1903) ఆధునిక తమిళ కాలక్షేపసంప్రదాయమునకు పితామహుండుగా పేర్కొనవచ్చును. అతడు తమిళసంప్రదాయమునకు మహారాష్ట్రసంప్రదాయములను సమ్మేళనముచేసి అపూర్వమైన నూతనసృష్టికావించి కాలక్షేపబ్రహ్మగా ప్రఖ్యాతికెక్కినాడు. గోపాలకృష్ణభారతి (క్రీ. శ. 1811-1887) 'నందనార్ చరిత్రం' అను కాలక్షేపగ్రంథమును తమిళములో రచించినాడు. ఆంధ్ర హరికథాపితామహుడుగా ప్రసిద్ధిగాంచిన ఆదిభట్ల నారాయణదాసును తంజావూరు కృష్ణభాగవతితో పోల్చవచ్చును.

తంజావూరు కృష్ణభాగవతికి ముందు క్రీ. శ. 19 వ శతాబ్ది పూర్వభాగములో అందమీన్ శివరామ భాగవతార్, నెమ్మోలి వైద్యనాథభాగవతార్, మణమేల్గుడి వెంకటాచల భాగవతార్, వరగూర్ గోపాలభాగవతార్ మొదలగు కథకులు తమిళములో ప్రాచీనపద్ధతిని కథా కాలక్షేపములను నిర్వహించుచుండెడివారు. త్యాగరాజుకు సమకాలికుడగు తల్లైస్థానం నరసింహభాగవతార్ ప్రాచీన సంప్రదాయానుసారముగా కాలక్షేపములను నిర్వహించియున్నట్లు తెలియుచున్నది.

కాలక్షేపములలో వేదాంతవిషయములకు ప్రాముఖ్యము కల్పించిన కథకులలో ముఖ్యుడు తిరువైయారు లక్ష్మణాచారియార్, (క్రీ.శ. 1857-1921).

కృష్ణభాగవతి తరువాత కాలక్షేపకథకులలో ప్రధానులుగా పేర్కొనదగినవారు తిరుమలై అయ్యర్, చిదంబరభాగవతార్ (క్రీ. శ. 1880 1938) అనువారు. తిరుమలై అయ్యర్ తులజాజీ మహారాజు (క్రీ. శ. 1729-1735) ఆస్థాన సంగీత విద్వాంసుడు. వీరు కథనసందర్భంలో సామాజిక సమస్యలనుజోడించి పండిత పామర జనరంజకముగా కథాకాలక్షేపములను కొనసాగించినారు. శివపురాణము వీరి కథలలో విశిష్టమైనది.

తిరువైయార్ లక్ష్మణాచారియర్ ప్రియశిష్యురాలగు సి. సరస్వతీబాయి (క్రీ. శ. 1894-1974) దక్షిణ భారతదేశములో తొలి హరికథాగాయనిగా రంగ మెక్కిన తొలి మహిళ. ఈమె జన్మస్థలము రాయలసీమలోని గుత్తిపట్టణము. ఈమె రామాయణకథలను యెక్కువగా చెప్పినది. ఈమెకు సమకాలికముగా హరి కథారంగములో రాణించిన చిన్నీబాయికూడ గొప్ప కథకురాలే. తమిళములో పులవర్ కీరన్‌కూడ గొప్ప కథకుడే. అతడు కంబరామాయణమును కాలక్షేప విషయముగా గ్రహించినాడు. తమిళ కాలక్షేపరంగములో శివానంద విజయలక్ష్మి చెప్పుకోదగిన కథకురాలు. తులసీదాసు రామచరితమానస్, కంబరామాయణము, వాల్మీకి రామాయణము - ఈ మూడు రచనలనుచేర్చి తులనాత్మకముగా ముప్పేటగా సమర్చి 'రామాయణ త్రివేణి' అనుపేరుతో సాగించిన ఈమె కాలక్షేపరీతి తమిళ కాలక్షేపములలో సాటిలేనిది. ఇట్లు తమిళములో ఈ కాలక్షేపమను సమాహారకళ ప్రజలలో సంస్కృతి సమాదరణము, సౌందర్యారాధనను పెంపొందించినది.

తెలుగు తమిళ సీమలందువలె హరికథ కన్నడదేశమందుకూడ ఒక జాన పదకళగా ప్రవర్తిల్లినది. హరికథారంగము యక్షగానప్రదర్శనములకు తుల్యమైన సమిష్టికళగా కన్నడదేశమున నావిర్భవించినది. యక్షగానప్రదర్శనములోను, హరి కథాగానములోను ప్రసిద్ధివహించిన కళాకారుల కుటుంబములు కొన్ని ఉత్తర కన్నడ మండలమునుండి దక్షిణ కన్నడ జిల్లాలోని 'ధర్మస్థళ'మునకు సుమారు రెండు శతాబ్దములకు ముందు తరలివచ్చినవి. గోపాలభాగవత్, నంజుండభాగవత్ మున్నగువారు హరికథా రచయితలేకాక హరికథా ప్రయోక్తలుకూడ. వీరందరిమీద మరాఠీ కీర్తనకారుల ప్రభావము అధికముగా కన్పట్టుచుండును. వీరు గానము చేసిన కథలలో అనేకము మహారాష్ట్రి కీర్తనతరంగిణికి అనువాదప్రాయములుగా కన్పట్టు చున్నవి. పరశురామ చరిత్ర, ప్రహ్లాద చరిత్ర, సముద్రమంథన, గజేంద్రమోక్ష, యక్షప్రశ్నాలు మున్నగు ప్రసిద్ధేతివృత్తములేకాక గరుడగర్వహరణ, భద్రాయు చరిత్ర, పేనాజి చరిత్ర, భీమమానసభక్తి, దత్తాత్రేయజన్మ మొదలగు మరాఠీ కథలు సయితము కన్నడ హరికథారంగములో చోటు చేసికొనినవి.

గౌరీమహిమ, పాండురాజు, విరాటపర్వ మొదలగు కథలను చెప్పిన తుము కూరు వేణుగోపాలదాసును ఆధునిక కర్ణాట హరికథా పితామహునిగా పేర్కొన వచ్చును. నంజుండ భాగవతార్ హరికథారచయితమాత్రమే కాక ప్రసిద్ధ కీర్తన కారుడు కూడ. కథా సుబ్బణ్ణగా ప్రసిద్ధిగాంచిన సుబ్బయ్య భాగవతార్ (క్రీ. శ.

1885-1945) వాల్గవ కృష్ణరాజవడయార్ ఆస్థానములో కథాగాయకుడు. కథా సుద్యుణ్ణ గజేంద్రమోక్ష, మహారాష్ట్రి సంతరకథె మున్నగు హరికథలను రచించినాడు.

ఆధునిక కర్ణాట హరికథకులలో మిక్కిలి ప్రసిద్ధుడు భద్రగిరి కేశవదాసు. పాండవ సత్వపరీక్ష. భక్త జయదేవ, భక్త నరసీమెహతా, భక్త రఘుకేవటు, భక్త సుదామ, భానుదాన, రామకృష్ణపరమహంస, రామపట్టాభిషేక, సంతమీరా, స్యమంతకోపాఖ్యాన మున్నగునవి అతడు రచించిన హరికథలు. హరిసర్వోత్తమ దాసు, బేలూరి కేశవదాసు, భద్రావతి వెంకటేశదాసు, సానల రామదాసు మొదలగు వారుకూడ కన్నడదేశములో ప్రసిద్ధులయిన హరికథాగాయకులుగా పేర్కొన వచ్చును. తెలుగు మాతృభాషగా గలిగిన లక్ష్మీనారాయణ భాగవతార్‌వంటివారు కూడ కొందరు కన్నడములో హరికథలను చెప్పినారు. లక్ష్మీనారాయణ భాగవతార్ ఝాన్సీ లక్ష్మీబాయి, వివేకానంద మొదలగు హరికథలను కన్నడములో రచించినాడు.

తెలుగు తమిళ కన్నడ దేశములందువలె కేరళదేశములో హరికథాగానమంతగా అభివృద్ధిచెందినట్లు కన్పట్టదు. కళాపోషకుడు, కళారాధకుడు, ప్రసిద్ధ వాగ్గేయకారుడు అయిన కేరళదేశపు ప్రభువు స్వాతితిరునాళ్ మహారాజా (క్రీ. శ. 1813-1847) ఆస్థానమందున్న అనంతపద్మనాభగోస్వామి (మేరుస్వామి) గొప్ప హరికథా కాలక్షేపకుడుగ ప్రఖ్యాతి పొందినట్లు తెలియుచున్నది. అతడు తంజావూరు మరాఠీ బ్రాహ్మణులశాఖకు చెందినవాడు.

హరికథలు చెప్పు సంప్రదాయము ఒరిస్సాలోకూడ చెదరుమదురుగా కన్పట్టుచున్నది. హరికథనుపోలిన కళారూపమును ఒరియాలో 'దస్‌కతియా' (దాన కాష్ఠికా) అని అందురు. గంజాం జిల్లాలోమాత్రమే ఇది వ్యాప్తిపొందినది. ఒరియాదేశములోని హరికథలు తెలుగులో నిర్వహింపబడుచున్నవి.

'దసకతియా' కళారూపమును కృష్ణచంద్ర గాయకరత్న ఉన్నతస్థితికి కొని తెచ్చినాడు. ఈ 'దసకతియా'లో విర్వాహకు లిద్దరుందురు. ఒకరు గానము చేయుచుండగా మరొకరు వ్యాఖ్యానము కావించుచు హాస్యప్రసంగములు చేయుచుందురు. ఈ దసకతియా ఒకవిధముగా బుర్రకథకు, సహకారగాయకునితోకూడిన తెలుగు హరికథకు చాల సన్నిహితముగా నుండును.

'పల్లానాట్యం' లేక 'పల్లానట్టం' అను మరొక నాట్యసంప్రదాయముకూడ దసకఠియావలె ఒరిస్సాలో ప్రసిద్ధమయినది. బంగాళదేశములోని 'పాలా' పద్ధతియే ఒరిస్సాలో 'పల్లా' గా మారినదని చెప్పవచ్చును. రాధాకృష్ణతత్త్వము చుట్టూ పరిభ్రమించు రసభావ సమన్వితములయిన గానరీతి యిది.

ఒరిస్సా, బంగాళదేశములందు బహుళవ్యాప్తినందిన రాసలీల, కృష్ణలీల వంటివానిని 'యాత్రాప్రదర్శనము' లని పేర్కొందురు. అనేకపాత్రధారుల ప్రవేశము లేకుండినచో ఈ యాత్రానాటకములు తెలుగు హరికథలకు సరిపోవును.

హరికథాకాలక్షేపము మహారాష్ట్రమున అభంగ్ అనబడుచున్నది. 'ఒక స్త్రీ ఆడుతూ పాడుతూ ఉంటే ఆమె కిరుప్రక్కలా ఇద్దరువ్యక్తులు నిలుచుని కథ చెప్పేవారు. దక్షిణదేశంలో ఒక పురుషుడు కథ మాటలతో చెప్తూఉంటే మరొకరు కీర్తనలుపాడే 'కథాకాలక్షేపం' ఒకటి ఉండేది. ఇటువంటి కాలక్షేపమే ఆదిభట్ల నారాయణదాసుగారిలోని అద్వితీయ హరికథా రచనాప్రవంతిని వెలికితెచ్చి ఆంధ్రదేశమంతటా ప్రవహింపచేసినది. దక్షిణదేశంలోని కథా కాలక్షేపాలలో భక్తుల భక్తిగీతాలు రామాయణాదులలోని శ్లోకాలతోకూడ గానం చేయబడేవి' (23) అని శ్రీమతి విష్ణల పార్వతిగారు వ్రాసినారు.

బాగేపల్లి అనంతరామాచార్యులు (క్రీ. శ. 19 వ శతాబ్ది) యక్షగానము, హరికథ ఒకటే అను అభిప్రాయమును మొట్టమొదటిసారిగా వ్యక్తము చేసినాడు. అనంతరామాచార్యులు స్వీయముగా చంద్రహాసచరిత్ర, కుచేలోపాఖ్యానము, మూడుస్నరవశ్రణము, అనసూయాచరిత్రము, సావిత్రీచరిత్రము, సుభద్రాపరిణయము, శశిరేఖాపరిణయము అను హరికథలను రచించినాడు. వీనిలో కొన్నిటిని యక్షగానములని అనంతరామాచార్యులు పేర్కొనినాడు. అనంతరామాచార్యుల సమకాలికుడగు ఆదిభట్ల నారాయణదాసు హరికథా పితామహుడుగ ప్రసిద్ధి గాంచినాడు. ఆదిభట్ల నారాయణదాసు ప్రహ్లాదచరిత్ర, అంబరీషచరిత్ర మొదలైన హరికథలను 'యక్షగానప్రబంధము' లనియే వ్యవహరించినాడు. నారాయణదాసు హరికథకు 'వేల్పు ముచ్చట' అను పర్యాయవాచకమును కల్పించినాడు. అతడు హరికథకు సంగీతపరముగను, సాహిత్యపరముగను ప్రతిష్ఠ తెచ్చినాడు. దైవభక్తియు, సత్యము, భూతదయ అనునవి హరికథయందలి ముఖ్యాంశములని నారాయణదాసు

23. 'ఆంధ్రదేశము-హరికథలు' - భారతి - కలగూరగంప - ఏప్రిల్, 1968.

చెప్పినాడు. అతడు తన హరికథల ప్రధానలక్ష్యమును ప్రహ్లాద చరిత్రమను హరికథ యవతారికలో ఇట్లు తెల్పినాడు.

'ఘన శంఖమోయన గంతంబు పూరించి
మేలుగ శ్రుతిలోన మేళగించి
నియమముతప్పక నయిఘనంబుల బెక్కు
రాగభేదంబుల రక్తిగొల్పి
లంకులెగిర్చిన పగిది కాలజ్ఞతన్
జాతి మూర్ఛనలొప్ప స్వరముపాడి
చక్కని నృత్యము సర్వరసానుకూ
లంబుగాగ నభినయంబు చేసె

స్వాకృత మృదు యక్షగాన ప్రబంధ సరణి
వివిధదేశంబులం దిన్ని పెద్దలుగల
బలు సభల హరిభక్తి నుపన్యసింప
లేని సంగీత కవితాభిమానమేల.'

అభినయనృత్యగానాదులతో సంగీతసాహిత్యములను మేళవించి యక్షగానములకు 'హరికథ' అను వాడుకనామముతో ఆంధ్రదేశములో అందరి ఆదరణ కలిగించినవారు అనకాపల్లి వాస్తవ్యులు బాలాజీదాసు. విజయనగర వాస్తవ్యులు ఆదిభట్ల నారాయణదాసు. బొబ్బిలి వాస్తవ్యులు చేకూరి ఎరుకయ్యదాసు అనువారు. ఆదిభట్ల నారాయణదాసు శిష్యుడగు పసుమర్తి కృష్ణమూర్తి పార్వతీపరిణయమను హరికథనుకూడ యక్షగాన ప్రబంధమనియే పేర్కొనెను. ఊలపల్లి గంగరాజకవి రామజనన హరికథ. భమిడిపట్టి రామమూర్తి సతీసక్కుబాయి హరికథ. వాసా లక్ష్మీనారాయణరెడ్డి శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారి జీవితచరిత్ర అను హరికథ మొదలగునవి యక్షగాన ప్రబంధములనియే వ్యవహరింపబడినవి.

యక్షగానములే హరికథలుగా రూపొందినట్లు కవిత్వవేది మొదలయినవారు తలంచినారు.[24] 'ఒకే ఒకవ్యక్తి యక్షగానంలోలాగ ఆడుతూ పాడుతూ కథ వినిపించే కళారూపమే హరికథ. కొందరు వంతపాటకులనుకూడా పెట్టుకోవడం

24. ఆంధ్రవాఙ్మయ చరిత్ర సంగ్రహము - పుట 145.

కద్దు' (25) అని శ్రీనివాస చక్రవర్తిగారు వివరించినారు. సహకారగానము తోడయినచో హరికథ యక్షగానముగా పరిణమించునని శ్రీనివాస చక్రవర్తి నిరూపించినాడు. బాలాంధ్రపు రజనీకాంతరావుగారు హరికథావతరణమునుగురించి ఇట్లు తెల్పినారు. 'యక్షగానాలు హరికథలుగా ఏకవ్యక్తి ప్రదర్శనము లయినట్లు చెప్పవచ్చును. అంతేకాదు, ఆరంభములో యక్షగానము హరికథా ఒకటే అయినట్లు చెప్పడానికికూడా దృష్టాంతము లున్నవి. (26)

యక్షగానమునందు దరువులు, ద్విపదలు, వర్ణనాత్మకములగు లేదా సంవాదాత్మకములగు వచనము లుండును. హరికథలందును ఇవి కన్పట్టును. అందువలన యక్షగానములే హరికథలుగా రూపొందినవని కొందరు చెప్పియుందురు. యక్షగానమే కర్ణాటకసంగీత ప్రచారసమయమున ఆ యా రాగప్రభేదములను, హిందూస్తానీమెట్లను ఇముడ్చుకొని హరికథ లవిర్భవించుకొనినదని కొందరి భావము. రెండింటిలోను గానాభినయములకు ప్రాధాన్యము కలదు.

డా. యస్వీ జోగారావుగారు హరికథలు యక్షగానములు భిన్న సాహితీశాఖలకు చెందినవను అభిప్రాయము నిట్లు ప్రకటించినారు. (ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర - పుట 78).

"ఇట్లు పలువురు పండితులు, సామాన్యులుగాదు ధీమాన్యులునైనవారు, స్వయముగా హరికథా గ్రంథరచన గావించినవారును నభిప్రాయపడిరనగా నది కాదనలేము. వానిలో నేదో సాదృశ్యము లేదనలేము. కాని రెండును పూర్తిగా వానియుత్పత్తి పరిణామములనుబట్టి యభిన్నము లనలేము. జక్కులకథలు, జంగం కథలు, హరికథలు, బుర్రకథలు - ఇవియన్నియు గానరూపమునఁ గథాఖ్యానమే ప్రధానాశయముగాఁ బ్రారంభింపబడినవి. కావునఁ దత్తద్రచనా ప్రక్రియలలోఁ గొంత సాదృశ్యము గోచరించినను వానివాని ప్రయోగపక్కికలు వేఱు. ప్రయోజనములు వేఱు". కాని జోగారావుగారు "హరికథలు రచనలో యక్షగానప్రాయములు" అని చెప్పియుండుటచే యక్షగాన హరికథలు రెండును అభిన్నములని ఆమోదించినట్లుగా భావింపవచ్చును.

యక్షగాన హరికథలు రెండింటికిని సామ్యములకంటె వైషమ్యము లెక్కువగా నున్నవి. యక్షగానములలో సూత్రధారుడు చివరవరకు నుండును. బహు

25. యక్షగానం - నాట్యకళ - ఫిబ్రవరి, మార్చి - 1970, పుట 14.
26. ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర - పుట 466.

పాత్రలుకూడ నుండును. హరికథలలో ఒకదే కథ నుపన్యసించును. రూపప్రద ర్శనావకాశము లేనియెడ ఏకపాత్రాభినయమునకు పనికివచ్చునని హరికథలను రచించియుందురు. యక్షగానములు ప్రదర్శనయోగ్యములు. కాని హరికథలు ఉపన్యసించవలసిన ప్రక్రియలు. హరికథలు ఆధునికములు. యక్షగానములు ప్రాచీనములు. యక్షగాన రచనాకాలములో హరికథారచన చేయబడినట్లు తెలియ రాదు. కేవలము ఆధునికయుగములో తెలుగులో ఆరంభించిన హరికథకులు మాత్రమే తమ హరికథలను యక్షగానములుగా పేర్కొనినారు.

కన్నడదేశమునందును యక్షగానములు బొమ్మలాటలకు, హరికథలకు ఉప యోగించు నాచారము కలదట. గాయకవాడ పెద్దన, దేనుమకొండ వెంకయ్య, పుసులూరి సుబ్బరాయకవి మొదలగువారు 'జంగంకథల'తోపాటు యక్షగానము లను రచించినారు. యక్షగానము హరికథగా చెప్పబడు నాచారము కన్నడదేశమున నున్నను అది ప్రాచీనమైన సంప్రదాయము కాదు. ఈవిషయమై ముల్కూరి సంగ మేశంగారు ఇట్లు తెల్పినారు. 'అసలు వేషరచనకూడా మానుకొని మద్దెల, తేగంట, హార్మోనియం శ్రుతి అనేవి సహాయంగాతీసుకొని ఒకాయన యక్షగానరచన గానం చేస్తూ ఉంటే, మరో నలుగురు వేర్వేరు పాత్రలను పంచిపుచ్చుకొని, కులాసాగా నాటకీయపద్ధతిలో సంభాషణలు నెరపడం అనే మర్యాదకూడ దక్షిణ కన్నడ ప్రాంతంలో పాతిక ముప్పైయేళ్ళనుండి బయల్దేరింది. దీనిని 'తాళ మద్దెల' అని పిలుస్తారు. ఇందులో ఆటలేని అభినయంగాని, వేషంగాని, ఏమీ లేవు. ఒకరు చెప్పే హరికథ నలుగురు పంచుకో చెబుతూన్నట్లుటుంది.' (27)

ఈ సంప్రదాయము యక్షగానముపై హరికథల ప్రభావమునుమాత్రమే సూచించును.

పైని పేర్కొనిన విభిదాంశములనుబట్టి నిర్మాణవిధానములో యక్షగానము లకు హరికథలకు భేదములేదని, ప్రయోగవిధానములో యక్షగానములు బహు పాత్రాశ్రయములుగ, హరికథలు ఏకపాత్రాశ్రయములుగా ప్రవర్తిల్లినట్లు సమన్వ యింపవచ్చును.

నేటి హరికథాసంప్రదాయము మహారాష్ట్రమునుండి అనుసరింపబడినదనుట సత్యము. మహారాష్ట్ర సంగీతసంప్రదాయములో గల అభంగములు, నిరూపణములు,

27. 'బయలాట'-వ్యాసము-ఆంధ్రప్రభ-సచిత్రవారపత్రిక-4-1-1956. పుట 64.

దోహరా, భజన్, ఓవి, నామావళీ ఇత్యాది అంశములు దాక్షిణాత్య హరికథా గానములందు వినియోగింపబడినవి.

'దోహరా' మరాఠీభాషలో ప్రసిద్ధమైన సంగీతరచనానుకూలమైన ఛందో విశేషము. ఇది సంస్కృత 'ద్విధారా' శబ్దమునకు వికృతియని మరాఠీలాక్షణికుల అభిప్రాయము. ఇది ఆఖ్యానరీతికి ఉపకరించు రచనావిశేషము. తెలుగులో దీనికి 'తౌహరా, తోహరా' అనికూడ వాడుక. దీని కొక్కదానికితప్ప తక్కిన మరాఠీ ఛందోవిశేషములకు తెలుగులో ప్రవృత్తిలేదు. కథానుసంధానములోను, ద్రుత గతిలో కథ సాగవలసిన ఘట్టములోను తౌహరాను తెలుగు హరికథారచయితలు వాడుచుందురు. దీనికి నిర్ణీతమైన ఛందఃప్రస్తారము కన్పింపదు. రచయితలు ఎవరి వీలునుబట్టి వారు కుదించిగాని పెంచిగాని దీనిని రచించి 'తౌహరా' అని వ్యవహరించినారు. దీనికి ఆదిప్రాసనియమము నిత్యలక్షణము. అంత్యప్రాసనియమము వికల్పము. 'దోరా' అనికూడ కొందరు హరికథారచయితలు దీనిని వ్యవహరించినారు.

యక్షగానములలో ద్విపదవలె, హరికథలలో దోరాలు లేక తోహరాలు సంప్రదాయసిద్ధముగా వాడబడుచున్నవి. నారాయణదాసప్రభృతులు తమ రచనలలో దోరా (తౌహరా)కు బదులు 'మంజరి' అను ఛందోవిశేషము నుపయోగించినారు. ఇది తెలుగులోని మంజరీద్విపద కాదు. మహారాష్ట్ర హరికథలలో వాడబడే తౌహరావంటిదే. యక్షగానములలో లేని విశేషములలో ఈ రేకుమంజరులనునవి ముఖ్యమైనవి. సంభాషణలకు నడుమనున్న కథాంశములను చెప్పుసందర్భములందును, కథను తొందరగా నడిపించవలసిన సందర్భములందును ఇవి వాడబడినవి.

'వర్తకి' అను మాత్రాచ్ఛందజన్యమైన గేయమును నారాయణదాసు మార్కండేయచరిత్ర, సావిత్రీచరిత్ర అను హరికథలలో వాడినాడు. దగడలనే ఈ పేరుతో వ్రాసిన ట్లూహింపవచ్చును. మంజరీ, వర్తకి - వీనిలో పల్లవి, అను పల్లవి యుండవు. అన్నియు చరణములే యుండును. రెండేసి భాగములుగల చరణములు రెండుగాని, మూడుగాని, నాలుగుగాని యుండును. రెండేసి భాగములకు ప్రాసయు, ప్రతిభాగమునకు యతియు పాటింపబడును.

హరికథలలో ద్విపదలును, కందార్థములును చేరినవి. క్రీ. శ. 19 వ శతాబ్ది ఉత్తరార్ధమునకు తరువాత వెలసిన యక్షగానములలోమాత్రము కొన్నిట దోరా

తోహరాలును, మరికొన్నిటియందు సాధారణముగా హరికథలలోనుండు లావణి మొదలగు అన్యదేశ్య చ్ఛందస్సులును చేరినవి.

తమిళుల కాలక్షేపములో సంగీతమున కెక్కువ ప్రాముఖ్యముండును. వైరాగ్యభక్తి తమిళకాలక్షేపము విశిష్టలక్షణము. కన్నడిగుల హరికథలో ప్రవచన భాగమునకే ప్రాముఖ్యము. కన్నడరచనలలో ఆధ్యాత్మికపరమైన నీతిబోధ ముఖ్య గుణము. మరాఠీ కీర్తన సంప్రదాయములో భక్తి ప్రధానలక్షణము తెలుగువారి కథ సంగీతమునకు, శాస్త్రసంప్రదాయమునకు, చతుర్విధాభినయములకు అన్నిటికిని సమప్రాధాన్యము సాధింపబడును. తెలుగులో 200 మంది హరికథారచయితలు దాదాపు వేయిముద్రితాముద్రిత హరికథాగ్రంథములను రచించినట్లు, ఇంచుమించు రెండువేలమంది కథాగాయకులు వెలసినట్లు, ఆచార్య తూమాటి దొణప్పగారు 'తెలుగులో హరికథావాఙ్మయము' అను గ్రంథమునందు తెల్పినారు.

హరికథ ఒక నూతన విద్యాప్రదర్శకమని చెప్పవచ్చును. దీనికి ప్రశస్తమైన సంగీతసాహిత్యములు, చక్కని నృత్యము, సర్వరసానుకూలమగు అభినయ ధోరణులు, శ్రోతల మనముల కింపగు మాటలనేర్పు, అన్నిటికంటె నెక్కువగ రమ్యరూపము కావలసినయంగములు.

డా. యస్వీ జోగారావు పేర్కొన్నట్లు 'యక్షగానము హరికథవలె వ్యాఖ్యానింపబడుచు, ఇంటింట నాడువారిచేఁ బారాయణము గావింపఁబడుచు, బొమ్మలాట వలెనే వెనుకపాటగాఁ బరిగణింపఁబడుచు, వీథిభాగవతులచే రూపకముగా ప్రదర్శింపఁబడుచు విట్లు బహుముఖప్రయోజనములతో బహుముఖముగా వర్ధిల్లుచు వచ్చినది.' (28)

## (20) జంగము కథ-యక్షగానము :

జంగములపేరనే జంగంకథలు ప్రసిద్ధములయినవి. తెరనాటకములు జంగములచే ప్రదర్శింపబడుచుండినట్లు భైరవరాజు వేంకటనాథుని (క్రీ. శ. 16 వ శతాబ్ది) పంచతంత్రము (4-240) నందును, అయ్యలరాజు నారాయణామాత్యుని హంస వింశతి (3-28) యందును కలదు. ఈ తెరనాటకముల ప్రసక్తి పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్ర పర్వతప్రకరణమున కలదు.

---

28. 'యక్షగానము-హరికథ'. అనంతరామాచార్య కృతులు-ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక-44-2.

రాజాస్థానములందు సంస్కృతనాటకములు ప్రదర్శింపబడుచుండగా, వానికి సమానాంతరముగ జనపదములలో వీథినాటకములు, బహురూపములు మొదలగు తెరనాటకములు ప్రచారమందుండెడివి. కాలక్రమమున ఈ తెరనాటకముల ప్రభావము యక్షగానములపై బడినది. శిష్టకవులు వానిని చేపట్టుటచే రూపకకళను సంతరించుకొని అది విశిష్టప్రక్రియగా రూపొంది రాజాదరణముతో వీథినాటకముగా దేశి సరణికి చెందిన నాటకములకెల్ల తలమానికముగా నిలిచినవి. యక్షగానములు మనకు నాటకములు లేనికొరతను తీర్చినవి. దీనిప్రాముఖ్యముమూలముననే తెలుగులో మొన్న మొన్నటివరకును మార్గనాటకముల ఆవశ్యకత లేకపోయి యుండవచ్చును.

జంగములు జక్కులవలెనే గానాత్మక కథాఖ్యానములు చేయుచుండెడివారు. యక్షగానములకు జంగంకథలకు కొంత సామ్యము కన్పట్టును. జంగంకథలు గానరూప కథాఖ్యానమున కుద్దిష్టములయినవి. యక్షగానములు కాలక్రమమున రంగప్రదర్శనల కెక్కినను వాని ప్రాథమికస్థితి గానప్రధాన కథాఖ్యానపద్ధతియే కదా! జంగంకథలు హరికథ, బుర్రకథలవలె గానరూప కథాఖ్యానములే. పుష్పులూరి వేంకట సుబ్బరాయకవి ద్రౌపదీవస్త్రాపహరణములో 'దరువులు, రగడలు, వచన గద్యపద్యముల సహితముగను ధర శివజంగమువారికి నిరతము ధర్మజీవనముగ చేయగబూనితి. జంగము లీకథ చేకొని వర్ణించి శ్రీయుతముగ బల్కంచు గుమ్మెటల్ చితారయుబూని సరసమైన సంగీత సత్కళా సంగతులొప్పగను స్థిరముగ తాళప్రస్తారంబులజేసి చెప్పునటుల' అని కవి వక్కాణించినారు. ఇందు యక్షగానములందువలె దరువులు, గద్యపద్యము లుండును. ద్విపద, ఏలాది దేశిరచన లుండవు. కథాఖ్యానమునకు ప్రధానముగా రగడ నుపయోగింపబడును. ప్రాచీన యక్షగానములందు రగడ వికారములగు రేకులు వాడబడినవి.

జంగంకథలు క్రీ. శ. 19 వ శతాబ్దికిముందు వ్యాప్తిలోనున్నట్లు కన్పట్టదు. వాని ప్రాదుర్భావమునకు జక్కులకథలు లేక యక్షగానములే కారణములై యుండవచ్చును. గాయకవాడ పెద్దన నలచరిత్రను, దేముడకొండ వెంకయ్య విరాటపర్వమును జంగంకథలుగాను, యక్షగానములు రచించినారు. వీరు క్రీ. శ. 19 వ శతాబ్దమునకు చెందిన జంగము కథారచయితలలో ముఖ్యులు. కొన్ని జంగము కథలే యక్షగానములుగా కొందరిచే భ్రమింపబడియున్నవని డా. యస్వీ జోగారావుగారు 'ఆంధ్ర యక్షగాన వాఙ్మయచరిత్ర' (పుట 134) లో వ్రాసినారు.

తుళ్లూరి మాధవరాయకవి సారంగధర కథ, పునులూరి సుబ్బరాయకవి 'యక్ష ప్రశ్నలు', ధనకుధరం రామానుజాచార్యులు (1900) రచించిన బిల్హణీయము మొదలగు జంగంకథలు యక్షగానములుగ పేర్కొనబడుచున్నట్లు తెలియుచున్నది.

'పగటివేషధారణలో కూచిపూడి, గడ్డిపాడు భాగవతులు క్రిష్టపాడు జంగములు జగమెరిగినవారట. పగటివేషధారులు సమిష్టిగను, వ్యష్టిగను తిరిగి ప్రదర్శనము లిచ్చుచుందురు. పగటివేషధారులు అరువదినాలుగు రకముల వేషములు వేయుదురట. వానిలో బుడబుక్కలవేషము, శారదవేషము, జంగమువేషము, అర్ధనారీశ్వరుడు మొదలగునవి కొన్ని. శారదావేషమునందు 'ఔ శారదా! కరుణావిధే' అను మకుటముగల యక్షగానరూపమగు రామాయణగాథను లయ సమన్వితముగా గానమొనర్చుచు స్త్రీ వేషముతో ప్రతియింటికేగి గృహస్థులొసంగు బహుమతులను గ్రహింతురు. ఈ పగటివేషములను గురించి తూమాటి దొణప్పగారు వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు తెలుగుసంస్కృతి - మూడవసంపుటము (పుట 914)లో చక్కని వ్యాసమును ప్రకటించినారు.

## (21) బుర్రకథ - యక్షగానము:

ఆంధ్రజాతికి అతి ప్రధానమైన జానపద కళారూపము బుర్రకథ. ఆంధ్రప్రదేశ్‌లో బుర్రకథకు నేడు విపులవ్యాప్తి కలదు. యక్షగానములందువలె బుర్రకథలోకూడ సంగీతము, నృత్యము, నాటకము ఈ మూడింటి జానపదరీతుల మేలు కలయికను చూడవచ్చును. సామాన్యజనులకు సాంఘిక రాజకీయచైతన్యమును గలిగించుటలో దాని కదియే సాటి. బుర్రకథకుగల ప్రాముఖ్యతనుగుర్తించి ఈ 20 వ శతాబ్దములో రాజకీయపార్టీలు తమ ప్రచారసాధనముగా దీనిని వినియోగించుకొనుచున్నారు.

బుర్రకథ పుట్టుకనుగూర్చి యిదమిత్థమని చెప్పుట కాధారము లేమియు లేవు. జంగములను ప్రముఖ బుర్రకథకులుగా పేర్కొనవచ్చును. జంగములు శైవమత విజృంభణము తరువాత యేర్పడిన జాతివారు కనుక బుర్రకథలు క్రీ. శ. 14 వ శతాబ్దమున జంగములమూలమున వ్యాప్తికి వచ్చియుండునని ఊహింపవచ్చును.

బుర్రకథలను మతసంబంధమైనవి, వీరగాథలు, రాజకీయగాథలు అని మూడువిధములుగా ఇతివృత్తస్వభావమునుబట్టి విభజింపవచ్చును. మొదటివిభాగము

శైవకథలకు, రెండవది పల్నాటియుద్ధమువంటివానికి చెందును. ఇక మూడవది మాస్కో-జర్మన్ యుద్ధము ప్రారంభమయిన తరువాతికాలమునకు చెందును. బుర్ర కథ శైశవదశలో మతసంబంధకమైనది. తరువాత వివిధరాజులమధ్య జరుగు యుద్ధములలో ప్రజలను రెచ్చగొట్టుట కుపయోగింపబడినది. నేడది రాజకీయ ప్రచారసాధన మైనది.

బుర్రకథలలో ముఖ్యమైనవి పెద్ద బొబ్బిలి కథ, కాంభోజరాజు కథ, బాల నాగమ్మ కథ, దేశింగురాజు కథ మొదలగునవి. కోస్తా ఆంధ్రలోను, రాయలసీమ లోను జంగములు, పిచ్చుకుంటులు మొదలగువారు బుర్రకథలు చెప్పుదురు. గొల్లలు కొందరు పల్నాటియుద్ధమును సుద్దుల 'బాణీ'లో చెప్పుచుందురు. తెలం గాణములో పలురకముల తెగలవారు బీరన్నలవారు, కొమ్మువారు, శారదకాండ్రు, బవినీలు, వీరముష్టులవారు మొదలగువారు బుర్రకథలను చెప్పుదురు.

## (22) యక్షగాన వైశిష్ట్యము :

దేశికవితాశాఖ లన్నిటిలోను గుణమును, పరిమాణమును, ప్రయోజనమును, వైశిష్ట్యమునుబట్టి అగ్రగణ్యమయినది యక్షగాన కవితాశాఖ. తెలుగుభాషలోనే అయిదువందలకుపైగా యక్షగానములు లభించుచున్నవి. యక్షగానములు తెలుగు లోనేకాక కన్నడ తమిళములందును రచింపబడినవి. యక్షగాన ప్రక్రియ విపుల మైనదేకాక ఇతరశాఖలతో పోల్చిచూచిన బహువిధముల విశిష్టమైనది. యక్షగాన వైశిష్ట్యమునుగురించి డా. యస్వీ జోగారావుగా రిట్లు తెలిపియున్నారు. (29)

### 1. సర్వోపభోగ్యమైన సమాహార కళాస్వరూపము :

యక్షగానము దేశీయమైన శుద్ధపదకవిత్వమునకు, సాంస్కృతికమైన ప్రౌఢ సాహిత్యమునకు సామరస్యము కల్గించి, ఉభయతారకముగ వాఙ్మయపథమున వెలసినది. నిసర్గమాధుర్యముతోడి శిల్పమునకు, నిరాడంబరత్వముతోడి విజ్ఞాన వికాసమునకు, సౌలభ్యసహితమైన శైలీవైశిష్ట్యమునకు కూడలియయినది ఈ యక్షగాన వాఙ్మయశాఖ. మార్గవాఙ్మయము పండితోపజ్ఞమయినది. దేశివాఙ్మయ మెక్కువగా పామరజనరంజకమయినది. పండిత పామర వాఙ్మయ ప్రక్రియలకు, కర్తృత్వములకు సామరస్యము సాధించినది యక్షగానము. పండితు లెక్కువగా

29. ఆంధ్ర యక్షగాన వాఙ్మయచరిత్ర-ప్రథమభాగము-పుటలు 216-224.

అగ్రవర్ణములవారు, నాగరికులు, రాజాస్థానాశ్రితులు. ఇక దేశికవులు అబ్రాహ్మణులు, జానపదులు. రాజాశ్రయ పరాఙ్ముఖులు. అన్నికులములకు అన్ని తరగతులకుచెందిన కవులు, ప్రదర్శకులు యక్షగానముల నభిమానించి రచించియున్నారు. యక్షగానము పాఠ్యగేయ నాట్యాదిక బహుప్రయోజనముల కేకవాక్యత సంఘటించినది. తెలుగుజాతియొక్క చిరంతనమైన గానకళాభిరుచికి, నాట్యకళాభిమానమునకును నిదానముగా నిల్చినది.

2. వివిధ ప్రక్రియానుబంధము:

ప్రబంధము, ఉలాప్రబంధము, కలాపము, కొరవంజి, వీథినాటకము, మార్గ నాటకము, బొమ్మలాట, జంగము కథ, హరి కథ, ఆధునిక రంగస్థలనాటకము, బుర్రకథ మొదలగు వివిధప్రయోజనాత్మకములగు వివిధసాహిత్య ప్రక్రియలతో యక్షగానమునకు సంబంధము కలదు. ఇట్లు పెక్కు సాహిత్యప్రక్రియలతో సంబంధముగల ప్రక్రియలు తమిళ కన్నడాంధ్రములందు చాల అరుదు. ఆ యా వాఙ్మయ పరిణామపరిశీలను సమగ్రముగా సమీక్షించుటకు ఇది ఎక్కువగా నుపకరించును.

3. బహువిధ పదకవితాప్రభేద సమీకరణము:

యక్షగానము సాధించిన బహుప్రయోజనములలో నిది ప్రధానమైనది. పాల్కురికి సోమనాథుడు బసవపురాణ పండితారాధ్యచరిత్రలలో ప్రాచీన దేశీయ పదములను, గీతులను, దృశ్యకళారీతులను పెక్కింటిని పేర్కొనినాడు. కాని అవి లక్ష్యలక్షణములులేని పట్టి పట్టికలుమాత్రమే. వానిలో చాలపదములు నేడు నామమాత్రావశిష్టములైనవి. పాల్కురికి సోమనాథుని తరువాత తాళ్ళపాకకవులు దేశీయ పదములను కొన్నిటిని పేర్కొనినారు. కాని లాక్షణికుల ఉపేక్షవలనను, పండిత కవులు ప్రయోగింపకపోవుటచే వానికి వ్యాప్తి కలుగలేదు. యక్షగానములకు తంజావూరు నాయకరాజులయుగమున రాజాదరణ లభించినది. యక్షగానములందు దేశీయపదము లెన్నియో చోటుచేసుకొనినవి. ఏలలు, జోలలు, సువ్వాలలు, ధవళ శోభనములు, అల్లోనేరేళ్ళు, అనువులు, త్రిభంగులు, త్రిస్తబకలు, వెన్నెలపదములు మొదలగు దేశిరచనలు యక్షగానములవలన సంరక్షింపబడినవి. తంజావూరు యక్షగానములలోని పంతువగపదములు, పదకేళికపదములు మొదలగు శృంగార పదములు, గొల్లపదములు, చెంచుపదములు, కొరవంజి దరువులు, సాంగత్య పదములు మొదలగునవి ప్రత్యేకముగా పేర్కొనదగినవి. ఈ దేశిరచనలన్నియు గీతి

ప్రధానములే. జాతీయ సంగీత వాఙ్మయచరిత్ర రచనకు ఈ దేశిపదరచనల పరిశీలన ఆవశ్యకము.

4. వస్తు వైవిధ్యము :

యక్షగానములందలి ఇతివృత్తములలో పౌరాణికేతివృత్తగాథలు యెక్కువగా నున్నవి. కన్నడ యక్షగానములలో పౌరాణికేతివృత్తములే ప్రాధాన్యము వహించినవి. తెలుగు యక్షగానేతివృత్తములలో పౌరాణికములతోపాటు, స్థలపురాణగాథలు, చారిత్రకములు, తాత్కాలికేతివృత్తములు, సాంఘికములు, మహాపురుషులచరిత్రలు, జానపదగాథలు, కల్యాణకథలు, తత్త్వవిషయికములు మొదలగు పలుతెరగతులకు చెందినవెన్నియో కలవు. యక్షగానములలో కొన్ని పురాణగాథాపరివర్తనములు, కొన్ని స్వకపోలకల్పితములు. ఇంతటి వస్తువైవిధ్యమును ప్రదర్శించిన యక్షగాన కవితాశాఖ ఇతర సాహిత్యప్రక్రియలకు తక్కువగావి. ప్రాధాన్యమును వహించియున్నది.

5. రసవిషయిక వైశిష్ట్యము :

వస్తువైవిధ్యము విశేషముగాగల యక్షగానములు రసవిషయిక వైశిష్ట్యమును గూడ కల్గినవి. కన్నడ యక్షగానములలో వీర, రౌద్ర, బీభత్స రసప్రధానములు పెక్కు కలవు. తెలుగు యక్షగానములలో పెక్కు శృంగార ప్రధానములయినవే. దక్షిణాంధ్ర యక్షగానములన్నియు శృంగారప్రధానములే. ఆంధ్రదేశమందు వెలసిన మృత్యుంజయ విలాసాది కొన్ని యక్షగానములుకూడ శృంగార ప్రధానముగనే రచింపబడినవి. సుగ్రీవ విజయాది యక్షగానములలో వీర కరుణాదిరసములకు ప్రాముఖ్యము కలదు. రాజకథాప్రసక్తిగల యక్షగానములందు కటికము (కటిక, కట్టియము, కటికీడు, కోలకేతడు, కేతినాయుడు, ఆస్థానసంతోషి, సంతోషుడు, బాగుదారు, చోపుదారు, బరాబరి అని వీనికి పేర్లున్నవి.) అను రాజోద్యోగి ప్రసక్తి విధిగా నుండును. కొన్ని యక్షగానములలో రాజునకు బదులు, శివుడు, ఇంద్రుడు మొదలగువారుకూడ కావచ్చును. దక్షిణాంధ్ర యక్షగానములలో కటికముపాత్ర బాగుగ రూపుకట్టినది. అతడు తన సహజ వికృతాకారచేష్టాభాషణాదుల వలన కొంత నర్తియో చెవుడో నటించి కొంత హాస్యమును ప్రదర్శించును. ఇట్లే పింగి, పింగడు, సుంకరి, మంత్రసాని మొదలయిన సాంప్రదాయికపాత్రల ద్వారమున యక్షగానములందు హాస్యము బహుళంగుల ప్రదర్శింపబడినది. హాస్య

ప్రధానములైన యక్షగానములలో తంజావూరివారి దొక ప్రత్యేకత. యక్షగానము లందలి సాంప్రదాయిక పాత్రలనుబట్టి యక్షగానములప్రయోగమున కెంత ప్రచార ముండినదో అది యెంత జనరంజకమై యుండినదో వ్యక్తము కాగలదు. హాస్య రస స్పర్శలేని యక్షగానములు చాల అరుదని చెప్పవచ్చును. పైని పేర్కొనిన వివిధాంశములనుబట్టి 'ఆంధ్రకవిత్వ పరిణామస్వరూపమును దాని వైవిధ్యమును తెలిసికొనుటకు యక్షగానముల సమగ్రపరిశీలన అతి ముఖ్యమని చెప్పవచ్చును.

## 6. ఛందో వైవిధ్యము :

యక్షగానములందు పదకవితలేకాక జాత్యుపజాతులును ప్రయుక్తములగును. ద్విపద రగడ వికృతులగు రేకులు మొదలయిన బహువిధచ్ఛందస్సులకు యక్ష గానములందు ప్రసక్తి కలదు. కన్నడ యక్షగానములందు కన్నడ దేశీయచ్ఛంద స్సులగు ద్విపది, చౌపది, సాంగత్యము, షట్పదులు (భామినీ షట్పదికే ప్రచార మెక్కువ) మొదలగునవి వాడబడినవి. వీనితోపాటు వృత్తములు, కందములు కూడ కన్నడ యక్షగానములందు ప్రయోగింపబడినవి. వృత్తములలో మత్తేభము, శార్దూలము, చంపకమాల అను మూడుమాత్రమే యక్షగానములం దెక్కువగా ప్రయుక్తమయినవి. దేవిదాసుని కృష్ణార్జున కళిగలోను, హాశమక్క రాముని గయ చరిత్రలోను వచనములవాడుక కలదు. పార్తి సుబ్బన్న 'పారిజాత'మను యక్ష గానములో చూర్ణికె వాడబడినది. యక్షగానములందు బహువిధచ్ఛందస్సులకు ప్రసక్తి కలదు. చంపూ, ప్రబంధ, ద్విపద, ఉదాహరణ, శతకాది ప్రక్రియలందలి ఛందోరీతులన్నియు యక్షగానములం దిమిడిపోవును. హరికథలు మొదలగువాని యందు ప్రయోగింపబడు తోహరాలు, దోరాలు, మంజరి, లావణి మొదలగు ఛందస్సులకుకూడ ఆధునిక యక్షగానములందు ప్రవేశము కలదు. ఆంధ్ర ఛంద స్సంహితా సర్వస్వమునకు యక్షగానముల పరిశీలన ఉపయుక్తము.

## 7. భాషావైవిధ్యము :

తెలుగులోని యక్షగానములు సాగర తీరాంధ్రమండలములలోను ఒరిస్సా సరిహద్దులలోను, రాయలసీమ, తెలంగాణములలోను, దక్షిణదేశమున తంజావూరు, మధుర, మైసూరు, పుదుక్కోట, తిరుచునాపల్లి, సేలము, చెంగల్పట్టు, మదరాసు మొదలగు ప్రదేశములలోను తెలుగుభాష వ్యవహరింపబడుచోట్ల అనేకములు వెలసి నవి. వివిధప్రాంతములలో, వివిధకాలములలో, వివిధకులములవారిచే వ్యవహ

రింపబడు భాషల కాకరములగుటచే ఆయా యక్షగానములందు నిఘంటువుల కెక్కని పదజాలము, ప్రయోగవిశేషములు, జాతీయములు యెన్నియో కలవు. క్రీ. శ. 16, 17, 18 శతాబ్దములనాటి పండిత పామరుల వ్యావహారిక భాషారీతుల నెరుంగుటకు యక్షగానములు మిక్కిలి తోడ్పడుచున్నవి. వ్యాకరణముల అడుగు జాడలను ఆశ్రయింపక, పదప్రయోగమునెడ యక్షగానకవులు సంపూర్ణ స్వాతంత్ర్యమును వహించినారు. కనుక కన్నడాంధ్రములలోని అపూర్వములగు భాషారీతులు, పదప్రయోగ వైశిష్ట్యములు యక్షగానముల పరిశీలనమువలన తెలియగలవు. భాషాతత్త్వశాస్త్రజ్ఞుల కివి మిక్కిలి ఉపయోగపడును.

8. లోకవృత్త ప్రదర్శనము :

ప్రజాకవితకు ప్రతినిధివంటిది యక్షగానము. సాహిత్యమును ప్రజాసన్నిహితముచేసి ప్రజాహృదయమును సాహిత్యములో ప్రతిబింబింపజేసిన ప్రక్రియ అది. విద్వత్కవుల సాహిత్యమందు పాండిత్యప్రకర్ష, కవితాచమత్కారాదులే ప్రాధాన్యము వహించును. కాని లోకవృత్తచిత్రణకు వానియందు చోటు తక్కువ. యక్షగానములపుట్టుటకు యెక్కువగా జనపదములే ఆటపట్టులు, రంగభూములు నయినవి. రాజసన్మానము లపేక్షింపని సామాన్యులగు యక్షగానకవులకు సామాన్య ప్రజల వినోదములే పరమలక్ష్యములు. యక్షగానములందలి భాషలో భావములలో, గేయచ్ఛందస్సుల తీరుతీయములలో, ఆ యా పాత్రలచిత్రణలో, నన్నివేశముల సంఘటనలో నిరాడంబరమైన, నిసర్గమధురమైన ప్రజాహృదయము, లోకము పోకడయు ప్రతిఫలించును.

యక్షగానములమూలమున ఆ యా కాలపు దేశీయాచారవ్యవహారములు, సాంఘికపరిస్థితులు స్పష్టముగ తెలియుచున్నవి. పాలకుల పండితగోష్ఠి, కావ్యగీత ప్రియత్వము, స్త్రీలౌల్యము మొదలగునవి కొన్ని యక్షగానములందు విపులముగా వర్ణింపబడినవి. సామాన్యజనుల జీవితరేఖలుకూడ యక్షగానములలో చోటు చేసు కొనినవి. వెట్టిగొల్లల ప్రసంగములు, వారి భోజనములు, విద్వాంసులయెడ వారికి గల అభిప్రాయములు హాస్యరసపోషకముగ నుండును. ఆచార్య తూమాటి దోణప్ప గారు 'యక్షగానములు - ప్రాచీనాంధ్ర నాటకస్వరూపము' నం దిట్లు వ్రాసినారు. 'విద్వాంసులనిన నొకరిమీదఁ బొగత్త పద్దెములు చెప్పి బ్రదుకువారని గొల్లల ప్రసంగములవలనఁ దెలియుచున్నది. రాజదర్శనార్థ మరుదెంచు పండితులు-కవులు-మొగసాల మొగమునమందు కటికవాంద్రకు-దీపావళికిఁ బొంగలికి నుగాదికి-సౌర

కాయలో గానుగుబిండియో లంచముక్రింద సమర్పించు కొనెడివారు. పండితగోష్ఠులలో బ్రాహ్మణుల యీర్ష్యాసూయలు, వాక్కలహములు, దొడ్డి సంభావనలలో దొడ్డ సంభావనలకై పెనగులాటలు, చక్కగా దీర్పబడినవి. కోయిల పారువ త్తె గాంధ్ర వక్కజిత్తులు, పురోహితుల వటాటోపములు, పామరస్త్రీల యమాయిక ప్రవర్తనములు, సుంకరుల ధౌర్త్యములు, యక్షగానములమూలమున మనకు విశదమగుచున్నవి.'

ఆ యా యక్షగానములలో నవతులకయ్యము, సుంకరుల యాగడములు, మంత్రసాని దెప్పిళ్ళు - ఇవికాక గొల్లలు, ఎఱుకలు, జెట్లు, పంబవారు, పెరికీలు మొదలగు జాతులచరిత్ర, వారి వాలకములు, మాటలతీరు, వృత్తులు, ఆశయములు, విశ్వాసములు మొదలగు విషయము లెన్నియో వారి కట్టుబొట్టులతోకూడ యక్షగానములలో తేటతెల్లముగా వివరింపబడినవి. జాతీయజీవితమును, సాంఘికాచార వ్యవహారాదులను ప్రతిబింబితము చేయుటలో పద్యకావ్యములకన్న యక్షగానములదే పైచేయి. ఆంధ్రుల సాంఘికజీవితచరిత్రను తెలిసికొనుటకు ఆంధ్ర యక్షగానముల పరిశీలన అనివార్యము.

9. దేశినాటక కళాప్రాతినిధ్యము :

మధుర కవితాశాఖకుచెందిన గీతప్రబంధము లెన్నియో యక్షగానములందు కలవు. యక్షగానము దేశివాఙ్మయకోశ మనదగినది. యక్షగానము గానప్రక్రియగా, రూపకప్రక్రియగాకూడ పరిగణింపబడుచున్నది. వీథినాటకముతో అభేదమును పొంది నాటకప్రక్రియగా రూపొంది నాటకశబ్ద వాచ్యమయినది. యక్షగానము. మార్గ నాటకప్రభావము యక్షగానములందు కొంత కన్పట్టుచున్నను తన స్వత్వమును కోల్పోలేదు. కలాపము, వీథినాటకము, కురవంజి, బొమ్మలాట మొదలగు దేశీయ దృశ్యరచనలకు యక్షగానములకు సన్నిహితసంబంధము కలదు. కనుక యక్షగానమును దేశసరణికి చెందిన నాట్యకళాప్రపంచమునకు ప్రతినిధిగా భావింపవచ్చును. దేశి దృశ్యకళారీతుల నెరుంగుటకు యక్షగానములు తోడ్పడుచున్నవి.

10. విశిష్టతలలో విశిష్టత :

ఆంధ్ర కర్ణాటక తమిళభాష లన్నిటను యక్షగానములు విశేషముగా వెలసినవి. 'తుళు' భాషలో 'పంచవటి' అను యక్షగానము కలదట. కన్నడదేశమున యక్షగానము గాత్రమాత్రోపజీవియగు నొక ప్రత్యేక గానశైలిగా ప్రాచీనకాలమందే

ప్రాదుర్భవించినదని చెప్పుచున్నము. అందు తెలుగులోవలె యక్షగానమునకు ప్రాచీనతాస్థితి కానరాదు. తెలుగువారు క్రీ. శ. 17 వ శతాబ్దిలో తమిళ కన్నడదేశములకు విస్తరించియుండినకాలముననే, తంజాపురాంధ్ర నాయకరాజుల ఆస్థానములో యక్షగానములు వెలసి రాజాదరణ, రంగభోగము పొందుచుండినకాలముననే క్రమక్రమముగా తమిళ కన్నడాది భాషాకవులు కొందరు ప్రభావితులై యక్షగానరచనను తమ భాషలలోనికి ఉపక్రమించియుండురని భావింపవచ్చును. యక్షగానము తెలుగు సాహిత్యప్రక్రియలలో ప్రధానమైనది, అన్యసాహిత్యములనుండి ఎరువు తెచ్చుకొనబడని, తెలుగుదనముట్టిపడు స్వతంత్రమైన సాహిత్యప్రక్రియ యక్షగానము. తెలుగునందలి ఉదాహరణ ప్రక్రియవలె నిదికూడ ఇతరుల కనుకార్యమయినది. తమిళ కన్నడాది ఇతర దాక్షిణాత్యసాహిత్యములలోనికి కొనిపోబడినది.

## (23) ఉపసంహృతి :

ఇంతటి వ్యాప్తిని, వైశిష్ట్యమును, ప్రాముఖ్యమునుపొందిన ఈ యక్షగానమును అనాదృతవాఙ్మయమని కొందరు పండితులు తలపోయుట శోచనీయము. కాని యక్షగాన కవితాకళ సరసులైన విద్వత్కవులకుకూడ ప్రీతిపాత్రము కాదగినట్టిదే. యక్షగానరచనకు సంగీతనాట్యాది బహుళ కళాపరిజ్ఞానము కావలెను. కేవలము సాహిత్యపరిజ్ఞానమున్న చాలదు. యక్షగానములు ఈసడింపదగినవి కావని ఆధునిక పండిత విమర్శకులు పెక్కుమంది నిరూపించినారు. డా. యస్వీ జోగారావుగారు చెప్పినట్లు, సర్వోపభోగ్యమైన సమాహారకళాస్వరూపమై, వివిధ ప్రక్రియానుబంధబంధురమై, బహువిధపద కవితల పాలవెల్లియై, అతిమాత్ర వస్తు రసచ్ఛందో భాషావైవిధ్యభాసురమై భిన్నదేశ భిన్నకాల భిన్నకవ్యాపన్నమై అనేక లోకవృత్త విశేషప్రదర్శకమై ఆంధ్ర జాతీయరూపక కళాసర్వస్వప్రతినిధియై అన్యభాషీయులకు అనుకార్యమై యావదాంధ్రవాఙ్మయమున బహుముఖవైవిధ్యము వైశిష్ట్యముకలిగి విశాలపారస్పతకాఖగా వెలసిల్లిన ప్రక్రియ యక్షగానమొక్కటే. నామమాత్రావశిష్టములై తాళపత్రముల దాగియున్న యక్షగానసాహిత్యమును సమగ్రముగ పరిశీలించి, పరిశోధించి వ్యాప్తికి తెచ్చుటకు కృషి చేయవలసియున్నది. 'ఆ రచనలన్నియు (యక్షగానాదికములు) పామరములనియు, నప్రౌఢములనియు, దోషభూయిష్ఠములనియు, నిపుడు వాని సంస్మరణము నైతము మఱచిపోయితిమి కావుననే, మన వాఙ్మయశరీరమున నొకపార్శ్వము పక్షపాతపీడితమై పచ్చుపడి

నది, వానివిఁ బునరుజ్జీవింపజేయుట మనకు మానరాని కర్తవ్యము ([30]) అను పింగళి లక్ష్మీకాంతముగారి వాక్యములు ఆంధ్రావళికి వేలుకొలుపులు.

## ఉపయుక్త గ్రంథ సూచి

తెలుగు :


1. అప్పారావు. పి. ఎస్. ఆర్. *తెలుగు నాటకవికాసము* - నాట్యమాలా ప్రచురణము-3. హైదరాబాదు (1967)
2. ఆదినారాయణశాస్త్రి. పంచాగ్నుల. 'యక్షగానములు' (జక్కుల పాటలు) ఆంధ్రపత్రిక. దుర్మతి సంవత్సరాది సంచిక (1921)
3. గంగప్ప, ఎస్. 'హరికథ' - తెలుగువాణి. ప్రపంచ తెలుగు మహాసభల ప్రత్యేక సంచిక (1975)
4. చింతా దీక్షితులు. 'కొరవంజి'. ఆంధ్రపత్రిక ప్రమాది సంవత్సరాది సంచిక.
5. జోగారావు, యస్వీ. *ఆంధ్ర యక్షగాన వాఙ్మయచరిత్ర*. ఆంధ్ర విశ్వకళా పరిషత్ప్రకాశితము. నెం. 68. (1961)
6. దొణప్ప, తూమాటి. 'బొమ్మలాట' *తెలుగు సంస్కృతి, 1-వ సంపుటము,* (1959)
7. దొణప్ప, తూమాటి. 'యక్షగానములు : ప్రాచీనాంధ్ర నాటకస్వరూపము'. *జానపద కళానందద, (ప్రథమ సంపుటము)*. నిర్మలా పబ్లికేషన్స్. విశాఖపట్నం-3. (1975)
8. దొణప్ప. తూమాటి. *తెలుగులో హరికథా వాఙ్మయము.* (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారి బహుమతిపొందిన గ్రంథము (1975) అచ్చులో నున్నది.
9. పార్వతి, విష్ణల. 'ఆంధ్రదేశము - హరికథలు' భారతి (కలగూర గంప). ఏప్రిల్ (1966)
10. ప్రతాపరెడ్డి. సురవరం. *ఆంధ్రుల సాంఘిక చరిత్ర.*


30. ద్విపద భారత పీఠిక - పుట 42.

11. ప్రభాకరశాస్త్రి, వేటూరి (పరిష్కర్త). *క్రీడాభిరామము*-శ్రీ ప్రభాకర పరిశోధకమండలి (పరిష్కృతము) ప్రచురణము 5. తృతీయ ముద్రణము. (1960)

12. ప్రభాకరశాస్త్రి, వేటూరి. '*సుగ్రీవ విజయము*'-పీఠిక.

13. లక్ష్మీకాంతము, పింగళి. *గౌతమవ్యాసములు*, ఎం. ఎస్. ఆర్. మూర్తి అండ్ కో. విశాఖపట్టణము. (1952)

14. లక్ష్మీకాంతమోహన్. 'బుర్రకథ' నాట్యకళ. ఏప్రిల్ (1966)

15. లక్ష్మీరంజనం. ఖండవల్లి. *ఆంధ్ర సాహిత్యచరిత్ర సంగ్రహము*.

16. వెంకటేశ్వరశాస్త్రి. పొన్నలగడ్డ. *మలయాళ భాషాసాహిత్యాలు (సంగ్రహ చరిత్ర)* (1968)

17. వేంకటరమణయ్య. నేలటూరి. *మధుర తంజావూరు నాయకరాజులనాటి ఆంధ్ర వాఙ్మయచరిత్ర.*

18. శహాజీ మహారాజు. *సీతాకల్యాణము (యక్షగాన నాటకము)* సంపాదకుడు: వేంకటావధాని. దివాకర్ల. తొలిపలుకు - గోపాలకృష్ణయ్య. వడ్లమూడి. ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీ అండ్ రీసర్చి ఇన్స్టిట్యూట్-హైదరాబాదు (1971)

19. శేషయ్య. చాగంటి. *ఆంధ్ర కవితరంగిణి*, 9 వ సంపుటము.

20. సంగమేశం. ముట్నూరి. 'కన్నడ యక్షగానములు' - భారతి. ఫిబ్రవరి. (1956)

21. సంగమేశం. ముట్నూరి. 'బయలాట' - ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక (4-1-1956)

22. సోమనాథుడు. పాల్కురికి. *పండితారాధ్య చరిత్ర* - ఆంధ్రగ్రంథమాల 30. పరిష్కర్త : డా. చిలుకూరి నారాయణరావు.

23. సోమశేఖరశర్మ. మల్లంపల్లి. 'జావా ద్వీపవాసుల వినోదములు-వాయంగ్ ఆటలు' - *చారిత్రక వ్యాసములు.*

ENGLISH :

1. Achyuta Menon, C. *Ezuttaccan and His Age.*
2. Ballal, N. V. 'Yakshagana'. The illustrated weekly of India Vol. XCVII 9. Feburary, 29, March 6. (1976).
3. Dikshitar, V. R. R. *'The Silappadikāram'*. (Translation with Introduction and Notes. Humphrey Milford Oxford University Press. (1933).
4. Karanth, K. S. *Yakshagāna.* The institute of Kannada Studies, University of Mysore. (1975).
5. Kittel, F. *Kannada English Dictionary.* Basel Mission Book and Tract Depository, Mangalore. (1894).
6. Ramakrishnaiah, K. *'Telugu Literature outside the Telugu country'*. Madras University Telugu Series, No. 9. (1941).
7. Rice, E. P. *A history of 'Kanarese Literature.'* The Heritage of India Series. Second Edition. (1921).

కన్నడము :

1. కవిరాజమార్గ.
2. కన్నడ ఛందోంబుధి.
3. కన్నడ కావ్యావలోకన.